# అనుబంధాలు

[సామాజిక నవల]

"సుదర్శన"



ఆదర్శగ్రంథమండలి, విజయవాడ.

“ ...అనుబంధాలు అన్నవి విచిత్రమైనవి. వాటికి జీవితంలోగల ప్రాముఖ్యతనుగురించే నా అన్వేషణ... దానితో నన్ను నేను అర్థంచేసుకోవటం కూడా పూర్తవుతుంది,”

15 వ అధ్యాయము

# అనుబంధాలు

బసవన్నకొండ మెట్లెక్కుతూవున్న వేదమూర్తికి బాల్యం నుండి గత జీవితమంతా తెరలు తెరలుగా స్ఫురణకువచ్చింది. కన్నులకుకట్టినట్లవుతూన్న కొన్ని జ్ఞాపకాలతో, తాను మళ్ళీ ఆ క్షణాల్లో జీవిస్తూవున్నట్లే కలిగిన హృదయావేగంతో, వెంటవస్తున్న రామయ్యనుకూడ మరచిపోయ్యాడు.

బస్సులో ఆ వూరివైపు ప్రయాణించేసేవాళ్ళకు అయిదారుమైళ్ళ దూరంనుండే, ఒక పెద్దకొండ నందీశ్వర స్వరూపంలో సాక్షాత్కరిస్తుంది. అదే బసవన్నకొండ. శివాలయంలో కనుపించే బసవయ్యరూపంలో వుండటంవల్ల పోలికనుబట్టి కొండకూ, కొండప్రక్కనున్న గ్రామానికి ఆ పేరు వచ్చింది. ఆ బసవయ్య మూపురముమీదే వెలసివుంది పూర్వం ఎప్పుడో నిర్మింపబడిన మల్లికార్జునుని దేవాలయం. గ్రామస్థులు ఆ దేవాలయాన్ని శ్రద్ధతో రక్షిస్తూవచ్చారు. శివరాత్రికి ఏటేటా పెద్ద ఉత్సవం జరుగుతుంది. గ్రామంలోనివారందరూ, స్త్రీలు, పిల్లలుకూడా ఆ సమయంలో తప్పకుండా కొండపైకెక్కి వెళ్ళుతాయి. ఎక్కవలసినదూరం సుమారు రెండు మైళ్ళుంటుంది...,

"ఏటేటా వందరూపాయలిచ్చే ఈశ్వరరెడ్డి యీసారి జరిగిన వుత్సవానికి యాభై మాత్రమే యిచ్చేడు. కారణం

తను కొత్తగా కాంగ్రెస్‌పార్టీలో చేరి, ఆ పార్టీకి విరాళ మిచ్చేడు. అందుకని” అన్నాడు రామయ్య, గ్రామంలో విషయాలేవో చెప్తూ.

వేదమూర్తి పరధ్యానంలో వినిపించుకోలేదు. రామయ్య కూడా మరి తర్వాత మాట్లాడలేదు...

తనకు ఆరేళ్ళున్నప్పుడు మల్లయ్యమామతో కలిసి కొండెక్కటం గుర్తువచ్చింది వేదమూర్తికి. మల్లయ్యమామ చనిపోయి రెండేళ్ళు కావొస్తోంది. కొండమీదికి వెళ్ళి, వాళ్ళ లయప్రాంగణంలో పచ్చికొబ్బరి కొట్టుకొని తిని మూడేళ్ళయింది. ఈమధ్య కొండపైకి వెళ్ళనేలేదు. చిన్నప్పుడు తన కత్యంతప్రియమైన అలవాట్లు రానురాను దూరమైపోయి, వానిస్థానంలో క్రొత్తవైన అభ్యాసాలు వచ్చినవి. తను జీవించే విధానంలో మార్పు వచ్చినప్పటికీ, ఆ చిన్ననాటి గతం నశించిపోలేదు. ఆ సంఘటనలు, అనుభవాలు జరిగిన వరుసలో స్మృతికి రావు; కాని ఒక విశిష్టమైన కలయికతో, ముందు వెనుకలు లేకుండా మనస్సులో కుడ్యచిత్రాలవలె మెదులుతూ, హృదయవేగాన్ని, ఉత్తేజాన్ని కలిగిస్తాయి. కొన్నిపరిసరాలు ప్రదేశాలు, చిరపరిచితమైనా కాకపోయినా, ఎందుకో గతాన్ని స్మృతిపథంలోకి తెచ్చే శక్తి కలిగి వుంటాయి; ఆ స్మృతి వట్టి ఊహకాదు. సంపూర్ణమైన స్పందనాపూర్వకమైన యథార్థ జీవితానుభవంవంటిది!

తను గబగబా పరుగెత్తి మెట్లెక్కి, కాళ్ళు నొప్పిపుట్టి, ఎక్కలేక నిలిచినప్పుడు, మల్లయ్యమామతో యీ బండ

మీదే కూర్చున్నాడు. మళ్ళీ అక్కడ కూర్చోవాలనిపించింది వేదమూర్తికి.

"ఇక్కడొకక్షణం కూర్చుందాము" అన్నాడు రామయ్యతో.

రామయ్య మల్లయ్యమామ కొమారుడు. తనకన్న పదేళ్లు పెద్దవాడు. అతనిలో మామపోలిక లున్నాయి.

ఒక తరానికి ఇంకొక తరానికి ఎంత భేదం! కదలనట్టే వున్న కాలం — ంలోకూడా — చాల వేగంగానే కదలిపోతూవుందని తెలుస్తుంది. రామయ్యకూడ తండ్రిలాగే వ్యవసాయం చూస్తున్నాడు. కాని అతను స్వయంగా మడిలో ఎన్నడూ దిగడు. ఫోర్తుఫారందాకా చదివాడు. టవున్‌లో ఈశ్వరరెడ్డికొడుకులు నడుపుతున్న సినిమాలో అతనికి పదో భాగం వుంది. మల్లయ్యమామకు పంట, పొలంవిషయాలు తప్ప ఇంకేమీ తెలిసేవికావు. శివరాత్రి ఉత్సవాల్లో పాల్గొనటం, వేసవిలో రాత్రిపూట భజనలు, కోలాటంనిర్వహించటం, గంగమ్మజాతర సవ్యంగా చేయించడం — యివి ఆయన జీవితంలో ముఖ్యమైన వ్యాసంగాలు. ఆయన చూచిన సినిమాలు ప్రహ్లాద, రామదాసు, సావిత్రి, ద్రౌపదీవస్త్రాపహరణము, తోలుబొమ్మలాట, బుర్రకథ, వీధినాటకాలమీద తనకున్న అభిమానాన్ని సినిమామీదికి మార్చుకోలేక పొయ్యాడు. రామయ్యకు తెలీని సినిమావిషయాలు, రాచకీయాలు లేవు. రాచకీయపార్టీలమీద ఆసక్తి వున్నది. కాని యింకా ఎందులోను ప్రవేశించలేదు. మల్లయ్యమామకు గాంధీగారిపేరొక్కటే తెలుసు. ఎన్నికలప్పుడు వోట్లకోసం

వచ్చినవాళ్ళను చూచి "ఈ కాంగ్రెసోళ్ళు మళ్ళీ ఎగబడ్డారే, స్వారాజెం ఎప్పుడొస్తుందంటా డా గాంధి?" అని కొంత ఆశ్చర్యంతో, కొంత విసుగుతో ప్రశ్నించేవాడు. అదీ ఆయనకు రాజకీయాలతోటివుండిన సంబంధం.

వేదమూర్తి, రామయ్య మళ్ళీ కొండ నెక్కటం ప్రారంభించారు.

మల్లయ్యమామకు కూతురు గౌరిని తన కివ్వాలని వుండేది. చదువుకోసం మద్రాసు వెళ్ళిన తను పెళ్ళి అప్పుడే అవసరంలేదని తల్లిదండ్రులద్వారా చెప్పించాడు. మల్లయ్యమామమనస్సు నొచ్చింది, కాని మేనల్లునిమీద అభిమానం ఏమాత్రం తగ్గలేదు. "వానికి నిజంగానే ఇంతకంటె మంచి సంబంధం రావాల్సిందేకదా!" అనుకొని సరిపెట్టుకొన్నాడు. గౌరివివాహం జరిగిపోయింది. తను మద్రాసులో వుండగానే మామమరణించాడు టైఫాయిడ్ జ్వరంవచ్చి.

అలయంచేరుకొన్నారు. దేవాలయానికి ఆవలివైపు వెళ్ళితే చెఱువు కనిపిస్తుంది. ఆ దృశ్యాన్ని కలయజూచాడు వేదమూర్తి. కొండ నానుకొనే కట్టబడిఉంది. ఆపెద్దచెఱువు, దానికావల కనుచూపుమేరలో అంచువలె కనిపించే పచ్చని పొలాలు - నీలాకాశం - ఆ దృశ్యం అత్యంత మనోహరమైంది! తన చిన్నతనంలో మొదటిసారి ఆ దృశ్యాన్ని చూచినప్పుడు మనస్సులో ఆనందమూ, భయమూ, వైశాల్యమూ ఒక్కమ్మడిగా హత్తుకొన్నవి. తన కా దృశ్యాన్ని చూస్తూంటే ఏదో అనూహ్యమైన జీవితపరమావధి సంజ్ఞారూపంగా, చిత్రరూపంగా అవగతమైనట్లుంటుంది. అదొకవింత శాంతి; గంభీరత,

తోణకని ఆనందము! అది మధురమైన, అవ్యక్తమైన ఒక విషాదచ్ఛాయ కూడా! ఎడతెగని కాలప్రవాహము ఘనీభవించిన, అనంతత్వము మూర్తీభవించిన భావము!

ఈమాత్రమైనా ఊహించగలడు యీరోజు! తను పెరుగుతూ, మారుతూవచ్చి, ఒక్కొక్కసారి యీ దృశ్యంముందు నిలబడినప్పుడు, అందలి అనుభూతి, దానిఅర్థం కూడ రూపొందుతూ వచ్చాయి. కాని మొట్టమొదటి అనుభవస్వరూపం మాత్రం పూర్తిగా అంతరించిపోలేదు. కొత్తదైన వేరైన అనుభవంగా మారిపోలేదు. శిశువు పెరిగి పెద్దదిఅవుతూన్న కొలది ముఖంలో, వ్యక్తిత్వంలో మార్పులు గోచరిస్తాయి కాని, అవి మొదటి రూపురేఖలకు భిన్నమైనవికావు. అటువంటిదే యీ దృశ్యానుభూతి కూడా. ఒకవిధంగా అది తన ఛాయ, ప్రతిబింబమే! ఆ దృశ్యంతో అవినాభావసంబంధమేర్పరచుకొన్న తనలోని ఒక అంశ!

కొండ దిగి వచ్చేటప్పటికి చీకటిపడుతూంది. పొలం నుండి ఎద్దులను తోలుకొనివస్తున్నవాళ్ళు, గుర్రెరిగినవాళ్ళు తారసిల్లుతున్నారు. అంతకుపూర్వం ఇండ్లకు మళ్ళిన పశువుల పేడమీద పడుతున్నది అడుగు చీకట్లో. పాదం నేలకు రాచుకుంటూ నడుస్తున్నాడు. అంతా తన చిన్నప్పటిలాగే! మార్పేమీలేదు యీ అనుభవాల్లో. కాని ఊరిలో, తన బంధువుల్లో, తన కుటుంబంలో మార్పులు వచ్చినవి, వస్తున్నవి. కలిగే మార్పులన్నింటి వెనకాల, ఆ కొండమీది దృశ్యమూ, కొండమెట్లూ, దేవాలయమూ, వానితో అను

బంధమేర్పరచుకొన్న తనలోని భాగమూ ... శాశ్వతంగా, ప్రభావంతంగానే వున్నవి!

కాని యీ పరిసరాల్ని గురించిన తన అనుభవం, గతాన్ని గురించిన స్మృతి ఒక రమ్యమైన ఊహామాత్రమే ఎందుకు కాకూడదూ! దానికి వాస్తవికానికి ఏమిటి సంబంధం? ఒక మనోహరమైన మిథ్యాజగత్తును సృష్టించుతూన్నదేమో తన మనఃప్రవృత్తి! ఒక రమణీయస్వప్నం! నిజంగా చూస్తే ఏముంది యీగ్రామంలో, కొండలో, పాత దేవాలయంలో? ఎన్నో సంవత్సరాలుగా భూమినంటిపెట్టుకొని, విజ్ఞానం, వికాస మెరుగని మనుష్యుల తరతరాల జీవితాలముద్రలతో, తను నడుస్తూన్న దారిలాగే, గజిబిజిగా వున్న ప్రదేశంలో విలువైన పదార్థమేమిటి, గొప్ప ఏమిటి? ... తన వ్యక్తిత్వానికి గతాను భవాలు సంకెళ్ళు వేస్తున్నవి. ... గ్రామంలోవాళ్ళకూ దారి ద్రయము వేసిన సంకెళ్ళు బిఱ్ఱబిగిసివున్నాయి; మూఢనమ్మకాలు, అల్లుకొనిపోయిన భయాలు జీవశక్తిని గడ్డకట్టేటట్లుచేసి, విజ్ఞానసంచలనాన్ని శూన్యంచేశాయి! పొట్టగడపటానికి పడే కష్టంలో, చేసే ప్రయత్నంలో మాత్రమే వ్యక్తమౌతూ నిలి చిన జీవచైతన్యం, ఒక చైతన్యమేకాదు, పరిసరాలమీద సహజంగా చూపవలసిన లక్ష్యం, శ్రద్ధ ఏమాత్రమూ వ్యక్తీక రించని మనుష్యులజీవితాలలోఉదాత్తత, సౌందర్యమూ ఏనా టికి ప్రవేశిస్తాయి? ఇదంతా ఊహిస్తే, ఇంత చీకటి ఎన్నిరోజు లకి, ఎంతప్రయత్నంమీద, యీ దేశాన్ని వదుల్తుంది బాబూ! అని పట్టి నిస్పృహామాత్రం కలుగుతుంది.

చైతన్యరహితంగా అందమూ, ఆనందమూ లేని జీవితాల మూగతనంలో కూడా, తరతరాలుగా ఒక ఆత్మప్రశాంతి, నిర్లిప్తత, ప్రపంచపరాఙ్ముఖత, వేదాంతానురక్తి, ఎక్కడో మేళవించి దాగొన్నట్లు అనుమానం కలుగుతుందే! ఇది వట్టి గాలిమేడ; ఊరికే గొప్పలుపోవడమే కాదు; జాతీయాభిమానమనే కొత్త ఆవేశం కలిగించే వట్టి గర్వమే కాదు; గాంధీమహాత్ముని పిలుపువిన్న ముప్ఫైమూడుకోట్ల జనంలో నుండి ఏకోన్ముఖమైన, చైతన్యవంతమైన, శక్తివంతమైన స్వాతంత్ర్యేచ్ఛ ఉద్భవించడ మొక అర్థవిహీనమైన సంఘటన ఎన్నటికీ కాదు. గతం వట్టి ఊహ ఏందుకౌతుంది? అది ఎప్పుడూ వుంటుంది. మనం గతంలోకి వెళ్ళలేముకాని, గతం మనలోకి, మనద్వారా భవిష్యత్తులోకి వెళ్ళగలదు. ఇది వ్యక్తిజీవితానికే కాదు, ఒకజాతికి, దేశచరిత్రకూ అన్వయించే అమోఘ సత్యం!

ఇంటికి చేరారు. గుమ్మంప్రక్కనున్న అరుగుమీద కూర్చున్న తండ్రి గోపాలస్వామి, "కొండ పైకి వెళ్ళావా?" అని వేదమూర్తిని పలుకరించాడు. అక్కడ నిలవకుండానే సరాసరి ఇట్లోకి వెళ్ళిపోయాడు "ఊ" అన్న సమాధానంతో.

తండ్రితో జరుగవలసిన ప్రసంగం ఆ క్షణంలో ప్రారంభంకావడ మతని కిష్టములేదు.

కొండపైకి వెళ్ళినప్పుడు అక్కడి దృశ్యంతో తాదాత్మ్యత చెందిన అనుభవం, గతానికి చెందిన ఆ స్మృతుల ప్రభావం ఏమిటి? అదొక కవితాభావన, సౌందర్యగవేషణ'

తన గతానుభవాలమీద—అంటే తనకు తనమీదే—ఉన్న విశ్వాసం కాబోలు!

పరిసరాల సంకెళ్ళను ఊడదీసుకొని పరువెత్తిపోవాలనే తన ప్రయత్నం ఇప్పటికి కొంతవరకు ఫలించింది. కాని తను అనుకొన్నరీతిగా, పూర్తిగా తనస్వేచ్ఛాయాత్ర సాగుతుందా?

అది సాగవలెనంటే తను పెళ్ళికి ఏమాత్రం ఒప్పుకోరాదు. పెళ్ళి అనేది స్నేహపూర్వకంగా, మధురంగా కంఠాన్ని బిగించే పూలమాల. కాని చివరకు కాడిమాను మెడమీద పెట్టి తన్ను గానుగెద్దును చెయ్యటానికికూడ అదేప్రయత్నం!

* * *

మరుసటిరోజు ప్రొద్దున కాఫీ తాగుతూన్నప్పుడు వచ్చింది పెళ్ళిప్రస్తావన.

వేదమూర్తి కళాశాలలో ఇంగ్లీషులెక్చరరుగా పని చేస్తున్నాడు. కడచిన జనవరిలో, అనగా జనవరి ౧౯౫౦ లో అతనికి ఉద్యోగం లభించింది, డిగ్రీ పుచ్చుకున్న ఆరుమాసాలకు. వేసవిలోనే పెళ్ళిప్రసక్తి తీసుకొచ్చారు తల్లిదండ్రులు, అప్పుడు జరిగిన చర్చఫలితంగా పెళ్ళివిషయం తనకే వదలి వేశారు అనుకొన్నాడు వేదమూర్తి. జూలైలో తను కళాశాలకు వెళ్ళిన ఇరవైరోజులకే మళ్ళీ తండ్రిదగ్గరనుండి పెళ్ళి విషయమై వచ్చిన ఉత్తరం అతనికి ఆశ్చర్యమూ, విసుగూ కలిగించింది. వెంటనే బసవన్నకొండ వచ్చి మాట్లాడిపోవలెనని అందులో వున్నందువల్ల, శుక్రవారం ఒక్కరోజు సెలవుపెట్టి వచ్చాడు, శని, ఆదివారాలు తల్లిదండ్రులతో గడపటానికి.

తండ్రి పెళ్ళి సంబధాన్ని గురించి క్లుప్తంగా వివరించాడు. అమ్మాయి స్కూలు ఫైనలు పరీక్ష యిచ్చింది. చాల అందంగా వుంటుంది. వాళ్ళది మంచి సాంప్రదాయమున్న కుటుంబం కూడా. ఇంక అంతకన్న కోరదగిన విషయా లేమున్నాయి? వేదమూర్తి ఇంకొక నాలుగురోజులు సెలవు పొడిగించి, తల్లితో ఆవూరు వెళ్ళి అమ్మాయిని చూచి, వాళ్లకు అంగీకారం తెలిపిరావాలి.

వేదమూర్తికి విసుగ్గా వుంది. తనకు బొత్తిగా తెలీని పిల్లను పెళ్ళిచేసుకోవడం మూర్ఖత్వము. ఒక్క క్షణం లీలగా ముఖం చూచి, సరేనని నిర్ణయించుకుంటే, తనను అర్థంచేసుకోగల, తనకు నచ్చిన మనస్తత్వంగల అమ్మాయే లభిస్తుందని నమ్మకమేమిటి? తనకు తెలీని వ్యక్తినిగురించి ఇటువంటి నిర్ణయానికిరావడానికి వేదమూర్తి కిష్టంలేదు.

వివాహ మొక పవిత్రమైన ఆదర్శం. తనకు దాన్ని నిర్వర్తించి, సాధించగల శక్తి, ఆత్మవిశ్వాసము, హృదయ వైశాల్యం వున్నాయి. ఒక స్త్రీని అర్థంచేసుకుని, ఆమెతో తన జీవితాన్ని సమరసంగా, ఆనందంగా పంచుకోగలమనస్సు తనకుంది. మానవత్వంమీద తనకున్న గౌరవం, తన త్యాగ సంసిద్ధత, వివాహమనే ఆదర్శాన్ని ఉజ్జ్వలంగా సార్థకం చెయ్యడానికి తనకున్న విశిష్టమైన గుణాలు. కాని త్యాగ సంసిద్ధత, మానవత్వంమీద గౌరవం వుంటే మాత్రం ఏమైనట్లు? అసలు తన కొక వ్యక్తిత్వమంటూ లేదా? దాని స్వరూప మెటువంటిది? తన వ్యక్తిత్వంతో సమన్వయం కుదరని భార్య అయితే, ఆదర్శసాధన వీలవుతుందా? అలవికి

మించి తన వ్యక్తిత్వాన్ని అధిగమించే త్యాగం వ్యర్థం; జీవి తానికి పరమావధి ఏమిటి? వ్యక్తిత్వప్రకాశమే పరమావధి అనీ, వ్యక్తిత్వాన్ని నిర్మూలించే త్యాగం అనర్థదాయకమైన వట్టి ఆవేశమనీ అతని అభిప్రాయం. వివాహం కానీ, ఏ ఆదర్శంకానీ జీవితంలో ఒక భాగమే. ఆదర్శాలకున్న విలువ, వక్తిత్వానికి అవి ఏ విధంగా దోహదం చేస్తాయనేదాన్నిబట్టి. అంతేకాని వ్యక్తిత్వాన్ని జీవితాన్ని అవి నాశనంచెయ్యకూడదు.

ఈ వైఖరి తనలో వ్యక్తిత్వం అంకురిస్తూఉన్నట్లు సూచన...మనోపరిణామాలు ఎవరివి వారికి గోచరిస్తాయికాని వాటినిగురించి యితరులకు నచ్చచెప్పడానికి ప్రయత్నంచేస్తే అది వృథాప్రయాస. భిన్నపరిస్థితి, భిన్నమైన వయస్సుకల వారికి అసలు బోధపడదు.

"నా పెళ్ళివిగురించి ఇప్పుడేమీ ఆలోచించకండి అని మొన్న సెలవుల్లో చెప్పానుకదా! మళ్ళీ ఎందుకీప్రయత్నం?" అన్నాడు వేదమూర్తి.

"పెళ్ళి వెంటనే ఏమీ పెట్టుకోవడం లేదు. నువ్వు వెళ్ళి చూచి నిశ్చయంచేసుకొనిరావడమే! వాళ్ళు ఏ మాటా తేల్చుకోడానికి కొంచం తొందరపడుతున్నారు."

"కాని, మనకేం తొందరలేదుగా! మనం ఊరుకుం దాము. నేనుపెళ్ళిచేసుకోదలచినప్పుడు స్వయంగాచెపుతాను."

"అనుకున్నప్పుడు మంచిసంబంధాలు ఎదురౌతాయా? వచ్చినప్పుడే ఎంచుకొని నిశ్చయంచేసుకోవాలి."

కొంతసేపు మౌనంవహించి "నా కిప్పుడు వద్దు, తొందరేం లేదు." అని నొక్కి పలికాడు వేదమూర్తి.

తండ్రి కొంత కోపంతో అన్నాడు: "తొందర లేదంటే ఎట్లా? మనకు ఆరువేలదాకా అప్పుఉన్నవిషయం నీకు తెలుసు. అదంతా నీ చదువుకోసం చేసింది. ఇంక ఈ యిల్లు మరమ్మత్తూ అదీ వెంటనే చేయించాలి. అమ్మాయిపెళ్ళికి పోను మిగిలివున్న అయిదెకరాల్లో ఇంటి ఖర్చులకు మించి దమ్మిడీ రావడంలేదు. ఇంక అప్పు ఎట్లా తీర్చాలి? ఈ విషయాలు నువ్వు గ్రహించి, పెళ్ళికి సిద్ధమైతే, చిక్కులు విడిపోతాయి. మా బాధ్యతాతీరుతుంది. నువ్వు హోటలుభోజనం చేస్తూ ఇబ్బందులు పడనవసరంలేకుండా కుదురుగా సంసారంతో వుండవచ్చు."

అసలుసంగతి తెలిసింది, అనుకున్నాడు వేదమూర్తి.

"అయితే కట్నంకోసమన్నమాట యీ తొందర?... ఎంత ఇస్తామన్నారు?" తన కెంతవిలువ వుందో తెలుసుకోవాలని అతనికి కుతూహలంగా వుంది.

"పదివేలు"

"కట్నం తీసుకొని పెళ్ళిచేసుకోవడం నా కిష్టంలేదు"

"అయితే అప్పుసంగతేం చేస్తావు?"

"నేను ఏదో మిగిల్చి నెలకింత అని పంపుతాను."

"మహాపంపావు! ఇప్పటికి ఒక వంద కట్టావు. అది వడ్డీలో నాలుగోవంతుకికూడా రాలేదు. ఈవిధంగా ఎన్ని సంవత్సరాలకు నువ్వు తీర్చేది? అప్పుతీరి నువ్వు పెళ్ళిచేసుకునేది నేను బ్రతికివుండగా చూడబోను"

"అయితే నన్నేంచెయ్యమంటారు?"

"పెళ్ళిచేసుకోమంటున్నాము ... డబ్బు అంటూ దానికోసమే కక్కుర్తిపడి ఎవర్నంటేవాళ్ళని, ఏదో పనికిమాలినపిల్లను చేసుకొమ్మనలేదే! లక్షణంగా చదువు, అందమూ, కుటుంబసాంప్రదాయమూ అన్నీ వున్న అమ్మాయి. ముఖ్యంగా ఆ విషయాలు చూచికదా, ఈ సంబంధం చేసుకొమ్మని చెప్పతూంది?"

"అక్కయ్యపెళ్ళికోసం మనం పడ్డ ఇబ్బందే కదా, కట్నమివ్వాల్సినవాళ్ళూ పడవలసింది. అప్పుడు మనం పొలం అమ్మివేశాము. వాళ్ళూ అట్లానే చేస్తారుకాబోలు యీ పది వేలకోసం!"

"అదేమీ లేదు! వాళ్ళకు పెద్ద వ్యాపారం వుంది. యుద్ధకాలంలో అందులో బాగా సంపాయించారుకూడా. వాళ్ళేమీ ఆస్తి తెగనమ్మవలసినపరిస్థితి రాలేదు. మీ అక్కయ్యకిచ్చిన పొలమైనా పెండ్లిలో మీ అమ్మకువచ్చింది. స్త్రీధనంగా వచ్చి, స్త్రీధనంగానే వెళ్ళింది అనుకోవాలి."

"అయితే బ్లాక్ మార్కెట్ డబ్బుని పెళ్ళిచేసుకొమ్మంటున్నారు! ముక్కు మొహం తెలీని అమ్మాయిని వెంటనే పెళ్ళాడవలసిందే! నే నాపని చెయ్యలేను."

"నీ ఊహలు చాల విడ్డూరంగా వున్నాయి. ఆ అమ్మాయి కురూపి కాదు, చదువురాని మొద్దూ కాదు, అని పదిసార్లుగా చెప్పినా ఆ మాట చెవిని వేసుకోవే! నువ్వొ వెళ్ళి స్వయంగా చూచుకొన్నతర్వాతే అంగీకరించవచ్చు. వెళ్ళమనేగా నేను చెప్పేది."

"నాకీపెళ్ళి వద్దనుకున్నప్పుడు నేనువెళ్ళి లాభమేమిటి"

"ఎందుకు వద్దనుకున్నావ్? ఇన్నాళ్ళు ఏవిధంగా డబ్బు విషయం నువ్వాలోచించలేదో, అల్లే ఇప్పుడూ యీ డబ్బు విషయం, దాని మంచిచెడ్డలు మాకు వదిలెయ్యి. ఆ సంగతి నీ కనవసరం. నువ్వు అమ్మాయినిచూచి, యిష్టపడి, చేసుకో. ఇంతగా చెప్పతూవుంటే ఇంకా నీకు నొప్పేమిటో నా కర్థం కాలేదు!"

తండ్రి కోపంగా విసుక్కున్నాడు. వేదమూర్తి మౌనం వహించాడు.

బ్లాక్ మార్కెట్ డబ్బు! యుద్ధసమయంలో ధరలు విపరీతంగా పెంచి, వ్యాపారులు ప్రజలరక్తమాంసాలు పిండి డబ్బు చేసుకున్నారు. ఆ విషయం విద్యార్థిగావుంటూ తనుచూచిన, విన్న ప్రత్యక్షవిషయం. అటువంటి వ్యాపారులతో నా సంబంధం! ఆ డబ్బునా తను వినియోగించుకోటం...కాదు, ఆ డబ్బుకా తను అమ్ముడుపోవడం? అసహ్యంవేస్తూంది!!

తన జీవితాన్ని ఆదర్శపథంలో నడిపాడు. విద్యార్థిదశ ముగిసి ఉద్యోగంలో ప్రవేశించినా తనింకా ఆమార్గంలోనే ముందుకు సాగుతున్నాడు. ఉన్నట్టుండి, అకస్మాత్తుగా తన్ను అథఃపాతాళానికి తోసివేస్తామంటున్నారు, తనని పెంచి పెద్ద చేసిన తల్లిదండ్రులే!

చదువు, ఆదర్శాలు—వీనికీ యథార్థజీవితానికీ సంబంధమేమిటి? జీవితంలో అడుగుపెట్టగానే నేర్చుకున్న, ఊహించిన సిద్ధాంతాలకు విరుద్ధంగా ప్రవర్తించవలసిన పరిస్థితులు ఎందువల్ల ఏర్పడుతాయి? పైతరంవాళ్ళదృష్టిలో చదువుకూ,

సంపాదనకూ, డిగ్రీకి, డబ్బుకూ ముఖ్యమైన సంబంధం వుంది. చదువుకై ఖర్చుపెట్టినడబ్బుకు ప్రతిఫలం రావాలి! అది కట్న రూపంలోనే ఉంటుంది ప్రస్తుత సాంఘికపరిస్థితుల్లో. లేకపోతే ఉద్యోగంచెయ్యడానికి ఉద్యోగాలే దొరకనప్పుడు, డిగ్రీపుచ్చుకున్న పట్టభద్రుడు ఇంకేవిధంగా సంపాయించగలడు?

తను ఆనర్సులో చేరిన మొదటిసంవత్సం ౧౯౪౨ లో ఆగస్టుఉద్యమంలో దేశస్వాతంత్రంకోసము జైలుకు వెళ్ళే అదృష్టంపట్టింది. ఎలెక్ట్రిక్ ట్రెయిను ఆపి, విద్యార్థులతో సమ్మె చేయించి, ఊరేగింపులో పాల్గొని, లాఠీ దెబ్బలను నిజమైన సత్యాగ్రహిమన స్తత్వంతో ఎదుర్కొని, ఆరు నెలలు జైలుకు వెళ్ళాడు; ఆ ఏడాది చదువుపోయింది. కాని ఆ త్యాగం దేశానికి ఎంతో అవసరమైనత్యాగం! అటువంటి త్యాగాల ఫలితంగానే దేశస్వాతంత్ర్యం సిద్ధించింది. దేశం స్వేచ్ఛను సాధించిన యీ కాలంలో, అందుకు ఏకొంతో తోడ్పడి, ఆ ఆవేశాన్ని గొప్పతనాన్ని పంచుకొన్న తను, వ్యక్తిగతమైన స్వేచ్ఛను, ఆదర్శాన్ని ఏవిధంగా వదులుకోగలడు? ఒకవైపు తెగిన సంకెళ్ళు! ఇంకొకవైపు తనకు పడబోతున్న ఇనుప సంకెళ్ళు!

పెళ్ళికి ఒప్పుకోవడం అసాధ్యం. ఎంత బాధకలిగినా, అది ఎవరికి కలిగినా తను ఈ విషయంలో లొంగిపోడు!

౮

"నువ్వు వ్రాసినకథ బాగుంది!" అన్నమాటలు వెనుకనుండి ఉన్నట్టుండి వినవడి, కొంత తత్తరపాటుతో, వెనక్కితిరిగి

చూచింది విమల. థర్మామీటరుమీది ఏకాగ్రతవల్ల లెక్చ
రరు సుందరరావు రావడమూ, తనవెనుక నిలబడటమూ
ఆమె గమనించలేదు.

ఏ కథ ? విమలకు చప్పున గుర్తు రాలేదు. ఆమె జ్ఞాపకం
చేసుకునేంతట్లోనే చిరునవ్వుతో సుందరరావు, "కాలేజి మాగ
జైనులో నువ్వు వ్రాసినకథ" అన్నాడు.

మళ్ళీ థర్మామీటరువైపు తిరుగుతూ విమల "మీ
వ్యాసం ఎంతో చక్కగా వుంది...నా కథ కన్న" అన్నది.

"నువ్వు చదివావా ?"

"ఊఁ" అని తలవూపి, ఆగి "రెండుసార్లు" అన్నది
మెల్లగా.

"సార్" అని పిలుస్తూ అటెండరు ఏదో విషయాన్ని
గురించి అడగటానికి రాగా, ఫిజిక్సు లెక్చరరు సుందరరావు
అక్కడినుండి వెళ్ళిపొయ్యాడు.

చాల నిదానంగా విమల తను వ్రాయవలసింది
వ్రాసి ముగించింది. మధ్యమధ్య ఏవో ఊహాలు, ఉత్సాహం
మనస్సుఏకాగ్రతని చెడగొట్టినవి. ఒక్కొక్క అక్షరందగ్గరే
ఆమెకలం ఆగిపోయింది. చివరకు పూర్తయిన విషయాన్ని
డిమాన్స్ట్రేటరుకు చూపించి, సంతకంచేయించుకొని, లేబొ
రేటరీనుండి బయటపడింది.

"నీ కథ బాగుంది" అని మెచ్చుకున్నాడు. సెలవుల
తర్వాత యీ సంవత్సరం తనతో సుందరరావు మాట్లాడట
మిదే మొదటిసారి. తను వ్రాసిన కథలోనివ్యక్తి సరోజినిని
గురించి ఏమనుకొనివుంటాడు ? ఆయనవ్యాసం, సాంఘికవ్యవ

స్థలమీద ఎంత ఉదాత్తంగా వుంది! వివాహవ్యవస్థను గురించి వ్రాస్తూ, వ్యక్తిగతమైనఅనుబంధాలముందు కులము, డబ్బు వంటివి లెక్కకురావన్నాడు. వ్యవస్థకన్న మనిషికే ఎక్కువ విలువ ఉండాలి. అది తనకు ఎంతో నచ్చినభావం.

"నువ్వు చదివావా ?" అన్న ప్రశ్నలో ఆసక్తి ధ్వనించింది. అంటే తనుచదివి, అర్థంచేసుకొన్నదని ఆయనకు తృప్తి. వ్యాసం వ్రాసినందుకు కొంత సార్థకత కలిగిందని సంతోషం కాబోలు! "రెండుసార్లు" అని తను అన్నమాట ఆయన విన్నాడా ? తను మెల్లగా అన్నది. అంతలో "సార్" అన్న పిలుపు. తన మాట ఆ పిలుపుతో వినబడలేదు కాబోలు!

పరధ్యానంగావున్న విమలకు వెంట నడుస్తున్న లీల ఏదో చెప్పుతున్నా, ఏమి చెప్పుతూందో తెలీలేదు. కళాశాల ఆవరణ దాటి వచ్చారు ఇద్దరూ. విమలకు గతసంవత్సరం జరిగిన విషయాలు స్మృతికివచ్చి మనస్సును ఆక్రమించుకొన్నవి.

మొట్టమొదటి రోజుల్లో సుందరరావు తనతో మాట్లాడి వుండకపూర్వం, అతనికి తను పెట్టిన పేరు "వైట్‌రోజ్" ఒకమ్మాయిజడలోని గులాబిపువ్వు ప్రాక్టికల్ క్లాసులో, క్రింద పడిపోయింది. ఆ అమ్మాయి చూసుకోలేదు. సుందరరావు అటు వెళ్ళుతూ, చిరునవ్వుతో మందలించాడు "సీ రోజ్ తీసుకో, ఇది సైన్సు లేబొరేటరీ" అని. ఆ వాక్యాని కర్థమేమిటి? ఆయన ఏది అన్నా ఏదో అర్థవంతంగానే వుంటుంది. సైన్సుకూ, గులాబీసౌందర్యానికి సంబంధం లేదనా? సైన్సు ప్రయోగాలసందర్భంలో సౌందర్యానికి జోక్యమనవసరమనేనా? మరి ఒక్కొక్కసారి, ఉన్నట్టుండి, ఆయ నెందుకు వేదాంత

చర్చవంటిది తను పాఠం చెప్పేటప్పుడు చొప్పిస్తూవుంటాడు? ఆడపిల్లలు తర్కించారు సుందరరావు అన్న వాక్యధ్వని యిద మిత్థమని నిర్ణయించటానికి. పర్యవసానం, తను ఆయనకు ప్రసాదించిన పేరు "వైట్‌రోజ్". "వైట్" ఎందుకంటే సుందరరావుకు తెల్లని దుస్తులమీద, లేత పసుపురంగుమీద పక్షపాతమెక్కువ; అది అందరూ గమనించే విషయం!

ఆయనతో పరిచయంకలిగిన తర్వాత చాలసార్లు నవ్వుకొన్నది; గులాబిపువ్వు కనుపించినప్పుడల్లా ఆసంగతే గుర్తు వస్తుంది. . . .

"ఆమె వైట్-రోజ్‌గారి బంధువని నీకు తెలుసా?" అని లీల అడుగుతూవుంది.

సుందరరావుపేరు విని, లీలమాట కర్థం తెలీక "ఎవరు బంధువు?" అని ప్రశ్నించినది.

"జూనియర్ క్లాసులో వున్న రమణి"

"నిజంగానా! ఏవిధంగా బంధువు?"

"మరదలు ... అంటే వరసఅన్నమాట ... ఆ అమ్మాయి ఎవరితో చెప్పనద్దంటుంది ... కాని ఆ దాపరిక మేమిటో నాకు తమాషాగా వుంది ... బహుశా సిగు కాబోలు!"

"సిగ్గెందుకు?" సుందరరావుతోడి బంధుత్వానికి ఇంకా గొప్పలుపోవచ్చునే, అనుకొన్నది.

"అంటే రేపు పెళ్ళి కావచ్చు; ఆ విషయం తెలిస్తే ఎవరైనా గోలచేస్తారేమోనని సిగ్గుగావుండవచ్చు."

"పెళ్ళి నిశ్చయమైందటనా?"

"ఇంచుమించు అయినట్లేనని కూడ చెప్పింది...కానీ నువ్వీ సంగతి అందరితో మాట్లాడవద్దు. ఆ అమ్మాయికి కష్టంగావుంటుంది."

"ఈ సంగతి ఇన్నాళ్ళుగా కొంచెమైనా తెలీలేదే! ఈమె కోసమే ఆయన ఇంకా పెళ్ళిచేసుకోకుండా వున్నారన్న మాట!... అందుకేనా ఆ అమ్మాయి అంత గర్వంగా కని పించటం?"

పాపం, గర్వమేమీలేదు! ఎవరితోనూ ఎక్కువ మాట్లాడదని అలా అనుకుంటారేమో! బహుశా ఏం మాట్లా డాలో తెలీక అలా వుంటుందనుకుంటాను."

"నువ్వు చెప్పే తెలీనితనం డబ్బు ఎక్కువగా వుండటం వల్ల వచ్చేది కాబోలు! అమ్మాయి స్వతహా మంచిదే అయి వుండొచ్చు పాపం!"

"నిజంగా వాళ్ళకు పెద్దగా డబ్బున్నట్టులేదు. సుందర రావు చేసుకోబోతాడని కాలేజికి పంపించారట. లేకపోతే చదువు మానిపించేసేవాళ్లే. పెళ్ళి తర్వాత సుందరరావే మెడిసిన్ చదివిస్తాడని అంటుంది. ఆ అమ్మాయికి డాక్టరవా లని ఎంతో కోరికట!"

లీల హాస్టలువైపు వెళ్ళింది. విమల ఇంటివైపు నడు స్తూంది. రమణిని తను పరీక్షగా ఎప్పుడూ చూడలేదు. సుందర రావు చేసుకోబొయ్యే ఆ అమ్మాయిలో ఏం విశిష్టత వుందో జ్ఞాపకం తెచ్చుకోబోయింది. కాని లాభంలేదు ఆ అమ్మాయి తనకు సరిగా గుర్తులేదు, ఏదో చూచాయగా తప్ప.

* * *

మరుసటిరోజు తరగతులోకి వెళ్ళడానికి యింకా పావు గంట వ్యవధివుంది. రమణిని పరీక్షగా చూస్తున్నది విమల. చాలమందికన్న అందమైనదే, ఎరుపే. కాని ఆ అందంలో ఒక విశిష్టత ఏమీతోచలేదనుకొని, పెదవి విరిచింది. రమణి నవ్వినప్పుడు ఆ తీరు గమనించింది...ఏదో నిరసన, నిర్లక్ష్యత వ్యక్తమౌతుందేకాని సౌహార్దం, మాధుర్యం తోచలేదు. అమాయికపు ఆహ్లాదాని కేమీ చిహ్నంకాదు ఆనవ్వు. వినమ్రత కాని వివేకంకాని తోచవు. స్వోత్కర్ష కనుపిస్తుంది అందులో.

లీలదగ్గరున్న ఒక నవల తీసుకొని, మధ్యలో అక్కడక్కడ చదవడం ప్రారంభించింది రమణి. కొంతసేపటికి లీలకా పుస్తకం కావలసివచ్చింది. ఆమె ఇంకొక అమ్మాయితో ఆ పుస్తకాన్నిగురించే చెప్పుతూ, అందులో ఏదో చూపించాలని, రమణిని ఆ పుస్తకమిమ్మని కోరింది. "ఇదుగో, ఇస్తాను" అంటూనే రమణి ఇవ్వలేదు. లీల ఆగి, మళ్ళీ రెండుమూడు సార్లు అడిగి ఊరుకుంది; రమణి ఇవ్వలేదు. తీరా గంటకొట్టి నప్పుడు ఇచ్చింది. లీల ఏమీ అనలేదు. రమణిప్రవర్తన విమలకు కోపం కలిగించింది. లీల మంచితనాన్ని గౌరవించడం తెలీని రమణి చివరకు స్నేహానికి కూడా తగదని అనుకొన్నది. చనవు, అధికారం ఇతరులమీద చూపించడానికి పూర్వం అర్హత సంపాదించాలి. అవి అప్పుడే రాణిస్తాయి స్నేహ చిహ్నాలుగా.

ఫిజిక్సు రికార్డుపుస్తకాలు తెచ్చుకోవడానికి విమల, లీల వెళ్ళారు. సుందరరావు విమలను పిలిచాడు, "ఈసారి నాటకం ప్రదర్శనసందర్భంలో మళ్ళీ నువ్వు పాడాలి." అన్నాడు.

రమణికి పాటలురావు కాబోలు!... పాడటమన్నా, అందు కోసం సుందరరావు తనని బ్రతిమాలడమన్నా, ఇంతకుపూర్వం తన కెంతో సరదాగా వుండేది; కాని యీసారి పాడకుండా తప్పించుకోవాలనుకొన్నది విమల.

"స్టేజిమీద పాడటం నా కసలు ఇష్టంలేదు; నాకు గొంతు చాలదండి!"

"మైక్ వుంటుందిగా, పోయిన సంవత్సరంలాగే!"

"మైక్‌కి సరిపోదు నాగొంతు; నాకు అడ్జస్టుచేసుకోవడమూ తెలీదు."

"నేను అడ్జస్టుచేస్తానులే; అంటే నీగొంతుని కాదు, మైక్‌ని." అన్నాడు నవ్వుతూ.

ఆ హాస్యధోరణి తనకు ఏమీ బాగులేదు. మౌనం వహించింది. "నేను పాడను" అని గట్టిగా చెప్పివెయ్యాలనుకొన్నది.

"నువ్వు నెమ్మదిగా సహజంగా పాడితే చాలు విమలా! ఎంతో బాగుంటుంది ముఖ్యంగా నాకు నువ్వు పాడితే వినాలని ... నువ్వు పాడకపోతే అసలీ ప్రోగ్రాంలో నాకు సరదాయే వుండదు. ఏమంటావు విమలా?" అని ప్రాధేయపూర్వకంగా, స్నేహంగా సుందరరావు అంటున్నాడు. ఇప్పుడు తనేం చేయగలదు? ఆయనధోరణి చూస్తే అక్కడినుండి పరుగెత్తిపోవడమే మార్గం అనిపించింది. ఇంకా ఆయనతో "పాడనని" మొండికెత్తడం ఆయన తనని మళ్ళీమళ్ళీ అడగడం, ఇవన్నీ తను భరించలేదు!

"మేము వెళ్తామండి!" అని గిరుక్కున తిరిగింది.

"కొత్తగేయాలు నేర్చుకోవాలి; మరచిపోవద్దు." అన్న మాటలు వెంబడించినవి.

లీల, విమల క్లాసుకు వెళ్ళారు. అది క్రొత్తలెక్చెరరు వేదమూర్తిక్లాసు. మొదటి సంవత్సరం చాలరోజులు లెక్చెరరు లేనందువల్ల ఖండకావ్యాలు సగంపైగా మిగిలిపోయ్యాయి. వేదమూర్తి అవన్నీ యీ సంవత్సరం పూర్తిచేస్తున్నాడు.

ఆర్నాల్డు కవి వ్రాసిన FORSAKEN MERMAN కావ్యాన్ని పాఠం చెప్పుతున్నాడు. ఆ కావ్యంలో ఇతివృత్తం మెర్‌మెన్ విరహము, అతని విషాదగాథ. మెర్‌మెన్ సముద్రంలో జీవించే వింతమానవుడు. అతనిభార్య తీరంలోవున్న గ్రామానికి చెందిన సామాన్య మానవకాంత. మెర్‌మెన్‌ను వివాహంచేసుకొని అతని వింతలోకంలో కొన్నాళ్ళు సంసారం చేసి, పిల్లల్నికన్న ఆమె ఒకనాడు సముద్రగృహంలో కూర్చుని చర్చిగంటలు మ్రోగటం విన్నది. ఆరోజు ఆదివారమనీ, తనవాళ్ళందరూ వెళ్ళి ప్రార్థనలుచేస్తారని గుర్తువచ్చి, తన పూర్వజీవితాన్ని జ్ఞాపకంతెచ్చుకొన్నది. మెర్‌మెన్‌జాతి వారికి ఆత్మలుండవనీ, వాళ్ళకూ దేవునికీ సంబంధం వుండదనీ సామాన్య ప్రతీతి. అతనితోనే తన శేషజీవితాన్నికూడ గడపి అట్లానే చనిపోతే, తనకు మోక్షం వుండదని ఆమె ఆలోచించుకున్నది. "నాకు చర్చికివెళ్ళి ప్రార్థనచెయ్యాలని వుంది. మళ్ళీ తొందరగానే వచ్చేస్తాను, సెలవి"మ్మని మెర్‌మెన్‌తో చెప్పి, ఆమె తనబంధువుల్లోకి వెళ్ళిపోయింది. ఎన్నిరోజులు గడచినా ఆమె తిరిగి రాదు. పిల్లలు తల్లికోసం పదేపదే తండ్రిని ప్రశ్నలువేస్తారు. వాళ్ళతో మెర్‌మెన్ తీరందాకావచ్చి, చర్చి

వైపు, ఊరివైపు ఎదురు తెన్నులు చూస్తాడు. ఆమెహృదయ కాఠిన్యాన్ని తలచుకొంటూ, ఉద్ధృతమౌతూన్న సముద్ర తరంగాలవైపు చూస్తూ, పిల్లల్ని "వచ్చివెయ్యండి" అని పిలుస్తూ మెర్ మెక్ విలపిస్తాడు. అతనిహృదయావేదన వింటూన్న వారిహృదయాల్లో ప్రతిధ్వని పలికేటట్లుగా కావ్యం నడచింది. Come away, children dear, అంటూ విషాదంతో పిల్లల్ని తీసుకొని మెర్ మెక్ చిన్నబోయిన తనయింటికి వెళ్తూవుంటే మనస్సు ద్రవించింది. వేదమూర్తి ఊహా, వ్యాఖ్యానము కవిత్వంతో తాదాత్మ్యత చెంది, ఆయనగొంతు లోని విషాద మాధుర్యం ఒక విచిత్రానుభూతిని కలిగించింది. విమలకు కళ్ళలో నీళ్ళు నిండినవి. టంగుమని మోగినగంట ఆమెను ఉలికిపడేటట్లు చేసింది.

"ఏడుస్తున్నావే!" అన్నది లీల, ఆమెవైపుచూచి చిరునవ్వుతో.

"క్లాసు ఎంతో చక్కగా వుంది. లెక్చరరు నాకు కన్నీళ్ళు తెప్పించారులే."

"అసలు మెర్ మెన్ ఆయనే అనిపించిందికదూ!"

* * *

శనివారం మూడుగంటలవేళ ఆడవాళ్ళ హాస్టలుకు వెళ్ళింది విమల.

లీలగదిలో పార్వతి, రమణి ఏదో చర్చిస్తున్నారు.

పార్వతి మంచంమీద పడుకొని, తలక్రింద ఒక చేయి ఎత్తుగా పెట్టుకొని, ఎదురుగా కుర్చీలో కూర్చున్న రమణితో వాదిస్తోంది. లీల పార్వతిప్రక్కన మంచంమీదే కూర్చున్నది.

విమల రాగానే ఆమెకూర్చోడానికి మూలనున్న చిన్న బల్ల తెచ్చివేసింది లీల.

"భక్తి, పాతివ్రత్యం అని బయలుదేరితే ఇంక తలెత్తు కోడానికి లేకుండా, దేవుడిగదిలోనూ, వంటగదిలోనూ పిచ్చి మొహం వేసుకుని చాకిరీ చెయ్యవలసినపరిస్థితి తయారౌతుంది. ఇప్పుడున్న వాతావరణంలో భక్తి, పాతివ్రత్యం కాదుగదా, అసలు వివాహమే స్త్రీస్వాతంత్ర్యానికి పనికిరాదు. పురాణ యుగంలో వుండినంత మాత్రం సాంఘికగౌరవం, సమానత్వం స్త్రీలకు తిరిగిరావాలంటే ఒక్కటే మార్గం. అదేమిటో తెలుసా ? కనీసం చదువుకున్న స్త్రీలందరూ 'మేం ఏ పరిస్థితుల లోనూ పెండ్లిచేసుకోము' అని ప్రతిజ్ఞ చెయ్యాలి. అట్లా ఒక్కతరం విద్యావంతులైన స్త్రీలు చేస్తేనే, వాళ్ళకు కొంచెం బాధకలిగినప్పటికీ తర్వాత తరాల స్త్రీల సమస్యలన్నీ తెగి పోతాయి. కట్నాలసమస్యే కాదు, పురుషులతో సమానత్వం విషయంకూడా ఇట్టే తేలిపోతుంది."

"మహా చెప్పావు. ఐతే నువ్వు పెళ్ళిచేసుకోవన్న మాట?" అన్నది రమణి.

"అంతే, నేను చేసుకోను. కాని నేనొక్కదాన్ని చేసుకో కుంటే మాత్రం ఫలితం వస్తుందా? నువ్వు చెయ్యాలి, అందరూ చెయ్యాలి ఆ పని" అన్నది పార్వతి.

"ఇంకా నయం! ఆడవాళ్ళందరూ మగవాళ్ళుగా మారాలి అనలేదు. వివాహంతోబాటు స్వాతంత్ర్యంకూడా ఎందుకు వీలుకాదో నాకు అర్థంకావటంలేదు. టీచర్లు, డాక్టర్లు

లాయర్లుగా పనిచేస్తూవుండి, పెళ్ళిచేసుకొని ఎంతమంది స్త్రీలు తమ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవడంలేదు?"

"ఓహో, ఉద్యోగాలుచేస్తున్నవాళ్ళంతా వ్యక్తి స్వాతంత్ర్యం కలిగివున్నట్లే భావిస్తున్నావా? ఇంట్లో భర్తల దగ్గర మొట్లుతింటూనే వుంటారు వాళ్ళు!" అని పార్వతి అనగా, విమల కలుగజేసుకొని,

"అంతేకాదు, ఒకవేళ ఉద్యోగము చెయ్యడమే స్వాతంత్ర్యం అనుకున్నప్పటికీ ఉద్యోగమూ, పెళ్ళీ రెండూ పొసగడం మాత్రం సులభమా? చదువుకుని ఉద్యోగంలో చేరినవాళ్ళకు పెళ్ళికావడం కష్టం; కట్నమిస్తామన్నా వాళ్ళ నెవరూ చేసుకోవడానికి ముందుకు రారు. అసలు చాలమంది చదువుకుని ఉద్యోగంచెయ్యడానికి తయారవడమెందుకు? అది వ్యక్తిస్వాతంత్ర్యం సాధించే ఉద్దేశ్యంతో ఏమీకాదు. చదువుకయ్యేఖర్చు తక్కువ. పెళ్లికన్న చదువు అందుబాటులో వుంది, అందుకని" అన్నది.

"అదేమీ కాదు. అట్లా అనుకుని ఎవ్వరూ చదవటం లేదు. చదువుకుంటే విజ్ఞానం వస్తుందని, ఉద్యోగంచేస్తే ఆర్థిక స్వాతంత్ర్యమూ, స్వేచ్ఛ వుంటాయని అనుకుంటారు. మన కున్న అభిప్రాయమే అందరికీ వుంటుందనుకోవడం పొరబాటు." అన్నది రమణి విమలవైపు చూడకుండానే

"నా అభిప్రాయమేమిటో నాకు బాగా తెలుసు. పెళ్ళిచేసుకోవాలనుకొని, దానికోసం చదువుకోవటంలేదుగా నేను. వివాహంలో నాకు నమ్మకమేలేదు!" అన్నది విమల.

రమణి ఆశ్చర్యంగా ఆమెవైపు చూచింది.

"ఒక్క ప్రమాణం, ఒక్క అభిప్రాయం, ఒక్క సూత్రం అందరికీ ఎలానూ సరిపోదులే; ఎవరి పరిస్థితుల్ని, ఇష్టానిష్టాల్ని బట్టి వాళ్ళు చేస్తారు. అందరికీ ఒక్క పద్ధతిని గూర్చి మనం ఆలోచించడం వృథా" అని లీల సర్దడానికి ప్రయత్నించింది.

"అదీ నిజమే! పెళ్ళికి అవకాశంలేనివాళ్ళందరికీ, అందులో నమ్మకం వుండదు, వివాహం నచ్చదు మరి!" అన్నది రమణి.

విమలకు కోపంవచ్చింది. "ఒక రెడీమేడ్ భర్త సిద్ధంగా వుంటే పెళ్ళిలో నమ్మకంవుండక మాత్రం తప్పుతుందా?" అన్నది.

పార్వతి నవ్వడం ప్రారంభించింది "రెడీమేడ్ అన్న మాట చాల బాగుంది!" అంటూ.

రమణి ముఖం చిట్లించుకుని "అర్థంలేని Discussion" అని కోపంతో లేచి వెళ్ళిపోయింది.

"విమలా డియర్, నీకు మంచి జీనియస్ వుంది, పేర్లు వెదకడంలో. Congratulations అంటూ పార్వతి మంచం మీదనుంచి లేచివచ్చి, విమలవీపుమీద ఒకటి చరచి, వంగి చెక్కిలి ముద్దుపెట్టుకొంది.

విమల తుడుచుకుంటూ "పోవే! ఆడదానిలా వుండరాదు!" అన్నది.

"రాదు!...ఏమిటేవ్ సంగతి? రమణిని అట్లా అన్నావని మీ ఫ్రెండ్ వైట్-రోజ్‌కి కోపంవస్తుందేమో!" అన్నది కుర్చీలో కూర్చుంటూ పార్వతి.

"ఆ అమ్మాయి అన్నదానికి నేనన్నాను." అని, విమల లీలవైపు చూచింది.

"నువ్వు చేసిందేమీ బాగులేదు. ఆ అమ్మాయిని ఎత్తిపొడవడం అన్యాయం. నేను నీ కేదో విషయం చెప్పితే, అది నువ్విట్లా వుపయోగించడమేమిటి, వ్యక్తిగతంగా?" అన్నది లీల. విమల జవాబు చెప్పడానికి ముందే పార్వతి అందుకొన్నది. "ఓస్, నీకు మాత్రమే చెప్పిన రహస్యం అను కున్నావు కాబోలు! హాస్టల్లో చాలమందికి తెలిసినకాన్ఫిడెన్సే! నాకూ చెప్పిందిలే; నేనే విమలకు చెప్పాననుకుంటుంది."

"అసలు నువ్వు నవ్వడం బాగులేదు; అందుకే ఆ అమ్మాయికికోపంవచ్చింది." అన్నదివిమల పార్వతి నుద్దేశించి.

"నవ్వివుండను కాని, యీమధ్య మాకు కొంత చెడింది. మొదట చాల స్నేహంగా వుండేది; కాని యిప్పుడు మన వార్డన్‌గారిచుట్టూ తిరగడం మొదలుపెట్టింది, ఆవిడ అనుగ్రహంకోసం! నీకు తెలుసుగా అసలు ఆమెకూ మనకూ పోయినసంవత్సరంనుంచే చుక్కెదురు అని! ఇంక ప్రతిపక్షు మంటే ప్రతిపక్షమే మరి."

మాసినబట్టలు తీసుకొనిపోవడానికి చాకలి వచ్చాడు. పార్వతి వెళ్ళిపోయింది. లీల బట్టలు తీసి చాకలిముందు పడేస్తూ వుంది.

విమల మంచంమీద పడుకొని ఆలోచిస్తూవుంది.

రమణిమీద తనకెందుకు కోపం? ఆ అమ్మాయితో తనకు పరిచయం లేనప్పుడు వాదన ఎందుకు పెంచుకోవాలి? తనకు అసూయా? బాధా? ఏమిటి? తనకూ రమణికీ

సంబంధం ఏమీ లేదు. తనకు అసూయకూడా ఏమీ లేదు. ఆ అమ్మాయిని సుందరరావు చేసుకుంటాడు. మంచిదే! అతని యిష్టం. ఆమె అతనిబంధువు మరి!

తన నేదో అన్నది కాబట్టే ఆ అమ్మాయిని అనవలసి వచ్చింది. లేకపోతే అంత స్పోత్కర్ష ఏమిటి? కలుపుగోలుగా వుండడం ఎవరైనా నేర్చుకోదగిన విషయమే.

చాకలి వెళ్ళిపోయాడు. ల విమలదగ్గరకు వచ్చి "ఏమిటే, ఆలోచిస్తున్నట్టున్నావ్?" అన్నది.

లీల చెయ్యి దగ్గరకు లాక్కొని "నీకు కోపంవచ్చిందా?" అని అడిగింది విమల.

"లేదు... కాని నువ్వామాట అనడం, పార్వతి మోటుగా నవ్వడం, పాపం! ఆ అమ్మాయి ఏమనుకొని వుంటుంది? అవతలివాళ్ళు బాధపడుతారని ఆలోచనలేకుండా ప్రవర్తించడం పార్వతికి మామూలే; కాని నువ్వు నా కాశ్చర్యాన్ని కలిగించావ్"

* * *

సుందరరావు విమలను తన గదికి రమ్మని కబురు పంపాడు. వెళ్ళగానే "కొత్తగేయాలేవైనా నేర్చుకొన్నావా విమలా?" అని ప్రశ్నించాడు.

"ఇంకా లేదు" అని ఊరుకుంది. కారణమేమిటో యింకా వివరిస్తుందనుకొంటూన్న సుందరరావు, ఆమె ఆగిపోయినందుకు కొంచెం ఆశ్చర్యంతో

"ఎందుకని? నేనప్పుడే చెప్పానే!" అని అంటూ ఏదో పుస్తకం తెరిచాడు కోపసూచకంగా.

చెప్పితే మాత్రం తనమీద యీ అధికారమేమిటి ? అసలు పాడడానికి తనెప్పుడు ఒప్పుకొన్నది ? పోతే, ఆ రోజు స్పష్టంగా నిరాకరించలేదు, అంతే.

ఇప్పుడు పాడనని గట్టిగా చెప్పేస్తే ఏమౌతుందేమిటి?.... నవ్వు వచ్చింది... ఏమీకాదు, ఈయనగారికోపం వ్యర్థమౌతుంది. తర్వాత తనతో మాట్లాడడు; తనకు తలబిరుసుతనం అనికూడ అనుకుంటాడు.

మర్యాద తెలీదు, వట్టి మోటుమనిషి. భయపడే, సిగ్గుపడే మొద్దు, అందుకే పాడలేదు అనుకుంటాడు.

అనుకోనీ. తనకేం? అతనికే అర్థంచేసుకొనేశక్తి లోపించినట్లవుతుంది.

కానీ, తనప్రవర్తన ఎవరికైనా ఆవిధంగానే మోటుగానే తోస్తుందికదా!

తను సుందరరావుతో అసలు ఎందుకని మోటుగా ప్రవర్తించాలి? ఆయన రమణిని వివాహంచేసుకోడానికి నిశ్చయించుకోవచ్చు. ఆ విషయం తన కనవసరం. ఆయనతో స్నేహం ఎందుకు చెడగొట్టుకోవాలి?

ఎదుట వున్న పుస్తకంవైపే చూస్తూ, జవాబుకోసం నిరీక్షిస్తున్న సుందరరావు ఆమెవైపుచూచి మళ్ళీ "జవాబు చెప్పడం కూడ కష్టంగానే వుందే!" అన్నాడు.

"నాటకం ఇప్పుడే కాదుగదా అని" అన్నది విమల.

"ఇప్పుడే కాదని ఎవరన్నారు? అసలు నీకిష్టంలేకపోతే మానెయ్యి, బలవంతమేమిటి?" అని మళ్ళీ పుస్తకం వైపు చూస్తున్నాడు.

చెప్పినట్లు చెయ్యడంలేదని కోపంవచ్చి వేసింది! ఇప్పుడు అడుక్కోవడం తనవంతు.

"అబ్బా, రేపట్నుంచి తప్పకుండా నేర్చుకుంటాను లెండి!" అన్నది అతనికోపానికి విసుక్కున్నట్లు.

సుందరరావుపెదవులమీద చిరునవ్వు, చూపుల్లో ఒక్కసారిగా మళ్ళీ మామూలు స్నేహభావం మెరిశాయి.

"సరే, మళ్ళీ మరచిపోవుకదూ?" అన్నాడు. తను నవ్వుతూ తలఊపింది.

ఆ సాయంత్రం ఇంటికి వచ్చినతర్వాత జరిగినదంతా గుర్తువచ్చి, పాడటానికి నిరాకరించివుంటేనే బాగుండునను కొన్నది. సుందరరావుతో తనకు యీ స్నేహంమాత్రం ఎందుకు? అర్థంలేని స్నేహం! అయినా తన కీ అశక్తత ఏమిటి? ఆయన్ని ప్రాధేయపడినట్లు, కోపంవద్దని చనవుగా చెప్పినట్లు 'అబ్బ, రేపట్నుంచి నేర్చుకుంటానులెండి!' అన్నది. ఆ 'అబ్బ'...ఏమిటి? పోనీ "క్షమించండి, నేర్చుకుంటాను" అని నింపాదిగా చెప్పవచ్చును గదా!

చర్చివైపుమాస్తూ, సముద్రతీరాన్నుండి వెనక్కి వెళ్ళలేని ఆ విషాదమూర్తి మెర్‌మెన్ గుర్తువచ్చాడు. మెర్‌మెన్ కూడా తనవలె స్నేహార్ద్రమైన మనస్సుని కట్టుబాటు చెయ్యలేని అశక్తుడే! లేకపోతే తన్ను విడచివెళ్ళిన భార్యమీద మమకారం ఏమిటి, అంతం లేకుండా? వేదమూర్తికంఠస్వరం చక్కగా గుర్తువస్తూవుంది. "Come away, children dear" అంటూ కావ్యం తీసి ఒక్కసారి వేదమూర్తిని అనుకరిస్తూ చదివింది.

# 3

"బావా, నాన్న ఉత్తరం వ్రాశారు. వారంరోజుల్లో మద్రాసు వెళ్తున్నారు." అన్నది రమణి సుందరరావుతో.

"వెళ్ళితేయేం ?"

"నాకు మంచివి రెండుచీరెలు తెమ్మని వ్రాయాలి, కార్డు వుందా ?"

"ఇప్పుడున్నవి చాలలేదా ?"

"ఎన్ని వున్నాయేమిటి? నాన్న నన్నెప్పుడూ డిసెపాయింట్ చెయ్యరు. నాకు తెలుసు, నువ్వయితే రెండు చీరెలతో తృప్తిపడి వుండమంటావని!"

"నన్ను కొనివ్వమని నువ్వెందుకడుగుతావు, నేనెందుకు కొనిస్తాను?"

అతనివైపు చురుగ్గా చూచి, నవ్వుతూ,

"అడగలేదని కోపమా? పోనీ మంచి జార్జెట్ చీర, నాకు లేని రంగులో, ప్రెజెంట్ చెయ్యి, పుచ్చుకుంటాను. ... కార్డు ఎక్కడుంది?" అన్నది రమణి.

"ఆ పుస్తకాలకు చివర వుంటుంది తీసుకో" అని చూపించాడు సుందరరావు.

రమణి ఉత్తరంవ్రాసి పూర్తిచేసింది.

"బావా, విమల మీ favourite అట నిజమేనా?"

"Favourite అంటే? ఆ అమ్మాయి బాగా పాడుతుంది. పోయినసారి కొన్ని పాటలు పాడించాను. చాల మంచిది."

"Favourite అంటే మీ ప్రియమైన శిష్యురాలు అన్న మాట! నాకు ఆ అమ్మాయంటే అసలు యిష్టంలేదు తెలుసా?"

"లేకపోతేపోనీ, యిప్పుడేం?...ఎందుకని ఇష్టంలేదు?"

"ఇష్టంలేదు, అంతే. కారణం ఉండి తీరాలేమిటి?"

"నిజమే... కాని కారణం ఉండకపోదు! చప్పున గుర్తు రాదు. కొంచంఆలోచిస్తే కారణం తప్పకుండా తెలుస్తుంది."

"కారణం గుర్తురాకపోతే ఎందు కాలోచించి కను క్కోవాలి ?"

"నాతో చెప్పడానికే అనుకో. నిన్ను నువ్వు అర్థం చేసుకోవడానికూడా. ఆ అమ్మాయితో నీకు పరిచయం వుందా ?"

"లేదు. అసలు నేనేమీ పరుగెత్తికెళ్ళి అమెతో మాట్లాడలేదు."

"అయితే ఆ అమ్మాయిని చూచీచూడటంతోనే ఇష్టంలేదని నిశ్చయించుకున్నావన్నమాట ?"

"కాదు, ఆ అమ్మాయిని ఊరికే చూస్తూవున్నాననుకోండి. అప్పుడు ఆమె ఏదో చేసో, అనో వుండవచ్చు...లేక ఆ అమ్మాయివైఖరే నాకు నచ్చకపోవచ్చు."

"ఏం చేసిందేమిటి? ఏమన్నా అన్నదా ?"

"ఊహు... నేనేమీ చెప్పను."

"చెప్పు, ఫరవాలేదు. చెప్తే నాన్నుంచివచ్చే ప్రమాదమేమీ లేదు కద."

"ఒక వేళ మీ అభిప్రాయం, ఆమెను గురించి, మారిపోవచ్చునేమో!"

"మారవచ్చు మారకపోవచ్చుకూడా. నువ్వు చెప్పితే నేగా తెలుస్తుంది!"

"నేను చెప్పను."

చెప్పమని అడిగించుకొంటూ, నిరాకరిస్తూవుండటం ఆమెకుసరదా అని సుందరరావుకు తెలుసు. అతను ఊరుకున్నాడు.

రమణి మళ్ళీ "ఎవరైనా నన్నుగురించి వెక్కిరింపుగా అంటే నాకు వాళ్ళమీద ఇష్టం కలగాలేమిటి ?" అన్నది.

"విమల ఏమన్నది నిన్నుగురించి ?"

"ఆ విషయం నేను చెప్పను."

"చెప్పనిదానివి చెప్పనట్లుండక, మధ్యమధ్య ఆ విషయం తవ్వటమెందుకు ?"

"నేను మళ్ళీ విమలసంగతే అంటున్నానని ఎందుకు ఊహించాలి ? ఏదో మాటవరసగా అన్నాను."

"అట్లా అయితే సరేలే!"

వంటవాడు మంగయ్య టీ తీసుకొనివచ్చి టేబిల్ మీద పెట్టాడు.

"మంగయ్యా, ఆ కార్డు పోస్టుకు పంపించు" అన్నాడు సుందరరావు రమణి వ్రాసిన కార్డును చూపించి, మంగయ్య దాన్ని తీసుకున్నాడు.

టీ సుందరరావుకు అందించింది రమణి.

టి తాగుతూ, రమణివైపు తదేకంగా చూస్తూ ఆలోచిస్తున్నాడు సుందరరావు.

కొంటెతనం, చిలిపితన మింకా పోలేదు. అదే ఆమెలో ఆకర్షణీయమైన గుణం. తనపై చనవు, అధికారం రమణికి చిన్నప్పటినుండి వచ్చినవి. అవి అట్లానే వున్నవి; ఎప్పుడూ తనని కవ్విస్తూ, ఏదో చెప్పబోయి, చెప్పకుండా ప్రాధేయ పడేట్లు చెయ్యాలి అని ప్రయత్నిస్తూవుంటుంది.

కళాశాలలో చేరకపూర్వం రమణిని చూచి, మాట్లాడి అయిదేళ్ళయింది. అప్పుడు పదిపదకొండేళ్ల బాలిక. ఈ అయిదేళ్ళూ కలుసుకోకపోయినప్పటికీ రమణి మాత్రం తనమీద ఆ చనవు, అధికారం మరచిపోలేదు, వదలుకోలేదు; ఈపాటికి వయోలక్షణమైన సిగ్గు ఆమెచిలిపితనానికి స్వస్తిచెప్పి, ఆమెలో పెద్ద మార్పు తీసుకొనివచ్చివుంటుందనుకొన్న సుందరరావుకు ఆశ్చర్యమూ, సంతోషమూ కలిగాయి. కళాశాలకు వచ్చినతర్వాత, పెద్దదాననయ్యాననీ, బావ లెక్చరరు స్థానంలో వున్నాడనీ సందేహం ఏమీలేకుండా, పూర్వంలాగే ఆమె అన్యోన్యత, చనవు కలిగివుండడం సుదరరావు కెంతో ప్రియమైనసంగతి.

నాలుగేళ్ళుగా వాళ్ళ రెండుకుటుంబాలు విడిపొయ్యాయి. రమణితండ్రి అంటే తన మేనమామ ఐదువేలు తీసుకొని చివరకు లేదన్నాడు. సుందరరావునాన్నగారు ఋజువేమీ లేక కోర్టుకు వెళ్ళలేక ఊరుకున్నాడు. అప్పటినుండి రాకపోకలు, మాటలు లేవు వాళ్ళకు.

పెద్దవాళ్ళకలహాలు ఎట్లావున్నా రమణి తనమీద అభిమానాన్ని పోగొట్టుకోకపోవడం సుందరరావుహృదయాన్ని చూరగొన్నవిషయం. రమణికి, వాళ్ళ నాన్న చేసిన

మోసానికి సంబంధమేమీలేదు; ఒకరితోడి ప్రేమానుబంధానికి, ఇంకొకరితోడి విరోధానికి లంకె ఏమిటి? అది వేరు, ఇది వేరు. మేనమామవిషయంలో కూడ వ్యక్తిగతంగా సుందరరావు ఏ నిశ్చయానికీ రాలేదు.

టీ తాగడం పూర్తయి, రమణి హాస్టలువార్డన్ శారదాంబను గురించి ఏమిటో చెప్తూవుంది. కొంత పరధ్యానంగా వింటున్నాడు సుందరరావు.

శారదాంబ తెలుగులెక్చరరు; ఆమె రమణిమీద ప్రత్యేకాభిమానమూ, శ్రద్ధ చూపిస్తుందట. ఈ ఏడు హాస్టలులో విద్యార్థినులసంఖ్య పెరగటంవల్ల, స్నానాలగది ఒక్కటే వుండడంవల్ల ఇబ్బందిగా వుంది. వేళకు అందరూ స్నానం ముగించడం అసాధ్యమౌతూవుంది. శారదాంబ రమణికీ, ఇంకొక అమ్మాయికీ మాత్రం తనకు ప్రత్యేకింపబడిన స్నానాల గది వుపయోగించడానికి వసతి కల్పించింది. సుందరరావుమరదలని తెలిసినతర్వాత, రమణిమీద ఆమెకు అభిమానం మరీ ఎక్కువైనదట.

సుందరరావుకు శారదాంబ అంటే కొంత జాలి, విసుగూ కూడా కలుగుతాయి. తనతో మాట్లాడవలసివచ్చిన కొన్ని సమయాల్లో ఆమెవైఖరివల్ల అతనికి చాల కష్టమనిపించింది. ఏదో అనవసరమైన అసందర్భపు సిగ్గు, ఆందోళన, ముంచుకొనివచ్చినట్లు ప్రవర్తిస్తుంది! పైటసవరించుకోవడం, తలవంచుకోవడం, ప్రక్కలకి చూడడం, అర్థంలేని చిరునవ్వూ చూస్తే, ఆమెకు ఎందుకు వచ్చిన గొడవ యీ ఉద్యోగం, పాపం! అనిపిస్తుంది.

"విమలవాళ్ళ నాన్నకూ, అమ్మకూ చాల సంవత్స రాలుగా ఎలాంటి సంబంధం లేదట." అన్నది రమణి, మళ్ళీ విమలప్రసక్తి తెస్తూ.

"ఎవరు చెప్పారు?"

"ఒక అమ్మాయి చెప్పింది. చదువుకోసమే వాళ్ళమ్మా తనూ యీ వూళ్ళో కాపురంపెట్టారట."

ఒకరినిగురించి ఒకరు పుట్టుపూర్వోత్తరాలు తడవ్వు కోవడం కంటె యీ అమ్మాయిలు మాట్లాడుకొనే విషయా లేమీ వున్నట్టు తోచలేదు సుందరరావుకు.

"ఇటువంటి కబుర్లతోనే ప్రొద్దుపుచ్చుతున్నావు కాబోలు! ఏమైనా చదవటం వుందా?" అన్నాడు.

"నువ్విచ్చిన నవల, Pride and Prejudice పూర్తి చేశాను" అన్నది రమణి చప్పున విషయం మార్చి.

"నీకు ఆ రెండూ బాగా వున్నట్టున్నాయి!" అన్నాడు నవ్వుతూ. విమల రమణినిగురించి ఏదో అన్నదనేసంగతి గుర్తు వచ్చి ఆ విషయం ప్రశ్నించాడు.

"నిన్నుగురించి ఆమె అన్న మాటేమిటి? నీ కంత అయిష్టత కలిగించినమాట?"

ఏదో కొత్తసంగతిగా తన కర్థంకానట్లు, బొమముడితో, కొంటెగా అతనికళ్ళల్లోకిచూస్తూ—

"ఏం మాట? ... నాకు అయిష్టతేమిటి?" అన్నది రమణి.

"అప్పుడే మరచిపోయ్యావంటే ఎట్లా నమ్మతాను? విమల నిన్నేదో అన్న విషయం!"

"ఏదో ... ఊరికేగాని ... నాకేం బాధలేదు. కాని అది నీతో చెప్పకూడదు"

"పోనీ ఏ సందర్భంలో వచ్చిందో చెప్పు. దాన్నుంచి ఎటువంటి విషయమై వుంటుందో నేనే ఊహించుకుంటాను."

ఉత్సాహంగా అన్నది రమణి. "సరే, మరి సరిగా ఊహించుకోవాలి, చూద్దాం. నువ్వు ఓడిపోతే ఏమిస్తావ్? ఒక జార్జెట్ చీర యిచ్చుకుంటావా?"

"సరే, సందర్భం చెప్పు."

"పోయిన శనివారం, సుమారు మూడున్నరగంటల వేళ నలుగురు అమ్మాయిలు— అందులో నేను, మీ Favourite వున్నాము — హాస్టలులో ఒకగదిలో ఏదో చర్చిస్తున్నాము."

"కథ చాల తీరికగా, స్థలనిర్దేశంతో ప్రారంభించావే! మూడుముక్కల్లో చెప్పు చాలు"

"ఆ చర్చ దేన్నిగురించి? భారతనారీమణుల్ని గురించి... అంటే పురాణ, ఆధునిక, భావి భారతీయమహిళల్ని గురించి"

"ఫరవాలేదు.... మంచిదేగా, ఇంకేదో చెత్త మాట్లాడకుండా."

"అప్పుడు నన్ను బాగా వ్యతిరేకిస్తున్న ఒక మగ రాయుడులాంటి అమ్మాయి 'చదువుకున్న స్త్రీలు పెళ్ళి మానేసుకోవాలి' అన్నది. ఏమంటే స్త్రీజాతిని ఉద్ధరించడానికట! పెళ్ళిచేసుకొని మాత్రం ఉద్ధరించగూడదా? అన్నాను నేను. చదువుకూ పెళ్ళికీ ఒకదానికొకటి పొసగవు అన్నది విమల కలుగజేసుకొని. ఎందుకు కుదరవు, సాధ్యమే,

అన్నాను నేను. అప్పు డావిడగారేదో అన్నదిలే... ఇంతకూ ఆమెతో నాకు పరిచయమే లేదు!"

"ఏమన్నది ?"

"అదేగా మరి ఊహించవలసింది, మీా ఊహాశక్తి నుపయోగించి."

"అయితే నీకు బాధకలిగించేమాట ఏమైవుంటుం దబ్బా! నా ఊహాశందటంలేదే!...'నీకు పెళ్ళెలా అవుతుందో చూద్దాంలే' అని వుంటుంది, అంతేనా ?"

"అదికాదు. మరీ అట్టా నన్ను తిరస్కరించేమాట కాదు. అదొక విసుకు! నేను చెప్పను."

"అయితే నేను ఓడిపొయ్యాను మరి."

"ఓడిపో...ఓడిపోయినందుకు నాకు చీరె వస్తుంది!"

సుందరరావు మళ్ళీ ఉత్సాహంచూపిస్తూ "సరేకానీ, నిన్నింకో ప్రశ్న అడగనా? నిజమైన, అంటే నీకు మనస్ఫూర్తిగా వున్న అభిప్రాయమే, జవాబుగా చెప్పాలి!"

ఉత్కంఠంతో రమణి సుందరరావుకళ్ళల్లోకి చూచింది. అతను తనవైపు తదేకంగా చూస్తూవుండడంవల్ల మళ్ళీ కళ్ళు తిప్పుకొని "సరే" అన్నది.

"నీకు చదువుమీాద, ఎంత ఆసక్తివుంది ? అంటే చదువుమీాద ఎక్కువా, పెళ్ళిమీాదా, నిజంచెప్పు ?"

"నాకు చదువుకొని డాక్టరవాలని వుంది." అని స్పష్టంగా చెప్పి, "తర్వాత పెళ్ళి" అని మెల్లగా అన్నది. మళ్ళీ అతనికళ్ళల్లోకి చూచింది.

చిరునవ్వు నవ్వుతూ "మంచిది. చదువుకో." అన్నాడు ప్రేమపురస్సరంగా. ఆ చిరునవ్వులో ఆశాభంగం కాని, సంకోచం గాని ఏమీ లేదు. అటువంటి దేదో కనుపిస్తుందనుకొన్న రమణికి కొంత ఉత్సాహభంగం కూడా కలిగింది.

వేదమూర్తి బసవన్నకొండకు వచ్చి వెళ్ళి మూడు నెలలు దాటింది. దసరా సెలవుల్లో కూడా ఇంటికి వెళ్ళలేదు. రెండుసార్లు కొంత డబ్బు పంపాడు. కాని గోపాలస్వామి కొడుక్కి ఉత్తరాలు వ్రాయడమే మానుకున్నాడు. అందువల్ల మూడవసారి ఉత్తరం వ్రాస్తూ బావ రామయ్యకు వ్రాశాడు వేదమూర్తి.

వేదమూర్తి తల్లికి ఏదో కొండవిరిగి మీద పడినట్లుగా జీవితం ఉన్నట్టుండి భారమైనట్లు అనిపిస్తూవుంది. ఎన్నాళ్ళనుండో భద్రంగా కాపాడుకొంటూవచ్చిన నిక్షిప్తధనం సర్వస్వమూ అకస్మాత్తుగా పరాధీనమైపోయినట్లు తోచింది 'ఇంకేముంది? రోజులు లెక్కించుకోవడం తప్ప!' అన్న ఏదో శూన్యభావంతోబాటు ఆమె దైనికజీవితంలో అలసత్వమూ, మౌనమూ ప్రవేశించాయి. ఇంట్లో తిరుగుతూవున్నా ఇదివరకెప్పుడూ తోచని, ఒంటరితనము, దిగులు ఆమెను వెంటనంటాయి. ఊళ్ళోవిషయాలు తరచు తన మాట్లాడే భర్త, అసలు మాట్లాడటమే లేదు. విధిగా భోజనందగ్గర, మిగతసమయాల్లో అవసరంవచ్చినప్పుడు ఒకటి రెండుసార్లు తప్ప, ఇంట్లో మౌనం, నిశ్శబ్దం స్థావరమేర్పరుచుకొన్నాయి. రాత్రి భోజనమైన

తర్వాత, పడుకొనేవేళదాకా రామయ్యతో వాళ్ళ యింటి అరుగుమీదే కూర్చుని, భర్త ఏదో మాట్లాడుతూవుంటాడు. పూర్వం ఎప్పుడో ఒకరోజున కాని యిట్లా చేసేవాడుకాదు. ఇప్పుడు ప్రతిరాత్రి తప్పకుండా ఇంటినుంచి వెళ్ళి అక్కడ కూర్చుంటాడు!

ప్రొద్దునపూట చెఱువువైపు, పొలంవైపు వెళ్ళి పద కొండుగంటలకు కాని ఇంటికి చేరుకోడు. భోజనమవగానే పడు కొని భాగవతం చదివి కొంతసేపు నిద్రించి, తర్వాత రామయ్యకొడుకు తెచ్చియిచ్చిన తెలుగు వార్తాపత్రిక చదవి, మళ్ళీ పొలాలవైపో, నలుగురూ కూర్చుండే మర్రిచెట్టుక్రింద రచ్చబండవైపో వెళ్ళిపోవడం గోపాలస్వామి దైనికకార్యక్రమం.

ఊళ్ళోవిషయాలుగూర్చి చెప్పడం కాని, భార్యకు భాగవతం చదివి వివరించడం కాని మానివేశాడు. భర్త తనతో యింత కఠినంగా మౌనంవహించడం ఆమెకు చాల కష్టంగావుంది. లోపలివ్యథ ఒకరికొకరు చెప్పుకుంటే బరువు తగ్గిపోయేదేమో! కాని ఆయన అందుకు అవకాశమివ్వడం లేదు. తను కలుగజేసుకుని ప్రస్తావించే ధైర్యమూలేదు.

ఎప్పుడైనా నోరుజారి వేదమూర్తిపేరువస్తే "వాడిని గూర్చి యింకా అనుకోవడం ఎందుకూ? నువ్వు వాణ్ణి మరచిపో" అంటాడు. తనేమో ఆ విషయం ఇప్పటికే సులువుగా మరచిపోయినట్లు, భార్య దౌర్బల్యాన్ని నిరసిస్తున్నట్లు వుంటుంది ఆయన ధోరణి. కాని ఆయనలో వచ్చిన మార్పు తనకు ఏమిటో భయం కలిగిస్తూవుంది.

ఒకరోజు ఏదో ఉత్తరం వచ్చింది. ఆ రోజు రాత్రి అన్నం సయించటంలేదని పాలు మాత్రం తాగి పడు కొన్నాడు. ఆ ఉత్తర మెక్కడనుండి వచ్చిందో, ఏమిటో మెల్లగా ప్రశ్నించింది మరుసటిరోజుప్రొద్దున.

కొంచము సేపు మౌనంగావుండి, చిరాకుగా, "బయటి వ్యవహారాలన్నీ నీకే కావలసివస్తున్నాయే! ఆడపెత్తనం!" అంటూ విసుక్కున్నాడు గోపాలస్వామి.

మార్వాడీ కివ్వవలసిన రెండువేలుఅప్పు ఏవిధంగా నైనా వదిలించుకోక తప్పదని తెలుసు. ఆవిషయమే ఏం చెయ్యాలో తోచక ఆలోచిస్తూవున్న గోపాలస్వామికి మార్వాడీ వ్రాసిన ఉత్తరం అలజడి కలిగించింది. ఆ రోజు మూడుగంటలకు ఈశ్వరరెడ్డియింటికి వెళ్ళాడు. కాని రెడ్డి లేడు. మరుసటిరోజున ప్రొద్దున కలుసుకోవడానికి నిశ్చయించు కొని తిరిగివచ్చాడు.

మొత్తం అప్పు ఆరువేలలో నాలుగువేలు ఈశ్వరరెడ్డి కివ్వాలి. వేదమూర్తి చివరిసంవత్సరం చదువుకోసం చేసిన రెండువేలు రెడ్డిగారు తనదగ్గర సమయానికి లేదంటే టవున్‌లో మార్వాడీదగ్గర తీసుకోవలసివచ్చింది. ఆ రెండువేలు కూడా ఈశ్వరరెడ్డిదగ్గర తీసుకొని మార్వాడీతో సంబంధం వదిలించు కొంటేనే బాగుంటుంది అనుకొన్నాడు. రెడ్డి తొందరపడేవాడు కాదు, తనంటే కొంత అభిమానం వుంది, తన పరిస్థితులూ అర్థంచేసుకోగలడు;

ఈశ్వరరెడ్డి గోపాలస్వామికన్న అయిదారేళ్ళు పెద్ద వాడు. అతని స్వగ్రామం బసవన్నకొండ కాదు. ఇరవై ఏళ్ళకు

పూర్వం ఎప్పుడో బసవన్నకొండలోని రామయ్య చౌదరి అనే భూస్వామి ఈశ్వరరెడ్డి తండ్రిదగ్గర అప్పుచేసి ఆ అప్పు తీర్చకుండానే చనిపొయ్యాడు. అతని అయిదుగురుకొమాళ్ళు వాటాలకని తగవులు పెంచుకోగా, ఈశ్వరరెడ్డి దావా వేసి అప్పుమీద డిక్రీ పొందాడు. సగంపైగా భూమి అతనికి వేలంలో వచ్చింది; ఇంకొక పాతికవంతు తనే డబ్బిచ్చి కొన్నాడు. తర్వాత దాన్ని వ్యవసాయంచేయించడానికి బసవన్నకొండకు తరచు వస్తూవుండి అక్కడ ఇల్లుకూడా కట్టించాడు. ఆ గ్రామం టౌనుకు దగ్గరైనందువల్ల స్వగ్రామం వదలిపెట్టి చివరకు అక్కడే కాపురంపెట్టాడు.

బసవన్నకొండ చేరిన ఇరవైఏళ్ళల్లో వడ్డీవ్యాపారం, వ్యవసాయం రెండూ చేస్తూ, కొత్తగా పొలం కూడా చాల సంపాదించి, ఊళ్ళో పెద్ద షావుకారు అయ్యాడు ఈశ్వరరెడ్డి. అతనికి ఇద్దరు కొడుకులు. వాళ్ళు స్కూలుఫైనలుదాటి పైకి వెళ్ళలేదు చదువులో. ఇద్దరికి పెళ్ళిళ్ళుచేసి, సినిమావ్యాపారం పెట్టుకోడానికి డబ్బు ఇచ్చాడు. వాళ్ళు టవున్‌లోనే కాపురంపెట్టారు. ఆ సినిమాలో వేదమూర్తిబావ రామయ్యకు కూడా చిన్న వాటా వుంది. కొడుకులు విపరీతంగా ఖర్చుజేస్తున్నారని తెలుసు ఈశ్వరరెడ్డికి; కాని వాళ్ళు వ్యాపారంకూడా తెలివిగానే చేసుకుంటూ తమ ఖర్చులకు తాము సంపాదించుకుంటున్నారని అతనికి తృప్తి. మొదట్లో వాళ్ళు బాగా చదువుకోలేదనీ ఖర్చుపెట్టుతున్నారనీ వగచినా తర్వాత వ్యవహారదక్షత కలిగివున్నారని తెలిసివచ్చి సంతోషించాడు. గోపాలస్వామికొడుకుమీద బుద్ధిమంతుడనీ,

డబ్బు పాడుచెయ్యకనీ, రెడ్డికి చాల ఆప్యాయత, గౌరవము వుంది. వేదమూర్తి చదువుకొని పెద్ద ఉద్యోగంచేస్తాడని అతని నమ్మకం. ఆ విషయమే మిత్రునితో ఎప్పుడూ అంటూ వుంటాడు.

మరునటిరోజు గోపాలస్వామి వెళ్ళి తనకు వచ్చిన చిక్కువిషయం రెడ్డికి వివరించాడు. పెళ్ళిసంబంధంవిషయము కూడా ఇదివరకే వినివుండిన రెడ్డి, వేదమూర్తి మొండిపట్టు పట్టాడనీ, దానివల్లనే అప్పువిషయం పెద్ద సమస్యగా తయారైందనీ తెలిసి ఆశ్చర్యపడ్డాడు. అతనికి ఈకాలం యువకులు రెండు రకాలుగా కనుపించారు. ఒకరకంవారికి చదువు రాదు. కాని ఖర్చులు, చెడ్డ అలవాట్లు, సోమరితనం వుంటాయి. రెండోరకంవారికి చదువు బాగా వస్తుంది. బుద్ధిమంతులే; కాని వ్యవహారజ్ఞానం వుండదు. కుటుంబానికి పనికిరారు. ఏదో వేదాంతం, వింతఊహలూ వుంటాయి. వాళ్ళు ఏ బడిపంతులు ఉద్యోగంచెయ్యటానికో పనికొస్తారు. వేదమూర్తి యీరెండో రకానికి చెందినవాడు పూర్తిగా. తన కొమాళ్ళు మొదటిరకం వాళ్ళే అయినా కొంత చురుకుతనం, తెలివితేటలు, సంపాయించేదక్షత చూపిస్తూవున్నారు. వాళ్ళే ఇప్పుడు వేదమూర్తి కన్న మేలనిపిస్తున్నారు.

వేదమూర్తి ఆనర్సు, అందులో ఇంగ్లీషు ఆనర్సు చదువుతున్నాడంటే తప్పకుండా డిప్యూటీకలెక్టరు అవుతాడు అనుకొన్నాడు. I. C. S.-కు పంపించండి అని గోపాలస్వామిని ప్రోత్సహిస్తూవుండేవాడు. ౧౯౪౨ ఆగస్టు విప్లవంలో ఆరునెలలు జైలుకు వెళ్ళాడని విన్నప్పుడు

కొంత నిరుత్సాహంతో, "ఇదేమీ మంచి పనిగా కనుపించడం లేదే!" అంటూ పెదవి విరచాడు. కాని ఆ వుద్రేకం తీరిపోయి వేదమూర్తి జైలునుండిరాగానే యథావిధిగా చక్కగా చదువుకొంటున్నాడని తెలిసి "జరిగినదంతా ఒకవిధంగా మంచికేలెండి! ఎట్లాగూ యుద్ధం పూర్తికాగానే స్వరాజ్యం రాక తప్పదు. జైలుకు వెళ్ళివచ్చిన క్వాలిఫికేషన్‌తో తప్ప కుండా పెద్ద ఉద్యోగమౌతుంది. ౧౯౩౭ లో కాంగ్రెసు మంత్రిత్వం వచ్చినప్పుడే జైలుకు వెళ్ళిన అనుభవం ఎంత విలువైందో తెలిసింది" అని ఊహించాడు రెడ్డి. వేదమూర్తి సంగతి వచ్చినప్పుడు ఎప్పుడైనా గోపాలస్వామిని అభినందిస్తూ సగర్వంగా కూడా అనేవాడు: "పైవాళ్ళే ఉన్నారండి ఉద్యోగాలన్నింటిలో. మనవాడొక డింతమాత్రం పైకివచ్చి ఉద్యోగంచేస్తూవుంటే మనమెంత గర్వపడవలసిన విషయం, ఆలోచించండి!"

కట్నం తీసుకోనని భీష్మించి కూర్చుని, "ఆస్తి తెగ నమ్ముకోండి, నాకేమీ పట్టదని" అంటున్న వేదమూర్తిసంగతి రెడ్డికి చాల ఆశాభంగం కలిగించింది. మిత్రుడు గోపాలస్వామి అంటే తన కెంతో అభిమానమూ, సానుభూతి వుంది. కాని ఏమిచూచి మళ్ళీ అప్పు ఇవ్వగలడు? ఇన్నాళ్ళూ ఆస్తి పెద్దది కాకపోయినా వేదమూర్తి ఇంకమీద సంపాయిస్తాడనీ, ఇచ్చిన డబ్బు తప్పకుండా తిరిగి వస్తుందనీ, గోపాలస్వామికి అప్పుఇవ్వ డానికి సంకోచించలేదు రెడ్డి. ఇప్పుడేముంది? తండ్రికీ, కొడుక్కూ అభిప్రాయభేదం వచ్చింది, మాటలు లేవు. ఇచ్చిన డబ్బు తిరిగిరావడానికే కష్టమౌతూవుండేపరిస్థితుల్లో మళ్ళీ

రెండువేలు ఎలా ఏవిధంగా ఇవ్వగలడు? తెలిసి తెలిసి డబ్బు ఎవరూపోగొట్టుకోలేరు; తన్ను మాలినధర్మం ఉండబోదుగదా!

ఈశ్వరరెడ్డి ఆలోచించి, చివర కన్నాడు: "ఒక్కటే మార్గం వుంది. మీకు నమ్మకమైతే అట్లాచెయ్యండి. అంతకు మించి నేనేమీ చెప్పలేను." గోపాలస్వామికి ఆ మార్గ మేమిటో వినాలని వుంది; ఏమైనా రెడ్డిని మించిన స్నేహితుడు, తన్ను ఆదుకోగల వ్యక్తికూడా మరెవ్వరూ తనకు లేరు. "సరే చెప్పండి" అన్నాడు.

"మీరిప్పుడు మార్వాడీ కివ్వవలసిన రెండువేల పైచిలుకూ, నాదగ్గర తీసుకొన్న మొత్తానికైన వడ్డీ, రెండూ కలిపి మూడువేలవుతూవుంది. ఈ మూడువేలు మీకు నాదగ్గర అప్పుగా తీసుకొన్నప్పటికీ, ఏడువేలమొత్తం బాకీ ఎప్పుడు తీర్చగలరు? ఈ భారాన్ని మోసేందుకు మీ వల్ల కాదు. మీ పొలం అమ్మినా ఏడువేలు ఎవ్వరూ ఇవ్వరు; నన్ను ఇమ్మని మీరడగటం కూడా భావ్యంకాదు. పోతే, నేను చెప్పే పరిష్కారమార్గం ఏమిటంటే—మీ పొలం అయి దెకరాలు అయిదువేలకు విక్రయం వ్రాసేసి, మిగతా రెండు వేలకు ఇల్లు తనఖాపెట్టితే అప్పుడు మీకు అప్పు రెండువేలు మిగుల్తుంది. మీ భారం తగ్గుతుంది!" అన్నాడు ఈశ్వరరెడ్డి.

గోపాలస్వామికి నోటమాటరాలేదు. కొంతసేపైన

"అయితే నా పొలం అయిదువేలకు మించి చెయ్య దంటారా?" అన్నాడు.

ఈశ్వరరెడ్డి అతనివైపు నిదానించి చూచి, మెల్లగా అన్నాడు "మీరు ఆవేశపడుతారు, బాధపడుతారు. కాని నేనేం చెయ్యను? మీకోసం ఇంకో ఐదువందలిస్తాను. అంతకు మించి ఇచ్చి ఇప్పుడెవరు కొనగలరు ఆ పొలం?"

"పొలం పోగొట్టుకోమంటారు, అంతేకదా?" అని నిట్టూర్చాడు గోపాలస్వామి.

"ఈపరిస్థితిలో మరేం చెయ్యగలరో చెప్పండి?నాకేమీ మీ పొలం అవసరంలేదు. ఎప్పటికైనా మీరు ఆ డబ్బిచ్చి పొలం వెనక్కి కావాలంటే నేను ఇవ్వడానికి సిద్ధమే. సరేనా? అయినా మీ అబ్బాయి పొలం ఏంజేసుకుంటాడు ? ఇంతకు మించి నేను చేసేదేమున్నది? పోనీ ఆ పైవదిహేనువందలకూ వడ్డీరేటుకూడా తక్కువే వేసుకొంటానులే" అన్నాడు.

గోపాలస్వామికి కూడా 'యింతకంటె దాక్షిణ్యం ఎవరుమాత్రం చూపిస్తారు ?' అనిపించింది. ఇంతకుమించిన పరిష్కారమార్గం కనుపించదు. మార్వాడీ కోర్టుకు లాగితే, పొలం వేలానికి వస్తే, తనకు కలిగే మేలేమిటి ? నష్టంతోపాటు అవమానంకూడా కలుగుతుంది! అంతే!! కానీ పొలం పోతూ వుంది. చివరకు ఆరడుగులనేల కూడా మిగలదు. కొడుకు మీద పట్టరాని ఆగ్రహంవచ్చింది. వెంటనే నిరాశ, నిస్పృహ కూడ కలిగాయి. "వస్తాను" అంటూ లేచివెళ్ళాడు. రెడ్డి కూడా "ఏమి నిశ్చయించావని" ప్రశ్నించకుండా చూస్తూ ఊరుకున్నాడు.

గుమ్మందాకా వెళ్ళిన గోపాలస్వామి వెంటనే వెనక్కి తిరిగివచ్చి, "అంతే, మీరు చెప్పినట్లే చేద్దాం. శనివారం

మార్వాడీకి డబ్బు ఇచ్చెయ్యాలి, ఆ రోజే అంతా పూర్తి చేసుకుందాం." అన్నాడు.

# 5

కళాశాల నాటకసంఘము దసరాకు ముందే ఏర్పాటు చెయ్యదలచుకొన్న ప్రదర్శనం రెండవటర్ముకు వాయిదా పడింది.

నాటకానికి పాత్రధారులుగా ఎన్నుకున్న ఆరుగురు విద్యార్థులలో, ఇంటరు రెండవసంవత్సరం చదువుతున్న రాఘవులు, బి. ఎ. మొదటిసంవత్సరం చదువుతున్న చంద్రశేఖరం వున్నారు. వాళ్ళిద్దరూ విద్యార్థులందరికీ నాయకత్వం తమకు ఆపాదించుకొన్నారు. వాళ్ళు చెప్పినవిధంగా చేయడానికి సిద్ధంగావుండి, జట్టుగావుండడంవల్ల కొన్ని ప్రయోజనాలను సాధించుకోదలచిన అయిదారుగురు స్నేహితులవల్ల వాళ్ళకు యీ సహజనాయకత్వం లభించింది. కళాశాల నిత్యజీవితంలో యీ జట్టువాళ్ళకు అత్యంత ముఖ్యమైన విషయం ఆడపిల్లలు, వాళ్ళు శ్రద్ధచూపే సంగతులు, వాళ్ళ రాకపోకలు, పుట్టుపూర్వోత్తరాలు, నడవడులు మొదలైనవి. ఎవరి క్లాసు అమ్మాయిలమీద వాళ్ళకే సహజమైన అధికారమున్నట్లు వాళ్ళలో వాళ్ళకు అంగీకారము; ఒకరికొకరు యీ విషయాల్లో చేతనైన సహాయం చేసుకోవడమనేది పరిపాటి. ఎవడైనా కొంచం చిక్కుల్లో పడినప్పుడు అందరూ కలసి వాణ్ణి రక్షించడం విధి; ఎవరికి అభిమానులైనవిద్యార్థినులను గురించి

వాళ్ళు ప్రత్యేకంగా శ్రద్ధచూపుతూ, ఏ రిసెర్చి విద్యార్థులకు వుండని కౌతూహలం, తెలివితేటలు ప్రదర్శిస్తూవుంటారు.

గతసంవత్సరం విమల పాడటం, ఆమెసహాధ్యాయి అయిన రాఘవులు నాకర్షించి, ఆమెమీద అతని కాసక్తిని పెంపొందింపజేసింది. ఈ సంవత్సరం మళ్ళీ ఆమె ప్రదర్శనంలో తప్పక పాల్గొంటుందని ఊహించి, చంద్రశేఖరంతో కలిసి నాటకంలో పాత్ర తీసుకోవలెనని నిశ్చయించాడు. ఏ విషయానికీ చంద్రశేఖరం తనకు తోడుగావుండవలెనని రాఘవులు కోరిక. తనొక్కడే ఏంచెయ్యడానికి తగినధైర్యం లేదు. "మాకు కూడా పాత్ర లిప్పించ"మని ఆ యిద్దరూ సంఘకార్యదర్శిద్వారా సుందరరావుని కోరారు. సుందరరావు వాళ్ళని ఎన్నుకొన్నాడు.

మొదటి రెండు రిహార్సల్స్ జరిగినవి. కాని విమల సంగతేమీ తెలీలేదు. కార్యదర్శికూడ ఆమె పాడుతుందో లేదో ఇంకా నిశ్చయంకాలేదు అన్నాడు. గత సంవత్సరం వుండిన కార్యదర్శి మూలంగానే విమల పాడగలదన్న విషయం సుందరరావుకు తెలియడంకాని, కార్యక్రమం నిశ్చయింపబడడంకాని జరిగింది. ఈసారి కూడా కార్యదర్శికి విషయంలో ప్రవేశముంటుందని ఊహించిన రాఘవులుకు ఆశాభంగం కలిగింది. విమల పాడే విషయం అంతా సుందరరావుమీదే ఆధారపడివుందని అతనికి బోధపడింది.

"మేష్టారూ, మన నాటకంలో స్త్రీపాత్ర ఎవరైనా విద్యార్థిని వేస్తే ఎంతబాగుంటుంది! మీకు ఎవరినైనా అందుకు

ఒప్పించకూడదూ?" అని కళాదృష్టితో సలహాయిచ్చాడు సుందరరావుకు.

"వాళ్ళెవరూ ముందుకు రారోయ్! మన కాలేజీ అమ్మాయిలకు తగని భయమూ, సిగ్గూ." అన్నాడు సుందరరావు, రాఘవులు సలహాను తోసివేస్తూ.

పోయిన సంవత్సరం చక్కగా పాడిన అమ్మాయి — ఆ అమ్మాయి పేరేమిటోనండి —ఆమెకు మంచి ధైర్యం వుందండి. మన నాటకంలో పాత్రకుకూడా బాగా సరిపోతుంది" అన్నాడు చంద్రశేఖరం, విమలపేరు కూడా తనకు తెలీనట్లు.

"విమల సంగతా ? ఈ సారి కూడా ఏమైనా పాడమని అడగవచ్చులే. కాని ఆ అమ్మాయి నాటకంలో పాత్రగా వెయ్యడానికి పనికిరాదు" అన్నాడు సుందరరావు .

మూడవరిహార్సల్‌కి రాఘవులు రాలేదు. చంద్రశేఖరం వచ్చాడు. కాని తను నేర్చుకొనివస్తానని చెప్పిన నాటక భాగం నేర్చుకోలేదు. రాఘవులు తలనొప్పివచ్చి హాజరు కాలేదట. తనకేమో తీరికలేక కంఠతాపెట్టడం వీలుపడలేదని చెప్పాడు.

నాలుగవ రిహార్సల్‌కి రాఘవులు వచ్చాడు. అంతా కాకపోయినా కొంతభాగం అక్కడక్కడ నేర్చుకొన్నాడు. వాళ్ళిద్దరూ నాటకంవిషయంలో ఇదివర కెన్నడూ చూపనిశ్రద్ధ చూపారు. "మన మీవిధంగా రిహార్సుచేస్తే, ఎప్పటికవుతుంది? మేష్టారూ! మిగతా విషయాలన్నీ కూడా ఇప్పట్నుంచే ఆలోచించుకోవడం మంచిది కదండీ! ఒక్కొక్క పాత్రకు ఏం

దుస్తులు కావాలో జాబితా వ్రాసుకొని ఆర్డరిచ్చి, కుట్టించుకొని, తయారుచేసుకోవాలిగదా!" అన్నాడు రాఘవులు.

దుస్తులవిషయం వినగానే మిగతా విద్యార్థులందరూ ఉత్సాహంగా అవునంటే అవునని, వాళ్ళు ఒక్కొక్కరికి ఏం కావాలో కోరికలు వెలిబుచ్చారు. రిహార్సల్ పూర్తికాకుండానే, దుస్తులవిషయం చర్చలో పడిపోయి, ఇండ్లకు వెళ్ళవలసివచ్చింది.

"అందరూ పూర్తిగా కంఠతాపెట్టితేగాని ఇంక రిహార్సల్ ప్రయోజనంలే"దని సుందరరావు వాళ్ళతో అన్నాడు.

"పోర్షన్సుకేముండీ! రెండురోజుల్లో బట్టీపెట్టివేస్తాము. ఇప్పటికి యాక్షనూ, మూవ్‌మెంట్స్ అర్థమైనవి కదండీ; అవి బాగా రిహార్స్‌చేసుకుంటే పోర్షన్స్ నేర్చుకోవడమెంతసేపు?" అన్నాడు చంద్రశేఖరం.

"మీరు పాటలసంగతేమిచేశారండీ మేష్టారూ? నారాయణస్వామి అని వున్నాడండీ, చాల బాగా పాడుతాడు. అతన్ని పాడమనండి! రిహార్సల్‌కికూడా వస్తానన్నాడు. మీరు విమలను కూడా రిహార్సల్‌కి రమ్మని అంతా ఏర్పాటు చెయ్యండి." అన్నాడు రాఘవులు.

సుందరరావేమీ మాట్లాడకుండా "సరే, కాని పోర్షన్సు నేర్చుకోకుంటే మిగతావేమీ లాభంలేదు." అని వెళ్ళిపోయ్యాడు.

నాటకసంఘం విద్యార్థులకోసమని ఏర్పడింది. వాళ్ళీరకంఆసక్తి చూపిస్తూవుంటే పనులెల్లా జరుగుతాయి? వాళ్ళని నిర్బంధించడానికి కాని, దండించడానికి కాని యిదేమీ

విద్యావిధానంలో భాగంకాదు. అనుకొని సుందరరావు ఊరుకున్నాడు, తర్వాత రిహార్సల్ మాట తలపెట్టకుండా.

"పోర్షన్సు నేర్చుకున్నాము, మీరు వచ్చి చూడాలి" అని పాత్రధారులందరూ వచ్చి చెప్పగా ఐదవ రిహార్సల్ ఏర్పాటుచేశాడు సుందరరావు. రాఘవులు, చంద్రశేఖరం తప్ప మిగతా అందరికీ ఇంచుమించు పోర్షను నోటికివచ్చింది. వాళ్ళది వరకు వచ్చింది కూడా మరచిపోయ్యారు. నారాయణస్వామిని తీసుకొనివచ్చాడు రాఘవులు. బలవంతంచేసి వాడిచేత ఒక పాట పాడించాడు. సుందరరావుకు వాడిపాటేమీ నచ్చలేదు.

"విమల రాలేదాండి?" అని అడిగాడు చంద్రశేఖరం.

"మీ కింత మాత్రం ఆసక్తి వుంది, ఆవిడ కేం వుంటుంది? ఆవిడా పాటలేమీ నేర్చుకోలేదట! నాటకమేమీ సాగేటట్లు కనిపించడంలేదు. మీకు అక్కరలేకుంటే మాని వెయ్యండి. నేనుమాత్రం ఊరికే ఇక్కడికివచ్చి కాలం వృథా చెయ్యను. ఇంక మొదటిటర్ములో వెయ్యడానికి వ్యవధికూడా లేదు. ఈ సెలవుల్లో ఏసంగతీ తేల్చుకోండి" అని చెప్పి సుందరరావు వెళ్ళిపోయ్యాడు.

రాఘవులు, చంద్రశేఖరం తప్ప మిగతా పాత్రధారులు మరుసటిరోజు సుందరరావుదగ్గరకు వెళ్ళారు. "నాటకం మాని వెయ్యకండి. రాఘవులూ, చంద్రశేఖరంల బదులు మేము వేరే ఇద్దర్ని తీసుకొస్తాం. మా పోర్షన్సన్నీ నేర్చుకుని సిద్ధమవుతాం." అని ప్రాధేయపడ్డారు వాళ్ళు.

"అట్లాఅయితే నేనూ సిద్ధమే. ఈ సెలవుల్లో ఆ కొత్త వాళ్ళను కూడా సిద్ధంకమ్మని చెప్పండి. రెండవటర్ములో కాలేజీ

తెరవగానే నేను వచ్చి రిహార్సల్ చూస్తాను. మీరా కొందరికి పోర్షన్సువచ్చివుంటే మూడు నాలుగు రిహార్సల్స్‌తో అంతా పూర్తవుతుంది." అన్నాడు సుందరరావు.

సెలవులైపోగానే వాయిదాపడిన నాటకానికి పునర్జన్మ ప్రారంభమైంది. రాఘవులూ, చంద్రశేఖరం తెలిసీ తెలీనట్లు తప్పుకున్నారు నాటకంనుండి.

సుందరరావు విమలతో ఆమె పాడటంసంగతి మళ్ళీ ప్రస్తావించాడు. ఆ అమ్మాయికంఠమాధుర్యం అతన్ని బాగా ఆకర్షించింది. తనలోని గతించిన మానసికప్రవృత్తి ఛాయలేకో ఆమెసంగీతశ్రవణంలో గుర్తువస్తాయి. తను చదువుకునేరోజుల్లో అనుభవించిన ఒకానొక భావావేగతీవ్రత, ఉన్మత్తపారవశ్యం స్మృతిపూర్వకంగా హృదయాన్ని తాకుతుంది ఆమెపాట విన్నప్పుడు.

యౌవనారంభసమయంలో, పదెనిమిదేళ్ళ క్రితం వెన్నెల్లో సముద్రంవలె ఉద్రూతలూగిన తన హృదయావస్థ మళ్ళీ రావాలని అతనికి కోరికలేదు—అదొక అవ్యక్తమైన తాత్కాలిక మానసికాందోళన మాత్రమే!—కాని ఆ భావ స్మృతిని రేకెత్తించే సంగీతం మళ్ళీ మళ్ళీ వినాలన్న కోరిక వుంది. విమల పాడవలసిన పాటల్ని తనే నిర్ణయించాడు. పార్వతి వీణ వాయించడానికి అంగీకరించింది.

కొత్తపాటలు నేర్చుకొన్నతర్వాత ఒకసారి పార్వతితో కలసి సుందరరావు యింటికివెళ్ళి పాడింది విమల. కొన్ని సూచనలుచేసి సుందరరావు వాళ్ళను మళ్ళీ ఆదివారం రమ్మని కోరాడు.

ఆదివారం విమల, పార్వతి సుందరరావుఇంటిలో వుండగా రమణి వచ్చింది. పాటమధ్యలో వున్నది విమల. పార్వతి వీణ వాయిస్తున్నది. సుందరరావు చిరునవ్వుతో ఆహ్వానించాడు. రమణి నిశ్శబ్దంగా ఒక ప్రక్క కూర్చున్నది. పాటలన్నీ పూర్తి అయ్యేంతవరకు ఎవరూమాట్లాడలేదు. పార్వతి, విమల రమణిని చూచీచూడనట్లున్నారు.

పాటలు పూర్తిఅయినవి. "ఇంకొక్క సారి రిహార్స్‌లుచేస్తే బాగుంటుందేమో ! వీణ గూడా సరిగ్గా కలుస్తుంది. ఈ గురువారం మళ్ళీ పెట్టుకొందాము రిహార్సల్. ప్రదర్శనం యీ శుక్రవారమో, శనివారమో ఏర్పాటుచెయ్యవచ్చునని ప్రిన్సిపల్‌గారన్నారు" అన్నాడు సుందరరావు. "మేము వెళ్తా" మంటూ లేచారు విమల, పార్వతి. టీతీసుకొని వెళ్ళమన్నాడు సుందరరావు.

రమణి గాని వాళ్ళుగాని ఒకరినొకరు పలకరించుకోక పోవడం గమనించి, టీ త్రాగుతూ వున్న సుందరరావు, "మా మరదలితో పరిచయంలేదేమిటి మీకు ? ఏం, రమణీ" అని వాళ్ళవైపూ, రమణివైపూ చూచాడు.

"ఎందుకు తెలీదండి !" అని సుందరరావుతో అంటూ విమల రమణివైపు చూచి స్నేహపూర్వకంగా నవ్వింది.

"మా హాస్టలుకు ఒకసారి విమల వచ్చినప్పుడు మీ మరదలు, నేను, లీల కలిసి ఏదో పెద్దగా చర్చించుకున్నాము కూడా. ఏమండీ, రమణీ ! మీకు జ్ఞాపకం లేదా ?" అన్నది పార్వతి.

రమణీ, విమలా ఏమనాలో తోచక, ఒకరినొకరు చూడకుండా తలవంచుకొని టీ త్రాగటంలో నిమగ్నులయ్యారు.

"ఏం చర్చించుకొన్నారు?" అన్న ప్రశ్న నోటిదాకా వచ్చిన సుందరరావు కేదో తటాలున గుర్తువచ్చి, ఊరుకున్నాడు.

టీ త్రాగటం అయింది. "మే మింక వెళ్తామండి, నమస్తే" అని సుందరరావుతో అని "వెళ్తాం" అంటూ రమణివైపు చూచి, పార్వతి, విమల వెళ్ళిపొయ్యారు.

"పట్టి కోతి, బావా. హాస్టల్లో పెద్దగా రౌడీతనం, వగ రాయుడిచేష్టలు." అన్నది రమణి వాళ్ళు వెళ్ళగానే.

"ఎవరు?" అన్నాడు సుందరరావు ఆమెకోపానికి ఆశ్చర్యపడుతూ.

"ఆ పార్వతి. మేం అసలు మాట్లాడుకోము. ఈ విమలకు దీనితో పెద్ద స్నేహము. విమలకూడా చూడడానికి అట్లావుంది కాని, అబ్బో, పెద్దదొంగ. పైకి ఎంతైనా నెమ్మదిగా ప్రియంగా మాట్లాడుతుంది, నవ్వుతుంది."

"నీ కసలు పడనట్లుందే వీళ్ళంటే. ఆవిధంగా కక్షలు పెంచుకొని ప్రయోజనమేమిటి? అవతలివాళ్ళు ఎటువంటి వాళ్ళయినా మనం వాళ్ళతో సఖ్యతగా మెలగటం నేర్చుకోవాలి. మనకు వాళ్ళు మంచివాళ్ళుకారని తెలిస్తే మన జాగ్రత్తలో మనం వుండాలి. అంతేకాని ద్వేషంపెంచుకొని, ముఖం త్రిప్పుకొని, వీళ్ళు శత్రువులు, వీళ్ళు మిత్రులు అని ప్రవర్తించటం బాగుండదు."

"నువ్వు చెప్పినట్లే వుంటున్నాను నేను. నాకేమీ కక్షలు అక్కరలేదు. కాని నోరువిప్పితే దురుసుగా మీదపడ వచ్చేవాళ్ళతో, వెక్కిరించేవాళ్ళతో మాటలేమిటి?" అని చేతిరుమాలుతో కళ్ళు తుడుచుకొన్నది రమణి.

"ఏమైంది? అంతగా బాధపడటానికి కారణం?" అని ప్రశ్నించాడు సుందరరావు అర్థంకాక.

"ఆ పార్వతికి ఎప్పుడూ నన్నూ, శారదాంబగారిని ఏమో అనటమే పని. హాస్టలులో ఒక పెద్దజట్టు తయారు చేసింది. ప్రతి విషయానికీ 'ఇది బాగు లేదు, అది బాగు లేదు, శారదాంబ పక్షపాతి' అని వ్యతిరేకప్రచారం చేస్తుంది వార్డన్‌ను గురించి."

"రాచకీయాలు బాగానే వున్నాయే, పదిహేనుమంది వుండే ఆడవాళ్ళ హాస్టల్లోకూడా!" అన్నాడు సుందరరావు.

విషయం మారుస్తూ రమణి ప్రశ్నించింది. "నీకు పాట లంటే అంత యిష్టమా, బావా?"

"ఏమిటి నీ ప్రశ్న? పాటలు ఇష్టంలేని దెవ్వరికి? నీకు మాత్రం పాటలు వినడం, సినిమాలుచూడటం ఇష్టంలేదూ?"

"అదికాదు. పాటలకోసం విమలకు ఎప్పుడూ ప్రాధేయ పడుతూవుంటావట. ఆమె పాడకపోతే, విద్యార్థుల్లో పాడే వాళ్ళేవరూ లేరా? శారదాంబ అంటుంది 'ఆ విమలతో మీ బావగా రంత పరిచయంగావుండటం ఏమంత మంచిపని కాదు' అని."

సుందరరావుకు కోపంవచ్చింది. కాని కోపంగా ఏమీ అనదలచుకోలేదు. కళాశాలకు వచ్చి అయిదారుమాసాలు

కాలేదు. చిన్నపిల్లగా వుండిన రమణి ఎంతలో లోకానుభవం గల స్త్రీగా మారిపోయింది! అనుకొన్నాడు. కాని ఆ పిల్ల లోకానుభవమేమిటి, నిజంగా? అన్న ఊహ వచ్చి నవ్వాడు. ఇది రమణిలో కొత్తవిషయంగా తోచింది.

"నీకంతా తమాషా కాని; నిజంగా, బావా! ఏమిటా అమ్మాయితో?" అన్నది మందలిస్తూ రమణి.

అతను నవ్వి, ఆగి, "నేను ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకొనే భయం ఏమీలేదులే!" అన్నాడు.

రమణిముఖంలో గులాబీలు విరిశాయి. ఆమెసిగ్గు చూచి నవ్వుకున్నాడు సుందరరావు. "పెళ్ళి" అనే పదం వినబడగానే సిగ్గేమిటో ఆడపిల్లలకు అనుకున్నాడు.

## 6

పగలంతా ఎండ తీవ్రంగా ఉంది; గాలి లేదు, విపరీతమైన ఉక్కపోసింది. ఎన్నిసార్లు మంచినీళ్ళు తాగినా దాహం తీరలేదు. నాలుగుగంటలకు చెరువువైపు వెళ్ళడానికి బయలుదేరాడు గోపాలస్వామి. వీధిమలుపు తిరిగేటప్పటికి నారాయణశాస్త్రి కనుపించాడు.

"ఇంత ఎండలోనే బయలుదేరారే చౌదరిగారు?" శా పలుకరించాడు.

"చెరువువైపు వెళ్తున్నాను, వస్తావా?"

శా వెంట నడిచాడు.

నారాయణశాస్త్రి గోపాలస్వామికి చాల ముఖ్యమైన మనిషి. అన్ని శుభకార్యాలకు, ముఖ్యమైన సందర్భాలకు,

శాస్త్రి లగ్నం పెట్టవలసిందే, వుండి జరిపించవలసిందే! కూతురు హైమవతిపెళ్ళి తిరుపతిలో చేసినా శాస్త్రిని వెంబడి తీసికొనివెళ్ళి, అతని పౌరోహిత్యంతోనే ఆ వివాహం జరిపించాడు.

"వేదమూర్తివివాహం కుదిరినట్టేనా?" అని శాస్త్రి ప్రశ్నించాడు.

కొంతసేపు ఏమీ జవాబుచెప్పలేదు. "ఇప్పుడు వద్దంటున్నాడు" అన్నాడు మెల్లగా.

"అతనికేం, బంగారుతండ్రి; బుద్ధిమంతుడు! కాలేజీలో ఎంతిస్తారేమిటి జీతం?"

"శాస్త్రుల్లూ, వాడిజాతకం చూచి, పేరు పెట్టింది నువ్వే. జ్ఞాపకం ఉందా?"

వేదమూర్తిజన్మలగ్నం కుండలి తయారుచేసి, "మంచి మేధావంతుడూ, పండితుడూ అవుతాడు అబ్బాయి. మీ యింట్లో కాదు, మాయిళ్లల్లోపుట్టవలసిన బిడ్డ." అని జ్యోతిషం చెప్పి, మెచ్చుకుంటూ 'వేదమూర్తి' అని నామకరణం చెయ్యమని శాస్త్రులు చెప్పాడు. అది గుర్తువచ్చింది.

"ఓ, జ్ఞాపకంలేకేం? ఎం. ఏ. ప్యాసయ్యాడా లేదా, అదృష్టజాతకుడు." అన్నాడు శాస్త్రి.

"వాడిఅదృష్టం సరే, మా సంగతేమిటో చెప్పవేం?"

"అదేమిటట్లా అంటారు? మీకు తక్కువైందేమిటి?"

"ఏమీలేదులే!"అంటూ నిట్టూర్చాడు గోపాలస్వామి.

మనస్సులో ఏమిటో బాధపడుతున్నాడని పసిగట్టిన శాస్త్రి, ఆలోచిస్తూ పొడుంకాయ తీసి, అరచేతిలో పొడుం

రాల్చుకొని మూడుసార్లుపీల్చి చిటికెలు వేసుకొంటూ విషయం కనుక్కోవడానికి ఉద్యుక్తుడయ్యాడు.

వెనకనుండి "నాన్నగారూ!" అని కేక వేసుకుంటూ పదేళ్ళపిల్లవాడు పరుగెత్తుకొనివచ్చాడు. "నాన్నగారూ! శ్రీనివాసయ్యావాళ్ళు కబురుపెట్టారు. మిమ్మల్నిప్పుడే అర్జంటుగా రమ్మన్నారట!" అని చెప్పాడు శాస్త్రి కొడుకు.

"చౌదరిగారూ! పనివుంది, నేను నిలుస్తాను. రేపు మీ యింటికివచ్చి కలుసుకుంటానులే. మీరు వెళ్ళిరండి." అని శాస్త్రి ఊళ్ళోకి వెనక్కినడిచాడు.

ఊళ్ళోకి చెరువు సుమారు మైలుదూరంలో వుంది. వేసే ప్రతిఅడుగూ భారంగా, ఆయాసంగా తోచింది గోపాల స్వామికి. తనలో సత్తువ ఉన్నట్టుండి ఇంతగా దిగజారిపోయిందేమిటి" అనుకున్నాడు.

చెరువుకట్టమీద కొంతదూరం నడచి కూర్చున్నాడు నీడగావున్నచోట. తనెప్పుడూ సాధారణంగా అట్లా కూర్చోడు. ఈవేళ ఆయాసంవల్ల కూర్చోక తప్పిందికాదు.

ఎదురుగా కనుచూపుమేర అంతా పచ్చని పైరు. వాలుతూవున్న ప్రొద్దు ఏటవాలుకిరణాల్లో ఆ పచ్చదనం జీవకళ ఉట్టిపడే తనవన్నెతో అతనికళ్ళల్లో నీళ్ళు తెప్పించింది.

బుద్ధితెలిసి, తన జీవితమంతా యీ పరిసరాల్లో తిరుగుతూవున్నా ఎన్నడూ పైరు పచ్చదనంవల్ల కళ్ళల్లో నీరు క్రమ్మలేదు. కన్నులకు కూడ శక్తి లోపించినట్లుంది, దేహంలో ప్రవేశించిన నిస్సత్తువతోబాటు.

# అ ను బం ధా లు

అస్తమించే సూర్యునివైపు తిరిగి కళ్ళకు చెయ్యి అడ్డు పెట్టుకొని కలయజూశాడు. పదను చేరిన కత్తిఅంచులాగ మెరు స్తున్నది చెఱువు. ఆ నీటి తళతళ వయసుమళ్ళిన తనపట్ల దాక్షిణ్యరహితంగా వుంది.

చెఱువులో నీళ్ళుత్రాగటానికి వచ్చి, ఆ సంగతి మరచి పోయి, నెమరు వేసుకుంటూ, అరమోడ్పుకన్నులతో పడుకున్న వృషభంలా వున్నది కొండ. కాదు, యోగముద్రలో, కాల ప్రభావాని కతీతుడై, మానవహృదయదౌర్బల్యాలకు, అను బంధాలకూ, ఆనందదుఃఖాలకు తను పట్టి సాక్షిస్వరూపమేనని నిరూపించుకొంటూవున్న శిలామూర్తి బసవేశ్వరుడు తనవైపు చూడడు.

కత్తియంచువలె వున్న నీటిమీాదితళతళకాంతులే ఇటు వైపు చల్లనైన పచ్చదనంగా పరివర్తన చెందాయి. మధ్య ఒక్క చెఱువుకట్టమాత్రం అడ్డం వున్నది. జీవితంలో నిర్దాక్షిణ్యమూ, సానుభూతీ రెండూ ప్రక్కప్రక్కనే వుంటూ యిలాగే కనుపిస్తాయి.

కొండ, చెఱువు, పైరు...యీా వరుస యీావిధంగానే మార్పేమిా లేకుండా తన అరవైఏళ్ళ జీవితాన్ని క్షణక్షణమూ స్పృశించింది. ఈ చోటుకన్న తనకు సన్నిహితమైంది ప్రపం చంలో వేరేదీ కన్పించదు.

ఆశలు, కోరికలు మనిషికి దుఃఖాన్నే కలిగిస్తాయన్న మాట ఎంత సత్యం!

పూర్వజన్మలో చేసుకొన్న పాపపుణ్యాలప్రతిబింబం ప్రస్తుత జీవితం. కర్మ అధిగమింప వీలుకానిది. కానీ, తను

యీ జన్మలో తెలిసి ఏ పాపం చెయ్యలేదే! తెలీని అపరాధమేమైనా చేశాడేమో!

ఏడాదికి తప్పకుండా కొండమీది మల్లికార్జునునికి భక్తితో ప్రణమిల్లలేదా ?

కులదైవం వేణుగోపాలస్వామిని మనసార భజించని దెప్పుడు ? "నల్లనివాడు పద్మనయనంబులవాడు" తన అంతరంగంలో నిత్యమూ ప్రతిష్ఠితుడే కదా !

కడుపునపుట్టిన ఒక్కకొడుకు, చిన్నప్పటినుండి తన మాట కెదురుచెప్పనివాడు, తన మనస్సుకు నచ్చిన రీతి పెరిగి పెద్దయినవాడు, వంశాంకురము, ఇంటిపేరు నిలబెట్టి ప్రకాశింప జేస్తాడనుకొన్నవాడు వానిమనస్సు ఇంత కఠినమైపోయిం దేమిటి ? కారణమేమీ కనుపించదే !

పొలంలో నిలబడి, నడుమువంచి స్వహస్తాలతో పైరు నాటుతూ, కూలీల పాటల తియ్యదనంలో మైమరుస్తూకూడా, తను గర్వానికి ఎప్పుడూ అవకాశమివ్వలేదే ! ఆ సమయంలో తలెత్తి ఆకాశవీధిలో, మల్లికార్జునుని దేవాలయం వైపు చూపులు సారించి, మనస్సులో చేతులెత్తి నమస్కారంచేశాడే !

కోతలు...కుప్పలునూర్పించటం...ధాన్యం తూర్పార బట్టటం...ఆ సందెవేళల్లో సూర్యభగవానుని బంగారుకిరణాలు సోకి, తన ధాన్యలక్ష్మి ధన్యతపొందని దేనాడు ?

వాడు సంపాయించి నాలుగెకరాలపొలం నలభైగా వృద్ధిచెయ్యకపోవచ్చు. అంతటి దురాశ తనకెన్నడూ లేదు...

కాని ఉన్న పొలాన్ని, తరతరాలనాటి భూమిని యీవిధంగా పోగొట్టుకోవలసివస్తుందని తను ఊహించలేదు.

చదివింది ఇంగ్లీషుచదువు. అది అచ్చిరాలేదు కాబోలు. కాని వానిమనస్సెప్పుడూ కులదేవతలనుండి మరలలేదే! మనోవాక్కాయకర్మల వాడెన్నడూ అపరాధంచెయ్యలేదు. వానికీ మూర్ఖత్వమేమిటి? తన బాధ ఎందుకని అర్థంకాదు?

తీరిపోయింది. ఈ భూదేవికీ తనకూ ఋణానుబంధం తీరింది. తన్నుగన్న, పెంచిన యీ తల్లి ఎవరో, తనెవరో? తన తల్లిని తను చేతులార ధారపోశాడు, అమ్మివేశాడు.

ఓపికఉండినన్నినాళ్లు పాలిచ్చి ముసలిదైన ఆవునుగాని, కష్టంచేసిన ఎద్దునుగాని తనెన్నడూ డబ్బుకులోభపడి అమ్మలేదు. ఇప్పుడిది విపరీతమే, పాపమే, కళంకమే!

తను బుద్ధిపూర్వకంగా యీ పాపం చేశాడా? కాని ఎటువంటి పరిస్థితులు ఎదురైనా, తను చెయ్యదగినపనేనా? తల్లిని విక్రయించవచ్చునా? ఇది మాతృద్రోహం మాత్రమే కాదు. కొండమీద వెలసి, కృపామయవీక్షణాలతో, మాళిస్థిత చంద్రకాంతులతో అభయమిచ్చే మల్లికార్జునస్వామికీ, జీవనాధారమైన జలాలనిచ్చే సరోవరలక్ష్మికీ చేసిన అపరాధం ద్రోహం కదా!

ఈ పొలం, ఈ భూమి, ఈ నీళ్ళు — వీనితో పెరిగిన దేహం, గడచిన బ్రతుకు నేటికి ముగింపుకు వచ్చినట్లే. మిగిలింది ఏకాకియై, వెలికాబడి, బాధాసర్పదష్టమైన మనస్సు మాత్రమే! దానికి నిష్కృతి ఎప్పుడు?

సూర్యుడ స్తమించాడు. రోజుగతించింది. మరో వుదయం మరోపగలు చూడవలెనన్న ఆశకూడ గతించింది.

తల్లి ఎడబాటు కోర్వలేని పసిపిల్లవానివలె కన్నులు ఒత్తుకుంటూ లేచి నిలుచున్నాడు. పెద్ద గాలితెర వచ్చింది

చెరువుకట్టదిగి రోడ్డుమీద నడుస్తున్నాడు. మసకచీకట్లో బాగా చూపుఆనక, శూన్యంలోకి వెళ్ళుతూవున్నట్లనిపించింది. అకస్మాత్తుగా వెనుకవచ్చిన గాలి బలంగా ముందుకుత్రోసింది. పడబోయి, చేతికఱ్ఱ సహాయంతో నిలదొక్కుకోగలిగాడు,

ఆకాశంలో అంతకుపూర్వం కనుచూపుకెక్కడా తోచని మబ్బులు ముంచుకొనివచ్చి కప్పివేశాయి. చిటపట చినుకులు ప్రారంభమై, వర్షంగా మారింది. విపరీతమైన గాలి. కష్టంతో, ఆయాసపడుతూ ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తున్నాడు.

మేఘం గర్జించింది. విధిచేసిన వికటాట్టహాసంవలె వుంది ఆమ్రోత. తన పాపాలొక్కసారి పటపట విరిగినట్లు,హృదయం పగిలినట్లు తోచి, మేనంతా కంపించి, ఊగిపోయింది. గాలి తగ్గింది. వర్షం కుండపోతగా కురుస్తూవుంది. ఆగినవాడు మళ్ళీ నడుస్తున్నాడు.

తలమీద ముసుగువేసుకొన్న అంగవస్త్రంతో బాటు, దుస్తులన్నీ ముద్దగా తడిసిపొయ్యాయి. భుజాలమీదుగా నీళ్లు దిగజారుతున్నవి.

చెరువుకు ఊరికి దారిమధ్యలో రోడ్డుప్రక్కగా వుంది వేణుగోపాలస్వామి ఆలయం. తనపేరు దేవునిఆలయంలో ప్రవేశించాడు.

వర్షంనుండి ఒక ఆదరువు దొరికింది. కాని ఒళ్ళంతా తడిసిపోయింది. మెల్లగా తడిదేహంతో ప్రవేశిస్తున్నట్లు, వెచ్చదనం హరించిపోయి, గజగజ వణకు ప్రారంభమైంది. ఆలయంలో ఒకమూల కూర్చున్నాడు.

అట్లా ఎంతకాలం గడిచిందో తెలీలేదు. అరగంటో, గంటో అయివుండవచ్చు. ఒకయుగం గడచినట్లుంది. వర్షం కొంచెం వెలిసినట్లుంది. చినుకులు పడుతూనే వున్నాయి.

గోపాలస్వామి మెల్లగా కదిలి, ఆలయం ముంగిట నిలుచున్నాడు. కాని వణకుమూలంగా అడుగులు పడటంలేదు. కష్టసహాయంతో రోడ్డుమధ్యకు చేరాడు.

దూరంలో మిణుకుమంటూ దీపం ఒకటి ఊరివైపు కనుపించింది. గాఢాంధకారం. కదలలేక, విపరీతంగా వణకువచ్చి రోడ్డుమీద కుప్పకూలిపొయ్యాడు.

చైతన్యరహితంగా పడివున్న గోపాలస్వామిని, లాంతరు గొడుగు పుచ్చుకొని సమీపించాడు రామయ్య.

కళాశాలలో ఉపాధ్యాయులందరూ వార్తాపత్రికలు చదువుకోడానికి ప్రత్యేకింపబడిన గదిలో ప్రారంభమైంది వేదమూర్తికి సుందరరావుకు పరిచయం. వార్తలు చదువుతూ రాచకీయాలు, ప్రపంచవిషయాలు యథాలాపంగా చర్చించుకోవడం నుండి మన స్తత్వశాస్త్రవిషయాలు, స్వీయానుభవాలు చెప్పుకోవడంతో వాళ్ళిద్దరికీ స్నేహంకూడ ఏర్పడింది. ఒకటి

రెండుసార్లు వేదమూర్తి సుందరరావుఇంటికి వెళ్ళాడు. దసరా సెలవుల్లో ఇద్దరూ హంపీ వెళ్ళి వచ్చారు.

సోమవారం సాయంకాలం నాటకంరిహార్సల్‌కి రమ్మని వేదమూర్తిని ఆహ్వానించాడు సుందరరావు. ఏవైనా తోచినవి సూచనలు చెయ్యమన్నాడు నాటకాన్ని ఇంకా బాగా రూపొందించడానికి. రిహార్సల్ తర్వాత సుందరరావు ఇంట్లో టీ తీసుకొని, యిద్దరు షికారు వెళ్ళారు.

ఊరిచివర పాకీవాళ్ళగుడిసెలున్న ప్రదేశాన్ని దాటి కర్నూలురోడ్డువైపు వెళ్తున్నారు. మురుగుకాలువవంతెన మీదకు వచ్చేటప్పటికి కుళ్ళువాసన వేసింది.

"అబ్బ! ఇది కాలువవాసన కాదు...ఏమిటో చచ్చి కుళ్ళినవాసన" అన్నాడు ముక్కుకు, నోటుకు జేబురుమాలు అడ్డుపెట్టుకొంటూ వేదమూర్తి.

సుందరరావు అట్లానే చేశాడు. ఏమీ మాట్లాడలేదు.

వంతెనదాటగానే రోడ్డుప్రక్క కొంతదూరంలో చచ్చిపడిన ఒక ముసలిగుర్రాన్ని కాకులు పీకుతూ, అసహ్యంగా దుర్భరంగావున్నది కనుపించింది. దాన్ని చూచి వేదమూర్తి ఒక్కక్షణం అట్లాగే నిలబడిపోయి, తర్వాత తొందరగా అడుగులు వేసుకుంటూ ముందుకుసాగిపొయ్యాడు. సుందరరావు ఒక్కసారి ప్రక్కకు చూచి, మామూలు నడకలోనే ముందుకువెళ్ళి, ఆగిన వేదమూర్తిని కలుసుకున్నాడు.

మునిసిపాలిటీసరిహద్దులు దాటగానే వాతావరణం ప్రశాంతంగా, నిర్మలంగావుండి మనస్సుని కుదుటబఱచింది.

"ఎంత దుర్భరంగా వుంది. అది జట్కా-బండి లాగే గుఱ్ఱం. ముసలిదై పనికిరాకపోయినందుపల్ల బండివాడు మేత వెయ్యకుండా తోలివేసివుంటాడు నిర్దాక్షిణ్యంగా. కదల్లేనిపరిస్థితిలో, ప్రాణంపోక, శక్తిలేక, కాకులూ గ్రద్దలూ పీకుతూవుంటే తీసుకుని తీసుకుని చచ్చిపుంటుంది." అన్నాడు వేదమూర్తి.

"మునిసిపాలిటీ యింత అధ్వాన్నంగా వుంది. కమీషనరుకి వుత్తరం వ్రాయాలి. హెల్తుఆఫీసర్ ఏం చేస్తుంటాడో అర్థంకాకుండా వుంది" అన్నాడు సుందరరావు.

ఇద్దరూ వెళ్ళి ఒకచోట కూర్చున్నారు.

"లోకంలో ఎంత కాఠిన్యం, నిర్దాక్షిణ్యం వుందో మనం ఊహించలేము. వయస్సు వచ్చినప్పటినుండి, ఒళ్ళు దాచుకోకుండా పనిచేసి, రాత్రింబగళ్ళు ఎంత బరువైనా లాగి డబ్బు సంపాయించి, వాణ్ణి, వానికుటుంబాన్ని పోషించిన జంతువుమీద కించిత్తైనా దాక్షిణ్యం చూపలేదుకదా! వాని మానవత్వాని కింక అర్థమేమిటి?" అన్నాడు భావావేగంతో వేదమూర్తి.

"నిజమే! కానీ, సంపాదన ఏ రోజు కా రోజు చాలదు; పిల్లలకు తిండిపెట్టడమే అసాధ్యమైపోతూవుంది. అట్లాంటి పరిస్థితిలో ముసలిగుఱ్ఱాన్ని ఎట్లా ఆదరిస్తాడు? గుఱ్ఱం సంపాయిస్తూవున్నప్పుడే కడుపునిండా దాణా పెట్టడం కష్టం వాని బ్రతుక్కి. ఇంక కృతజ్ఞతకోసం ముసలిగుఱ్ఱాన్ని పోషించాలి అనుకోవడానికి, అదీ ఒక ప్రాణి అని ఊహించడానికి వానికి అవకాశం ఏదీ?"

"అయితే వాడు మనిషే కాడు! జీవచ్ఛవమన్నమాట. వాని బ్రతుక్కంటే ఆ గుఱ్ఱం బ్రతికిన బ్రతుకే విలువైంది."

"వాని మానవత్వంసంగతి మన కేం తెలుసు? మానవత్వం వుంది కాబట్టే అట్లా చెయ్యవలసివచ్చిందేమో! వానికి నలుగురు పిలలున్నారనుకోండి. చివర చంటిపిలకు నాలుగణాల పాలు కొనాలి. ఈ గుఱ్ఱాన్ని పోషిస్తే ఆ పాలు కొనలేడు; రెండింటిలో ఏదో ఒక్కటే చేయగలడు. గుఱ్ఱంమీద జాలే, కానీ అటు బిడ్డమీద ప్రేమ! ఒకప్రక్క బ్రతుకు ఆఖరు దశలోవున్న గుఱ్ఱం, ఇంకొకప్రక్క బ్రదుకు ప్రథమదశలో వున్న శిశువు! ఎట్లాచూచినా వాని కర్తవ్యం వాడు సరిగ్గానే నిశ్చయించుకొన్నట్లవుతుంది."

"మీారు ఊహించిన పరిస్థితి ప్రత్యేకమైంది. కాని యిట్లాంటి క్రౌర్యం సాధారణంగా జరుగుతూవుంటుంది! దీన్ని శిక్షాస్మృతిలో చేర్చవలసిందే."

"న్యాయం, శిక్ష, నీతి, తీర్పు అన్న పదాలకున్న చిక్కు వాటిని అనువర్తింపజేయడంలోనే వుంది! ప్రతి దోషమూ ప్రత్యేకమైందే! ప్రత్యేకపరిస్థితులకు సంబంధించిందే! తరచిచూస్తే ఒక నేరానికి ఇంకొక నేరానికి సామ్యమేవుండదు. ప్రతినేరస్థునికి బలవత్తరమైన పరిస్థితులే వుంటాయికూడా. ఒకవ్యక్తితన చేతలకి ఎంతవరకు బాధ్యుడన్న విషయమే వివాదాంశము. మన స్తత్వాన్నిబట్టి, వేదాంతపరంగా కూడా, వ్యక్తి తన చేతలకి బాధ్యుడు కానేకాడేమో అన్న అనుమానం కలుగుతుంది. ఇంతేకాదు, మీా దృష్టిలో శిక్షార్హమైనదోషం నాదృష్టిలో కాదు. మన యిద్దరిదృక్పథాలకూ, సంఘదృక్ప

ధానికీ, శిక్షాస్మృతికీ ఏకీభావం కుదరదు. కాని ఇట్లా ఆలోచిస్తూ న్యాయశాస్త్రం, శిక్షలు వుండరాదని అనలేము. సంఘక్షేమానికి, అసలు సాంఘికజీవితానికే అవి అవసరం. నిబంధనలూ, శిక్షాస్మృతి అంటూ వుండకతప్పదు. స్థూలంగా ఆ నిబంధనలు ఉల్లంఘింపబడినవా లేదా అనే విషయమే న్యాయస్థానంలో పరీక్షకువస్తుంది. శిక్ష విధిస్తారు. కాని న్యాయస్థానం చేసే తీర్పు కాని, సాంఘికదృష్టికాని వ్యక్తిగతమైన నీతినీ, ఒక మనిషి అంతఃకరణాన్నీ నిర్ణయింపలేవు. మీ దృష్టికి ఆ గుఱ్ఱపుబండివాడు శిక్షార్హుడు. న్యాయశాస్త్రం దృష్టిలో ఇప్పటికికాదు; బహుశా బండివాని అంతఃకరణప్రకారం దోషికానేకాడు. ఇంక నావాట్టుకు నేను ఏ తీర్పు చెయ్యలేను అనుకుంటాను. సంఘం వేరు, వ్యక్తి వేరు! సంఘనీతి, వ్యక్తి అంతఃకరణ ఎన్నడూ ఒకటి కావు."

"మీరు చేసే విభేదం స్పష్టంగానే వుంది. కాని ఆ దృశ్యాన్ని చూడగానే, మనసు దాన్నుండి ఒక వ్యక్తిమీదికి ఆ వ్యక్తిచేసిన అన్యాయంమీదికి సహజంగా పరివర్తిస్తుంది. అప్పుడు అసహ్యంతోబాటు దుఃఖమూ, కోపమూ శిక్షించాలనే ఆవేశమూ కలుగుతుంది. ఇది సహజమైన అనుభవం. దాన్నొకవిధమైన తీర్పనీ, ఆ తీర్పుచేసేహక్కు మనకు లేదనీ అనడం యథార్థవిషయాన్ని గుర్తించకపోవడం. అంతేకాదు, అటువంటి మనస్సంచలనము చాల అవసరం కూడ. సంఘానికి, వ్యక్తికి యిద్దరికీ అవసరమే. ఆ సంచలనము, అటువంటి అన్యాయాలు జరుగకుండావుండాలనే పట్టుదలను కలిగిస్తుంది. ఆదర్శవంతంగా సంఘాన్ని దిద్దాలనీ, క్రౌర్యాన్ని, దుఃఖాన్ని

లోకంలో లేకుండా చెయ్యాలనీ దృఢనిశ్చయం ఏర్పడుతుంది. మీరు చెప్పిన ప్రత్యేకసమస్య ఏమైనా, ఆవిధంగా చేయవలసి వచ్చిన బండివానిసంగతి ఆలోచించామనుకోండి. దానివల్ల మన ఆర్థికవ్యవస్థ యిటువంటి అన్యాయానికి ఎంతవరకు మూల కారణమో కూడా బోధపడుతుంది. అప్పుడా వ్యవస్థని మార్చ వలెనని కూడా నిశ్చయించుకుంటాము. ఆ బం
గట్టిగా తెలీలేదనీ, వాని అంతఃకరణవిషయం తెల్సుకోవడానికి వీల్లేదనీ, మనలో కలిగే మానసికపరివర్తనని అరికట్టడం ఏమీ భావ్యంకాదు."

"అరికట్టనక్కరలేదు. కానీ దానిస్వరూపాన్ని, కలిగిన ఆవేశంయొక్క ఉపయోగాన్ని నిర్మలంగాగుర్తించాలి. ఆవేశం వల్ల, ఉద్రేకపూరితమైన ఆలోచనవల్ల, ప్రత్యేకకర్తవ్యం నిర్ణయంకాదు. ఆవేశంయొక్క ఉపయోగము కార్యసాధనలో చాల తక్కువ. యథార్థంయొక్క క్లిష్టస్వరూపాన్ని అవగాహన చేసుకొని, కర్తవ్యాన్ని మెలకువతో చూపించగల ఆలోచన కావాలి. ఆవేశమన్న శక్తికి లోబడితే, వ్యక్తిగతమైన బాధ్యత గుర్తుకురాదు సరికదా, చేసే చేతలకు ఏ ఫలితం వస్తుందో—మంచి ఫలితమో, చెడుఫలితమో—దానితర్వాతసంగతేమిటో కూడా మనం బొత్తిగా ఊహించలేనిపరిస్థితి అది. ఆవేశశక్తి లోబడిపోవడం వ్యక్తిస్వాతంత్ర్యానికి విరుద్ధలక్షణం. సంఘాన్ని పెద్దఎత్తున, వ్యవస్థారూపంగా సంస్కరించవలెనని కలిగే పట్టుదలకూడా ఒక ఆవేశమే. అటువంటి ఆదర్శాలకుకూడ తాత్కాలికమైన భావావేగానికున్న దోషమే వుంది. సరియైన ప్రత్యేక కర్తవ్యాన్ని అవి నిర్ణయించలేవు."

"ఎందుకు నిర్ణయించలేవు ? వ్యవస్థలలో లోపాలను మార్చాలని అప్పుడే ప్రయత్నం ప్రారంభమౌతుంది."

"ఏ వ్యవస్థనూ ఒక్క నిముషంలో, వెంటనే మార్చడానికి వీలుకాదు. మన మా దృశ్యాన్ని చూచి వచ్చాము. మనం వెంటనే చేసిందేమిటి ? ఒక దీర్ఘ చర్చ. ఈ చర్చ మన ఆవేశానికి, ఆదర్శాలకు ప్రతిబింబమేకదా. మరి యీ చర్చతో ప్రత్యేకంగా మనం సాధించిందేమిటి? ఏమీలేదు. ఇంటికివెళ్ళేలోపుగానే యీ విషయం మరచిపోతామేమో! ఐతే, యీ పరిస్థితిలో ప్రత్యక్షకర్తవ్యమన్నది ఏ రూపంలో వుంటుంది? మనము వెంటనే ఏంచెయ్యగలము ? అన్న ప్రశ్న వస్తుంది. ఆ శవాన్ని, అనారోగ్యకరమైనపెంటగా గుర్తించి దాన్ని తొలగించివెయ్యటం మనం చెయ్యగలిగినపనే. నిజమైన కర్మయోగి స్వహస్తాలతో ఆ పని చేస్తాడు. గాంధీగారు అట్లా చేసేవారు. ఆయనకు ఆవేశం రాదు. వ్యవస్థలను గురించి లోకాన్ని గురించి తర్వాత ఆలోచిస్తాడు కాని, యీ క్షణంలో ఆలోచించడు. పోనీ గాంధీవలె చెయ్యలేము, కనీసం మునిసిపాలిటీవాళ్ళకు చెప్పుతాము. రిపోర్టొకటి వ్రాస్తాము. సాంఘిక ప్రయోజనాన్ని సాధించే మన ప్రత్యక్షకర్తవ్య మిదే. మరి మన ఆవేశానికి కర్తవ్యానికి సంబంధమే కనుపించలేదే !"

"మీరు చెప్పే సాంఘికప్రయోజన మొకవిధమైనది. మన మనుకొన్న ఆదర్శం దానికన్న గొప్పది; అందువల్ల నిదానంగానే సాధించడానికి వీలౌతుంది."

"ఎప్పుడు ? ఎంతకాలంలో ? ఏవిధంగా ? అది మన ఊహకుఅందనివిషయం. మనం ఊహాలల్లినా అవి వట్టి ఊహాలే!

ఏదో పెద్ద విషయాన్ని మనస్సులో వుంచుకొని, వ్యక్తి తన అనుబంధాల్ని, ప్రత్యేకకర్తవ్యాన్ని, ప్రవాహశీలమైనజీవితాన్ని విస్మరించడం కంటే అనర్థమూ, దాస్యమూ ఇంకేముంటుంది? ఈ యుగంలో భావోద్రేకానికి, ఊహాపూర్వకమైన సాంఘిక ఆదర్శాలకు వ్యక్తిచేసే దాస్యం చాలవిచిత్రమైంది! వ్యవస్థను మార్చడం ముఖ్యం కాదనటం లేదు నేను. ఎంతైనా ముఖ్యమైన విషయమే! కాని అందువల్ల కొన్ని వ్యక్తిగతసమస్యలు పరిష్కరింపబడినా, కొత్త సమస్యలు కూ తప్పకుండా ఎదురౌతాయి. సామ్యవాదసిద్ధాంతం వుందనుకోండి. జీవితావసరాలైన తిండీ, గుడ్డా సమస్య తీరినా, వ్యక్తి సహజస్వాతంత్ర్యం ఎంతవరకు దెబ్బతింటుందన్న కొత్త సమస్యనుగూర్చి తీవ్రంగా ఆలోచించవలసివస్తుంది. ఒక సమస్య పరిష్కరింపబోతే, కొత్తది యింకొకటి తయారౌతూవుంటుంది."

"అయితే మీరు సూచించే మార్గమేమిటి?"

"నిర్ణీతమైన పరిష్కారమార్గమంటూ ఒకటి ఎట్లా వుంటుంది? సంఘం, వ్యక్తి, పరిస్థితి—యీ మూడూ అవినాభావసంబంధాన్ని కలిగిన ఒక సమగ్రమైనవిషయం. మన మా సత్యాన్ని గుర్తించాలి. మూడింటిమీద దృష్టివుంచుతూ ఎప్పటికప్పుడు కర్తవ్యం నిర్ణయించుకొని, దాన్ని నిర్వర్తించడమే పరిష్కారమార్గం. అంటే వ్యక్తిగతమైనబాధ్యతలను వదలి సాంఘికవ్యవస్థలనుగూర్చి వ్యర్థమైన ఆలోచనచేయు సామాన్యునికి ఎట్లా తగదో, సంఘంలో మార్పులు తీసుకురాగలిగినస్థితిలో, పదవిలోవున్న, నాయకుడైన వ్యక్తి, ఆ విషయాన్ని మరచి తన స్వార్థప్రయోజనాల్ని గురించి మాత్రమే

ఆలోచించుకోవడం తగదు. వ్యక్తి ఎప్పటికప్పుడు తన కర్తవ్యాన్ని తాను ఆలోచించుకోవాలి. ఏవిధంగా? తనలోని వ్యక్తిత్వానికి ద్రోహం జరుగకుండా, ఇతరులకు బాధకలుగకుండా; బాధ తప్పనిపరిస్థితుల్లో, దేనివల్ల తక్కువబాధ కలుగుతుందో అది చేయడానికి కర్తవ్యం నిర్ణయించుకోవాలి. అంతఃకరణఅంటే, నేను చెప్పగలిగిన నిర్వచనం యిదే. ఇట్లా జీవించే వ్యక్తిప్రవర్తన ఇతరులకు కొంత విచిత్రంగాకూడా వుండవచ్చు. అతను సాంఘికనిబంధనలను కాని సాంఘికాదర్శాలను కాని ఒకప్పుడు అతిక్రమించవచ్చు; అతను ఒకసారి చేసినదానికి, ఇంకోసారి చేసినదానికి స్థూలంగా సంబంధమేమీ కనుపించకపోవచ్చు. అతనిచేతలు పరస్పరం విరుద్ధంగా కూడ తోచవచ్చు. కాని అది అవతలివాళ్ళదృష్టిభేదం మాత్రమే!

"వ్యక్తిత్వానికి ద్రోహంకలుగకుండా అన్నారు,వ్యక్తిత్వమంటే ఏమిటి? ఎంతటి స్వార్థమైనా, ఏకోరికలైనా, వ్యక్తిత్వమాటూ సమర్థించవచ్చుకదా?"

"స్వార్థం అంటే ఏమిటి? అది వ్యక్తికీ అవతలివాళ్ళకీ వున్న సంబంధంలో వాళ్ళకు కలిగే నష్టాన్నీ బాధనీ సూచించే పదమే కదా! వ్యక్తిత్వసాధనకు, స్వతంత్ర కార్యాచరణకు కూడ 'ఇతరులకు బాధ కలుగకూడ'దన్న నిబంధన చెప్పేవున్నాను. అందువల్ల మీరనే స్వార్థానికి ప్రవేశంలేదు. ఇంక వ్యక్తిత్వాన్ని నిర్వచించమంటే ఏం చెప్పగలను? వ్యక్తిత్వమన్నది గతంవల్ల, ప్రస్తుతానికి చెందిన ఆలోచన ఆవేశాలవల్ల ఏర్పడే సంకలనమనఃస్థితి; ప్రవాహశీలమైనది! జీవితం నదిలాంటిది అనుకుంటే, దానిలోని ప్రవాహజలమే వ్యక్తిత్వము. ఒక

మధురస్మృతి కాని, బాధాస్మృతి కాని వుంచుకోండి. మధుర స్మృతి ప్రయత్నపూర్వకంగానూ, బాధాస్మృతి అప్రయత్నం గానూ కలుగుతూవుండవచ్చు. మరీ సహించరాని గతానుభవం విపరీతమైన భయంతో కూడినదైతే, స్మృతిపథంలోకి రాకుం డానే అణగి అలానే వుండవచ్చు. ఎలాంటివైనా ఈ స్మృతుల విషయంలో గమనించవలసిన దొక్కటే! వానివల్ల నూత్నాను భవాలకు కావలసిన ఆవేశమూ, ఆలోచనా ఎంతవరకు లోపింపచాయన్న విషయం. నది ప్రవహిస్తూండగా కొంతనీరు ప్రక్కల చిన్న సరస్సులౌతూ నిలిచిపోతే ఏం జరుగుతుంది? ప్రవాహజలంలో కొరత వస్తుంది. గతంవల్ల బంధింపబడుతూ వున్న వ్యక్తిత్వం సమగ్రవికాసాన్ని చెందలేదు. మన జీవితం కూడా చర్విత చర్వణమై, కృశించి, యథార్థంతో సంబంధాన్ని కోల్పోతుంది .. గతం నశించాలి; అందులో చిక్కువడ్డ వ్యక్తిత్వం నూత్నానుభవాలవైపు ప్రవహించాలి."

"వ్యక్తిత్వాన్ని అర్థంచేసుకోవడానికి గతం ఎప్పుడూ అవసరం అని నాకు తోస్తూందే! గతానుభవస్మృతులు కూడా ఎప్పుడూ ఒకవిధంగా వుండవు. మనకు అవగాహనఅయ్యేకొద్దీ అవి మారుతూవస్తాయి. అందువల్ల గతం నశించాలి అనటం కన్న, గతాన్ని అర్థంచేసుకొని అధిగమించాలి అనడం బాగుంటుం దేమో!"

"ఈ భేదం మన యిద్దరిఅనుభవాల్లో వున్న భేదం కావచ్చు. నేనేమీ చెప్పలేను." అన్నాడు సుందరరావు.

వాళ్ళు యిల్లుచేరుకునేటప్పటికి వర్షం ప్రారంభమైంది.

# 8

వర్షం కురుస్తూవుంది. మంచంమీద పడుకొని, వేద మూర్తి మరుసటిరోజు పాఠంచెప్పవలసిన ఖండకావ్యాన్ని చదవడానికి పుస్తకం తీశాడు. అది హాడ్సన్ (Hodgson) వ్రాసిన 'ఆబోతు' (The bull) అన్న కావ్యం. ఒక అడవి ఆబోతుమరణావస్థనువర్ణించాడుకవి. ఆవులు, ఆబోతులుకలిసిన ఒక పెద్దమందకు నాయకుడుగా జీవితాన్ని గడిపిన ఆబోతు, తన ముసలితనంలో ఒక కోడెవల్ల ఓడింపబడి, ఒళ్ళు తెగి మృత్యువు నెదురుచూస్తూవుంది. పోరాటం అనగానే, క్రొత్త నాయకునితో మంద వెళ్ళిపోయింది. మగతగా ముసలి ఆబోతు ఒక స్వప్నావస్థలోవుంది. కాకులు, గ్రద్దలు అరుస్తూ దాని శరీరాన్నాశించి పైన తిరుగుతూవున్నాయి. రక్తసిక్తమైన ముఖంమీద యీగలు రొద చేస్తున్నాయి. కావ్యం చదవగానే సాయంత్రం ఊరిబయట కనుపించిన దృశ్యం మళ్ళీ ప్రత్యక్ష మౌతూవుంది. మనస్సుకు హత్తుకొనిపోయిన ఆ దృశ్యాన్ని వదిలించుకోవడ మెట్లానో తెలీలేదు.

మాంసాన్ని కోల్పోయి, వికృతంగా ప్రక్కఎముకలు కనుపిస్తూ, దుర్వాసనతో పడివున్న గుఱ్ఱం, మృత్యువును నిరీక్షిస్తూ, గతానికిచెందిన ఊహాదృశ్యాలస్వప్నంలో మాత్రం నిలిచి, అంతరిస్తూవున్న చైతన్యంతో, కొడిగట్టిపోయిన దీపం వంటి ఆబోతు. యథార్థంగా చూచిన దృశ్యానికీ, కావ్యంలోని దృశ్యానికీ ఎంతో సంబంధం వుంది. గుఱ్ఱంకూడ విశ్వాసంతో తనుసేవించినవానిచేత నిర్దాక్షిణ్యంగా తరిమివేయబడి, స్నేహా

శూన్యమైన చివరిదశలో, ఆబోతులాగే మృత్యువు నాహ్వా నించివుండాలి.

మనస్సు కరుణార్ద్రమై, విపరీతంగా చలిస్తూవుంది. పుస్తకం మూశాడు.

ఆవేశగ్రస్తమైన మనస్సు బానిసవంటిది. యథార్థానికి అనుగుణంగా ఆలోచించలేక శక్తివిహీనమైపోతుం దేమిటి తన మేదస్సు? ఎందుకని సహింపరాని జుగుప్సాకరమైన, ఏ సంబంధమూలేని విషయంమీదికి పరిభ్రమిస్తూంది తన మనస్సు?

తన జీవితానికిసంబంధించినవిషయాల వైపు, సహేతుకమైన ఆలోచనవైపు ఊహల్ని త్రిప్పాలి. తనకున్న ఆదర్శాలేమిటి? జీవితాన్ని ఆదర్శపథంలో నడపడానికి తను చేస్తున్న, చెయ్యగలిగిన ప్రయత్నాలేమిటి? కట్నంతీసుకొనే పెళ్ళి తప్పించుకొన్నాడు, మంచిదే. కాని అది చాలదు. ఆదర్శానికి తగినవిధంగా వివాహంకూడా చేసుకోవాలి.

అటువంటి వివాహానికి తనకున్న అవకాశాలేమిటి? అంటే, తనకు పరిచయమున్న ఆడవాళ్ళెంతమంది? ఎవరెవరు? వాళ్ళలో ఒక్కొక్కరి ప్రత్యేకతనుగురించి తను గ్రహించిం దెంతవరకు? ఎవరిమీదైనా యింతవరకు అనురాగం అంటూ కలిగిందా?

నిజానికి ఆడవాళ్ళంటే తనకు చాల సిగ్గు. విద్యార్థిగా వుండేటప్పుడు వాళ్ళకు దూరంగానే తిరిగాడు. సంవత్సరం కావస్తోంది లెక్చరరుగా చేరి. పోయినసంవత్సరం కళాశాలలో వుండివెళ్ళినవాళ్ళలో ఇప్పుడున్నవాళ్ళలో తనతోమాట్లాడిన ఆడపిల్లలు ముగ్గురే! వాళ్ళతోఅయినా చెప్పుకోదగిన పరి

చయమేమీ ఏర్పడలేదు. ఒక్కొక్కరితో మాట్లాడింది ఏ రెండు మూడుసార్లో, అంతే.

కాని ఆడవాళ్ళలో వుండేరకరకాలైనభిన్నవ్యక్తిత్వాలు తనకు బాగా తెలిసినట్టే అనిపిస్తుందే, ఎందుకని? అది ఊహా మాత్రమైన జ్ఞానమేనా? షేక్స్పియరు సృష్టించిన నాయికలూ, అన్నాకెరెనీనా, మాడమ్ బొవరీ, మొపాసాకథల్లో వ్యక్తులూ, తనకు స్త్రీల మనస్తత్వాన్ని, వాళ్ళలో వ్యక్తి వైవిధ్యాన్ని అవగాహనకు తెచ్చారు. మరి యీ సాహిత్యాలబ్ధమైన జ్ఞానం, పరిమితమైన తనయథార్థానుభవాలకు ఒక ఊహాస్వరూపాన్ని కల్పిస్తూ తనతో ఏ రెండుసార్లోమాట్లాడిన వాళ్ళకు విశిష్టవ్యక్తిత్వమేదో వున్నట్లే భ్రమ కలిగిస్తూవుందా? తను వూహించే వ్యక్తిత్వాలు ఎంతవరకు నిజమైనవి ?

ఈ ప్రశ్నకుజవాబు, వాళ్ళవ్యక్తిత్వాలు జీవితంలో పరీక్షింపబడితేకాని లభ్యమయ్యేది కాదు. వాళ్ళనుగురించినఊహా సరియైనదేనని తనకు ఆత్మవిశ్వాసం వుంది. అంతకుమించి తను చేసేదికూడా ఏమీ లేదు.

గతసంవత్సరం చదువుతూవుండిన నిర్మల అనే విద్యార్థిని తను పరిశీలనగా గమనిస్తూవచ్చాడు. ఒకరోజు అటెండెన్సు పిలుస్తూవుంటే ఆ అమ్మాయినంబరు వచ్చినప్పుడు జవాబు రాలేదు. కొన్నినంబర్లు దాటినతర్వాత ఆమె మామూలుగా కూర్చునేవైపు చూశాడు. 'పలకటం మర్చిపొయ్యానే,ఎట్లా?' అంటూవున్నట్లుగా ఆమె తననే చూస్తూవుంది. ఆమెవైపు చూచి, కొంచెం ఆగి, ఆమెనంబరు గుర్తుపెట్టి, తర్వాత యథాప్రకారం మిగతా నంబర్లు పిలవడం పూర్తిచేశాడు. తను

హాజరు గుర్తుపెట్టడం ఆమెకూడా గమనించేవుండాలి! కాని క్లాసు అయిపోగానే తనగదికి వచ్చి "చెప్పడం మరచిపోయ్యాను. హాజరువెయ్యండి." అని కోరింది. అట్లా వచ్చి చెప్పడం అనవసరమే! ఆమె తనపై చూపిన ఆసక్తో, గౌరవమో ఆవిధంగా వుంది!

హాజరుపలకడం మరచిపోతే, "ఒక గంట అటెండెన్సు పడకపోతే పోయింది, కాని, దానికోసం వెళ్ళి ఎవరడుగుతారని సిగ్గుచేతనో, నిర్లక్ష్యంవల్లనో లెక్కచెయ్యరు కొంతమంది. చూచి గుర్తుపెట్టినట్లైతే, "నన్ను 'చూచి' నంబరు గుర్తుపెట్టాడు; నా విషయంలో ఎంతో కొంత అభిమానం చూపాడని తృప్తిపడి ఊరుకుంటారు కొంతమంది. ఇటువంటి సంఘటనలు ఒకటి రెండు గమనించి. ప్రయత్నపూర్వకంగానే పలక్కుండా ఊరుకుండి, అప్పుడు తమవైపు చూస్తాడో లేదో అనీ, చూచిన తర్వాత హాజరు గుర్తుపెట్టుతాడో లేదో అనీ, పరీక్షిస్తారు కొంటెతనంగా నవ్వుకుంటూ ఒకరిద్దరు. కాని తనపై ఆసక్తినీ, గౌరవాన్నీ వ్యక్తపరుస్తూ నిర్మల ప్రవర్తించినతీరు ఆమె ప్రత్యేకతని చూపిస్తూనేవుంది!

కొంతమంది పుస్తకాలివ్వమనీ, నోట్సుకావాలనీ వస్తారు. వాళ్ళకుకూడా తనమీద ఆసక్తి వుండివుంటుంది బహుశా. కాని తనతో మాట్లాడడానికి మామూలుగా వాళ్ళు కల్పించుకొనే కారణాలవి అందులో వాళ్ళనిగురించిన ప్రత్యేకత ఏమీ బయటపడదు. వాళ్ళకూ నిర్మలకూ చాల భేదంవుంది. మరి నిర్మలలో ఒక విశిష్టతను తాను చూడటం వట్టి ఊహా, కల్పన కాదుకదా!

పరిచయం అంటే ఏమిటి? ఊరికే మాట్లాడినంత మాత్రాన, గంటలకొలదీ ఏవో విషయాలు చర్చించుకొన్నంత మాత్రాన అవతలివాళ్ళనుగురించి తెలిసే దేమాత్రం? వాళ్ళ అభిప్రాయాలు తెలియవచ్చు, కాని వాళ్ళ వ్యక్తిత్వం, ప్రత్యేకత, తెలీకుండానే ఉండవచ్చు. నడకలో, చూపుల్లో, మాట్లాడేతీరులో, నవ్వేవిధానంలో, పరీక్ష వ్రాస్తున్నప్పుడో, తరగతిలో పాఠం వింటున్నప్పుడో, సభల్లో జనంలో కూర్చున్నప్పుడో లీలగా గమనిస్తూవుంటే ఎవరివ్యక్తిత్వంలో ఏ ప్రత్యేకత వుందో అవగతమౌతూనేవుంటుంది.

కాని ఇటువంటి భావనాత్మకమైన పరిచయాన్ని పరస్పర స్నేహంగా రూపొందించడమెట్లాగో తనింకా ప్రయత్నించలేదు.

అందుకు కారణం అవకాశాలు లేకపోవడంకాదు. నిర్మల మళ్లీ రెండుమూడుసార్లు ఏదో పనిమీద వచ్చి మాట్లాడింది. కానీ, ముక్తసరిగా, తనకేమీ పట్టనట్లు, చాల నిర్లిప్తతతో తను ప్రవర్తించాడు. ఎప్పుడు వెళ్ళిపోతుందా అని ఎక్కడికక్కడ త్రెంచివేసినట్లు జవాబిచ్చాడు. ఎందుకని క్రొత్తగా ఉపాధ్యాయుడు కావడంవల్ల విద్యార్థులపట్ల తనలో అప్రయత్నంగా వ్యక్తమయ్యే ఒక గుణం కాబోలు! కాని నిజంగా తనలోవున్న కోరిక వేరు ఆమెతో సుఖంగా చాలసేపు మాట్లాడాలనీ వుంది; మరి తనప్రవర్తన ఇంకొకతీరుగావుండి, విపరీత ఫలితాన్నిస్తుంది.

వర్షమెప్పుడో ఆగిపోయింది. తను గమనించలేదు. కిటికీఅవతల గాఢాంధకారం. చుక్కలవెలుతురుగూడా లేదు. వర్షానికి వూగుకూడా మాటుమణిగింది.

దీపం తీసివేసి, కప్పుకొని పడుకొని కన్నుమూశాడు నిద్రకోసం ప్రయత్నిస్తూ. మనస్సులో ఇంకా ఆలోచనలు మెదులుతూనే వున్నాయి. ప్రస్తుతం తన కొక ప్రత్యేకతతో కనిపిస్తూవున్న అమ్మాయి విమల. ఆమె రెండవసంవత్సరంలో వుంది. ఈసారి చదువు అయిపోతుంది. వచ్చేపడాది మళ్ళీ ఈ కళాశాలలో చేరుతుందోలేదో! తనకు పరిచయమున్నంతవరకు ఆమెలో తన కిష్టమైన గుణాలు చాల వున్నాయి. ఆమెకు కూడా తనమీద కొంత శ్రద్ధవున్నట్టే వుంది. క్లాసులో తన ఉపన్యాసం ఆసక్తితో వింటూవుంటుంది. మెర్ మెన్‌ను గురించి చెప్పుతూవున్నప్పుడు ఆమెకళ్ళల్లో ప్రతిబింబించిన భావావేగం తను మరచిపోలేడు. ఆమెకు కన్నీళ్ళువచ్చి కన్నులు చెమ్మగిల్లిన సంగతికూడా గమనించాడు. ఆమెలో మంచిభావనాశక్తివున్నట్లు తోస్తుంది. చక్కగా పాడుతుంది. తను రాకపూర్వం, గత సంవత్సరం, ఒకసారి పాడిందట. ఈసారికూడా పాడుతుందన్నాడు సుందరరావు, కాని ఆమెతో వ్యక్తిగతమైన స్నేహానికి అవకాశ మేమీ కన్పించదు. తనుగా వెళ్ళి మాట్లాడటం ఇష్టంలేదు.

వేదమూర్తికి నిద్రపట్టింది.

సూర్యాస్తమయవేళ. అదొకశివాలయం. వేదమూర్తి ఆలయంలోకి వెళ్ళాడు. చాలమంది స్త్రీ పురుషుల్తో—కొంత సమ్మర్దంగానే వుంది దేవాలయం. ఆ రోజు పండుగ, శివరాత్రి కాబోలు. ఆ విషయం తన కెందుకు గుర్తులేదని ఆశ్చర్యపోతూ ప్రదక్షిణలు ప్రారంభించాడు. మొదటిసారి తిరిగివచ్చి, నందివైపు చూస్తూ, ఎంత జీవకళతో తీర్చారో! అని తనలో అనుకుంటూ రెండో ప్రదక్షిణకు వెళ్ళాడు. మళ్ళీ నందిదగ్గరకు వచ్చేటప్పటికి

నందికిబదులు ఆస్థానంలో ఆబోతు కన్పించింది. ఇదేమిటని తను ఆశ్చర్యపడుతూవుండగానే అది లేచి నిలుచుని తలవిదిలిస్తూ కొమ్ము విసురుతూ తనమీదికి విజృంభించింది. భయంతో వెనక్కి పరుగెత్తాడు. ఆబోతు ఆగి, కోపంగా చూస్తూవుంది. ఎవరో స్త్రీ కిలాకిలా నవ్వింది. తన్నుచూచి వెక్కిరించినట్లుంది నవ్వు! ఆవైపు చూచాడు. నవ్వినవ్యక్తి విమల. తనని చూచి "ఆబోతును అదిలించండి మరి ఇంతేనా!" అన్నది. కోపంవచ్చి మొండిధైర్యం కలిగింది. ఆబోతువైపు అడుగువేశాడు, కాని ఇంతలో ఆబోతు తనప్రయత్నమేమీ లేకుండానే దేవాలయం నుండి పరుగెత్తి వెళ్ళిపోయింది. తనేమీ చెయ్యకుండానే అది వెళ్ళినందుకు కొంత నిరుత్సాహం, కొంతసంతోషంతో విమల కోసం చూచాడు. అక్కడెక్కడా లేదు. ఇంతలో ఎక్కడికి వెళ్ళిందని ఆత్రంగా విసుకుగా దేవాలయంవెనక్కి పరుగెత్త బోయాడు. ఆ వెళ్ళడంలో భుజం ఒక రాతి స్తంభానికి దభీమని తగిలింది.

వేదమూర్తికి మెలకువ వచ్చింది. భుజం గోడకు కొట్టుకొని, తను మంచానికి ఒకమూలగా ఒత్తిగిలి వున్నాడు.

పడుకునేటప్పుడు చలిగాలి అని కిటికీతలుపులు మూసినందుకేమో చాలా ఉక్కగా వుంది. దాహంవేస్తూవుంది. లేచి స్విచ్చివేశాడు. మంచినీళ్ళు తాగి, గడియారంచూస్తే, నాలుగున్నర అయినట్లు తెలిసింది. కిటికీ తెరిచి, దీపమార్పి, మళ్ళీ నిద్రప్రయత్నంచేశాడు. నిద్రరాలేదు.

రాత్రి చదివిన కావ్యం ఆబోతునుగురించి; పడుకునే ముందు తనఆలోచనలు విమలనుగురించి; అందువల్ల స్వప్నం

వచ్చింది. తను ఆడవాళ్ళతో మాట్లాడటానికి సిగ్గుపడటం తనకే విసుగ్గావుంది...అదే స్వప్నంలో వ్యక్తమైనభావంకూడా అనుకొన్నాడు.

* * *

తరగతికి వెళ్తూవున్న విమల కనిపించింది వేదమూర్తికి. ఆమెలో ఏదో క్రొత్త ఆకర్షణ వుంది. ఆమెను చూస్తే కొంత జంకుగా కూడ వుంది. కిలకిలా నవ్వి హేళనచేసి, కనుమరుగైన స్వప్నవిమల! యీామెలో కవ్వించి, పురికొల్పి, పారిపొయ్యే ఆకర్షణ—ఇంతకుపూర్వం లేనిది—ఇప్పుడు వున్నట్లుతోచింది.

వాళ్ళ క్లాసుకు తను వెళ్ళవలసింది చివరిగంటలో. పాఠంచెప్పవలసిన ఖండకావ్యాన్ని ఇంకొకసారి చదువుతూ కూర్చున్నాడు.

"వేదమూర్తిగారు మీరేనా అండీ?" టెలిగ్రాము జవాను వెదుకుతూ వచ్చాడు. "ఎక్కడి నుండి వచ్చి వుంటుంది యీ టెలిగ్రామ్?" అని ఊహించాడు సంతకంపెట్టుతూ. కవరు చింపుతూవుంటే "క్రాస్‌వర్డ్ పజిలులో ప్రథమ బహుమతియేమో అని హృదయం గడగడలాడింది. వ్రేళ్ళు తొందరపాటు చూపించాయి.

" Father dangerous. start immediately. " అని రామయ్యసంతకంతో వుంది టెలిగ్రాము.

ఇంతకుపూర్వం ఉత్తరమైనా ఏమీలేదే! అకస్మాత్తుగా ఏమి జరిగివుంటుందో! మధ్యాహ్నం ఒంటిగంటకు బస్సువుంది. తక్షణమే గదికి వెళ్ళి సర్దుకుంటే బస్సు అందుకోగలడు.

అక్కడేవున్న రామచంద్రయ్యతో సంగతిచెప్పి, ప్రిన్సిపాల్‌ను కలిసికొని సెలవుకోరడానికి వెళ్ళాడు.

వెళ్తూ టెలిగ్రాం తీసి చదివాడు మళ్ళీ. Father dangerous ...రామయ్య ఇంగ్లీషు తమాషాగా వుంది! దాని కనువాదం: తండ్రి తనకు ప్రమాదకారి అని. రామయ్యకు తెలిసిన ఇంగ్లీషు అంతే.

ప్రిన్సిపాల్ అప్పుడే వెళ్ళటానికి అనుమతి, మూడు రోజులు సెలవు ఇచ్చాడు.

బస్సు వూరుచేరేటప్పటికి దీపాలు వెలిగించే వేళ అయింది. దిగగానే రామయ్యకొడుకు పండ్రెండేళ్ళవాడు 'మామయ్యా' అంటూ వచ్చాడు.

"ఏమైంది?" అని ప్రశ్నించాడు ఆత్రంగా.

ఆరోజు తెల్లవారుజామున తండ్రి పోయాడు అని

పట్నంనుండి బసవన్నకొండ రెండుమైళ్ళు; దారిఅంతా చీకటిగావుంది.

సాయంత్రం చెరువుగట్టుకు వెళ్ళివస్తూ రెండుగంటలు విడువకుండా కురిసినవర్షంలో చిక్కుకొని తడిసిపొయ్యాడు. వర్షం కొంచెం వెలిసినతర్వాత సంగతి తెలిసి వెదుకుతూ వెళ్ళగా వేణుగోపాలస్వామిగుడిదగ్గర రోడ్డుమీద స్మారకం తప్పి పడిపోయి కనిపించాడు. ఇంకొకమనిషి సాయంతో తీసుకొనివెళ్ళి ఇల్లుచేర్చారు. తెల్లవారుజామున చనిపోయాడు. అదీ మరణానికి కారణం.

బండిదిగగానే మృతదేహాన్ని వుంచినచోటుకి పరుగెత్తాడు. ఆ ముఖంలో ఆయన నిదురపోతున్నట్టే కనిపిస్తున్న ప్రశాంతత, సౌమ్యత, హృదయంలో ఏదో భక్తిభావాన్ని కలిగించి, కన్నీళ్ళు ఆపుకోలేకపొయ్యాడు. చేతుల్లో ముఖాన్ని దాచుకుంటే చేతులు తడిసిపొయ్యాయి. రామయ్య తనచేయి పట్టి అక్కడినుండి తీసుకొనివెళ్ళాడు.

రామయ్య జరిగినదంతా వివరించాడు. ఇల్లుచేర్చి మంచు గడ్డవలె వున్న దేహాన్ని, కాళ్ళు చేతులుపట్టి గట్టిగా రుద్దుతూ వుండగా, డాక్టరు వచ్చాడు. ఇంజక్షను ఇచ్చి, బ్రాందీకూడా ఇవ్వాలి అన్నాడు. బ్రాందీ ఎక్కడదొరుకుతుంది అక్కడ, ఆవేళలో? నాటు సారాయి పోశారు. గుక్కపడిందోలేదో! అస్పష్టంగా ఎక్కడోవుంది నాడి. దేహంలో ఉష్ణం ప్రవేశించ లేదు. తెల్లవారుజామున నాలుగు గంటలకు నాడిఅందలేదు. డాక్టరువచ్చి మరణించినట్లు చెప్పాడు.

"అమ్మ ఎక్కడ?" అన్నాడు. లోపలి గదిలోకివెళ్ళారు. రామయ్యభార్య, ఒక ముసలావిడ పక్కకు తప్పుకున్నారు.

"అమ్మా!" అంటూ దగ్గరకువెళ్ళి కూర్చున్నాడు ఏదో చెప్పాలనుకున్నాడు. కంఠం రుద్ధమై మాటరాలేదు.

పైటచెరగుతో కళ్ళు తుడుచుకొంటూ, "అమ్మా!" అన్న పిలుపుకు ప్రతిగా "ఏం తండ్రీ...ఏమున్నదని వచ్చావు? మనసులువిరచి, ఆశలేకుండాచేసి, ఇప్పుడెట్లావున్నారో అమ్మా, నాన్నా, చూద్దామని వచ్చావా?" అన్నది, ఒక్కొక్క మాటా వెక్కివెక్కిఏడుస్తూ తల్లి.

"అత్తయ్యా, నీకు దుఃఖంవల్ల మతిచెదిరినప్పుడు, నువ్వు మాట్లాడకుంటే బాగుంటుంది. కష్టంవచ్చినప్పుడు భరించుకోవాలిగాని, ఏదేదో ఊరికే అనుకోవడ మెందుకు ?" అని మందలించాడు రామయ్య.

తల్లిమాటలకు నిరుత్తరుడయ్యాడు. రామయ్య గదిలో నుండి బయటికి తీసుకువెళ్ళాడు.

"దుఃఖంలో ఏదో అంటూవుంది రాత్రినుండీ, కాస్సేపు ఒంటరిగానే వుండనియ్యి ఆమెను. మనం ముందు కార్యం చూడాలి. మీ అక్కయ్యా వాళ్ళకు టెలిగ్రాం ఇచ్చాను. బహుశా తెల్లవారుజామున వస్తారు. తెల్లవారితే ఆలస్యమేమీ వుండదు. కట్టెలు సిద్ధంచేయించాను. వేణుగోపాలస్వామి ఆలయం వెనక మా మామిడితోపులో స్థలం నిర్ణయించాను" అని చెప్పుచున్న రామయ్యను ఆపి,

"అది సరే... అమ్మ ఏమంటున్నది, ఎందుకట్లావున్నదో నాకు సరిగా చెప్పు" అని ప్రశ్నించాడు వేదమూర్తి.

"నువ్వు ముందు ముఖంకడుక్కుందువు గాని రా" అని లాక్కుపోయ్యాడు రామయ్య. బలవంతంగా తన యింటి నుండి వచ్చిన కాఫీ త్రాగించాడు. మళ్ళీ తండ్రిమృతదేహం దగ్గరకువెళ్ళి మౌనంగా కూర్చున్నాడు.

"అమ్మ అంటున్న దేమిటి ?" అని అడిగాడు.

"నువ్వు పెళ్ళిచేసుకోనని మూడు నెలలక్రితం అన్నావట. తర్వాత సెలవుల్లోకూడ ఇక్కడికి రాలేదు. ఆ విషయమై చింతకలిగి ఎప్పుడూ పరధ్యానంగావుంటూన్న మామయ్య, రెండు రోజుల్నుంచి భోజనమే మానేసి, వానలో

తడిసి పడిపోయి యిట్లా అయ్యాడనీ, దీనికంతా నువ్వే ఒక విధంగా కారణమనీ నీమీద కొంచెం కోపంగా వుంది. ఆ మాటే అంటూవుంటుంది ఎంత వారించినా!" అని వివరించాడు రామయ్య.

*  *  *

గోపాలస్వామికి దహనసంస్కారాలు పూర్తిచేశారు. హైమవతి, ఆమెభర్త రంగయ్య వచ్చారు. రెండుమూడు సార్లు తల్లితో మాట్లాడబోయికూడా ఆమెవిముఖత్వం గ్రహించి వేదమూర్తి ఊరుకున్నాడు. గోపాలస్వామి దహనమైనరోజున ఆమెకు జ్వరంవచ్చింది. పడకమీదనుండి లేవలేదు. హైమవతి ఆమెకు ఉపచారాలు చేస్తున్నది.

ఈశ్వరరెడ్డి వేదమూర్తిని తనయింటికి తీసుకొని వెళ్ళాడు. భూమి విక్రయంసంగతి, ఇంటిమీద మిగిలివున్న పదిహేనువందల ఋణంసంగతి వివరంగా చెప్పాడు. గోపాలస్వామి మరణానికి రెండురోజులముందే పరిష్కారమైంది ఆ వ్యవహారం తండ్రి ఆ రెండురోజులు భోజనం మానివేసి నందుకు కారణం తెలిసింది.

"బ్రతికినన్నాళ్ళు భూమినే ఆశ్రయించే రైతుకు, తరతరాలుగా తనకు చెందిన పొలాన్ని అమ్ముకోవడం ఎంతటి బాధ కలిగిస్తుందో ఆలోచించు. మీ నాన్నగారి ఆవేదన నాకు తెలుసు; అందుకే నేనొకమాటయిచ్చాను. ఎప్పుడైనా సరే మీకు కావాలంటే మీ పొలం మీకు తిరిగి విక్రయిస్తా నన్నాను. ఆయనకోరికమీద స్నేహధర్మంవల్ల నేను కాదన లేకపోయాను. నే నామాట అన్నందువల్లనే వ్యవహారం

తేల్చుకోగలిగాడు కూడా. ఆయనసంసారం యీవిధం కావడం నాకు విచారంగా వుంది. మీ నాన్నగారి ఆత్మకు శాంతికలగాలంటే నువ్వు వివాహవిషయంలో ఆయన సూచించిన మార్గాన వెళ్ళి పొలాన్ని నిలబెట్టుకోవాలి. నాకూ తృప్తిగా వుంటుంది!" అన్నాడు ఈశ్వరరెడ్డి.

"మీ అభిమానానికి మా కుటుంబం ఎంతో ఋణపడి ఉంది. కాని పొలం మళ్ళీ కొని నేను ఏం చేసుకోను ? నాకీ విషయాలేమీ తెలీవు. నా జీవితమార్గం, బ్రదుకుసంగతి వేరు కదా" అన్నాడు వేదమూర్తి.

"సరే, నీ యిష్టం. జరిగిన వ్యవహారం నీతో చెప్పడం ధర్మమని తోచింది" అన్నాడు రెడ్డి.

ఒక నెలరోజులతర్వాత వచ్చి తల్లిని తనతో తీసుకొని వెళ్ళితే బాగుంటుందని నిశ్చయించాడు వేదమూర్తి. అంతవరకు హైమవతిని తల్లిదగ్గరే వుండమని కోరాడు. ఈ విషయం కూతురుద్వారా విని, తను బసవన్నకొండ విడిచి ఎక్కడికీ వెళ్ళనన్నది తల్లి.

వేదమూర్తి తల్లిదగ్గరకు వెళ్ళాడు. "అమ్మా నాకు ఇబ్బందిగా వుంది. నేనక్కడ ఇల్లుచూచి ఒక నెలతర్వాత నిన్ను తీసుకువెళ్తాను" అన్నాడు.

"నేనెక్కడికీ రాలేను. వచ్చి నీయిల్లు చక్కదిద్దేకాలం పోయింది. ఉండనిస్తే ఈ యింట్లో వుండనియ్యి; లేకపోతే ఆ వేణుకృష్ణునిగుళ్ళో ఎప్పుడువస్తుందో పిలుపు అని కాచుకొని వుంటాను. నువ్వు అప్పుడు చెప్పినట్లే పొలమూ, ఇల్లూ అమ్మి ఋణంతీర్చు. చేసినఋణం తీర్చలేదు ఫలానావాళ్ళు అన్న అప

వాదూ, కోర్టులకు తిరగడం వద్దు. నేను కోరేది ఇంతే. నువ్వన్న ప్రకారమే అంతా జరిగిపోతూవుంది. ఇంక మనస్సుకు కష్ట మేమీలేకుండా బ్రతుకు. భగవంతుణ్ణి నేను ప్రార్థించేది నువ్వు సుఖంగా వుండాలనే. మా బ్రదుకులు ముగిశాయి. వెళ్ళు నాయినా!" అన్నది.

ఆమె నిష్ఠురవాక్యాలకు మనస్సు బాధపడినా, చెయ్యాలో తెలీలేదు. ఇంత కఠినంగా, తన్ను దోషి అని నిర్ణయించినందుకు వేదమూర్తికి ఆశ్చర్యంగా వుంది. పొలం విక్రయమైపోయి ఋణంతీరినసంగతి ఆమెకు తెలీకపోవటం, తండ్రి ఆమెతో ఆ సంగతి చెప్పకపోవటం కూడా వింతగా వుంది. చిన్నప్పటినుండి వాళ్ళతో వుండి, వాళ్ళప్రేమమీదే ఆధారపడినప్పటికీ వాళ్ళస్వభావాలనిగురించి తనకేమీ తెలీదు. అత్యంత సన్నిహితులైనవాళ్ళమన స్తత్వమే అంతుపట్టకుండా వుంది; పరాయివాళ్ళనుగురించి సులభంగానే తెలుసుకోవచ్చు నేమో! ఆత్మజ్ఞాన మెంత కష్టసాధ్యమో, అట్లే జీవితానికి ఆదినుంచీ ఆధారభూతంగావున్నవారినిగురించిన జ్ఞానం కూడ కష్టసాధ్యం. ముఖ్యంగా వాళ్ళనుండి ప్రేమ, ఆదరణ తప్ప ఇంకేమీ ఎరగనిమనస్సు, వాళ్ళలో కూడా అందరిలోవలె మిగతా గుణదోషాలెన్నో వుంటాయని సులభంగా గ్రహించ లేదు. అప్పుడప్పుడు కఠినంగా, కోపంగా వుంటూవుండే తల్లి దండ్రులనుగురించి తెలిసినంతగా, ప్రేమతప్ప ఇంకేమీచూపని తల్లిదండ్రులను గురించి తెలియడానికి అవకాశం లేదు. తన కోరికలకు వ్యతిరేకంగాను, కఠినంగాను తల్లిదండ్రులు ప్రవర్తించ టం వేదమూర్తిజీవితంలో యిదే మొదటిసారి.

రామయ్యతో తల్లి విషయం ప్రస్తావించాడు. "అత్తయ్య మా యింట్లో వుంటుంది. దుఃఖం కొంత వుపశమించితే మనసు మారుతుంది. అప్పుడు నువ్వు వచ్చి తీసుకుపోవచ్చు. ఇప్పుడేం తొందర?" అన్నాడు రామయ్య.

హైమవతి తనతో రమ్మని కోరింది తల్లిని. ఆమె అంగీకరించలేదు. మేనల్లుడిదగ్గర ఉండడానికే సమ్మతించింది.

# 9

"ఆ అమ్మాయిని నేనే స్వయంగా పిలిచి చెప్పానండి. ఆంధ్రభాషాపరిషత్తుపట్ల విద్యార్థుల్లో శ్రద్ధ కల్పించడానికి అంతమాత్రం బాధ్యత తీసుకోవాలి అనుకొన్నాను. లేకపోతే 'నాకేంకర్మ? చేస్తున్నది తిక్కనజయంతి. పెద్దవారొస్తున్నారు. సభాప్రారంభంలో చక్కనివద్యాలో కీర్తనలో మనోహరంగా పాడితే రసోత్పాదకంగా వుంటుందనుకొన్నాను. పాడనంటే పాడనని మొహమోటంలేకుండా చెప్పింది. మరి నేను ఎర్రగా బుర్రగా లేనుకదండీ" అని తెలుగు ప్రధానోపన్యాసకుడు శేషయ్యశాస్త్రి సానుభూతితో వింటూన్న వెంకట్రావు, సుబ్బరామయ్యలతో అన్నాడు.

శేషయ్యశాస్త్రి నలభైఅయిదేళ్ళ వయస్సువాడు, నల్లగా వుంటాడు. వెంకట్రావుకు యాభైమూడు వయస్సు. దబ్బపండుచాయ, మెల్లకన్ను. చాల సౌమ్యుడని విద్యార్థుల్లో ప్రతీతి.

సుబ్బరామయ్య తర్కశాస్త్రం బోధిస్తాడు. ముప్పై అయిదు ముప్పైఆరు సంవత్సరాలుంటాయి. ఇప్పుడిప్పుడే కళ్ళా

శాల లెక్చరర్లలో పెద్దవాళ్ళవర్గంలో చేరుతున్నాడు. తెలివిగా, ఛలోక్తులతో మాట్లాడుతాడని, పొట్టిగా, సన్నగా వుంటాడని విద్యార్థులు "జోకర్" అని కొంటెగా పిలుస్తారు. హాస్య ధోరణిలో తనకున్న పేరు నిలబెట్టుకోవాలని, ఇంగ్లీషు వార, మాసపత్రికలలోని వాక్యాలను, చిన్నకథలను సంగ్రహించి జాగ్రత్తపెట్టి, పాఠంలో ఏదో ఒకవిధంగా జొప్పిస్తూ, క్లాసును గొల్లుమనిపిస్తూ వుంటాడు సుబ్బరామయ్య.

విమల పాడనని నిరాకరించినవిషయం శేషయ్యశాస్త్రి చెప్పగా, అతనికి కలిగిన భంగపాటుకు మరికొంత వ్యాఖ్యానంగా సుబ్బరామయ్య యిలా అన్నాడు.

"ఈసారి మళ్ళీ ఆమె సంగీతం నాటకప్రదర్శనసందర్భంలో వుంటుందట. పోనీ అప్పుడు వినవచ్చు. రిహార్సల్ చాల శ్రద్ధగా జరుగుతూందట—అంటే పాటల రిహార్సల్!"

"ఈ విషయం తెలుసుకునే మా కార్యదర్శి జనార్దనం వెళ్ళి ఆమెను పాడమని కోరాడు. వాడితో పాడనన్నదట. నాతో చెప్పి, నన్నడగమని ప్రాణంతీశాడు. "పోన్లేవోయ్, నీస్నేహితుడెవరైనా పాడేవాడుంటే పాడించమన్నాను. చెప్పితే వింటేనా! నేను కూడా ప్రయత్నించినందుకు ఫలితం బాగానే వచ్చింది. అయినా కాలేజీ ఆడపిల్లలతో ఎవరుమాట్లాడగలరు? ఎవరు ఒప్పించగలరు? మాటపోవడం తప్పితే." అన్నాడు శేషయ్య.

"చెప్పేవాళ్ళు చెప్పితే వింటారులెండి. దానిలో కీలకమేమిటంటే—సైన్సువాళ్ళకి విద్యార్థులతో మనకన్న సాన్నిహిత్యం, సంబంధం ఎక్కువ. ఎంతసేపూ క్లాసులో ఉపన్యాసం

చెప్పటంతోనే పూర్తవుతుంది మనకున్న సంబంధం. ప్రాక్టి కల్సు, రికార్డులూ వీటిగొడవ మనకు లేదుగా! ఆ సైన్సువాళ్ళకి కొంత వ్యక్తిగతపరిచయం వుంటుం దిఒక్కొక్క విద్యార్థితో." అని వెంకట్రావు వివరించాడు.

"అంతే కాదు లెండి! ఈ ఆడపిల్లలున్నారు చూశారూ! బ్రహ్మచారులమూ ఐతే చవ్వున వింటారు. మనలాంటివాళ్లల్లో ఏముంది ?" అని శేషయ్య నిస్పృహా వెలిబుచ్చాడు.

"అదేమిటండీ అట్లా అంటారు ? అనుభవంవల్లకలిగే రసికత్వం అనుభవంలేనివాళ్ళ కెట్లావస్తుంది? " అని నవ్వాడు సుబ్బరామయ్య.

సుందరరావు వచ్చాడు. టేబుల్ మీద ఉన్న ఒక వార్తాపత్రిక తీసుకొని, కుర్చీలో కూర్చోబోతూ

"ఏమిటండీ సుబ్బరామయ్యాగారూ! సరదాగా నవ్వుతున్నారే! ఇవ్వాళ ప్రొద్దునపూటంతా తీరికేనా మీకు ?"

"ఆ, కాని మధ్యాహ్నం రెండుగంటలూ చావాలి బాబు. ఏమండీ సుందరరావుగారు! విద్యావిధానంలో ప్రయోగాత్మకమైన బోధన చాల అవసరం. అనుభవంలో నేర్చుకునే విషయానికున్నవిలువ ఊరికేచదివి, విని, ఊహించే విషయానికి లేదు కదా అని ఆలోచిస్తున్నాము మేము, చూడండి, తెలుగు, చరిత్ర, మిగతా ఆర్ట్సు విషయాలకుకూడా ప్రయోగరూపమైన బోధన లేకపోవడం దురదృష్టం కదా! వుండడానికి ఏమైనా అవకాశముందా ? అని ప్రశ్న. మీ అభిప్రాయం ఏమిటి ?"

"ఇప్పుడున్న వ్యాసరచన, పరీక్షలు మాత్రం ఆ విషయాలకు సంబంధించినంతవరకు ప్రయోగాత్మకబోధన కాదే

మిటి? బహుశా కావ్యరచన, పద్యరచనగా దాన్నింకా విస్తరించవచ్చునేమో!"

"అబ్బే, అది లాభంలేదండి! ప్రయోగరూపమైన బోధన అంటే చూడటం, తాకటం, పట్టుకోవటం, రుచి చూడటం, కొలవటం వంటివివుండాలి. మీ సైన్సువిషయాల్లో వున్నాయి. కదండీ. నన్నడిగితే గాంధీగారి బేసిక్ విధానంలోని అభిప్రాయం కూడా ఇదే అంటాను."

శేషయ్యశాస్త్రి నవ్వాడు. "ఎప్పుడూ తెలివిగా మాట్లాడాలనే ప్రయత్నం యింక చాలించవోయ్!" అంటూ వెంకట్రావు లేచి వెళ్ళాడు.

"అటువంటి బోధనకు ఆర్ట్సువిషయాల్లో కావలసిన సామగ్రి ఎట్లావుంటుందోకూడా సూచించు మరి" అన్నాడు శేషయ్యశాస్త్రి.

"ఇప్పుడు ఒక మంచి కావ్యాన్ని మీరు పాఠం చెప్పాలనుకోండి. చక్కని ఉద్యానవనం, కోయిలలూ అవీ కావాలి. చరిత్రవిషయమైతే, చారిత్రక నాటకాలే కొన్ని వెయ్యాల్సివస్తుందనుకుంటా. కానీ యివన్నీ ఏర్పాటుచెయ్యడానికి కొంత ఇబ్బంది వుంటుంది. ఖర్చు. అందుకే కాబోలు ఆడియోవిజువల్ ఎడ్యుకేషన్ అంటూ సినిమాలరూపంలో ఒకమార్గం చూపిస్తున్నారు. దాన్నే ఆడియో—విజువల్ —టాక్చ్యుల్ (tactual) — క్లుప్తంగా A. V. T. బోధనా విధానంగా మార్చాలి, అంతే! స్పర్శకూడా కలవాలి మిగతా రెండింటితో. ఇదేం అసాధ్యమైన విషయం కాదండోయ్! ఇప్పుడు 'టాకీ' ఎల్లా వచ్చిందో రేపు "ఫీలీ"కూడా అట్లానే

వస్తుందని ఆల్డస్ హక్స్‌లీ ఒక నవలలో అంటాడు. మనం సుందరరావుగారిని అడిగితే తెలుస్తుంది! ఏమండీ, రావుగారూ! మాడరన్ ఫిజిక్స్‌లో 'మూవీ' నుండి 'టాకీ', దానినుండి 'ఫీలీ'కి కూడ త్వరలో వెళ్ళేఆశ ఏమైనా వుందంటారా?"

సుందరరావు వార్తాపత్రిక చదువుకుంటున్నవాడు, తలెత్తి చూచి "పాపం! మీ ఆశ నిరాశే!" అన్నాడు.

గంటకొట్టారు. "ఇప్పుడు క్లాసు వుందయ్యా; మరిచే పొయ్యాను" అని అంటూ శేషయ్యశాస్త్రి వెళ్ళిపొయ్యాడు.

పదినిముషాల తర్వాత సుందరరావు వెళ్ళడానికి లేచాడు. అతన్ని చూచి సుబ్బరామయ్య కూడ లేచి "నాటక మెప్పుడండీ రావుగారూ?" అని ప్రశ్నించాడు.

"ఈ శుక్రవారం అనుకొన్నాము మొదట. కాని ప్రిన్సిపల్‌గారు ఊళ్ళో వుండరట. యూనివర్సిటీ సెనేట్ సమావేశానికి వెళ్తున్నారు. అందువల్ల పై శుక్రవారం పెట్టుకొమ్మని చెప్పారు."

"అయితే మరిరెండు రిహార్సల్స్‌కు టైము వుంటుంది. సంగీతంవిషయం ఏం చేశారు? ఆ అమ్మాయి పాటలు కూడా రిహార్స్ చేస్తూవుందా? మంచి పాటలు ఎన్నుకోండి. గత సంవత్సరం చాల బాగుంది ఆ ప్రోగ్రాం."

"అట్లాగే"

"ఆ అమ్మాయి సైన్సు స్టూడెంటటకదూ?"

"అవును."

"ఏంలేదులెండి. ఆంధ్రభాషాపరిషత్తువారి కవిజయంతికి ప్రార్థన పాడనన్నదట. ఇందాక శేషయ్య ఏడుస్తున్నాడు.

చక్కగా పాడేవాళ్ళు వాయిద్యాలూ అవీ కుదరంది ఊరికే ఎట్లా పాడతారు? ఈయన అసలు అడగటంలో అర్ధంలేదు. ప్రోగ్రాం శ్రవణానందంగా, కనీసం ఒక గంటైనా వుండా లండోయ్, రావుగారూ!" అన్నాడు సుబ్బరామయ్య. "సరే" అంటూ వెళ్ళిపొయ్యాడు సుందరరావు.

* * *

గురువారంనాడు పార్వతితో కలిసి సుందరరావు ఇంటికి వెళ్ళడానికి హాస్టలుకు వెళ్ళింది విమల. పార్వతి అస్వస్థతగా వుందని పడుకొనివుంది. తను రాలేనన్నది.

ఇంటికి తిరిగి వెళ్ళిపోదామనుకొన్నది విమల. కాని సుందరరావు తమకోసమే కాచుకొనివుంటాడన్నవిషయం గుర్తు చేసి, విమలను వెళ్ళి చెప్పమన్నది పార్వతి. ఆయనఇల్లుకూడ హాస్టలుకు దగ్గరగానే వుంది.

గతసంవత్సరం రెండుసార్లు, ఈ ఏడాది రెండుసార్లు ఆయనఇంటికి వెళ్ళింది. పార్వతి ఎప్పుడూ తనవెంట వుండేది. పార్వతిసమక్షంలో తన సంగీతాన్ని గురించి ఆయన విమర్శన చేస్తూ సూచనలుచేసినా, లేక బాగుందని పొగడినా తనకు కష్టంగానే వుంటుంది. ఒక్కర్తెవున్నప్పుడు తనవిషయమై ఏమి చెప్పినా వినవచ్చు. కాని అందుకోసం వెళ్ళి కూర్చోవడం ఏం బాగుంటుంది? అసలు వెళ్ళడం బాగుంటుందా? అనే ప్రశ్న వస్తూవుంది.

ఒంటరిగా వెళ్ళాలని అనుకోగానే ఈ ఉద్వేగమేమిటి?

రమణితో ఆయనవివాహం స్థిరపడినట్లే. అధ్యాపకుడు, మిత్రుడు, సహృదయుడు అయినందువల్ల తనకు కొంత అభి

మౌనంవుండటం సహజం, న్యాయం. రమణికన్న ఎక్కువ అర్హతకలిగినవ్యక్తి ఆయనభార్య కావాలన్న అభిప్రాయం తనకు కలగడంలో కూడ దోషమేమీలేదు.

ఈవిషయం తనకు బాగా తెలిసినప్పుడు, అక్కడికివెళ్ళి "పార్వతి ఇవాళ రాలేకపోయిం"దని చెప్పిరావడానికి సందేహం, ఉద్వేగం ఎందుకు ?

వెళ్ళకుండా మౌనంగాకూర్చున్నవిమలనుచూచి పార్వతి అన్నది ;

"ఏమిటే పెద్ద ఆలోచనలోపడినట్లున్నావు ? నాకు అస్వస్థతగావుందని ఆయనతో చెప్పిరావటానికి అయిదునిమిషాలు పట్టదు. ఇంతలో నిన్నేమీ ముద్దుపెట్టుకొని పెళ్ళి చేసుకోడులే !"

"ఛీ ఛీ, నీకుసిగ్గులేదేమిటే! నీ నోటికడ్డంలేదు. నేనేమీ వెళ్ళటంలేదు పో" అన్నది విమల కోపంగా.

"లేదులే, వెళ్ళవే బంగారుతల్లి ! నాబుద్ధి గడ్డితిన్నదిలే. నువ్వెళ్ళి చెప్పటం నీ కర్తవ్యం. అదే మర్యాద, వెళ్ళిరా !" అన్నది పార్వతి.

"సరే, ఇప్పుడే వచ్చేస్తా"నంటూ మేడ దిగింది విమల.

క్రిందహాల్లో రమణి,మరికొందరు కేరమ్సుఆడుతున్నారు

"పోనీ రమణిని తీసుకొనివెళ్తే !" అని అనుకుంటూనే గేటుదాకా వెళ్ళిపోయింది. నేను మరీ తమాషాగా, Silly గా ప్రవర్తిస్తున్నానే ! ఇదేదో పెద్ద సమస్య అయినట్లు సందేహాం ఏమిటి అనుకొని తొందరగా నడిచింది సుందరరావుఇంటివైపు.

సుందరరావు ఏదో పుస్తకంచదువుతూ, వాళ్ళకోసం నిరీక్షిస్తున్నట్లే ఉన్నాడు. విమల వెళ్ళగానే "కూర్చో విమలా, పార్వతి ఏదీ?" అన్నాడు.

విమల కూర్చోలేదు. "పార్వతికి తలనొప్పి వొచ్చింది. జ్వరంకూడా వున్నట్లుంది. మీరు మాకోసం చూస్తూంటారని చెప్పిపోవడానికి వచ్చాను."

"అట్లాగా! ఇవాళ రిహార్స్ చేయకపోయినా ఫరవా లేదు. మన ప్రోగ్రాం మళ్ళీ వాయిదాపడింది....నిలబడే వున్నావే, అట్లా కూర్చో" అన్నాడు.

ఆయన నేదో చెప్పబోయి పూర్తిచెయ్యలేదు. విమలకు కూర్చోక తప్పిందికాదు.

"మంగయ్యా, టీ తీసుకొనిరా" అని కేకవేసి, సుందర రావు, "ప్రిన్సిపల్ గారు ఊళ్ళో ఉండరు. అందువల్ల వచ్చే శుక్రవారానికి ఏర్పాటు చెయ్యమని ఆయన చెప్పారు" అన్నాడు.

ఆయన టీ తెమ్మని చెప్పినతర్వాత తను వెళ్ళిపోవడం బాగుండదనిపించింది విమలకు. ఇద్దరూ కొన్నిక్షణాలు మౌనంగా వున్నారు.

విమల టేబిల్ మీదవున్న సాహిత్యపత్రిక తీసి పుటలు తిరగవేస్తూవుంది.

"మీరిద్దరు వస్తారనే నేనింకా టీ తీసుకోలేదు" అన్నాడు.

...త్తరంగా ఆయనవైపుచూచి, మళ్ళీ పత్రిక చూస్తూవుంది.

ఈ నెల సంచికలో పంచికథలు రెండు పడ్డాయి. నువ్వు చదవలేదా?" అన్నాడు.

"లేదండి"

"నువ్వుకూడా కథలు వ్రాస్తూవుంటావు కదూ! మాగజైన్‌లో నువ్వు వ్రాసింది చాల బాగుంది."

విమల సుందరరావువైపు చూస్తూ "నాతో ఆ మాట అప్పుడే ఒకసారి చెప్పారు; నేను మరచిపోలేదు!" అన్నది చిరునవ్వుతో.

"నీ కథ, నీ పాట రెండూ నాకు బాగా నచ్చాయి!"

విమల కన్నుల్లో ఒక్కక్షణం ఆనందోద్వేగం తళుక్కున మెఱసింది. క్రిందికి చూస్తూ "అట్లా అంటే చాలదు; అందులో ఏమిటి నచ్చిందో కూడా చెప్పండి. అప్పుడు మీరు ఊరికే అంటున్నారో, నిజంగానో తెలుస్తుంది." అన్నది.

"చెప్పుతాను. ఆ కథలో సరోజినిపాత్ర చాల యథార్థంగా, నాకు తెలిసిన ఒకవ్యక్తికి ప్రతిబింబంగా వుంది. దురదృష్టంవల్ల, సాంఘికదురన్యాయంవల్ల జీవితం కోరికలకు, ఆశయాలకు అనుగుణమైన మార్గంలో వెళ్ళక అపసవ్యమైనప్పుడు, వ్యక్తిహృదయంలోని వేదనాభారాన్ని మధురప్రకృతి, వీణవలె పలికించే విషాద రాగచ్ఛాయల్ని, ఆ సరోజిని పాత్రలో చక్కగా చిత్రించావు. ఆ విషాదమూ, పరిస్థితుల నిర్దయా లేకపోతే ఆ వ్యక్తిత్వానికి స్వరూపం, సార్థకత వుండ వేమో! నే నెరిగిన యువతి ఆ రేళ్ళక్రితం మరణించినది. ఆమె, ఆమెభర్త నాకు ఆత్మీయులు."

విమల ఆసక్తితో వింటున్నది. ఆమెకు సుందరరావును గురించిన యీ క్రొత్తవిషయం ఇంకా తెలుసుకోవాలనిపించింది.

"దురదృష్టం, విషాదమే వ్యక్తిత్వానికి వన్నె తెస్తాయి అంటున్నారే, ఆ భావం నిర్దాక్షిణ్యంగా లేదూ? ఎవరైనా కోరికలుతీరాలి, సంతోషంగా తృప్తిగా వుండాలనే అనుకుంటారు. నా కథలో సరోజినిని చూచి అయ్యో పాపం, అంటారనుకున్నాను, సంఘాన్ని విమర్శిస్తారనుకొన్నాను. కాని మీరు ఆమె విషాదమే బాగుందంటారనుకోలేదే!" అన్నది విమల.

"సంతోషం, తృప్తికన్న ఆత్మజ్ఞానము ఎంతో సాధించదగిన వస్తువు. అతి ప్రియమైనది. దాన్ని కొందరు జీవితంలోని అపసవ్యత, విషాదంద్వారానే పొందగలరు. వాళ్ళవిషయంలో విషాదం శోభ తెస్తుంది. అంతేకాదు, మనకోరికలు ఎంత గాఢమైనవో, మనలో ఎంతటిచేవ వుందో కూడ పరిస్థితులప్రాతికూల్యం నిరూపిస్తుంది. ఊహామాత్రమైనవి, యాదృచ్ఛికంగా కలిగిన అభిప్రాయాలు ఆశయాలు కావని తెలుస్తుంది.

"మీ రిట్లా హృదయంలేని వేదాంతదృక్పథంనుంచి నాకథను బాగుందంటారనుకోలేదు. మనిషి వాంఛించే ప్రతి విషయంలోనూ నిరాశకలగటం మంచిదంటారు కదూ మీరు?"

"అట్లాకాదు. నేనుచెప్పిన వాంఛలు వ్యక్తిగతమైన అనుబంధాలకు సంబంధించినవి. జీవితావసరాలకు సంబంధించిన, ఆర్థికమైనకోరికలను గురించి నేను మాట్లాడటం లేదు. వాటి విషయంలో సాధ్యమైనంత తృప్తి అవసరమనే గుర్తిస్తాను. తిండీ, గుడ్డలఅవసరం తీరితేనే మానవత్వానికి అర్థంవుంటుంది. నే నిందాక అన్న విషాదం, జీవితావసరాలను అధిగమించి

మానవహృదయం చేసే అన్వేషణ, ఏర్పరచుకునే అనుబంధా లను గురించే."

"అది కూడా నేను ఒప్పుకోను. విషాదాన్ని ఎవరు కావా లంటారు ? జీవితం సవ్యంగావుండాలనే కోరుతారు. పోనీలెండి, నా సంగీతాన్ని గురించి కూడా ఇటువంటిదే ఏదైనా వేదాంతం వుందా ?" అన్నది విమల.

సుందరరావు మెల్లగానవ్వాడు. "నీకథలో ఒక వ్యక్తినీ, నీ పాటలో ఒక స్మృతినీ ప్రేమిస్తాను. ఆ స్మృతిచ్ఛాయలో దాగివున్న ఆవేశాన్ని ఆకళించుకొనే ప్రయత్నంచేస్తాను."

విమల కొంత ఆలోచించి అన్నది: "మీకు రెండూ నచ్చినందుకు సంతోషమే కాని, నిజం చెప్పాలంటే మీరు స్వార్థపరులు! మీ పూర్వానుభవాల్ని మాత్రం జ్ఞాపకానికి తెస్తాను నేను, అంతేనా ?"

ఈ ప్రశ్నతీరు తనని నిలదీసి అడిగినట్లుంటే, సుందర రావు నిరుత్తరుడయ్యాడు. మంగయ్య టీ తీసుకొచ్చాడు, వళ్ళు బిస్కట్లతో సహా.

మంగయ్యప్రవేశంవల్ల కలిగిన అభ్యంతరసమయంలో తనప్రశ్న ఎంత సూటిగా వుందో విమలకూడ గ్రహించింది. అది తమ యిద్దరిమధ్య ఏర్పడిన స్నేహాన్ని గురించిన నిశితమైన ప్రశ్న. ఇంతేకాదు, సుందరరావు కేదో గాఢమైన పూర్వాను భవం వుందనీ, తనఆకర్షణ ఆ స్మృతినే ఆధారంచేసుకొన్నదనీ తెలుసుకొన్నదికూడా. తానింతగా యీ ప్రసంగలోదిగినందుకు ఆశ్చర్యపడుతూవున్న విమలకు తొందరగా వెళ్తే బాగుంటుం దేమో, పార్వతి ఎదురుచూస్తూవుంటుందే అనిపించింది.

విమల అన్న మాటలనుగురించే, టీ త్రాగుతూ ఆలో చిస్తున్నాడు సుందరరావు.

తనప్రవర్తన నిజంగానే స్వార్థపరమైనదా? తనప్రవర్తన వల్ల యీమెకు కలిగిన నష్టమేమిటి? సుందరరావుకు సుబ్బ రామయ్యవాళ్ళప్రసంగం, రీడింగ్‌రూములో అంతకుముందు రోజే తను విన్నమాటలు, వాటి సంపూర్ణార్థం గుర్తువచ్చింది.

టీ తాగటం పూర్తిఅయింది. విమల వెళ్దామా లేక ఇంకా సుందరరావు ఏమి చెప్పతాడో విందామా? అనే సందిగ్ధంలోనే వుంది.

"ఆంధ్రభాషాపరిషత్తువాళ్ళు నిన్ను కవిజయంతిలో పాడమన్నారట, నీవు నిరాకరించావట, నిజమేనా?" అన్నాడు సుందరరావు.

"అవును, తెలుగులెక్చ్చరరుగారు పిలిపించి చాలసేపు వేధించారు. కాని సభల్లో పాడటం అసలు బాగుండదు. నేనల్లా అంటే మీకు కోపంగాని, నాకిష్టముండదు. మరీ ఒక సమావేశంలో ఉపన్యాసానికిముందు సభలో నిశ్శబ్దం కుదురు కోకపూర్వం నేను పాడేదేమిటి, వాళ్ళు వినేదేమిటి?"

"విమలా నువ్వెందాక అన్నట్టు, నీ సంగీతంవిషయంలో నేను స్వార్థంతోనే ప్రవర్తించాను." అన్నాడు సుందరరావు.

తను అప్రయత్నంగా ఆయనస్వార్థాన్నిగురించి అన్న మాట ఆయనకు కొంచెం బాధకలిగించినట్లుందే. విషయం తప్పించాలని విమల అన్నది: "నేను వాళ్ళతో పాడనని చెప్పానని మీతో ఎవరన్నారు? ఆ సంఘం కార్యదర్శి జనార్దనంకూడ నామీద చాల కోపంగా వున్నాడు."

"అతనేకాదు. తెలుగులెక్చరరే బాధపడినట్టున్నాడు. ఆ విషయం నాతో ఆయన చెప్పలేదు; చెప్పడుకూడా. తర్కశాస్త్రోపన్యాసకుడు సుబ్బరామయ్య చెప్పాడు."

"ఆయనకు మా క్లాసుతో సంబంధమేలేదే!"

"లేకపోతే యేం? కాలేజీలో వుంది కదా,...విమలా, నువ్వు నాకోసమై పాడనక్కరలేదు. నీ కిష్టంలేకపోతే ఇప్పుడైనా ప్రోగ్రాం తీసివెయ్యవచ్చు."

సుందరరావు యిల్లా అనటం విమలకు ఆశ్చర్యంగావుంది.

"అదికాదండీ! యీ విషయంలో నా కిష్టాయిష్టాలు లేవు. మీ యిష్టమే నాయిష్టం. మీరు ఏంచెప్పితే అది చేస్తాను. ఎవరికేమి కోపం వచ్చినా, ఏమనుకొన్నా నాకేమీ భయంలేదు."

ఆమె అన్నమాటలు, సంపూర్ణ బాధ్యతని తనకు అప్పగిస్తూ చెప్పినవి మాత్రం కావు. ఎవరికీ ఇవ్వని ప్రత్యేకమైన విలువను తనకిచ్చినట్లు, తనతో స్నేహానుబంధాన్ని నొక్కి చెప్పినట్లు సుందరరావు గ్రహించాడు.

బాధ్యతకన్న అనుబంధం క్లిష్టమైనది. బాధ్యతవిషయంలో ఒకనిర్ణయానికి రావచ్చు, కాని అనుబంధాన్ని గురించి నిర్ణయానికిరావడం సులువు కాదు.

"నాటకసంఘంఅధ్యక్షుడుగా ఉన్నందుకు ప్రోగ్రాం ఉంచటమే నా బాధ్యత. అందువల్ల తయారైన ప్రోగ్రాం మార్చాలని చెప్పను."

సుందరరావుమాటలు విమలకు ఆశ్చర్యాన్ని కలిగించాయి. అత నేదో తప్పించుకోవాలని ప్రయత్నిస్తున్నట్లు

ఆమెకు తోచింది. ఇట్లా అంటారని తను ఎప్పుడూ వూహించనే లేదు.

"నాకూ నాటకసంఘానికి సంబంధంలేదు. అది ఎట్లా పోతే నాకేం? మీరు పాడమంటే పాడుతాను, అంతే." అన్నది.

"నీ కిష్టంలేనివిషయంలో నే నెందుకు బలవంతం చెయ్యాలి ?"

"ఎందుకు చెయ్యకూడదు ?" విమల ఆవేశంతో రెట్టించింది

"ఇతరులను బలవంతపెట్టటం మంచిదికాదు."

"మీరు నన్ను బలవంతపెట్టటం నాకిష్టమే, కాబట్టి తప్పేమీ లేదు."

సుందరరావుకు యీ సంభాషణలో తనే ఓడిపోతున్నట్లనిపించింది. ఒకక్షణం మౌనంగా వుండి "సరే, ప్రోగ్రాం మాని వేయనక్కరలేదు" అన్నాడు చిరునవ్వుతో.

"మీ యిష్టం!" అన్నది విమల.

ఏం జరిగిందో, ఆమెకు అర్థంకాలేదు, కాని ఏదో జరిగినట్లేవుంది. సుందరరావునుగురించిన తన భావనలో కూడ ఏదో మార్పువచ్చినట్లుంది. కొన్ని క్షణాలు మౌనంగా వున్నారు. తర్వాత "చాలసేపయింది, నేను వెళ్ళొస్తాను" అన్నది విమల.

"మంగయ్యా, ఈఅమ్మాయిని వీళ్ళయింటిదాకా తోడు వెళ్ళి దిగబెట్టిరా" అన్నాడు సుందరరావు, మంగయ్యనుపిలిచి.

"హాస్టలుకు వెళ్ళి పార్వతిని చూచివెళ్తాను. వద్దులెండి" అన్నది.

"పోనీ హాస్టలుదాకే వస్తాడు,"

విమల సుందరరావుయిల్లు దాటగానే, ఎదుటివరుసలో వున్న ఒక మేడదిగుతూ, ఆమెసహాధ్యాయి రాఘవులు కనిపించాడు.

రాఘవులు యీమధ్య చాలసార్లు తన్ను వెంబడించి రావడమూ, తరగతిలో తనపరిసరాల్లో కూర్చోవటమూ, లేబొరేటరీలో తనపక్కగా వెళ్ళటమూ గమనిస్తూనే వుంది. "ఏ డిక్కడా తయారయ్యాడే!" అనుకొని గబగబ నడచి హాస్టలుచేరింది.

# 10

"అనాలోచితమైన నీ మొండిపట్టువల్ల, నీ సంఘ సంస్కరణా వేశంవల్ల ఎటువంటి అనర్థం సంభవించిందో చూడు తమ్ముడూ! నీ మీదే ఆశలుపెట్టుకొన్న తండ్రి హృదయం ఎంతగా క్షోభించివుంటుంది. లేకపోతే యీ అకాల మరణం ప్రాప్తిస్తుందా? మీ తల్లిగారి నిష్ఠురభావం కూడా ఇందుకనే తెలుస్తోందికదా. మనం ఊహించలేనంత విపరీతంగా వుంటాయి ఫలితాలు. అది విధి మనమీద చూపే ద్వేషమే కావచ్చు! కాని ఎంతో కొంత మనబాధ్యతా వుంటుంది అందులో." వేదమూర్తి తండ్రిమరణాన్ని గురించి తల్లి అతని మీదచూపిన కోపాన్ని గురించి, లోటిలెక్చరరు రామ చంద్రయ్య వ్యాఖ్యానించాడు,

"ఎంత అసంబద్ధంగావుందో చూడండి, యీ పరి ణామం. పొలం అమ్మివేసి నాతో వచ్చి వుండమని చెప్పాను కదా! నామీద నిజంగా ఆపేక్ష, మీరు చెప్పివున్నట్లేవుంటే

నామాట ఎందుకు వినలేదంటారు? తనైనా ఆ సమస్యను పరిష్కారంచేసినమార్గం అదే కదా! నామీందకోపానికి మరి అర్థమేమిటి? వాళ్ళమాట కాదని త్రోసివేశానన్నపట్టుదల, కాఠిన్యం కాకపోతే, నామీంద వాళ్ళుచూపించిన ప్రేమయేమిటి? ఆయన మరణం నాకు జరిగిన పెద్ద అన్యాయం. దాన్ని మరింత బాధాకరంగాచేస్తున్నది మా అమ్మ. అక్కయ్యపెళ్ళికి పొలం అమ్మవచ్చుకాని, నాకోసం పొలం అమ్మకూడదు; ఏమిటీన్యాయం?" అన్నాడు వేదమూర్తి.

"ఆ పొలం మీంతల్లికి పెళ్ళిసమయంలో వాళ్ళనాన్నగారు ఇచ్చింది. అక్కడే వుంది భేదం. స్త్రీధనంగా మీంకు వచ్చిన పొలాన్ని స్త్రీధనంగా ఇవ్వటం వేరు; తరతరాలుగా వస్తున్నపొలం తెగనమ్ముకోవటం వేరు. అంతేకాదు; మీం నాన్నగారినుండి అది నీకు వచ్చినతర్వాత, ఆయన అనంతరం నువ్వేంచేస్తావనేవిషయం వేరు; ఇప్పుడే ఆ పొలాన్ని మీం నాన్నచేతులార అమ్మించడానికి నువ్వు ప్రయత్నించడం వేరు; వంశపారంపర్యంగా తనభూమిని చేతులార దున్ని పండించిన దాన్ని, మీం నాన్నగారు ఎట్లాఅమ్ముకొంటారు? అది ఆయన ఆత్మాభిమానాని కెంత దెబ్బ! దాన్నిబట్టి ఊహించు, మీం తండ్రిది ఎంత గొప్ప హృదయమో! మామూలువ్యక్తి నీ మాట వినివుండేవాడు. నీమీంద ప్రేమవున్నప్పటికీ ఆప్రేమకు బలహీనంగా లొంగిపోలేదు మీంనాన్న. తనకూ భూమికీ ఉన్న అనుబంధాన్ని అవగతం చేసుకొన్న ఆయన ఎంత గొప్పవ్యక్తి! అదంతా నీకు కాఠిన్యం, పట్టుదల అనిపిస్తుంది. నువ్వేమాత్రం ఆయన్నిగురించి ఆలోచించి అర్థంచేసుకొన్నావు నిన్ను

ఆయన అర్థంచేసుకోలేదనటానికి? మరి నీకున్నంత మన స్తత్వ పరిజ్ఞానం ఆయనకు లేదుకదా !"

"మీరు ఇదంతా చాల సెంటిమెంటల్‌గా ఊహిస్తున్నా రనుకుంటాను."

"ఒకరి సెంటిమెంట్సు, అనుభావాలు, అనుబంధాలు ఇంకొకరికి అర్థంకావడంకూడ కష్టమే. వర్డ్సువర్తు వ్రాసిన మైకేల్‌నుగురించి ఆలోచించు! ఆ వృద్ధుడైన తండ్రి వేదన వంటిదే మీ తండ్రి వేదనా అనుకో."

వేదమూర్తి మౌనంగాఉండి, తర్వాత అన్నాడు.

"పోనివ్వండి మీరన్న అనుబంధం సత్యమే అనుకున్నా ఆయన అకస్మాత్తుగా మరణించటానికి అదెట్లా కారణ మౌతుంది? వర్షంలో తడిసిపోయి, దేహంలో శైత్యంకమ్ముకొని మరణించాడు! వర్షంలేకపోతే మరణమే సంభవించి ఉండదు!"

"వర్షంవంటివి బాహ్యానికి కనుపించే కారణాలు! నువ్వు మాటవినకపోవడం కూడా భరించగలిగాడు కాని, పొలం తెగనమ్ముకోవటం ఆయన భరించలేకపొయ్యారు, అంటాను. భూమితోడిఅనుబంధం ఎంతగట్టిదో, ఎంతపవిత్ర మైందో, మన గ్రామాల్లో కొంతమంది ఇంకా ఎక్కడో మిగిలివున్న ఒకరిద్దరు పెద్దవారిని, సచ్ఛీలురైన రైతుల్ని చూస్తే తెలుస్తుంది. మద్రాసులో కాలమంతా గడిపి, ఈ వాతావరణంలోనివ్యక్తుల్ని అర్థంచేసుకోవడం కష్టంబాబూ! వాళ్ళెందుకూ పనికిరాని మోటువాళ్ళుగా కనిపిస్తారు. మరి వాళ్ళహృదయం మన కెట్లా తెలుస్తుంది? బి. ఇడి. అయిన

తర్వాత ఒక్క సంవత్సరం మా గ్రామంలో వున్నాను వ్యవసాయం చూస్తూ..." రామచంద్రయ్య ఇంకా చెప్తున్నాడు.

అతనివైపు చూడకుండానే ఆలోచిస్తూ కూర్చున్న వేదమూర్తి కిటికీదగ్గరకు వెళ్ళి ముఖంతిప్పించి బయటకు చూస్తూ నిలబడి కోటు జేబులోనుండి చేతిరుమాలు తీసుకొన్నాడు.

రామచంద్రయ్య ఆగాడు. వేదమూర్తిని గమనిస్తూ దగ్గరకు వెళ్ళి భుజంమీద చెయ్యివేశాడు. "తమ్ముడూ! నేను పాపిష్టివాడిని! ఏ విషయాన్ని గురించి వాదించాలో, ఏమి మాట్లాడాలో తెలీదు. నీ మనస్సుకు బాధకలిగించాను, క్షమించు" అన్నాడు.

వేదమూర్తి అతనివైపు తిరిగాడు. చెక్కిళ్ళు ఆర్ద్రంగా వున్నాయి.

"లేదండీ! మీరు చెప్పినమాటల్లో సత్యం వుంది. జీవితాన్ని గురించి, వ్యక్తుల్ని గురించి నాకేం తెలుసు? మా నాన్న పోవటానికి నేను ఎంతవరకు బాధ్యుణ్ణో దైవమే నిర్ణయించాలి. కాని, మా అమ్మ నాతో ఒక్కసారైనా మనసిచ్చి మాటాడలేదు." అతని చివరిమాటలు గాద్గదికంగా వున్నవి.

గంటకొట్టారు. ముఖంతుడుచుకొని, పుస్తకంతీసుకొని, భారంగా తను వెళ్ళవలసిన తరగతివైపు నడిచాడు వేదమూర్తి.

* * *

విషాదం వ్యక్తమవుతున్న లెక్చరరు ముఖకవళికను పరిశీలనగా చూస్తూ, ఉపన్యాసం వింటున్నారు విమల, లీల, క్లాసులోని చాలమంది విద్యార్థులు. కావ్యానికి ఉపోద్ఘాతంగా, ఏవో విషయాల్ని కొంత క్లిష్టమైనవే చెప్తున్నాడు. చెప్పే

భావాలు సులభంగా బోధపడకపోగా, ఆయనముఖాన్నిబట్టి ఆయనమనస్సు కూడా విషయంమీద కేంద్రీకృతం కావటం లేదని వారికి తెలిసిపోయింది. బోధించే భావాలకన్న, ఆయన లోని మార్పే వాళ్ళఊహల్ని ఆకర్షిస్తోంది. అందులోను అది మధ్యాహ్నం చివరిగంటఅవడంవల్ల అలసిపోయి పరధ్యానంగా వుండేవాళ్ళ ఆలోచనాశక్తికి వేదమూర్తిఉపన్యాసం కన్న, అతనిలో కనుపించే విషాదమే ఆసక్తి కలిగిస్తూవుంది.

ఉపోద్ఘాతం అరగంటకు మించలేదు. తర్వాత కావ్యాన్ని అంతటినీ ఒక్కసారి చదవటం ప్రారంభించాడు. కావ్యవస్తువుతో సమన్వయంకుదిరిన కంఠస్వరం విద్యార్థులను ముగ్ధుల్ని చేసి, అలసిపోయిన వాళ్ళమనస్సుల్లో శ్రోత్రఆసక్తిని ప్రవేశపించింది. చదవటం పదినిమిషాలు పట్టింది. చివరిపంక్తులు చదువుతూనే పుస్తకంమూసివేసి తటాలున వేదికదిగి, క్లాసులోనుండి వెళ్ళి పోయ్యాడు వేదమూర్తి. విద్యార్థులు ఆశ్చర్యంతో ఒకరినొకరు ప్రశ్నించుకొన్నారు. కొందరు లేచి నిలుచున్నారు. కొంత మంది వేదమూర్తి వెనుకనే అతన్ని కలుసుకోడానికి వెళ్లారు.

గది చేరుకోకముందే ముగ్గురువిద్యార్థులు వెంటవెళ్ళి దారిలో కలుసుకొని "మేము ఇంటికి వెళ్లవచ్చునా మాస్టారూ?" అని అడిగారు. ఆ ప్రశ్న హాస్యాస్పదంగా, అనవసరంగా, వెక్కిరిస్తున్నట్లు తోచింది. "వెళ్ళమనేకదా, నేను వచ్చేశాను. ఇంక పదిహేనునిముషాలే వ్యవధివుంది, వెళ్ళవచ్చు" అని గదిలో ప్రవేశించాడు.

అప్పటికే లెక్చరర్లు ఒక్కొక్కరు ఇండ్లకు వెళ్తున్నారు.

హృదయం శూన్యంగా వుంది. ఎదుటి గోడవైపు తదేకంగా చూస్తున్నాడు. ఆలోచనలేమీ రావటంలేదు, కాని చచ్చినగుఱ్ఱం, చావబోతున్న ఆబోతు, కళ్ళకుకట్టి మనస్సునాక్రమించిన జుగుప్స, దైన్యం పిచ్చివాణ్ణి చేస్తున్నవి ఆ దైన్యంతో ఏడ్పువచ్చినట్లై, విద్యార్థులముందు నిలవలేక వచ్చేశాడు.

ప్రిన్సిపాల్ గదిదగ్గరవుండే జవాను వచ్చాడు.

"మిమ్మల్ని పిలుస్తున్నారండి" అన్నాడు వేదమూర్తితో.

"నన్నా?" అంటూ లేచి ఆయనగదివైపు నడిచాడు.

అతను ప్రవేశించటం గమనించనట్టే ఏదో పనిచూచుకొంటున్న ప్రిన్సిపాల్ కొన్ని క్షణాలైనతర్వాత "మీరు క్లాసు ఇంత ముందుగా వదలివేశారు ఎందుకని?" అన్నాడు అతని వైపు చూడకుండానే.

"నా మనస్సు పాఠంమీద నిలవలేదు. మనస్సు కలతచెంది వాళ్ళను పొమ్మన్నాను."

ఆశ్చర్యంగా "ఎందుకని?" అంటూ తలెత్తి అతని ముఖంచూచాడు. చూడగానే గుర్తువచ్చినట్లుంది. "ఓ, మీ తండ్రి పోయాడుకదూ! కాని, విద్యార్థులనట్లా మధ్యలో వెళ్ళిపొమ్మని చెప్పటం సరికాదు. మీరు ఈ రోజు సెలవుపెట్టి వుండవలసింది. లేకపోతే నాతో ముందే చెప్పి, క్లాసుకి వెళ్ళకుండా వుండవలసింది. అంతేకాని ఇల్లా చేస్తే క్రమశిక్షణ పాడవుతుంది. వాళ్ళు నా గదిముందే పెద్దగా అల్లరిచేసుకుంటూ వెళ్ళారు. మిగతా క్లాసులకు ఎంతతొందర వీళ్ళవల్ల? నేను

జవాన్ను పంపి వాళ్ళ నెమ్మదిగా వెళ్ళేట్టు చేయాల్సివచ్చింది” అని గొణిగాడు.

“క్షమించండి. ఇంకెప్పుడూ అట్లా జరగనివ్వను.”

“అది చెప్పటానికే పిలిచాను; సరే, వెళ్ళండి.”

గదికి తిరిగివచ్చి కుర్చీలో వాలిపొయ్యాడు. ఈక్లాసులు విద్యార్థులూ, ప్రిన్సిపాల్, క్రమశిక్షణ—అన్నీ తనని వెక్కిరిస్తూ, శిక్షిస్తూనే వున్నాయి. నిజంగా తను దోషియే. తన మీద ఎవరైనా ఆదరం ఎందుకు చూపాలి? మళ్ళీ ఆ గుణ్ణం దృశ్యం! అరచేతులతో రెండుకళ్ళూ అదుముకుని తలవంచాడు.

ఎవరో వచ్చినచప్పుడైంది. తలెత్తి చూశాడు. ఎదుట ఒకఅమ్మాయి నిలబడివుంది. ఆఅమ్మాయి ఇందాకటిక్లాసులో అమ్మాయే! ఏదైనా కావాలి కాబోలు! విసుగ్గా ఏ మడుగుతుందో అని ఆమెవైపు చూస్తున్నాడు. ఆమె పొట్టిగా, పల్చగా, ఎర్రగా వున్నదో లేదో అన్నంత లలితంగా వుంది. కళ్ళల్లో సౌమ్యత, ఏదో మంచితనం వ్యక్తమౌతూన్నవి.

“మాస్టారూ...మీరేమనుకోకండి. మీతో మాట్లాడాలని వచ్చాను...నే నీ కుర్చీలో కూర్చోవచ్చా?” అంటూ అనుమతికోసం చూడకుండానే తడబడుతూ వేదమూర్తికెదురుగావున్న కుర్చీలో కూర్చున్నది.

“ఏం జరిగింది? ..చెప్పండి. క్లాసులో మీకంత దుఃఖం వచ్చిందే!...నాతో చెప్పండి.” అన్నది. ఆమెకంఠం వణుకుతూంది.

వేదమూర్తి నిరుత్తరుడై చూస్తున్నాడు. ఆమెమాటలకు అప్రయత్నంగా అతనికళ్ళు నీళ్ళతో నిండాయి. తలవంచి చేతి

రుమాలుతో తుడుచుకొని, చిరునవ్వుతో "నామీద యింత సానుభూతి ఎందు కమ్మాయ్ ?" అన్నాడు.

"మీరేమైనా అనుకుంటారనే ఇంతసేపు వెయిటింగ్ రూమ్‌లో కూర్చున్నాను. చివరకు మీతో మాట్లాడితీరాలనే తోచింది. అందుకని వచ్చాను." అన్నది తలవంచుకుని.

"అట్లాగా! మా నాన్న పోయ్యారు. నేనీమధ్య కాలేజికి సెలవుపెట్టింది కూడ అందుకే."

ఆమె అతనివైపు తదేకంగా చూస్తూ మౌనంగావుంది.

వేదమూర్తికి ఆమెనుగురించి ఏమైనా అడగటం భావ్యమని తోచింది. "నువ్వు హాస్టలులో వుంటున్నావా?" అన్నాడు.

"పదిహేనురోజులక్రితంవరకూ వుండేదాన్ని. ఇప్పుడు మా నాన్న నీ వూరు బదిలీచేశారు. హాస్టలులో లేను. మా మా నాన్న హాస్పటల్లో డాక్టరు; పేరు రమణమూర్తి ... మాయింటికి రండి ఒక్కసారి." అన్నది. ఆమె లేచి నిల్చుంది.

ఆమెఆహ్వానానికి ఆశ్చర్యపడి, తన కామెపేరైనా గుర్తులేనందుకు సిగ్గుపడుతూ "నీ పేరు ?" అని ప్రశ్నించాడు.

"లీల" అన్నది.

# 11

సుందరరావు యింటికివెళ్ళివచ్చిన రెండురోజులకు పోస్టులో విమల కొకవుత్తరం వచ్చింది

"ఓ హృదయాధి దేవతా! ప్రియతమా!

నీ యమరగానము, అపురూపలావణ్యాము, గత సంవత్సరమునుండి నన్నావహించి, ఎల్లప్పుడు నా మనోవీధిని నీవే

సంచరించుచుంటివి. నా దేవతామూర్తితో మాట్లాడు ధైర్యమే లేదు నాకు! నీసిగలో వసించు పువ్వులసౌరభము, నీవు ప్రక్కనుండి పోవువేళ నన్నుస్పృశించు వాయువీచిక నీకును, నాకును అవ్యక్తమైన పవిత్రప్రేమబంధమును గల్పించుచున్నవి. కాని, చంద్రకళనుబోలిన యీ దివ్యానుభవమునకు మచ్చ ఏమి? అమృతమూర్తి, నా హృదయాధిదేవత తన దేవత్వమును గోల్పోవుచుండుటేల?

నీవు సుందరరావుయింటికి పలుమారులు వెడలుచుంటి వని, యిదివర కెందరిసౌశీల్యమునో భగ్నమొనరించిన యీ మాయావియుచ్చులలో తగుల్కొంటివని, లోకము వేయునిం దలు కర్ణకఠోరములై, నాహృదయమును దల్లడిల్లజేయుచుండె. నీ వధిష్ఠించిన మత్ హృదయపీఠిక శూన్యమై జీవితమే అంధకార బంధురమయ్యెడిని. సీతావిరహార్తుడైన శ్రీరాముననూహింపుము!

సుందరరావు నిన్ను వివాహమాడుట కల్ల. వాడపర రావణబ్రహ్మ! నా ప్రేమ యనన్యము, స్వార్థరహితము. ఆ పాపినిగురించి సత్యమిప్పటికైన గ్రహించి, వెంటనే వానితో మాట్లాడుట మానివైచి, ప్రదర్శనములో పాడనని నిరాకరింపుము! ఇట్లు చేసితివేని నా జీవితము నీకు నీరాజనమిచ్చెదను. ధన్యునిజేతువని త్రికరణశుద్ధిగా నమ్ముచున్న

"విమలాదేవిచరణచారణచక్రవర్తి."

ఉత్తరం వ్రాసినవారెవరో కనుక్కోవడానికి చాలసేపు ప్రయత్నించింది విమల. (శ్రీ)రాముని ప్రసక్తి వున్నందువల్ల చివరకు రాఘవులేమో అని అనుమానించింది. వాడే తను

సుందరరావుయింటినుండి రావటం చూశాడు. తనవెంట చాల సార్లు తిరుగుతున్నాడు.

పార్వతికి చూపింది ఉత్తరాన్ని. దాన్ని చదివినతర్వాత ఒకటే నవ్వుతున్న పార్వతితో విమలకూడా నవ్వింది. అంత కంటె చెయ్యవలసింది కూడ ఏమీఉన్నట్టు తోచలేదామెకు.

నవ్వటంమాని పార్వతి గంభీరంగా ముఖంపెట్టి "ఏమే దేవతా! నీకు భక్తులున్నారని తెలియక ఇంత చెడిపోయితివి, ఇంక నీ భక్తులకు మోక్షమెట్లు? నీ వానాడు సుందరరావుతో నేమేమి చేసితివి?" అంటూ పెదవులతో 'ముద్దు' అను అర్థాన్ని సూచిస్తూ కవ్వించింది.

"ఛీ, పాడుమాటలు, చేష్టలు వద్దన్నాను కదా! ఆ చివరిమాట చూడవే, ఆ బిరుదు! చరణచారణచక్రవర్తి! వాని కామాటకు అర్థం తెలీలేదు పాపం! ఎరువుసొమ్ము బరువుచేటు!"

"అర్థంలేకేం? ఎందుకో తెలుసా? నువ్వు జయదేవుని గీతాలు ఎప్పుడూ పాడుతుంటావని, నువ్వు పద్మావతీ, తను జయదేవుడని, తెలివిగానే పెట్టుకున్నాడు."

"అయితే యీవుత్తరం ఏంచేద్దామంటావ్? ప్రిన్సిపాల్ గారి కిద్దామా?"

ఛా, బుట్టదాఖలు చెయ్యి...వద్దు, వద్దు, అటానే పెట్టుకొని ఫ్రేముకట్టించు! అది నీపాటకు, అందానికి, ఆకర్షణ ఎంత పెద్ద సర్టిఫికెట్టో తెలుసా!"

విమల నవ్వింది. "ఎంత కాదనుకున్నా, ఎవరో మనవల్ల ఆకర్షింపబడ్డారనీ, మనలోనిగుణాలేవో వాళ్ళని కదిలించాయనీ తెలుసుకోవటం ఇష్టంగానే వుంటుంది" అన్నది.

"అంతేకాదు, ఇప్పుడు నువ్వు ఊఁ అఁటావనుకో, కట్నంగిట్నం ఏమీలేకుండానే, జీతంభత్యం అడగని సేవకుడు, భర్తుడు నీకు లభిస్తాడు కూడా...నా కట్లాఁటివుత్తరాలు వ్రాసే వాళ్ళుంటే ఎంతబాగుండును!" అన్నది పార్వతి.

"ఇది వ్రాసినవాడు ఎంత పనికిమాలినవాడో! వట్టిFool అని తెలుస్తోంది కదా. వాణ్ణికట్టుకున్నభార్యకు అథోగతే!"

"ఎందుకేమిటి? ఎప్పుడు కుక్కలా వెఁటవుంటాడు. నేనైతే అట్లాఁటివాణ్ణే కోరకుఁటాను."

"పోవే, తమాషాకు ఏదో అనాలనేప్రయత్న మింక చాలించి, ఒక్కవిషయం ఆలోచించు. సుందరరావుగారిని గురించి నన్నుగురించి ఏవో అపోహలు బయల్దేరాయనే తెలుస్తోంది కదా! నేనేం చేసేదిప్పుడు? పాడటం మానివెయ్యనా?"

"ఇంకా బాగుంది! అపోహమాట దేవుడెరుగు కాని, నువ్వు పాడటం మానేస్తే, వీడుమాత్రం సీతాకళ్యాణం జరిగినట్టే భావిస్తాడు!"

"అవును నిజమే. మంచి చిక్కే వచ్చిపడిందే! మరి ప్రోగ్రాం మానెయ్యకుండా పేరు వేయించుకోమంటావా?"

"పేర్ల సంగతి వీడివుత్తరంద్వారా తప్ప మనకేమీ తెలీదు. ఆ విషయం మనమేం చెయ్యలేముకూడా. నువ్వు వీడిమాట విన్నట్లుగా ప్రవర్తిస్తే మాత్రం వాడుసూచించిన అపోహను కొంత బలపర్చినట్లే అవుతుంది. అందుకని నా సలహా ఏమిటంటే, నువ్వింక రిహార్సల్‌కు వెళ్ళక్కరలేదు; ప్రదర్శనలో మాత్రం నువ్వునేర్చుకొన్న పాటలు పాడేసెయ్యి."

పార్వతి చెప్పినమార్గం బాగుందని విమల నిశ్చయించింది.

ఇదిజరిగిన రెండురోజులకు ఇంకో ఉత్తరం వచ్చింది. దానిలో పొగడ్తలు లేవు, అన్నీ అసభ్యమైనవర్ణనలు, తిట్లు, బెదిరింపులు వున్నాయి. ఇంగ్లీషు, తెలుగు కలిసిన భాష. చివరిబెదిరింపు యిట్లావుంది:

"...నువ్వేంచేసినా, నన్ను తృప్తిపరిస్తే, once only నీకు క్షేమం, రక్షణ వుంటుంది, లేకపోతే నిన్ను మాయంచేస్తాను. ఇదే Warning. నీ Family, నీ History నాకు తెలుసు. నువ్వు మంచిగా Yess అంటే చిక్కులేదు. Chemistry practical cuassకు మల్లెపూలు తల్లో పెట్టుకొనిరా. అది నీ consentగా భావిస్తాను. మాటవినకుంటే మాత్రం You will disappear, అంతే! Be a good girl."

అడుగున సంతకమేమీ లేదు.

విమల ఉత్తరాన్ని నలిపి, చించివేసి, ముక్కల్ని కాలితో రాచి అంతలో బిగ్గరగా ఏడ్చింది.

లోపలనుండి ఆమెతల్లి వస్తూ చూచి, ఆదుర్దాగా, "ఏమిటే, అట్లా ఏడుస్తున్నావు? ఏం జరిగిందో చెప్పు!" అని ప్రశ్నించింది. విమల ఏడుపు మానలేదు. తర్వాత తల్లివైపు తిరిగి "ఎవడో రౌడీ వెధవ ఛండాలంగా తిట్టి రాశాడే, బెదిరిస్తున్నాడు." అన్నది. అంతలోనే ఏడుపుమాని లేచి నిలుచుని, "కాని, ఏ మాతుందో నేనూ చూస్తాను! ఏం చేస్తాడు వీడి మొహం!" అని ఇటు అటు తిరుగుతూ..."ఇంక సినిమాలకు వెళ్ళను; ఎక్కడికి వెళ్ళినా బండిమీద వెళ్ళి బండిమీదే

తిరిగివచ్చేస్తాను. అయినా ఇదేం ఊరా, అడివా?" అమ్మా, రాత్రిళ్ళు ఎవరువచ్చిపిలిచినా తలుపు తీయొద్దు!"

"మనింటికి ఎవరొచ్చి పిలుస్తారే! ఏమని బెదిరించా డేమిటి? చెప్పు. అయినా నువ్వేదో బుద్ధిగా వెళ్ళి చదువుకొని వస్తున్నావనుకుంటే...ఇదంతా ఏమిటి? ... నువ్వేమీ కలగ జేసుకోందే ఎందుకు వ్రాస్తాడు అట్లా? అణకువైన పిల్లవనుకుంటే యీ తగవులూ, గొడవలూ. ఏమిటే?" అన్నది విమలతల్లి.

"అది నా లోపంకాదు. ఇప్పుడు కాలేజీకు రాళ్ళది. నేనేంచేసేది, వాడు నన్నుచూచి ఏదోఅనుకుని కట్టుగట్టితే? నాకు గర్వమట, మదమట, ఇంకేదో, ఏదోనట! ఆ వుత్తరం చదవకుండానే చించెయ్యాల్సింది. ఇట్లాంటి అవమానంజరిగితే మనం చేసేదిమాత్రం ఏమిటి? చదువైనా మానెయ్యాలి లేకుంటే పట్టించుకోకుండా మొండిగా, ధైర్యంగాఅయినా వుండాలి, అంతే.

విమలతల్లి ఆలోచిస్తూ కూర్చున్నది. కూతురు బాగా చదువుకున్నతర్వాత పెళ్ళిచేయాలనుకొన్నది ఆమె. చదువు మానిపించాలని, వెంటనే వివాహంచెయ్యాలని ఆమెకులేదు. అది ఆమెఆశయానికి విరుద్ధం. కాని యీ పరిస్థితిలో ఏం చెయ్యాలా అని ఆలోచించి యిలా అన్నది.

"యీ నాలుగునెలలూ ఎట్లాగో గడిపివేస్తే, వచ్చే ఏడాదికి మద్రాసులో ఆడవాళ్ళకాలేజీలోచేరితే బాగుంటుంది."

"నేనూ అదే అనుకొంటున్నాలే, లేకపోతే జడిసి పారిపోతామాయేం?"

"ఇంకోపని చెయ్యి. మీ పిన్నిని, బాబాయినీ ఇక్కడికి రమ్మని వుత్తరం వ్రాయి. వాళ్ళొచ్చి రెండు మూడు వారాలు వుంటారు. తర్వాత సెలవులు. అంతలో వుత్తరం బెదిరింపు వట్టిదో, గట్టిదో తెలుస్తుంది," అన్నది తల్లి.

విమల వుత్తరం వ్రాసింది. బంధువుల్ని రమ్మని.

పార్వతి కీ వుత్తరాన్ని గురించి చెప్పడమా, మానడమా అని ఆలోచించింది విమల. పార్వతిహాస్యధోరణికి ఒక దారీ తెన్నూ అంటూ వుండదు; అనవలసినమాట అనగూడనిమాట అని విమర్శే వుండదు. చివరకు ఉత్తరంలోని చివరి బెదరింపు విషయం చెప్పవలెననే నిశ్చయించింది.

"ఇంకొక ఉత్తరం వచ్చిందే పార్వతీ, ఇవ్వాళ" అని ప్రారంభించింది.

"మొన్న వ్రాసిన భక్తుడేనా?" అన్నది మాటమధ్యలోనే పార్వతి.

"కాదు, వీడొక రాక్షసుడు. నేను లొంగిపోవాలట. లేకపోతే నన్నేదో చేస్తాడట. నేను దాసోహమన్నట్లు తనకు తెలిసేటందుకు తలలో మల్లెపూలు గుత్తుగా పెట్టుకొని కనిపించాలటకూడ."

"వీడేనే Cave - Man అంటే! ఆదిమానవుడన్నమాట! బలంతో దౌర్జన్యంగా లొంగతీసుకొంటాడు. ఆరాధన, ప్రేమ, త్యాగం, జాంతానై. వైలన్స్, ప్యూర్ వైలన్స్. ఆహా! ఎంత Thrilling గా వుంటుందే విమలా...నువ్వు Americanఫిల్ములు చూడలేదు కాబోలు. నేను వేసవిసెలవుల్లో మద్రాసులో చూశాను. వాటెని అమెరికాలో "కామిక్స్" అంటాను. దానిలో

మనమనుకునే కామిక్కేమీ వుండదు. అంతా స్త్రీలనుబలా త్కరించటం, హత్యలు, బలప్రదర్శనం, రకరకాలచిత్రవధలు. నువ్వాటువంటిపిక్చరులో హీరోయినువి. అబ్బ, నే నూహించ లేకున్నానే, నువెంతచిత్రంగా హింసింపబడుతావో!"

"ఆపవే నీపిచ్చివాగుడు...సమయం సందర్భం లేకుండా ఏమిటది?" ఇప్పుడు నేను ఏవిధంగా జాగ్రత్తగా వుండాలి?"

"ఆ వుత్తరం ఏదీ? అది ప్రిన్సిపాల్‌కు చూపించు."

"దాన్ని కోపంతో చించిపారవేశాను. అయినా అది చాల అసహ్యంగా, చదివేటట్టులేదు."

"నేనొక చక్కనిసలహా చెప్పనా?"

"చెప్పవే." ఆశగా అన్నది విమల. పార్వతి కొంచె మాలోచించి"నువ్వు క్లాసుకుమల్లెపూలుపెట్టుకొనిరా"అన్నది.

"ఇదా నీ మహా గొప్పసలహా."

"దానిఅర్థం నువ్వు గ్రహిస్తేకద. మట్టిబుర్ర. పువ్వులు పెట్టుకుంటే వాణ్ణి మనం పట్టుకోవచ్చు."

"ఎట్లా పట్టుకుంటావ్? 'నీ పువ్వులు నేను చూశాను' అని వచ్చి వాడు మనతో చెప్పడు కదా. అదీగాక, నేను అంగీకారం తెలిపానని పగలే ఇంట్లోదూరవచ్చుకూడా."

"అవును. అప్పుడింకా సులభంగా పట్టుకోవచ్చు. ఏం జేస్తాడేమిటి. వాడి మొహం!"

నిజమే. సాహసవంతమైన ఆలోచనే. కాని ఫలితం మాత్రం ఊహింపరానిది. ఏమీ పెద్ద ప్రమాదం జరుగకపో వచ్చు. కాని బోనులోపడినఎలుక తప్పించుకోడానికి ఏంచెయ్యడానికైనా సిద్ధమైనట్లు, వాడు ఎంతగొడవైనా తీసుకురాగలడు.

తర్వాత పగపట్టవచ్చు ఎందుకువచ్చిన విరోధం? ఒకవేళ ఈ ఉత్తరం పట్టి బెదరింస్తై తే. నిమ్మళంగావుంటే వచ్చిన మబ్బు వచ్చినట్లే విడిపోవచ్చు. పార్వతి కళలూ, సినిమాలు ఆధారం చేసుకొని మాట్లాడుతున్నది. బాధ్యత, పరిస్థితి గుర్తించి అనే మాటలు కావు. "ఏమిటి దీర్ఘంగా ఆలోచిస్తున్నావ్?" అని పార్వతి ప్రశ్నించింది.

"నీ సలహా నాకు నచ్చటంలేదు. అనవసర గొడవ అక్కర్లేదు. వాడెవడో తెలీటంకన్న, ఏగొడవా రాకపోవటం ముఖ్యం." అన్నది విమల.

# 12

వేదమూర్తి బుధవారం కాలేజీకి సెలవుపెట్టాడు. దిన మంతా wodehouse వ్రాసిన నవల ఒకటి చదివి పూర్తిచే శాడు. ముందురోజు రామచంద్రయ్య అన్నమాటలూ, తన దైన్యం, క్లాసులో ఒక విషాదకావ్య నాయకునివలె కనుపించిన పరిస్థితి ఏర్పడటం, అంతా విచిత్రంగా కొత్తగా తోస్తోంది ఇప్పుడు. ఆకస్మికంగా కలిగే తన భావస్పందనలు సిగ్గుకలిగిస్తూ, అర్థరహితంగావున్నాయి. అంతా వట్టి ఉద్రేకం. తనదొక విచిత్రప్రకృతి — తనఊహలకు, ఉద్రేకాలకు ఎక్కడో ఉన్నట్టుండి లంకె తెగిపోతూవుంటుంది.

రామచంద్రయ్యధోరణి, తండ్రిమరణంవల్ల అలసివున్న తన చిత్తప్రవృత్తిని లొంగదీసి, తన్ను అశక్తుణ్ణిచేశాయి. అతను నావిధంగా మాట్లాడటం, వాదించటమేమిటి, తనేదో పెద్ద దోషంచేసినట్లే! ఏవిషయం చర్చించినా, ముఖ్యంగా తను

వ్యక్తిగతాభిప్రాయాల్ని గురించి, సానుభూతిఅనేది లేకుండా, వ్యతిరేకంగానే వాదిస్తాడు రామచంద్రయ్య. కట్నంపెళ్ళి విషయంలో వాస్తవికతనుగురించి చెప్పినవాడే, ఇప్పుడు తండ్రి మరణంవిషయంలో సెంటిమెంట్సును గురించి, విలువలు, అనుబంధాలను గురించి నిశ్చయంగా తెలిసినట్టే చెప్తుతాడు. ఒక విధమైన ఈర్ష్య అతనికే తెలీనిది అవ్యక్తంగా అతన్ని ప్రేరేపిస్తోంది కాబోలు! లేకపోతే తనదే తప్పని, తన అప్రయోజకత్వాన్ని నిరూపించటానికి అంత ప్రయత్నంమెందు కాతనికి?

ఆ అమ్మాయి లీల చూపిన సానుభూతికూడా వింతగానే వుంది! ఇంతమందిని తను పరిశీలనగా గమనిస్తూ వాళ్ళ వాళ్ళప్రత్యేకతని అవగాహనచేసుకో ప్రయత్నిస్తున్నాడు కాని యీవిధంగా ఏ అమ్మాయైనా వచ్చి ఉన్నట్టుండి సానుభూతి తెలుపుతుందని కలలోకూడ ఊహించలేదు. ఆ అమ్మాయి మాటలు తనపైచూపిన ప్రభావమూ విచిత్రమైనదే. అమృత స్పర్శవలెవుంది తనహృదయానికి ఆమెఅభిమానం. ఆక్షణంలో మంచులా కరిగిపోయాడు. తలుచుకుంటే సిగ్గేస్తోంది.

సహజమే మరి. మద్రాసులో చదువుకునేరోజుల్లో ఎండలో తిరిగి తిరిగి చివరకు 'ఉడిపి కృష్ణవిలాస్' లోని ఎర్ కండిషన్‌రూము చేరుకునేటప్పటికి ఎంతహాయి అనిపించేది! ఆ అనుభవసత్యమే ఇందులోనూ వుంది అనుకోవాలి. మన ఉష్ణోగ్రతనుబట్టి పరిసరాల ఉష్ణోగ్రతలోని హెచ్చుతక్కువలు పనిచేసినట్లు రామచంద్రయ్యమాటల్లోని తీవ్రతతో వేడెక్కి ప్రిన్సిపాల్‌చీవాట్లతో పొగలుగ్రక్కుతూవున్న మనస్సు,

ఆ అమ్మాయిసానుభూతిచల్లదనంతో చప్పున యథాస్థితికి వచ్చిఊరుకుంది. వేదమూర్తి నవ్వుకున్నాడు.

అతి కోమలంగా, ఛాయామాత్రంగా, ఉన్నదో లేదో అన్నట్లు నిమ్మళంగాఉంటూ తన దృష్టిలోకే రాని లీలలో ఒక ప్రత్యేకత. తనమీద ఇంత ఆదరభావం దాగివున్నట్లు అనుమానించటానికైనా వీలులేదు. ఒకవిధంగా చూస్తే ఆమెచేసిన దాంట్లో అర్థమే కనిపించదు. క్లాసులో చూడటం తప్ప తను బొత్తిగా తెలీనివాడైనప్పుడు, అకస్మాత్తుగా వచ్చి "మీరేదో దుఃఖంలోవున్నారు, నాతో చెప్పండి" అని సూటిగా అడగటం ఒక పిచ్చిచేష్టలాగే వుంది. లీలకూడ భావోద్రేకానికి లొంగిపోయి, ఆలోచించకుండా ఏదోఒకటి చేసివేసేవ్యక్తి కాబోలు!

అతని ఆలోచనలకు అంతరాయంకలిగిస్తూ ఇద్దరు విద్యార్థులు గదిలో ప్రవేశించారు.

వాళ్ళచేతుల్లో పుస్తకాల్నిబట్టి వాళ్ళు సరాసరి కాలేజినుండి తిన్నగా తనగదికే వచ్చారని వేదమూర్తి ఊహించాడు.

వాళ్ళని కూర్చోమని చెప్పి ఏం కావాలి?" అని అడిగాడు.

"మా కింకా రెండుపోయమ్స్ పూర్తికావాలి కదా. సెలక్షను పరీక్షలు దగ్గరపడుతున్నాయి. ఇంతలో రెండూ అవుతాయాండీ?" అన్నాడు ఒక విద్యార్థి.

"ఒకటిఅవుతుంది. మిగిలింది వచ్చేటర్మ్‌లో అవుతుంది."

"అదికాదండీ, మాకు యీమధ్య రెండుక్లాసులు నష్టమయ్యాయికదా, మిగతావాళ్ళకేమో, అన్నీ పోయినసంవత్స

రమే పూర్తయి, మా సెక్షనుమాత్రం ఇట్లావుంటే, మరి చివరి పరీక్షకు మేమెవ్వరమూ చదువుకొనేది?" అన్నాడు రెండవవిద్యార్థి.

"చదువుకోవాలనుకుంటే క్లాసులో కాకపోతే మాత్రం చదువుకోగూడదా? శంఖంలోపోస్తేగాని తీర్థంకాదేమిటి?" విసుగ్గా అన్నాడు వేదమూర్తి.

"మీరు పూర్తిచేసినతర్వాత చదివితేనే లాభం కాని, యిప్పుడేం బోధపడుతుందండీ?"

"అట్లా అనుకుంటే క్లాసులోఅయ్యేదాకా చదవకుండానే వుండండి... పోనీ మిగతావి చదువుకోండి."

"శనివారాలు ప్రత్యేకంగా క్లాసుపెట్టుతారని..."

"అది వీలుకాదు. మీరిద్దరు కోరుతున్నారు. మిగతా తొంభై ఎనిమిదిమంది సంగతో? వాళ్ళకు బహుశా అక్కరలేదేమో!"

"అంతా వస్తారండి... మీరు రమ్మని చెప్పాలి."

వేదమూర్తికి విసుగుపుట్టి అన్నాడు. "ఏమిటి మీ అభిప్రాయం? మీకుతప్ప ఇంకెవరికి చదువుమీద శ్రద్ధలేదనా? లేక మీ ఉత్సాహం చూచి నేను మురిసిపోతాననా? రెండు గంటలు అనివార్యంగా నష్టమైపొయ్యాయో లేదో ప్రపంచమే మునిగిపోయినట్లు భావిస్తారు. ఇప్పటికిఅయినవి సవ్యంగా చదువుకుంటే చాలు, గొప్పగా పాసవుతారు. మిగిలినవి టైముకు సరిగ్గా పూర్తిచేస్తానని మాత్రం చెప్పగలను, అంతే."

"మీకంత కోపం దేనికండీ? చాలమందికి మా అభిప్రాయమే వుంది. ముందుగా పూర్తిఅయితే, కొన్నివ్యాసాలు డిక్టేటుచేస్తారని ఆశ."

"ఓ, అదా సంగతి. మీరే నోట్సుతీసుకోవాలిగాని, నేను వ్యాసాలు డిక్టేటుచెయ్యటం, మీరు బట్టీపెట్టటం మంచిది కాదు. అందరూ కావాలంటే శనివారం సంగతి తర్వాత ఆలోచిస్తాను...మీరింక వెళ్ళవచ్చు...నాకు మనసు బాగా లేదు." అన్నాడు వేదమూర్తి.

వాళ్ళు వెళ్ళిపొయ్యారు.

నాలుగున్నర అయింది. గదిలోనే కూర్చోవటం దుర్భరంగా వుంది. ఎక్కడికైనా వెళ్ళితే బాగుంటుందనిపించింది.

ఊరికి తూర్పువైపుగా గవర్నమెంటుఆస్పత్రి, దాని కావల ఒక ఫర్లాంగులో చెఱువూ వున్నాయి. ఆ వైపు షికారు కని బయలుదేరాడు వేదమూర్తి.

మళ్ళీ లీల జ్ఞాపకంవచ్చింది...ఇన్నాళ్ళు ఆమెపేరైనా తెలీదే. అసలు ఆమెనుగురించి ఎప్పుడూ అనుకోనేలేదు. ముఖంమాత్రం గుర్తుంది. అదైనా విమలప్రక్కన కూర్చుంటూ వుంటుంది కాబట్టి. ఈ అమ్మాయికీ విమలకూ మంచి స్నేహమున్నట్టుంది.

లీల వచ్చి సానుభూతి తెలిపింది. మరి విమల తన్ను గురించి ఏమనుకొనివుంటుంది?

వాళ్ళింటికొకసారి రమ్మన్నది. ఆ మాట తను లెక్క చెయ్యలేదు. ఆమెవచ్చి సానుభూతి తెలపటం ఎంత అసంభావ్యంగా, ఆకస్మికంగా వుందో, తన్ను ఇంటికి ఆహ్వానించటమూ అంత అసంబద్ధమే. తను వెళ్ళితే ఏం బాగుంటుంది?

ఎందుకు వెళ్ళరాదు? లీలద్వారా విమలను గురించి తెలుసుకోవటానికి మంచి అవకాశం లభిస్తుంది.

ఆస్పత్రిదాటి వెళ్ళబోతూ, కుతూహలంగా ఆవరణ లోకి ప్రవేశించి అక్కడున్న ఒక ఆస్పత్రిపనివాణ్ణి పిలిచాడు.

"డాక్టరు రమణమూర్తిగారిల్లెక్కడో నీకు తెలుసా?"

"ఆరెమ్మోగారా అండీ? ఇదుగో యీ కాంపౌండుకు అవతలివేపు. ఇట్లా ఆస్పిటలుమీదుగానే వెళ్లొచ్చు" అని దారి చూపాడు.

వెనక్కు తిరిగిపోదామా అనుకొని, మళ్ళీ యిల్లు విషయం అడిగి అక్కడికి వెళ్ళకపోతే యీ మనిషి ఏమను కుంటాడోనని, డాక్టరుక్వార్టర్సువైపు నడిచాడు.

"డాక్టరుగారున్నారా?" అని యింటిముందర పూల కుండీల్లో నీళ్ళుపోస్తున్న కుఱ్ఱవాణ్ణి అడిగాడు.

"లేరు, అక్కడే ఆస్పత్రిలో వుండారండి ... ఇందాకే ఎళ్ళారండి" అన్నాడు వాడు.

ఒక క్షణమాలోచించి "వాంరి అమ్మాయి లీల?" అన్నాడు.

"అమ్మాయిగారున్నారు" అని బిందె ఒకచోటపెట్టి, పిలవటానికి వెళ్ళబోయ్యాడు వాడు.

అంతలో లీల వాకిలిదగ్గరకు వచ్చింది. వేదమూర్తిని చూచి "రండి" అని లోపలికి ఆహ్వానించింది.

అది డ్రాయింగ్‌రూము. వెళ్ళి ఒక కుర్చీలో కూర్చు న్నాడు వేదమూర్తి. ఏమి మాట్లాడాలో తోచటంలేదు. లీల కూడా అదే సందిగ్ధంలో వుందేమో, ఆగకుండా లోపలికి వెళ్ళిపోయింది.

కొంతసేపటికి లోపల్నుంచి ఒక నలభై యేళ్ళ స్త్రీ వచ్చింది. కళ్ళజోడుపెట్టుకొని, లావుగా వుం దామె; లీల

తల్లి అని పోలికలు చెప్తూన్నాయి. "నమస్కారమండీ" అన్నది. వేదమూర్తి లేచి చేతులుజోడించి మళ్ళీకూర్చున్నాడు.

లీల నిన్న భావోద్రేకంవల్లనే అట్లాచేసిందని ఋజువౌతూవుంది. సహజంగా సిగ్గుపడేతత్వంగల అమ్మాయి అయివుంటుంది. చుట్టూవున్న వాళ్ళందరికీ అభినందల్నీ, సానుభూతినీ తెలుపుతూ, జోక్యంలేనివిషయాల్లో జోక్యం కలుగజేసుకుంటూ, సాంఘికమర్యాదల్లో ఉత్సాహించూపేరకం కాదు. లేకపోతే ఒక్కమాటైనా మాట్లాడకుండా లోపలికి వెళ్లి వాళ్ళతల్లిని పంపించదు అనుకున్నాడు వేదమూర్తి.

లీలతల్లి ఒకకుర్చీలోకూర్చొని వేదమూర్తిని, తదేకంగా చూస్తూ, గౌరవపురస్సరంగా "మీరు మా అమ్మాయికి ఇంగ్లీషు చెప్తూతారటకదూ! పాఠం చాల బాగా చెప్తూతారట" అన్నదామె. మొదటిమాటకు తలఊపి, మౌనంవహించాడు. ఏమి మాట్లాడాలో తెలీలేదు.

ఆమె అతనిస్వభావం గ్రహించినట్లుంది. కొంతసేపుండి ధారాళంగా నవ్వుతూ ప్రారంభించింది. "అమ్మాయి నిన్న జరిగినసంగతంతా నాతో చెప్పింది. మీరేమనుకున్నారో అని అది భయపడ్డది. నే నన్నాను...'ఏమీ అనుకోరు, నువ్వు చేసినదాంట్లో తప్పేముంది గనక !' అని. ... పాఠం చెప్తూతూవుంటేనే మీ మనస్సు కలతగావుందని తెలిసిందట. తర్వాత క్లాసుమధ్యలో వదలిపెట్టారట. మీకు సానుభూతి తెలపాలని గట్టిగాతోచి మిమ్మల్ని 'ఏమిటల్లావున్నా'రని వచ్చి అడిగింది కాని, మీరు పేరు, అవీ అడిగేటప్పటికి "నాకు తెలీని పిల్ల యిలా వచ్చి అడుగుతూవుందే!" అని మీరనుకొన్నట్టు

వ్యూహించి, తను తప్పుచేశాననుకొన్నదట. దానిదొక విచిత్ర ప్రకృతి. ఎవరైనా బాధపడుతూవుంటే సహించలేదు. సాధారణంగా ఎప్పుడూ ఎక్కువ మాటాడదు. స్నేహితులూ ఒకరిద్దరే. కాని ఉన్నట్టుండి ఏదో చేస్తుంది అందరికీ ఆశ్చర్యం కలిగేలాగ!...

ఆమెఆగకుండా లీలను గురించి చెప్పుతూవుంటే వేదమూర్తికి మాట్లాడకుండ వినటమే బాగుంది.

"...ఒకసారి ఏమైందనుకున్నారు! అప్పుడు సెకండు ఫారమో ఏదో చదువుతూవుంది. ఎవరితోనూ మాట్లాడదు. తగనిసిగ్గు, భయం... దీనిస్వభావం టీచరుకూడా బాగా తెలుసు. ఆ టీచరు ఒకరోజు క్లాసులో ఎవరో అబ్బాయిని కొంటెతనం చేశాడనో, పాఠంనేర్చుకోలేదనో చెంపవాచేటట్టు కొట్టి, బెంచీపై ఎక్కమని, అప్పటికీ కోపంతీరక చెవిపట్టుకొని మలిమేస్తున్నాడు. లీల ఉన్నట్టుండి లేచి, టీచరుదగ్గరకు పరుగెత్తి, అతన్ని చెయ్యిపట్టి లాగుతూ, 'మాస్టారూ, కొట్టకండి, వదలండి, వదలండి' అని కేకలుపెట్టింది. విస్తుపోయి ఆ అబ్బాయిని వదిలివేశాడు టీచరు. 'ఏమిటమ్మా అది, నీ కెందుకు పో' అని కసిరాడు. వెళ్ళి డెస్కుమీద ముఖం కప్పెట్టుకుని అలానే ఏడుస్తూవుందట. తర్వాత ఆ టీచరు 'ఆ అబ్బాయి నీకు బంధువా? స్నేహితుడా?' అని అడుగుతూ ఓదార్చి, ఏమీ కాదని తెలుసుకుని మరీ ఆశ్చర్యపొయ్యాడు."

ఆమె చెప్పటం ముగించి "లీలా, ఇట్లా రామ్మా" అని

"ఇదుగో, కాఫీ తయారైంది" అని అడుగులో అడుగు వేసుకుంటూ కాఫీ ట్రే తెచ్చి బల్లమీద పెట్టింది లీల. వేద మూర్తివైపు చూడకుండా తలవంచుకుని కూర్చున్నది.

"కాఫీ తీసుకోండి" అన్నది లీలతల్లి.

చేతిలో కాఫీకప్పు పట్టుకుని, ఇక మాట్లాడటం తన వంతు అనుకున్నాడు వేదమూర్తి. ఆవిడధోరణివల్ల మొదట వున్న క్రొత్తదనం పోయింది.

"నాకు ఆశ్చర్యం కలిగించినమాట నిజమే. కాని ఆ క్షణంలో మనస్సులోని విషాదంబరువు తీసివేసినట్లయింది. ఇవాళ ఇలా రాగలిగానంటే మీ అమ్మాయి చూపించిన సానుభూతే కారణం. లీలకూ, మీకూ కృతజ్ఞత తెలుపుదామని వచ్చాను. మీరుకూడా ఇంతగా మనసిచ్చిమాట్లాడటం నాకు సంతోషంగా వుంది...కొన్ని పరిస్థితుల్లో స్నేహభావాని వున్న విలువ మరి దేనికీలేదు. నేను లీలనుగురించి ఏమీ అనుకోలేదు. చాల అరుదైన అమ్మాయి అనుకొన్నాను"అన్నాడు వేదమూర్తి.

అతను కాఫీ త్రాగుతూవుంటే, లీలతల్లి లేచి, "మీరు అమ్మాయితో మాట్లాడుతూవుండండి, మళ్ళీ వస్తాను" అని లోపలికి వెళ్ళిపోయింది.

లీల వేదమూర్తివైపుచూచి స్నేహపూర్వకంగానవ్వింది.

"మీరు యివాళ మా యింటికి వచ్చారు కాబట్టి నేను మిమ్మల్నిగురించి అనుకునేదంతా నిజమని తెలిసింది" అన్నది.

"నన్ను గూర్చి ఏమనుకుంటున్నావు?" అని కుతూహ లంగా అడిగాడు.

"మీరు చాల మంచివారని...ఇంకా అల్లాగే...ఏమని చెప్పను?"

"ఊరికే మంచి అంటే ఏం తెలుస్తుంది? స్పష్టంగా చెప్పాలి."

"నాకు చెప్పటం చేతకాదు. నేనూ, విమల మిమ్మల్ని గూర్చి మీరెంతో మంచివారని చెప్పుకుంటాము."

"అంటే ఏమిటో చెప్పటానికి ప్రయత్నం చెయ్యాలి, లేకపోతే నాకేమీ తెలీదు" అన్నాడు. విమలమాట వచ్చి నందుకు అతనిహృదయ మొక్క గంతు వేసింది.

"అంటే...ఇన్నాళ్ళు నే నొకరకంగా మిమ్మల్ని గురించి అనుకొన్నాను. మరి నిన్నటిరోజు ఆఅభిప్రాయంతోనే వచ్చి మాట్లాడాను. కాని తర్వాత నాకు భయంవేసింది. మీరు మీరు కాదేమో అని...అంటే నా అభిప్రాయం తప్పేమో అనిలెండి...కాని యివాళ మా యింటికి వచ్చారు కాబట్టి నా అభిప్రాయం రైటని నాకు తెలిసింది."

వేదమూర్తి ఆలోచించాడు. ఇంతకంటె యీమె వివ రించలేదు. వ్యక్తుల్ని గురించి తను ఊహించుకునేటట్లే యీమె కూడ ఊహిస్తుంది. కాని ఆ ఊహలు, స్పష్టంగా ఆలోచనలకు తనకుఅందినట్లు అందక, ఈమెలో ఒక భావస్వరూపంలోనే నిలిచిపోతాయి.

వేదమూర్తి మౌనంగావుండటం చూచి లీల అన్నది—

"కాని ఒక్క విషయం వుంది—నా అభిప్రాయం ప్రకారం, మీరు ఎంతటివిషాదమైనా దానిబరువు మోయగలరు—కాని, విషాదంతో నిన్న మీరు పాఠం చెప్పలేకపోయారు. తర్వాత నేను వచ్చి మాట్లాడినప్పుడు కూడ మీ కళ్ళల్లో నీళ్ళున్నవి."

వేదమూర్తి సిగ్గుపడ్డాడు. ఈ అమ్మాయిని ఏమీ లెక్కకురాని, వ్యక్తిత్వంలేని ఒక ఛాయామాత్రంగా తను ఊహించాడే, తన దెంత పొరపాటు! నిర్భయంగా, కాని చాల సహజంగా, మృదువుగా, వెక్కిరింపు చూచాయగానైనా లేని మాటల్లో తన్నుగూర్చి ఎంత సూటిగా విమర్శ చేసింది! ఆ విమర్శలో ఎంతసౌహార్దం, అభిమానం ధ్వనిస్తున్నాయి!

వేదమూర్తికి లీలమీద వెంటనే ఏదో చెప్పలేని ప్రేమ భావం కలిగింది. అది ఆకర్షణకాదు; చాల ఆప్తులైనవారిపట్ల కూడ తన కిదివరకు కలగని ఆత్మీయతాభావ మది.

అతను మౌనంగావుండటం చూచి లీలకూడ ఏమీ మాట్లాడలేదు.

వేదమూర్తి ఆమెతో చెప్పటం ప్రారంభించాడు.

"మా నాన్న అకస్మాత్తుగా పోయారు. కొన్నాళ్ళక్రితం యిక్కడ ఒకరాత్రంతా వర్షం కురుస్తూవుందే, ఆ రోజే మా వూళ్ళోవచ్చిన గాలివానలో తడిసి ఆయన చనిపోయారు..."

తండ్రిపోవటం, తల్లి తనతో వచ్చి వుండననటం చెప్పాడు. ఎందుకని అని లీలప్రశ్నించగా, తన వివాహప్రసక్తి రావటం, పొలాన్ని అమ్ముమనటం మొదలైన విషయాలు కూడా చెప్పాడు.

డాక్టరు రమణమూర్తి వచ్చాడు. ఆయనకూడా భార్య ద్వారా నిన్నటిసంగతి విన్నట్టున్నాడు.

పరిచయంకాగానే నవ్వుతూ "కూర్చోండి, కూర్చోండి. మా అమ్మాయి నెమ్మదిగా ఉన్నట్టుండి, ఏదో చేసేస్తూ వుంటుంది" అన్నాడు.

లీల లోపలికి వెళ్ళిపోయింది.

"మా అమ్మాయిమనస్తత్వం మాకే సరిగా అర్థం కాదు. చాల sensitive girl. ఇదుగో, ఇలాంటిది జరిగినప్పుడు బయటివాళ్ళు ఏమైనా అనుకుంటారేమోననిపిస్తుంది. కాని మళ్ళీ unconventional గా చూస్తే ఆమెచేసింది చాల perfect గాను, proper గాను వుంటుంది." అని కొమార్తె ప్రకృతిని గూర్చి వివరించి, తర్వాత వేదమూర్తిఊరు, చదువు, తల్లిదండ్రులు మొదలైన విషయాలు ప్రశ్నించి తెలుసుకున్నాడు.

"ఏడుగంటలు దాటింది, నేను వెళ్తానండి" అని టైము చూచుకొని లేచాడు వేదమూర్తి. కాని డాక్టరు వెళ్ళనివ్వలేదు. "కూర్చోండి, ఇప్పుడేవస్తాను"అని లోపలికివెళ్ళి ఒకక్షణంలో మళ్ళీ తిరిగివచ్చి "భోజనంచేసి వెళ్ళాలి మీరు" అన్నాడు.

"వద్దండీ, Excuse me." అని వేదమూర్తి లేచాడు.

డాక్టరుగారిభార్య తలుపుదగ్గరకు వచ్చి "మీరు ఇవాళ భోజనంచేసే వెళ్ళాలి. ఉంటారనే వంటచేయించాను. ఇంతకు ముందే చెప్పకపోవటం నాదే పొరపాటు." అన్నది.

వేదమూర్తికేమీ పాలుపోలేదు. వాళ్ళని తిరస్కరించి వెళ్ళటం మోటుతనమనిపించింది. వాళ్ళఅమ్మాయి అభిమానం కన్న ఆ దంపతుల ఆదరణ మరీ విచిత్రంగా కనిపించింది.

భోజనమైనతర్వాత వరండాలో ఒకగంట కూర్చున్నారు. వేదమూర్తి కుటుంబాన్ని, కాలేజీగురించి చాల విషయాలు డాక్టరు అడిగి తెలుసుకున్నాడు.

బండి పిలిపించి వేదమూర్తిని పంపించాడు.

## 13

శారదగదిలో కూర్చుని చదువుకుంటూవుంది రమణి. ఆమెకోసం ఎదురుచూస్తూ అప్పుడప్పుడు టేబిల్‌మీదగడియారంవైపు చూస్తోంది. రమణికినిద్రవస్తోంది. కాని శారదాంబ ఇంకా రాలేదు. సాయంత్రం ఆరుగంటలకు వెళ్తూ, "నేను వచ్చేటప్పటికి కొంత ఆలస్యం అవుతుందేమో, నా భోజనం నా గదిలో గిన్నెల్లో పెట్టించు. నువ్వు యిక్కడే చదువుకొంటూవుండు" అని చెప్పి వెళ్ళింది.

తొమ్మిదిగంటలు! చాల విసుగ్గావుంది. ఇప్పుడు మూడునెలల్నుంచి ఇలాట్యూషన్ చెప్పడానికి వెళ్తూవుందీమె. ఎవరో హైస్కూలుపంతులమ్మ తెలుగు విద్వాన్ పరీక్షకు కట్టుతుందట; వారానికి రెండుమూడుసార్లు తీరిక వున్నప్పుడు యీవేళలో ట్యూషన్ చెప్పటానికి ఒప్పుకొన్నది. ఆ ట్యూషన్ సాయంత్రంపూట వుండగూడదూ? లేక ఆవిడనే ఇక్కడకు రమ్మనగూడదా? ఆ పంతులమ్మ హైస్కూలు పిల్లలకు సాయంత్రం ప్రయివేటు చెప్పి, ఏడుగంటలనుంచి శారదాంబదగ్గర చదువుకొంటుందట. మామూలుగా ఎనిమిది గంటలకు తిరిగివచ్చేస్తూవుంటుంది; ఒక్కొక్కరోజు తొమ్మిదీ, పదీ అవుతుంది.

ట్యూషన్‌వల్ల డబ్బుకూడ ఏమీ ముట్టేటట్టులేదు. మనిషి మంచిది. అందుకే బీదరాలైనపంతులమ్మమీద దయ. ఆవిడ యీమె కష్టపడ్డప్పుడు విందులుచేస్తూవుంటుంది, అదే యీమె సహాయానికి ప్రతిఫలం. శారదాంబకు స్నేహమే ముఖ్యం; అరమరిక లేకుండా మనసిచ్చిమాట్లాడుతుంది. తన విషయంలోగూడ విద్యార్థిని—లెక్చరరు అన్న విభేదంలేకుండా ఎంత ఆప్యాయతగా వుంటుంది! తను ఎప్పుడూ "అక్కయ్యా" అని పిలవటమేగాని "మేడమ్" అనలేదు.

శారదాంబకు చాల పట్టింపు—అందరూ తనని 'మేడమ్' అని పిలవాలని. ఈ విషయంలో పార్వతీవాళ్ళతో ఆమెకు ఎప్పుడూ గొడవే. వాళ్ళు ఛస్తే అలా పిలవమంటారు. ఎంత సేపూ "ఏమండీ!" అనే అంటారు. లేకపోతే "వార్డెనుగారూ" అనో "శారదాంబగారూ" అనో పిలుస్తారు. "వార్డెనుగారూ" ఏమిటి? "మేడమ్" అనాలి అని యీమె మందలిస్తుంది. ఆ పార్వతి కోతితనానికి అంతులేదు. "మాడమ్" అనో "మే-డమ్"అనో దీర్ఘాలతో, వత్తులతో అంటుంది. దాన్తో మిగతావాళ్ళకు నవ్వు, యీమెకు ఒకటే కోపం! తనకూ నవ్వొచ్చేస్తుంది అప్రయత్నంగా. కాని శారదాంబమనస్సెంత నొస్తుందో అని నవ్వు అణచుకోవడానికి సతమతమైపోవాలి.

తన కెందు కంత అప్రయత్నంగా నవ్వు వచ్చేస్తుందో తెలీదు. మొన్న స్నానాలగదిలోనుంచి బయటికి వస్తూ శారదాంబ తలుపుదగ్గర పడివున్న అరటితొక్కమీద కాలు వేసి, సర్రున జారింది. అదృష్టవశాత్తూ ద్వారాన్ని పట్టుకొన్నది గాని, లేకపోతే పెద్దదెబ్బ తగులవలసిందే. గడపమీద

చతికిలబడ్డది. తనకేమో ఆపుకోలేనంతగా ఒకటే నవ్వు. ఆమెకు బాగా కోపంవచ్చేసింది. అరటితొక్కమీద, దాన్నక్కడ పడవేసిన కమలమీద, దాన్ని తీసివెయ్యాని పనిమనిషి నాగమ్మమీద, నవ్వినందుకు తనమీద, అందరిమీద ఒక్కటే కోపం! ఏం చెయ్యను, వెళ్ళి క్షమాపణ కోరుకోవడమైంది.

అన్ని విషయాలు బాగానే వున్నాయి, కానీ యీావిడ యీమధ్య తనచీరలు వాడుతూవుండేమిటి? ఏదో ఒకటీరెండు సార్లు కాదు, ఇప్పుడు బాగా మామూలే చేసుకొంటోంది. అందులో తనే అరుదుగా వాడే అతి ప్రియమైనవాటినే ఇప్పటికి రెండుసార్లు కట్టుకుంది. అదేంచునిపోగాని, చీర ఊరికే నలిపివేస్తుంది. తను కట్టుకుంటే ఎక్కడో అంచులదగ్గర తప్ప నలిగిపోదు. శారదాంబకట్టుకుంటే చీరంతా నలిగిపోవడమే! ఏమంటే మళ్ళీ ఎలెక్ట్రిక్ ఐరన్ ఇచ్చి తననే ఇస్త్రీచేసుకొమ్మంటుంది.

జట్కా ఆగిన శబ్దం వినిపించి, 'అబ్బ, ఇప్పటికి వచ్చింది.' అనుకొంటూ రమణి గదిలోనుండిబయటికివచ్చింది.

శారదాంబ జట్కావాడికి డబ్బులిచ్చిపంపిస్తూ "ఇంకా మేలుకొనే వున్నావా రమణీ! నిద్రరాలేదూ?" అని, నవ్వుతూ లోపల ప్రవేశించినది.

"మీా భోజనం అదుగో, ఆ మూల వుంది. నేను వెళ్ళనా, వుండి వడ్డించాలా?" అన్నది రమణి.

"నా భోజనమైపోయింది. ఆ పంతులమ్మ నన్ను భోజనానికి వుండమని బలవంతంచేసింది...చూడు, తాంబూలం కూడ వేసుకున్నాను...కూర్చో రమణి! మనం సోడా

తెప్పించుకొందామా?" అంటూ శారదాంబ రమణిని కూర్చో మని బలవంతంచేసింది.

చీర మార్చుకోవడానికి స్నానాలగదిలోకి వెళ్తూ "రమణీ, నాగమ్మ వంటింట్లో పడుకుందో, లేక పాత్రలు తోముతూవుందో, వెళ్ళి రెండు మంచిసోడాలు పట్టుకురమ్మను" అన్నది.

రమణి వెళ్ళి, అప్పుడే పడుకోబోతున్న నాగమ్మతో "రెండు సోడాలు తీసుకురమ్మన్నా"రని చెప్పింది. "అబ్బ వేళాపాళాలేదటండీ! ఎంతచేసినా చంపుతారు!" అనివిసుక్కుంటూ నాగమ్మ బజారువైపు వెళ్ళింది.

రమణి మళ్ళీ గదిలో ప్రవేశించేటప్పటికి శారదాంబ చీరమార్చుకొని, ముఖం కడుక్కొనివచ్చి పక్కమీద కూర్చున్నది. ఆమెచేతిలో ఏదో పుస్తకముంది. దాన్ని చూపిస్తూ "రమణీ! యిలా రా, యీ పుస్తక మెప్పుడైనా చూశావా?" అని ఏదో వింతసంగతి చెప్పబోతున్నట్టు రమణి వైపు ప్రశ్నార్థకంగా, కొంటెతనంగా చూచింది.

"ఏం పుస్తకమండీ?" అని ఆసక్తిగా రమణి వెళ్ళి ఆమె ప్రక్కనే మంచంమీద కూర్చుని పుస్తకంలోకి చూచింది.

"ఇది 'రాధికాసాంత్వనము' అనే పద్యకావ్యం"

"పద్యాలా? సరే, నాకేమర్థమవుతుంది?" అన్నది ఉత్సాహమంతా పోయి, ఆమెముఖంవైపు చూస్తూ రమణి.

శారదాంబ చెవుల్లో దూదిపెట్టుకొన్నట్టు, సబ్బు నురగ, తెల్లగా పేరుకొనివుంది. అది చూడగానే రమణికి నవ్వాగలేదు. పకపక నవ్వింది.

శారదాంబకు అర్థంకాలేదు. బాగా కోపంవచ్చిందామెకు. "ఏమిటా నవ్వు?" ఈ పుస్తకాన్ని చూస్తే నీకంత నవ్వేమిటి?" అని తీవ్రంగా అడుగుతూవుంది.

ఆమెకోపాన్ని చూచి రమణికి మళ్ళీ ఇంకొక నవ్వు తెర వచ్చింది. ఆపుకోవడానికి ప్రయత్నిస్తూ, "అదికాదండి..." అని మళ్ళీ నవ్వింది.

"ఏమిటీ? నీ Silliness మరీ ఎక్కువౌతోంది!" అని ముఖంత్రిప్పుకొన్నది శారదాంబ.

శారదాంబ తెలుగులెక్చరరైనా, ఆమెకు బాగా కోపంవచ్చినప్పుడూ, తనమర్యాద, అధికారం నిలబెట్టుకోవలసిన క్షణాల్లోను ఇంగ్లీషుపదాలు అవలీలగా దొర్లుతాయి. ఈ విషయం ఇంకొక వెక్కిరింపు పార్వతీవాళ్ళకు!

మళ్ళీ రాబోయే నవ్వాపుకొని, "లేదండీ! మీరు చెవుల్లో, సబ్బునురగ మూదిపెట్టుకొన్నట్లుగావుంది. అది చూచి నాకు నవ్వాగలేదు." అన్నది రమణి.

శారదాంబ టవలుతీసి తుడుచుకుంటూ "కొంటె పిల్లవు! ప్రతిదానికీ నీకంత నవ్వెందుకొస్తుందో నా కర్థంకావటం లేదు" అని ఆప్యాయంగా మందలించింది.

"ఏమోనండి. మీరువచ్చేముందు నేనూ అదే ఆలోచిస్తున్నా. పోనీలేండి, ఆ పుస్తకంసంగతేమిటో చెప్పండి"

"ఇప్పుడు వద్దులే పో; అసలు నా బుర్ర చెడిపోయింది నీ విపరీతపు నవ్వువల్ల"

"కాదు చెప్పండి,నాకువినాలని ఎంతో ఆసక్తిగావుంది."

"నీకు నిద్దరొస్తోందన్నావుగా, వెళ్ళి పడుకో."

"లేదు, నానిద్ర తేలిపోయిందిలెండి నవ్వుతో...అంతే కాదు; మరి నేను సోడాకోసం వుండవద్దూ. చెప్పండి, నిజంగా నేను శ్రద్ధగా వింటాను."

శారదాంబ మంచంమీదపడుకొని రమణిని తనప్రక్కన కూర్చోమన్నది. రమణివైపు చూస్తూ పుస్తకంవిప్పింది. మళ్ళీ అంతలోనే మూసివేసి,

"ఏమీలేదు...రాధాకృష్ణుల ప్రేమను, ప్రణయ కలహాన్ని వర్ణించే కావ్యం ఇది. ముద్దుపళని అన్న స్త్రీ వ్రాసింది. మామూలుగా కావ్యాలు, వాటిల్లో ప్రేమతత్వం అంతా పురుషులు వ్రాసినవే. కవయిత్రులైన ఒకరిద్దరు స్త్రీలు భక్తిపరంగానే వ్రాశారు. ప్రేమతత్వాన్ని, శృంగారాన్ని గురించి వ్రాసిన స్త్రీ ముద్దుపళని ఒక్కర్తే. కొన్నిచోట్ల కొంచము సిగ్గుతెప్పించేవర్ణనలూ, అవీ వున్నా చాల సరసంగా వుంటుంది ఆమెకవిత్వం..."

"పోయిన నిద్ర మళ్ళీ వచ్చేస్తూవుందండి. మీరు క్లాసులో పాఠంచెప్తున్నట్లుంది. ఏవో మామూలు విషయాలు చెప్పండి దయచేసి" అన్నది రమణి ఆవులిస్తూ.

"దానికే వస్తున్నా" అని శారద రమణిఒళ్ళో చెయ్యి వేసి, లాలనగా "నేనడిగినదానికి దాచుకోకుండా జవాబుచెప్పాలి మరి" అన్నది.

"ఊఁ, అడగండి" అన్నది రమణి.

"మరి సుందరరావుగారు నిన్ను పెళ్ళిచేసుకొంటారు కదా, ఆయన—నిన్నేమీ—చెయ్యలేదా?"

రమణి ఆమెవైపుచురుగ్గాచూచి, "మా బావ అట్లాంటి వాడు కాదు, ఏమిటిమీరడిగేది?" అని కోపంధ్వనిస్తూ అన్నది.

"అదికాదమ్మాయ్; చూడు; ఆప్యాయంగా నిన్నెప్పుడూ ముద్దుపెట్టుకోలేదా? అన్నాను, అంతే. మొన్న ఇంగ్లీషు సినిమాకు వెళ్ళాము, అందులో వాళ్ళు ఎంగేజ్‌మెంట్ అవగానే, అంటే పెళ్ళిచేసుకోవాలని నిశ్చయించుకోగానే, అతను ఆ అమ్మాయిని ముద్దుపెట్టుకోలేదూ! అది మామూలు ఆధునిక పద్ధతే. అట్లాచేశారా సుందరరావుగారు? అన్నాను.

రమణికి ఏం చెప్పాలో తోచలేదు. "పెళ్ళిచేసుకోండా మనుకొని, మేము నిశ్చయించుకొన్నామని" ఇదివరకు మాటల సందర్భంలో శారదాంబతో తను చెప్పివుంది. మరి అట్లా జరిగినప్పుడు ముద్దుపెట్టుకోవటం చాల రమణీయమైన, ఆధునిక పద్ధతి. నిజంగా అటువంటి నిశ్చయమే జరిగివుంటే, బావ తనను తప్పక ముద్దుపెట్టుకొనేవాడే. బావ చాల మాడరన్ అని తనకు తెలుసు. ఇప్పుడు పెళ్ళి నిశ్చయమైందని చెప్పికూడ, ముద్దు పెట్టుకోలేదని అంటే, శారదాంబదృష్టిలో తనూ సుందరరావు కూడ చాల చులకనఅవుతారు.

రమణి మౌనం చూచి శారదాంబ "సిగ్గుపడకు పిల్లా! అక్కయ్యతో చెప్పితే యేం?" అన్నది. తర్వాత రమణి చెయ్యి లాక్కొని తన చేతివ్రేళ్ళు ఆమెవ్రేళ్ళమధ్య దూర్చి "ఏం, ముద్దుపెట్టుకున్నాడు కదూ?" అన్నది.

'ఊఁ" అని తలఊపింది రమణి.

శారద తనచేతితో కలిసివున్న రమణిహస్తాన్ని అదిమి, వదిలిపెట్టి, ఆమెబుగ్గ గిల్లుతూ "అదృష్టవంతురాలివి కదూ!" అన్నది.

"ఫో అక్కయ్యా" అని సిగ్గుతో, గర్వంతో రమణి శారదముఖంలోకి చూచింది.

"అందుకే, పిచ్చిపిల్లా, 'రాధికాసాంత్వనము' చదివితే దాంపత్యమాధుర్యం తెలుస్తుంది. నీకు యీ వేసవిలోనే కదూ పెళ్ళి ?"

"కాదు! ఇంటరుమీడియట్ పూర్తవాలి."

"చాలదూరమే!...నిజంగా, అమ్మాయ్, నీకు చదువెందుకు చెప్పు? దండుగ. వేసవిలోనే చేసుకోరాదూ? ఏం చక్కా, హాయిగావుండొచ్చు! ఆడవాళ్ళకు ప్రేమ, భర్త, దాంపత్యజీవితం ఇవే ఆనందాన్నిస్తాయి. కాని మిగతావి ఏంలాభం? అవన్నీ ఊరికే బడాయిగాతిరగటానికి, గొప్పలు చెప్పుకోవడానికి. చూడు, నేనున్నానా, యీ వార్డెన్‌షిప్ బాధ్యతల్లో, యీ వట్టి ఆకతాయిపిల్లలతో ఎట్లా సతమతమౌతున్నానో! నువ్వేదో మళ్ళీ మెడిసిన్ చదువుతాను పెళ్ళి తర్వాతకూడా అంటావు కానీ, అదంతా వట్టి నిష్ప్రయోజనం. చక్కగా భర్తతోవుంటే పోదూ ?"

డాక్టరీ చదివి, ఉద్యోగంచేస్తానంటే ఎంతో గొప్పగా వుంటుంది అన్న అభిప్రాయంలో వున్న రమణికి యీ మాటలు ఆశ్చర్యం కలిగించాయి.

"ఏమిటండీ. స్వతంత్రంలో వుండే ఆనందం, వంటయింటిలో మగ్గుతూవుంటే వస్తుందా ?" అన్నది.

శారదాంబ నవ్వి "అన్నీ అనుభవంలేనిమాటలు! వేదిక మీంది ఉపన్యాసాలు...వంటయింట్లో కాదు పడకటింట్లో!" అని చివరిమాట రహస్యంగా ఉచ్చరించి, రమణిబుగ్గమీంద చిటిక వేసింది.

"అయితే మీరెందుకు పెళ్ళిచేసుకోలేదు? ఎందుకు ఉద్యోగంచేస్తున్నారు?" అని ప్రశ్నించింది రమణి.

నిట్టూర్పువిడుస్తూ శారదాంబ "దానికి టైము రావాలి కదా! నీకో రహస్యం చెప్పనా? ఎవరితో అనగూడదు. ఏదీ చేతిలో చెయ్యివేయి"

రమణి శారదాంబ తనతో యిదివరకెప్పుడూ యింత సఖ్యతతో మాట్లాడలేదని జ్ఞాపకంతెచ్చుకుని, ఆశ్చర్యపడుతూ, గర్వపడుతూ, ఆమెచేతితో చెయ్యికలిపింది.

"నాకూ పెళ్ళి నిశ్చయమైనట్టే... బహుశా యింకో నెలలోపుగానే!" నిదానంగా, కళ్ళు కప్పువైపు తిప్పి, రమణి వైపు చూడకుండా అన్నదామె.

"అయితే తర్వాత ఉద్యోగంచెయ్యరా?" అన్నది రమణి.

"ఏమో! కాని నాకు యీవూళ్ళో వుండాలనిలేదు. మద్రాసులో ఉద్యోగం దొరికితే బాగుండును."

"మీకు కాబోయేభర్త ఎవరో చెప్పరూ?"

"వద్దు. సమయంవచ్చినప్పుడే తెలుస్తుంది. కొన్ని చిక్కులున్నాయి, అందుకని."

"పోనీ, యీవూరేనా? అదైనా చెప్పండి."

"ఉహుం, ఇంకేమీ చెప్పను. నువ్వు గడుసుదానివే!

మెల్లగా చెప్పించాలని ప్రయత్నిస్తున్నావు." అని నవ్వి శారదాంబ కొంచెంఆగి, మళ్ళీ "ఈ వూరు కాదులే...ఇంక ప్రశ్న లడగబోకు" అన్నది.

నాగమ్మ తెచ్చినసోడాలు చెరొకటి తీసుకున్నారు.

"నీకు నిద్రరావటంలేదా?" అని రమణి నడిగింది శారదాంబ.

"లేదు. వచ్చే నిద్రకాస్తా ఎగిరిపోయింది."

"అయితే నేను కొన్నిపద్యాలుచదువుతా, వింటావా?" శారద పుస్తకంవిప్పి, పడుకుని చదువుతూంది. ఆమెచదివే ధోరణి రాగయుక్తంగా వుంది. కొంత కొంత తెలిసినా, బాగా అర్థంకాలేదు రమణికి ఆపద్యాలు. శారద చదవటం ఆపి మంచంమీద లేచి కూర్చున్నది.

"అబ్బ! పాడుసోడా! కడుపులో తిప్పేస్తూంది." అంటూ స్నానాలగదిలోకి పోబోయి, అక్కడే వాంతిచేసుకున్నది.

మళ్ళీ నాగమ్మను పిలవడానికి రమణి వెళ్ళింది.

## 14

గురువారం వచ్చింది. విమలను బెదిరిస్తూవచ్చిన రెండవ వుత్తరంప్రకారం కెమిస్ట్రీ ప్రాక్టికలుక్లాసుకు ఆమె మల్లెపువ్వులు పెట్టుకొని పోవలసినరోజు. ఆ రోజు ఏం జరుగుతుందో, ఎవడైనా తనవైపు పరీక్షగాచూస్తాడో, వచ్చి పలకరిస్తాడో కనిపెట్టవలె నని నిశ్చయించుకొన్నది విమల. పొడుగ్గా, దిట్టంగా బల ప్రయోగమన్నభావాన్ని సూచించే ఆకారం ఆమెతరగతి

వాళ్ళలో నలుగురైదుగురుకి మాత్రమే వుంది. వాళ్ళను ముఖ్యంగా గుర్తుపెట్టుకొన్నది.

పువ్వులేజాతిపీ పెట్టుకోకుండా వెళ్ళింది కాలేజి వెయిటింగ్‌రూములో పార్వతికోసం ఎదురుచూస్తూ కూర్చుంది. గంటకొట్టి, తరగతికి వెళ్ళటానికి బయలుదేరబోతూవుంటే వచ్చింది పార్వతి. మాట్లాడుకోవటానికి వ్యవధలేదు. క్లాసుకు వెళ్ళారు.

వెళ్ళి కూర్చున్నతర్వాత తెలిసింది పార్వతిజడలో పెద్ద మల్లెపువ్వులబంతివుందని. విమలమనస్సు పాఠంమీదలేదు. అందరిజడల్నీ చూచింది. ఇద్దరు కనకాంబరాలు, ఒకరు గులాబీ పెట్టుకున్నారు. మిగతా అయిదుగురుజడల్లో పువ్వులే లేవు. పువ్వులు సాయంకాలం పెట్టుకుంటారు. ప్రొద్దున తరగతికి పెట్టుకొని రావాలంటే దానికి కొంతప్రయత్నం అవసరం; క్రిందటిసాయంత్రమే పువ్వులు వాడకుండా భద్రంచెయ్యాలి. మల్లెపువ్వులు విరివిగా దొరకటంలేదు కూడాను. పార్వతి బుద్ధిపూర్వకంగా, ఏదో ఉద్దేశంతోనే మల్లెలబంతి ధరించి వచ్చింది. వుత్తరం జ్ఞాపకమున్నదన్నమాట. మాట్లాడుకోవటానికి వీలు లేదు. ప్రిన్సిపాల్‌గారు షేక్స్పియరు చెప్పుతున్నారు.

విమల తన పుస్తకంఅట్టమీద పెన్సిలుతో 'మల్లెపూలు' అని వ్రాసి, పార్వతికి చూపించింది. దాన్నిచూచి, పార్వతి తన కేమీతెలీనట్లు ప్రిన్సిపాల్‌వైపు తదేకంగా చూస్తూ పాఠం వింటూవుంది.

కోపంవచ్చి మోచేత్తో పార్వతిని పొడిచింది విమల. పార్వతి దృష్టిమరల్చకుండా, తలత్రిప్పకుండానే "ఇన్" అంటూ

ఊరుకోమ్మని విమలను గిల్లింది. మాట్లాడించే ప్రయత్నం విరమించుకొన్నది విమల.

గంటకొట్టగానే కెమిస్ట్రీ లేబరేటరీకి వెళ్ళాలి. "రూముకు వెళ్ళివద్దాము రా" అని పార్వతిని వెయిటింగ్ రూమువైపు లాక్కువెళ్ళింది విమల. దారిలోనే "ఏమిటి నీ తెలివి. నువ్వెందుకు పెట్టుకున్నావు అవి?" అన్నది కోపంగా.

"చెప్పతా పద!" అంటూ పార్వతి వెయిటింగు రూములో విమలను ఒకప్రక్కకుతీసుకువెళ్ళి "చిన్నడిటెక్షన్, అంతే" అన్నది నవ్వుతూ.

"ఏమిటి నువ్వు చేసేడిటెక్షన్? తీసెయ్యి" విసుగ్గా అన్నది విమల.

"ఎందుకట్లా భయపడతావు? మనమిద్దరం ఒక్క టేబిల్ దగ్గరే వుంటాముగా క్లాసులో—వాడి తెలివి ఎట్లా పని చేస్తుందో నేనుచూడాలి. ఇవాళ పూర్తి ఫలితం తెలీకపోయినా, కొద్దిరోజుల్లోఅయినా తెలుస్తుంది. వాడు నీకు మళ్ళీ వ్రాయవచ్చు; లేక నాకే వ్రాస్తాడేమో చూడవచ్చు. అంతేకాదు. నా దృష్టిలో కొందరు అనుమానితులున్నారు. వాళ్ళసంగతి కూడా దీనివల్ల ఏమైనా తెలీవచ్చు. నీకేం బాధలేదు, పద, టైమైంది" అని పార్వతి విమలతో లేబరేటరీవైపు నడిచింది.

లేబరేటరీకి వెళ్ళినప్పటినుంచి చెయ్యవలసిన ఎక్స్పెరిమెంటుమీద కాకుండా వాళ్ళిద్దరిదృష్టి చుట్టూవున్నవాళ్ళమీదే వుంది. ఒకరు కొంతసేపు ఎక్స్పెరిమెంటువిషయం చూస్తూవుంటే, ఇంకొకరు మెల్లగా ఎదుటివాళ్ళని, ప్రక్కవాళ్ళని గమనిస్తూవున్నారు.

ఫలితమేమీ కనిపించలేదు. అంతా ఎప్పటిలాగే వుంది. ఎవరినీ అనుమానించటానికి వీలులేదు. క్రొత్త సంగతులేమీ జరగలేదు. రాఘవులు క్లాసుకే రాలేదు.

గంటకొట్టారు. ప్రాక్టికలు ఇంకా ఒకగంట వుంది. గంట కొట్టగానే బి. ఏ. జూఆలజీ మెయిన్ విద్యార్థులు వాళ్ళ కెమిస్ట్రీ రికార్డుపుస్తకాలు తీసుకోవటానికి ప్రాక్టికల్ జరుగుతున్న గదిద్వారా అవతలిగదిలోకి వెళ్ళి, పుస్తకాలు తీసుకొని మళ్ళీ వరుసగా వెళ్ళిపోయ్యారు. వాళ్ళు పదిహేనుమంది. ప్రతివారం ఆ సమయానికి అట్లా వెళ్ళుతూనేవుంటారు. ఆ సంఘటనలో క్రొత్త ఏమీలేదు.

క్లాసు అయిపోయింది. వెయిటింగ్‌రూముకు వెళ్ళిన తర్వాత పార్వతి, విమల ఒకర్నొకరు చూచుకుని పెదవి విరిచారు తమఓటమిని అంగీకరిస్తూ. పార్వతి ఆలోచిస్తూవుంది. ఆమె కేదో గుర్తువచ్చినట్టుంది...చప్పున లేచి,

"మరచిపోయాను...ఈ పుస్తకం లైబ్రరీలో తిరిగిఇచ్చివెయ్యాలి. అయిదునిమిషాల్లో వెళ్ళోద్దాము రా" అన్నది విమలతో.

ఇద్దరూ లైబ్రరీకివెళ్ళారు. లైబ్రరీఅసిస్టెంటు రాచయ్య, అటెండరు మాత్రమే వున్నారు. ఆసమయం—ఒంటిగంట రెండుగంటలమధ్య—విద్యార్థినులు పుస్తకాలుతీసుకోవటానికి. ప్రత్యేకింపబడిన సమయం. ఆ వేళలో మిగతావిద్యార్థులకు పుస్తకాలివ్వరు. ఆడవాళ్ళసంఖ్య యాభైకి మించదు. వాళ్ళలో తరచు పుస్తకాలుతీసుకుని చదివేవాళ్ళూ కొందరే. అందువల్ల రాచయ్యకు అటెండరుకు మంచి విశ్రాంతి ఆ సమయంలో.

రాచయ్య ముప్ఫయి ఏదేళ్ళవాడు. ఈ ఉద్యోగంలో ప్రవేశించి రెండేళ్ళయింది. అంతకుపూర్వం యుద్ధకాలంలో మిలటరీ రిక్రూటింగ్ ఆఫీసుల్లో గుమాస్తాగా పనిచేశాడు. మనిషి పొడుగ్గా, ఆకర్షణీయంగా వుంటాడు. ఎప్పుడూ బుష్ కోటూ, పాంట్సు వేసుకుని నీటుగా వుంటాడు. జీతం తక్కువే అయినా, తన దుస్తులు, తలనూనెలు, సినిమాలవిషయంలో లోపంరానీయడు. ఇంటిఖర్చుభారం చాలవరకు తండ్రిమీదే వుంది. కాలేజిహాస్టలుకెదురుగా సబ్బులు, టూతుపేస్టులు, బ్లేడ్లు వగైరాలఅమ్మే పెద్దకొట్టు నడుపుతున్నాడు రాచయ్యతండ్రి.

కౌంటరుదాటి సరాసరి లోపలికి వెళ్ళటానికి, కావలసిన పుస్తకాలకోసం బీరువాల్లో వెదుక్కోవటానికి ఆడపిల్లలకు, అధ్యాపకులకు మాత్రం ప్రత్యేకమైనవసతి. పార్వతి కౌంటరు దాటి అవతలవైపుకువెళ్ళిఅక్కడేదో పనిచూస్తున్న రాచయ్యకు తెచ్చిన పుస్తకం యిచ్చింది. "ఇంకోపుస్తకం కావాలా ?" అంటూ బీరువాలతాళాలగుత్తి పార్వతి నిలుచున్నదగ్గఱగా ఉన్న చిన్న టేబిల్ మీద పడవేశాడు రాచయ్య.

విమల, పార్వతి ఒక బీరువా తెరచి పుస్తకాలుచూశారు. పార్వతి అందులో ఒక ఇంగ్లీషునవల తీసుకొని మళ్ళీ ఆచిన్న టేబిల్ దగ్గఱకు వెళ్ళింది. వెళ్ళటంలో తెఱచివున్న బీరువా తలుపు తలకుతగిలి పువ్వులబంతి క్రిందపడ్డది. ఆమె చూడలేదు విమలకూడా గమనించలేదు.

పార్వతి టేబిల్ మీదవున్న చీటీలలో ఒకదాన్ని తీసి పుస్తకం నెంబరు, పేరు వగైరా వ్రాస్తున్నది. రాచయ్య బీరువా తాళంవెయ్యటానికి వెళ్ళాడు.

పార్వతి వ్రాయటం ముగించి చీటీ, పుస్తకం రెండూ కౌంటరుమీద పెట్టింది. రాచయ్య బీరువాదగ్గరనుంచి వస్తూ, దారిలోనిలుచున్న విమలతో "మీ పూలచెండు ఇదిగో"నని పువ్వులబంతి ఇవ్వబోయాడు, "నావి కావు" అన్నది విమల.

అతను కౌంటరుదగ్గరకు వెళ్ళేటప్పటికి, పార్వతి తను అక్కడపుంచిన పుస్తకాన్ని చూపిస్తూ "దాన్ని తీసుకుంటాను ఎంటరుచేసుకోండి" అన్నది.

రాచయ్య పువ్వుల్ని పార్వతిదగ్గరున్న టేబిల్ మీద పెట్టాడు. పుస్తకం వివరాలన్నీ చీటీలో సరిచూచి పుస్తకాన్ని పార్వతి కందించాడు. పార్వతి దాన్ని, పువ్వుల్నికూడా తీసుకొని "థాంక్స్" అని చెప్పి, విమలతో కలిసి లైబ్రరీనుంచి బయటికి వచ్చింది.

ఇద్దరూ మెట్లెక్కుతూవున్నారు. పార్వతి మెట్లప్రక్కనున్న చిత్తుబుట్టలో పువ్వుల్ని పడవేసింది.

"ఎందుకు పారేస్తున్నావు?" అన్నది విమల.

"వాటితో పని తీరిపోయిందిగా. అదీగాక వాడు తన చేత్తో తాకినవాటిని మళ్ళీ తల్లో పెట్టుకోమంటావా?"

"అయితే అక్కడే వదిలిపెట్టకపొయ్యావా? తీసుకురావడం దేనికి?"

"వాడు వాటిని వాసనచూస్తూ, మురిసిపోయ్యేందుకా? వట్టి రాస్కెల్ వాడు...పువ్వులు తీసుకొచ్చి నీ కందివ్వాటమేమిటి, లేకపోతే!"

విమల ఆశ్చర్యంగా పార్వతివైపు ఒకక్షణం చూచి, "అయితే వుత్తరంవ్రాసింది వాడేనంటావా?"అని ప్రశ్నించింది.

"ఇంకెవరు? నీకు తెలీదు వానిసంగతి. నేను జూనియర్ క్లాసుల్లో ఉన్నప్పుడే గమనించాను వాడి వెధవవేషాలు. ఇప్పుడు నేనంటే జాగ్రత్తగా ఉంటాడు. అదట్లాఉంచి నాకీ విషయం చెప్పు. వాడు నీదగ్గరెప్పుడూ పిచ్చివేషాలు వెయ్యలేదా? చాలముఖ్యం, ఆలోచించి జ్ఞాపకంతెచ్చుకో."

విమల చిరునవ్వుతో "డిటెక్టివ్‌లా అడుగుతున్నావే ...లేదు. పాపం—నేనసలు లైబ్రరీకి వెళ్ళితేగా నువ్వు వెళ్ళినన్నిసార్లు. నా క్కావలసినపుస్తకాలు నువ్వో లీలో తెస్తూ ఉంటారాయె. నా టిక్కెట్లలో ఒకటి నీ దగ్గరా, ఇంకొకటి లీల దగ్గరా."

"సరే...నీతో చెప్పలేదు నేను. పోయినసంవత్సరం మొదట్లో వాడు పుస్తకాలిస్తూ, తీసుకుంటూ ఒకవిధమైన చూపు చూచేవాడు నాకళ్ళల్లో కళ్ళుపెట్టినట్లు. నా కొంచెం భయంవేసినమాట నిజమే. కాని అంతలో ఝడుసుకుని లైబ్రరీకి వెళ్ళటం మానేస్తానా? వాడట్లా చూచినప్పుడు నేనూ కళ్ళుపెద్దవిచేసి వాడిని ఏకంగా స్టేర్ చెయ్యటం మొదలుపెట్టాను. అప్పటినుంచి చూడటం మానేశాడు. కాని తెలుగుపుస్తకాలు కొన్ని తీసుకొచ్చి, అంటే—ముఖ్యంగా చలంకథలూ, ఇంకా తమాషాపేర్లుండేవి 'నీవే నా భార్యవు', 'నే నెవరిభర్తను', 'అల్లరి పిల్ల' లాంటివి—తీసుకొచ్చి, 'ఇవి చదివారా మీరు? అందరూ వీటికోసం అడుగుతున్నారు. మీకు కావాలేమోనని రిజర్వుచేశాను' అన్నాడు రెండుమూడు సార్లు. అప్పటినుంచి తెలుగుపుస్తకాలు తీసుకోకుండా ఇంగ్లీషువే తీసుకోవటం, అక్కడికి వెళ్ళినప్పుడు ఇంగ్లీషులోనే మాట్లాడటం ప్రారంభిం

చాను. ఏమనుకున్నాడో మరి, ఇప్పుడు మంచిగానే వుంటు న్నాడు. అందుకే ఇప్పుడు నేను తెలుగులో మాట్లాడినా ఫరవాలేదు.”

వెయిటింగ్ రూము చేరారు. హాస్టలునుంచి వచ్చిన మధ్యాహ్నం ఫలహారం తింటూండగా విమల అన్నది.

“ఇన్నాళ్ళు లైబ్రరీరాచయ్యసంగతి నాతో అనలేదే! ఎందుకని?”

“ఆ ప్రసక్తి రాక చెప్పలేదనుకుంటాను. అందులో అది నా కొంచెం అవమానకరమైనవిషయం అనుకున్నానులే అప్పుడు. మనకుబాగాపరిచయమైందికూడా రెండోటర్ములోనే. ఆ సంగతి మొదటిటర్ములో జరిగింది.”

“మరి యీ వుత్తరంసంగతేమిటి? నీ అనుమానం రాచయ్యే వ్రాశాడనా?”

“తప్పకుండా. ఇట్లాంటివాళ్ళకు ఏఅమ్మాయిమీదైనా ఒక గాలికబురు తెలిసిందనుకో ఇంక ఆమెనుగురించి ప్రయత్నిస్తే సులభంగా లొంగుతుందనే అభిప్రాయం వుంటుంది. నీవు సుందరరావింటికి వెళ్ళటాన్నిగురించే కదా ఆ రెండు వుత్తరాల్లోనూ వుంది. కాబట్టి వీడికి అ సంగతివల్లే ధైర్యం వచ్చివుంటుంది అని వూహించవచ్చు.”

“నీ వూహ తప్పు. వా డెప్పుడూ లైబ్రరీలో వుంటాడు, నన్నుచూసే అవకాశం లేదుకదా; లేబొరేటరీకి పువ్వులుపెట్టుకుని వస్తే, వాడు చూడటం మెట్లా? నువ్వు పిలిచావు కాబట్టి లైబ్రరీకి వచ్చాను. లేకపోతే ఆదారినగూడా వెళ్ళే అవకాశం లేదు. ఇదొక పాయింటు. అంతేకాదు, వాడే వ్రాశాడను

కుంటాం. అప్పుడు మనం లైబ్రరీకి వెళ్ళగానే, నావైపు చూచి నేను మల్లెపువ్వులు పెట్టుకున్నానా లేదా అని వాడు తెలుసు కుంటాడు. అట్లా తెలుసుకునేవుంటే, ఆ పువ్వులు నావని ఎందుకు పొరపాటుపడతాడు? ఇది రెండవపాయింటు. కాబట్టి రాచయ్య నిర్దోషి. వాడికీ వుత్తరంసంగతే తెలీదు."

"పాపం! కాని నీ కింకొక్క విషయం తెలీదు. అందువల్లే ఇంత అమోఘంగా వాదిస్తున్నావు. అదేమిటంటే మనం ప్రాక్టికలుక్లాసులో వుండగా వీడు ఒకసారి వచ్చి వెళ్ళాడు. బహుశా ఏదో నెపంపెట్టుకునే వచ్చివుంటాడు. కాని వాడు వచ్చి వెళ్ళటంమాత్రం నేను చూశాను. అప్పుడు వాడిమీద అనుమానం కలుగలేదు కాబట్టి ఆ సంగతి నీతో చెప్పలేదు. వాడు వచ్చినప్పుడు నువ్వు అబ్జర్వేషన్పుస్తకంలో వ్రాస్తు న్నావు; నేను చుట్టూ పరీక్షిస్తున్నాను. తర్వాత ఏమిజరిగిందో ఇప్పు డాలోచించు. నీ జడలో పువ్వులు లేవని వాడికి తెలి సింది. వెళ్ళి, తర్వాత ఏం ఎత్తువెయ్యాలని ఆలోచిస్తూ వుంటాడు. అందుకే నిన్ను లైబ్రరీకి తీసుకువెళ్ళాను. పువ్వులు క్రిందపడేట్టు నేను చెయ్యాలనేచేశాను. చూడనట్టు నటించాను. అప్పుడు వాడేంచేశాడు? పువ్వుల్ని చూడగానే వుత్తరంసంగతి నీకు జ్ఞాపకంచెయ్యాలని వాడికి తోచివుంటుంది. అందుకని అవి తీసుకొచ్చి చాల అర్థవంతంగా నీ చేతి కివ్వబోయాడు! లేకపోతే, అవి నీవి కావని నువ్వంటే, నా చేతికి ఎందుకు తెచ్చి యివ్వ లేదు? నీవి కాకపోతే తప్పక నా వేనని వాడికి తెలుస్తుంది కదా! చూశావా నా Logic ఎట్లా వుందో! ముమ్మాటికి రాచయ్య

వ్రాసిందే ఆ వుత్తరం. నువ్వుమాత్రం వాడేంజేస్తాడో కనిపెట్టి వుండాలి.'' పార్వతి తనడిటెక్టివ్ విజయగర్వాన్ని వ్యక్తచేసింది.

''డిటెక్టివ్ పుస్తకాలు చదివినందుకు కొంత ఫలితం చూపించావే!'' అన్నది విమల, ఆమెవాదన కొంతవరకు అంగీరిస్తూ.

మధ్యాహ్నం క్లాసులు ప్రారంభంకావటానికి అయిదు నిమిషాలవ్యవధివుంది. సుందరరావు పిలుస్తున్నాడని కబురు వచ్చింది. పార్వతిని వెంటదీసుకుని ఫిజిక్సులేబరేటరీకి వెళ్ళింది విమల.

''ప్రోగ్రాం శుక్రవారం—అంటే రేపు—వుంటుదను కొన్నామా, మళ్ళీ మార్చవలసివచ్చింది. రేపు విద్యామంత్రి వస్తారట కాలేజీకి. ఆయన మాట్లాడినతర్వాత ప్రోగ్రాం పెట్టుదామంటే ప్రిన్సిపాల్ వద్దన్నారు. శనివారం అంటేఎల్లుండి–తప్పకుండా వుంటుంది. ఈ విషయం చెప్పాలనే పిలిచాను'' అన్నాడు సుందరరావు.

''నేను మానేస్తే మంచిదేమో!'' అన్నది విమల.

''మరి...ఆ రోజు నువ్వేమీ చెప్పకపోతివి...నీ యిష్టం!'' అన్నాడు విమలవైపు పరీక్షగాచూస్తూ సుందరరావు.

విమల ఆలోచిస్తోంది.

''వద్దు...విమలప్రోగ్రాం వుంచండి మేష్టారూ!''అన్నది పార్వతి; ''టైమైంది రా పోదాం'' అని విమలను మాట్లాడ నివ్వకుండా లాక్కుని వచ్చివేసింది.

''ఏమిటే నువ్వుచేసింది? ఈ వుత్తరాలూ, పాటూ నాకు పిచ్చెత్తేట్లుంటే, ఇంకా నేను పాడేదేమిటి?'' అన్నది విమల.

"నీ మంచికే చేశాను. నువ్విన్నాళ్ళూ సుందరరావు గారింటికి వెళ్ళివచ్చి, యిప్పుడు ప్రోగ్రాంఇవ్వకపోతే అందరూ ఏమనుకుంటారు? నువ్వు వెళ్ళింది రిహార్సల్‌కు కాదనీ, వాళ్ళ అనుమానాలే నిజమనీ అనుకుంటారు. రిహార్స్‌చేసి సిద్ధంగా వున్నప్రోగ్రాం ఎట్లాగో పూర్తిచెయ్యటమే వుత్తమం."

# 15

ఆరుగంటలకే నాటకప్రదర్శనంకోసం ఏర్పాటైన ఆవరణ అంతా విద్యార్థులతో నిండిపోయింది. మూడువైపుల కాలేజీ భవనం ఒకవైపు వరండా, మధ్యనున్న చతురస్రపుస్థలం యిటు వంటిప్రదర్శనలకు, సమావేశాలకు వుపయోగిస్తారు.

వరండాకెదురుగా స్టేజీ ఏర్పాటుచేశారు. స్టేజివెనుక నున్నగది గ్రీన్‌రూమ్. స్టేజీకికుడివైపున కొన్నివరుసలు కుర్చీలు, తర్వాత బెంచీలు వేశారు. బెంచీలలో చివరి ఏడెనిమిది విద్యార్థినులకు కేటాయింపబడినవి. మిగతాకుర్చీలు, బెంచీలు లెక్చరర్లకు, అతిథులకు ఉద్దేశింపబడినవి. స్టేజికిఎదురుగాను, ఎడమ వైపునా వున్న స్థలమంతా టార్పాలిన్‌పరచి విద్యార్థులు కూర్చోవటానికి వీలుగావుంది.

కుర్చీలువేసిన వైపు, కుర్చీలకూ, గదులకూమధ్య, ఖాళీవరండా వుంది. ఆవరణ నిండిపోవటంతో, ఆలస్యంగా వచ్చినవిద్యార్థులు ఆ వరండాలో గుంపులుగుంపులుగా పొడుగునా నిలుచున్నారు. ఆడపిల్లలుకూర్చున్నచోట వాళ్ళబెంచీల నానుకుని ఒకగుంపు చేరింది.

ఆపున్నరకు తెరతొలగించమని సుందరరావు ప్రత్యేకం మయ్యాడు. చప్పట్లధ్వనితో సభ నిండిపోయింది.

"కారణాంతరాలవల్లవాయిదాపడుతూవచ్చినకే ఈ ప్రదర్శనం ఈరోజుఏర్పాటుచెయ్యటానికి వీలైనందుకు నాటకసంఘం వారు సంతోషిస్తున్నారు. ఈ నాటకంలో వేషధారులైనవాళ్ళు మీలోనివిద్యార్థులే కాబట్టి ఓపికతో చూచి, విని వాళ్ళకు ప్రోత్సాహమిస్తారని ఆశిస్తున్నాను...కార్యక్రమం మొదట సంగీతంతో ప్రారంభమాతుంది"...ఎవరో గట్టిగా దగ్గారు... సుందరరావు కొంచెమాగి "పాల్గొనేవారు కుమారి విమల, కుమారి పార్వతి" అన్నాడు. మళ్ళీదగ్గు...దాన్ననుసరించి నవ్వు, గుసగుసలు వినబడ్డాయి. "సంగీతం అయినతర్వాత నాటకం ప్రారంభమాతుంది. మీరు నిశ్శబ్దంగావుండాలని కోరుతున్నాను" అని చెప్పి లోపలికి వెళ్ళిపోయాడు సుందరరావు.

విమల, పార్వతి, మృదంగంవాయించటానికి వచ్చిన హైస్కూలు సంగీతపుమేష్టరు, స్టేజిలోపల సిద్ధంగావున్నారు. సుందరరావు సరాసరి గ్రీన్‌రూములోవున్న వేదమూర్తిదగ్గరకు వెళ్ళాడు. పాత్రలవేషధారణలో, రంగులద్దుకోవటంలో సహాయంచేయటానికి అంగీకరించి వచ్చి, ఆ పనిమీద వున్నాడు వేదమూర్తి.

సుందరరావు అతనితో "మూర్తిగారూ!... మీరు వెళ్లి స్టేజీమీద పాటల్ని ఒకదానితర్వాత ఒకటి ఎనౌన్సు చేయండి. ఇదుగో కాగితం. యీ వరుసలోనే పాడుతుంది విమల. పాటలన్నీ పూర్తవగానే తెరదింపించెయ్యండి, నే నీపని చూస్తుంటాను." అన్నాడు.

తెరలేచింది. "మొదటిపాట — జయదేవకృతి ..." అని మైక్‌లో చెప్పి పక్కకు తప్పుకున్నాడు వేదమూర్తి.

స్రవంతివలె నిర్మలంగా మధురంగా సాగిన సంగీతాన్ని అందరూ నిశ్శబ్దంగా, సావధానంగా ఆస్వాదించారు. చివరి పాట "పూర్ణమ్మపాట". పూర్ణమ్మకథ కన్నులకుగట్టి హృదయానికి హత్తుకొన్నది. పాట విన్నంతసేపు వేదమూర్తిదృష్టి, మనస్సు విమలమూర్తిలో లీనమయ్యాయి. సంగీతప్రభావమో, పూర్ణమ్మపాటలోని కవిత్వాశక్తో, ఆ కథావస్తువు యొక్క హృదయవిదారకరమైన కరుణో, లేక అన్నింటి సమన్వయమో ఒక ఊహాజగత్తు సృష్టించి వేదమూర్తిని మైమరచేట్టు చేసింది. పాట అయిపోయింది; కాని వెంటనే వేదమూర్తి కదలలేదు; లేవలేదు. తర్వాత కార్యక్రమాన్ని గురించి చెప్పటానికి మైక్ దగ్గరకు వెళ్లలేదు. సభకెదురుగా కూర్చున్న విమల ఏమీతోచక స్టేజిప్రక్కకు, వేదమూర్తి వైపుచూచింది ప్రశ్నార్థకంగా. ఆమెవైపే చూస్తున్న అతని కెదురై, ఆ కాటుకకన్నులచూపు, మెఱుపులా ఆమెసౌందర్య రేఖను హృదయంలో నాటింది.

"వన్స్‌మోర్" అని సభలోనుండి కేక. వేదమూర్తి చప్పున లేచి మైక్ దగ్గఱకు వెళ్లాడు. "వన్స్‌మోర్" అని మళ్ళీకేక. "సంగీతకార్యక్రమం అయిపోయింది. నాటకం ప్రారంభమవుతుంది" అన్నాడు వేదమూర్తి. "వన్స్‌మోర్" అంటూ రెండుమూడుకేకలు, చప్పట్లు!!

వేదమూర్తికి సందిగ్ధావస్థ! తను ఏర్పాటుచేసిన ప్రోగ్రాం కాదు పొడిగించటానికి, మార్పులు చెయ్యటానికి.

సరేనని తను అంటే, విమల పాడటానికి యిష్టపడుతుందో, యిష్టపడదో! ఆమెతో తానిదివరకు ఎన్నడూ మాట్లాడి వుండ లేదు. "I am sorry, the program is over" అన్నాడు ఇంగ్లీషులో కోపంగా. ఇవతలికి వచ్చి, తెర దించమన్నాడు.

విమల, పార్వతి లేచారు. తెరకవతల సభలో అంతా అలజడి ప్రారంభమైంది. "పాటలు కావాలి" అంటూ రాజకీయ నినాదంలాగ, చాలమంది ఏకకంఠంతో భజన ప్రారంభించారు.

సుందరరావు వచ్చాడు. విమలను ఇంకొక రెండు కృతులు పాడమన్నాడు. ఆమె అంగీకరించింది. సుందరరావు తెర ఒత్తిగించుకొని సభముందుకి వెళ్ళాడు. భజన, చప్పట్లు రెట్టింపయ్యాయి. కాని సుందరరావు ఏదో చెప్పబోవటం గమనించి "ఇష్" అనుకొని ఒకక్షణం నిశ్శబ్దంగా వున్నారు. "ఇంకొక రెండుకృతులు వుంటాయి. మీరు నిశ్శబ్దంగా వుండాలి మరి" అన్నాడు. విజయసూచకంగా సభ చప్పట్లతో జవాబిచ్చింది.

విమల రెండుకృతులు పాడింది. పాటలు పూర్తికాగానే, ఆలస్యం లేకుండా తెర వాలింది.

నాటకసంఘం కార్యదర్శి విమలను, పార్వతిని సభలో కూర్చోపెట్టానికి తీసుకొనిపోతానన్నాడు. విమల సుందరరావును పిలవమన్నది. "నేను యింటికి వెళ్తానండి ... మా అమ్మకు అస్వస్థతగా వుంది. మీరైతే దయచేసి నాకు బండి తెప్పించి పెట్టండి" అన్నది సుందరరావుతో.

సుందరరావు తెరలాగటానికి నిలబడివున్న జవాన్ని జట్కా తీసుకురమ్మని పంపాడు.

నాటకంకోసం స్టేజిమీద అన్నీ సర్దుతున్నారు.

జట్కా వచ్చింది. జవాను ఆడవాళ్లుకూర్చున్నదగ్గర చాల సమ్మర్దంగావుండి, విద్యార్థులు త్రోవయివ్వటంలేదనీ, అల్లరిచేస్తున్నారనీ చెప్పాడు.

సుందరరావు ఇటూఅటూ కార్యదర్శికోసం చూశాడు. అతను కనిపించలేదు. వేదమూర్తితో "వాళ్ళను కొంచెం పంపించివస్తారా, నేను స్టేజివిషయం చూడాలి." అన్నాడు. వేదమూర్తి సరే నన్నాడు.

సమ్మర్దమంతాఆడవాళ్ళబెంచీలదగ్గరేవుంది. వేదమూర్తి దారికోసం, చేతుల్తో విద్యార్థుల్ని ఒత్తిగించి, సర్దవలసివచ్చింది. వెనుకనుంచి రెండు పిల్లికూతలు వినిపించాయి.

జట్కాదగ్గరకు వచ్చారు. "శ్రమ తీసుకొన్నారు, నమస్కారమండి." అని వేదమూర్తికి కృతజ్ఞత తెలిపి విమల, పార్వతి బండెక్కారు.

వేదమూర్తి మళ్ళీ స్టేజీవైపు రావటానికి దారిలేదు. విద్యార్థుల వీపులు, తలలే కనిపిస్తున్నాయి. ఒకరిద్దరు వెనక్కి చూచి ప్రక్కకు తొలగబోయినప్పటికి గుంపులో దారిఏర్పడే సూచనలు లేవు. వాళ్ళ భుజాలు తాకుతూ, ఒత్తిగిస్తూ కొంత వీలుచేసుకుని గుంపులోకి జొరబడ్డాడు. మధ్యకు చేరేటప్పటికి ఒకవైపునుంచి ఒత్తిడివచ్చి ఒకరిద్దరు విద్యార్థులు విసురుగా మీదపడ్డారు. వేదమూర్తి ఆవైపు తిరిగి వెనుకనున్నవాళ్ళ నుద్దేశించి, "ఏమిటిది, తొయ్యొద్దండి." అన్నాడు కోపంగా. "ఊఁయ్" అని ఎవరో కూశారు. ఒకడు "కాలు, కాలండీ! తొక్కేస్తున్నారు" అని అరచి వేదమూర్తిని చేతుల్తో గట్టిగా

బలంకొద్దీ ఎదుటివాళ్ళమీదికి నెట్టివేశాడు. వేదమూర్తి వాళ్ళమీద పడ్డాడు. వాళ్ళు పట్టుకొన్నారు. నిలవరించుకొని నెట్టినవాణ్ణి చెంపమీద కొట్టాడు వేదమూర్తి. వాడు ఒక్క క్షణం నిశ్చేష్టుడై వెంటనే వేదమూర్తిచొక్కా లంకించుకొన్నాడు. చుట్టూవున్నవాళ్ళు వాణ్ణి నివారించారు. కొందరు వేదమూర్తిని స్టేజివైపు తీసుకొనివెళ్ళిపోయారు.

ఈ గొడవ గమనించి, కూర్చున్నవాళ్ళల్లో కొందరు లేచి చూస్తున్నారు. మరికొందరు వరండావైపు రాబోతున్నారు. గొడవజరిగిన గుంపులోనివాళ్ళు గట్టిగా మాట్లాడుకుంటూవున్నారు. కొంతమంది ఆవరణదాటి బయటికి వెళ్ళారు. ఇంతలో తెరతీసి మళ్ళీ వేశారు.

సుందరరావు వేదమూర్తిద్వారా జరిగినసంగతి తెలుసుకుని, స్టేజిలోనుంచి వరండావైపు వచ్చాడు. అక్కడున్న విద్యార్థులెవరూ అతనిప్రశ్నలకు సమాధానమివ్వలేదు. తప్పించుకుని వెళ్ళిపోతున్నారు. ఇంతలో జనార్దనం, చంద్రశేఖరం, రాఘవులు మరియిద్దరు సుందరరావుదగ్గరకు వచ్చి "ఇటురండి మాస్టారు!" అని అతన్ని స్టేజీవైపుకు తీసుకువెళ్ళారు.

శేషయ్యశాస్త్రి, సుబ్బరామయ్య, ఎవరో నలుగురైదుగురు తప్ప, అధ్యాపకులు చాలమంది నాటకప్రదర్శనకు రాలేదు. వచ్చినవాళ్ళు కొంతమంది ఊళ్ళోవాళ్ళు; మిగతా బెంచీలలో విద్యార్థులే కూర్చున్నారు. శేషయ్యశాస్త్రి, సుబ్బరామయ్య గొడవజరిగినచోటవున్న విద్యార్థులతో మాట్లాడుతూ వున్నారు.

"వేదమూర్తిగారు వెంటనే క్షమాపణ చెప్పాలి స్టేజి మీద," అన్నాడు చంద్రశేఖరం సుందరరావుతో.

"మొదట నాటకంజరగటం ముఖ్యం" అన్నాడు సుందరరావు.

"అట్లాకాదు, క్షమాపణ ఇప్పుడే చెప్పితీరాలి, లేక పోతే నాటకం జరగదు."

"అవునండీ, క్షమాపణ వెంటనే చెప్పటం న్యాయం" అన్నాడు జనార్దనం చంద్రశేఖరంతో అంగీకరిస్తూ.

"నాటకం జరగకూడదంటే యిప్పుడే నిలిచిపోతుంది. నాకేం బాధలేదు. కాని క్షమాపణసంగతి విచారణతో కాని తేలేవిషయం కాదు" అన్నాడు సుందరరావు.

"మీరు వేదమూర్తిగారికి చెప్పి క్షమాపణ ఇప్పించాలి. ఆయన నారాయణస్వామిని విద్యార్థులందరిఎదుట కొట్టారు. ఆడపిల్లలుకూడ చూస్తున్నారు. దీనికి వేరేవిచారణ అనవసరం" అన్నాడు చంద్రశేఖరం.

"నా సంబంధం నాటకంతో మాత్రమే. క్షమాపణ విషయంగాని, ఎవరిది తప్పు అనే విషయంగాని విచారించటం నా పనికాదు. అందుకు వ్యవధికూడా లేదు. ప్రిన్సిపాల్‌గారు యిక్కడ లేరు. అది ఆయనబాధ్యత. మనం నాటకం వేసుకుందాము; మీరువెళ్ళి అందర్నీ కూర్చోబెట్టండి" అన్నాడు సుందరరావు.

"పోనీ, మేమే వేదమూర్తిగారి నడుగుతాము. ఆయన క్షమాపణ చెప్పితే తర్వాత నాటకం జరగవచ్చు" అన్నాడు. చంద్రశేఖరం.

"సరే"అని సుందరరావు స్టేజిలోపలికి వెళ్ళాడు. సభలో అలజడి చాలవరకు తగ్గి, విద్యార్థులు మళ్ళీ యథాస్థానాల్లో కూర్చున్నారు.

వేదమూర్తి గ్రీన్‌రూములో మౌనంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు. జరిగినసంఘటనప్రభావ మతన్ని వదలలేదు.

జనార్ధనం, చంద్రశేఖరం వగైరా వేదమూర్తిని సమీపించారు.

"నారాయణస్వామిని కొట్టినందుకు మీరు క్షమాపణ చెప్పాలి."

వేదమూర్తి వాళ్ళవైపు చూచి ఊరుకున్నాడు. అతనికి మళ్ళీ కోపంవచ్చింది. కాని మాట్లాడదలుచుకోలేదు.

"అందరిలో అతన్ని అవమానించారుమీరు"అన్నాడు జనార్ధనం.

"గెటవే" అన్నాడు వేదమూర్తి.

"మీరు మళ్ళీ కోపం తెచ్చుకోవటం బాగులేదు. క్షమాపణ చెప్పటం న్యాయం" అన్నాడు ఒకడు. వాడిదివరకు తన గదికి ఒకసారి వచ్చి మాట్లాడడం గుర్తువచ్చింది వేదమూర్తికి.

"ఏమిటీ న్యాయం? 'అపాలజీ' ఇమ్మని అడగవలసింది. నేను. ఆ కుర్రవాడేడీ? మీకేమిటి జోక్యం ఇందులో? మీరు వెళ్ళండి" అన్నాడు.

"మే మతనితరఫున వచ్చాము. స్టేజిమీద 'అపాలజీ' ఇచ్చి తీరాలి" అన్నాడు చంద్రశేఖరం.

"ఇవ్వను"

"మీరు అతనికాలు తొక్కటమేకాక, కాలు తీసుకో బోతే చెంపమీద కొట్టారు."

"కాలు తొక్కలేదు. పొగరెక్కి నన్ను తోశాడు. క్షమాపణకోరవలసింది నేనా!"

"ఏదిచేసినా అధికారంచెల్లుతుంది, పడివుంటారనే రోజులు మారాయి. క్షమాపణయివ్వకుండా ఎట్లా తప్పించు కుంటారో చూస్తాం!"

"నీతో మాట్లాడే అవసరం నాకులేదు...గెటవుట్" అన్నాడు వేదమూర్తి.

నాటకం మొదటిరంగం జరుగుతూవుంది. చంద్రం, జనార్దనం వెళుతూ సుందరరావుతో "ఈ రంగంతో ఆపివె య్యండి...నాటకం జరగదు" అన్నారు. "వచ్చిన నష్టమేం లేదు" అన్నాడు సుందరరావు.

మొదటిరంగం పూర్తయి తెరవాలింది.

"సోదరసోదరీమణులారా! నాటకంలేదు, వచ్చెయ్యండి. విద్యార్థి సోదరునికి జరిగిన అవమానంపట్ల నిరసన తెలపాలి. లేవండి, బయటికి నడవండి. Down with brutality" అని చంద్రం, మరికొందరు విద్యార్థులు కూర్చున్నవాళ్ళమధ్య ప్రవే శించి, కేకలుపెట్టి, వాళ్ళను ఆవరణనుంచి బయటికి పంపించ సాగారు.

సుబ్బరామయ్య, శేషయ్యశాస్త్రి స్టేజిలోపలికివెళ్లారు. ఆడపిల్లలు ఇండ్లకు వెళ్ళిపోయారు.

తెరవెనుక మైక్ లోనుండి "నాటకం ఉంటుంది" అని పాత్రధారులైన విద్యార్థులతో చెప్పించాడు సుందరరావు.

"ఏమండీ, రావుగారూ! ఏమి టిదంతా? కుర్రవాళ్ళు పిచ్చెత్తిపోయ్యారు ... నాటకం మానివెయ్యాల్సిందేనా?" అన్నాడు సుబ్బరామయ్య.

"పిచ్చెత్తినవాళ్ళు ఆస్పత్రికి పోతారు, మనమేంచేద్దాం?" అని నిమ్మళంగా కుర్చీలో కూర్చున్నాడు సుందరరావు.

"మీరు వెళ్ళి చెప్పితే వింటారు మేష్టారూ! మీరు చెప్పండి దయచేసి," అని పాత్రధారులు సుందరరావును బతిమాలుతున్నారు. వాళ్ళకు నాటకం నిలిచిపోతే, తమ వేషాలు వృథాఅయిపోతాయని బెంగపట్టుకొన్నది.

"మీరు కార్యదక్షతవహించి కూడా, వెనుకంజ వేస్తే ఎట్లా మరి? ఏదో చెయ్యాలి; వెళ్ళండి." అన్నాడు శేషయ్యశాస్త్రి.

"కొన్ని పరిస్థితుల్లో ఎవరుచేసేదీ ఏమీ వుండదు. చేస్తామని చేతులెగరవేసుకుంటూ, చిందులు తొక్కి ప్రయోజనం లేదు" అన్నాడు సుందరరావు.

మైక్ లోనుంచి 'పదిహేనునిముషాల్లో' నాటకం మళ్ళీ ప్రారంభమౌతుందని ఇంకొకసారి చెప్పుతున్నాడు.

ఆవరణ చాలవరకు ఖాళీఅయింది. కేకలుపెట్టే వాళ్ళందరూ వెళ్ళిపోయారు. సుందరరావు, శేషయ్య, సుబ్బరామయ్య స్టేజిబయటికి వచ్చి నిలుచున్నారు.

మళ్ళీఅయిదు పదినిముషాల్లో విద్యార్థులు ఒక్కొక్కరు ఆవరణలోకి ప్రవేశిస్తున్నారు. "నాటకం వుంటుందా?" అని సుందరరావును అడిగి కూర్చుంటున్నారు.

రెండవరంగం ప్రారంభించారు. ఆవరణ మూడువంతులు నిండిపోయి విద్యార్థులతో కిటకిటలాడుతూవుంది.

నాటకం పూర్తిఅయ్యేటప్పటికి తొమ్మిదన్నర అయింది. జరిగిన గొడవవల్ల ఒకగంట ఆలస్యం.

* * *

నాటకమైపోగానే సుందరరావు వేదమూర్తిని వెంట బెట్టుకొని ప్రిన్సిపాల్‌గారింటికి వెళ్ళాడు. వేదమూర్తికి తన కర్తవ్యమేమిటో తెలీదు; ప్రిన్సిపాల్‌గారికి విషయం పూర్తిగా తెలియజేయటం ముఖ్యమని సుందరరావు చెప్పి తీసుకువెళ్లాడు.

ప్రిన్సిపాల్‌గారు పడకకుర్చీలో పడుకుని, కాలు ఒక బల్లమీదికి చాపి పాదానికి వేడినీళ్ళసంచితో కాపు వేసు కొంటున్నారు.

నాటకంలో జరిగినగొడవసంగతి చెప్పాడు సుందరరావు.

"మీరు వానికాలుతొక్కటంమూలాన వాడు తోశాడు?" అని వేదమూర్తివైపు చూచి అడిగాడుప్రిన్సిపాల్.

"తొక్కలేదండీ! ఆవిషయం గట్టిగా చెప్పగలను. వాడు నన్ను నెట్టివేస్తూ అట్లా ఊరికే అరిచాడని నా అనుమానం" అన్నాడు వేదమూర్తి.

ప్రిన్సిపాల్ తృప్తిచెందినట్లు కనిపించలేదు.

"ఆ విషయం మీ రెట్లా చెప్పగలరు? మీ కాలికి బూటువున్నప్పుడు మీరు తొక్కారో లేదో తెలుసుకునే అవకాశంలేదు." అన్నాడు.

"బూటువున్నా, గట్టిగా ఏదైనాతొక్కితే తెలుస్తుంది కదండీ."

"ఆఁ...గట్టిగా ఏదైనాతగిల్తే తెలుస్తుంది. లేకపోతే తెలీదు. చూడండి, నిన్న మంత్రిగారు వెళ్ళేటప్పుడు

ఆ సమ్మర్దంలో నా కాలిచిటికెన వేలు ఎవడో తొక్కాడు. ఆ బాధకు నడవలేకపోతున్నాను... మీ బూటుముందరిచివర తోనో, వెనుకచివరతోనో వాడికాలిచిటికెనవ్రేలు తొక్కారనుకోండి, మీకు తెలిసేఅవకాశం లేదు. వాడికి విపరీతమైన బాధ కలుగుతుంది."

స్వానుభవాన్ని వుపయోగించి ప్రిన్సిపాల్ అంటున్న మాటలకు వేదమూర్తికి, సుందరరావుకు నవ్వొచ్చింది. ప్రయత్నంమీద అపుకున్నారు.

"నా అభిప్రాయమేమిటంటే—వాడు నిజంగా బాధ భరించలేకనే తటాలున మిమ్మల్ని తోసివుంటాడని." అన్నాడు ప్రిన్సిపాల్.

"ఏవిధంగానో ఒకవిధంగా జరిగిందనుకోండి. కాని తర్వాతవచ్చినసమస్యవిషయం మన మిప్పుడు ఆలోచించాలి. జనార్దనం, చంద్రశేఖరం కొంతమందిని వెంటపెట్టుకొనివచ్చి బెదిరించారు. క్షమాపణ స్టేజిమీద చెప్పాలన్నారు! ఇంతకూ ఆ నారాయణస్వామి, అంటే అసలుమనిషిమాత్రం కనిపించ లేదు. వాడు వచ్చి అడిగితే కొంత సబబువుండేది. వీళ్ళు గుంపుకట్టుకుని రావటమేమిటి? నాటకం జరగకూడదని అల్లరి చేయటమేమిటి? ఇదంతాచూస్తే ఏదో దృష్టిలోపెట్టుకుని, పెద్ద రభసచెయ్యాలనే ఆలోచిస్తున్నారని తేల్తోంది." అన్నాడు సుందరరావు.

"ఆ ఏదో ఏమిటంటారు?నాకేమీ బోధపడటంలేదు." అన్నాడు ప్రిన్సిపాల్.

"సెలెక్షను పరీక్షలు ఇంకొక వారంలో ప్రారంభ మౌతాయి కదండీ!"

"అయితే యిప్పుడేం జరుగుతుందంటారు?"

"వేదమూర్తి 'అపాలజీ' ఇవ్వనన్నారు. వాళ్ళు బహుశా కాలేజీకి రామని సమ్మె చెయ్యవచ్చు."

ఆ మాటవిని ప్రిన్సిపాల్ ఉద్రిక్తుడై, ఆలోచించసాగాడు.

"అయితే యీవిషయం ప్రెసిడెంటు నారాయణరావు గారికూడా తెలిపితే బాగుంటుంది... మీరు వెళ్ళి చెప్పాలి సుందరరావుగారూ!" అన్నాడు. తర్వాత వేదమూర్తివైపు తిరిగి "వేదమూర్తీ! మీరు మొన్ననే ప్యాసై వచ్చారు, అంటే, ఇప్పటివరకు విద్యార్థులేకదా! మీరే యీ విద్యార్థులతో నెగ్గుకొనిరాకపోతే ఎట్లా?...కోపంవచ్చి వాణ్ణి ఏదో కొట్టారు; 'అపాలజీ'ఇవ్వటం గౌరవలోపం ఎందుకౌతుంది? గొప్పతనమే అవుతుంది." అన్నాడు.

వేదమూర్తి ఏమీ అనలేదు. సుందరరావు జవాబిచ్చాడు.

"క్షమించాలి, మీ రట్లా అనటం న్యాయం కాదు. మీరే ఆవిధంగా సలహాయిస్తే, నిర్వర్తించటం తప్పనిసరే అవుతుంది. కాని నేను చెప్పేది ఆలోచించండి. నారాయణస్వామి నిజంగానే వళ్ళు తెలీనిబాధలో వీరిని తోశాడేమో, అక్కడున్న విద్యార్థుల్ని వాళ్ళనూ పిలిచి, యథార్థం విచారించండి. అది నిజమని తేలితే, వళ్ళు తెలీక తోసినందుకు మొదట ఆ కుర్రవాడు క్షమాపణ చెప్పాలి; కోపంలో కొట్టినందుకు వేదమూర్తి తర్వాత క్షమాపణ చెప్పాలి. అదీ

న్యాయం. వళ్ళు తెలీలేదన్న కారణం వాడికొక్కడికే కాదు, వేదమూర్తికీ వుంది. మీ అభిప్రాయం ఏమిటో సెలవియ్యండి'' అన్నాడు.

''నిజమే. మనం ఆవిధంగానే చెయ్యవచ్చు...అవును, సమస్య పరిష్కారంకావటానికి అదే మార్గంగా తోస్తూవుంది'' అన్నాడు ప్రిన్సిపాల్ తలపంకిస్తూ. తర్వాత కొంతసేపు ఏదో ఆలోచిస్తూవుండి,

''విద్యార్థులూ, కాలం, పరిస్థితులూ—అంతామారి పోయాయి,...చూడండి, నిన్న నా కాలు తొక్కాడు గదా, నేను వాణ్ణి కళ్ళారా చూశాను. కాని, వా డేం చెయ్యగలడు ఆ సమ్మర్దంలో! వెనకనుంచి వచ్చినఊపుకుఆగలేక నామీదపడి తొక్కాడు. అది గ్రహించి ఊరుకున్నాను. అంతేగాని, వాణ్ణి 'నువ్వు నాకు క్షమాపణ చెప్పు' అనీ, 'నువ్వు నాకీ బాధ కలిగించావు; కాలేజినుంచి బయటికి నడు' అనీ, అనాలని నాకు తోచలేదు సుమండీ! నేను పాతకాలంవాణ్ణి.'' అన్నాడాయన.

వేదమూర్తి, సుందరరావు నవ్వారు.

''మీరు నారాయణరావుగారిదగ్గరకు వెళ్ళిరండి... ఇమనో, ఎందుకైనా మంచిది, ఒక రిపోర్టు, ఆమూలాగ్రంగా జరిగింది వ్రాసియివ్వండి యిద్దరూ. ఇక్కడనుంచే మనవిచారణ ప్రారంభించినట్లవుతుంది'' అన్నాడు ప్రిన్సిపాల్.

వేదమూర్తి, సుందరరావు తమకు సంబంధించినంతవరకు జరిగినవిషయాన్ని రిపోర్టు వ్రాసియిచ్చారు. దాన్ని తీసుకుంటూ

''వీళ్ళని దిద్దటానికి యిక మనచేతకాదు. ఆ కాలం గతించింది. వీళ్ళని దిద్దే ఉపాధ్యాయులు రాచకీయపార్టీలలోని

వ్యక్తులు, సూత్రాలు!...అంతేకాదండోయ్, సినిమాలు, పత్రికలుకూడా!...అబ్బో! యిది చాల పెద్దవిషయం; మన కెక్కడ అంతుపట్టుతుంది? వెళ్ళిరండి, ఆలస్యమైంది."అన్నాడు ప్రిన్సిపాల్.

వేదమూర్తి వెళ్తున్నవాడు ఏదో గుర్తువచ్చి, వెనక్కి తిరిగి, "మేష్టారూ, మా నాన్నగారు పోయి సోమవారానికి పదిహేనవరోజు. రేపు ఊరికి వెళ్ళి సోమవారం ఆకర్మకాండ జరుపవలసిన అవసరం వుంది...సెలవు కావాలి." అన్నాడు.

"జరిగినగొడవకు తగినట్లు యీ యిబ్బంది కూడా వచ్చిందీ! సరే, వెళ్ళండి, తప్పుతుందా మరి."

# 16

ఆదివారం మూడుగంటలకు జనార్దనం, చంద్రశేఖరం ప్రిన్సిపాల్ యింటికి వెళ్ళారు.

వేదమూర్తి, నారాయణస్వామినికొట్టినందుకు క్షమా పణ చెప్పటానికి నిరాకరించటం బాగులేదనీ, ప్రిన్సిపాల్ గారు చెప్పి యిప్పించకపోతే, విద్యార్థులు తమ హక్కులరక్షణకోసం, ఆత్మ గౌరవాన్ని నిలబెట్టుకోవటానికి, చర్యతీసుకోవలసివస్తుందనీ 'విజ్ఞాపనపత్రం' ఒకటి ఆయనకందజేశారు. దానిమీద కార్య వర్గం అనేపేరుతో అయిదుగురువిద్యార్థులు సంతకంచేశారు. ప్రొద్దునజరిగిన విద్యార్థులసమావేశంలో ఆ కార్యవర్గంఎన్నుకో బడ్డదట. జనార్దనం అధ్యక్షుడు, చంద్రశేఖరం కార్యదర్శి.

జరిగిన సంగతేమిటో విచారణ చెయ్యకుండా తనేమీ చెప్పలేనన్నాడు ప్రిన్సిపాల్. బాగా తెలిసినవిషయానికి విచారణ

అనవసరం. వేదమూర్తికూడా కొట్టినవిషయం నిరాకరించటంలే దంటూ వాదించారువిద్యార్థులు.ప్రిన్సిపల్'ఆలోచిస్తా'నన్నాడు.

ప్రెసిడెంటు నారాయణరావు మరునాడు విచారణ జరిపించవలసిందని ప్రిన్సిపాల్‌ను కోరాడు.

ఆ రోజు ప్రొద్దుటిక్లాసులు పూర్తికాగానే జనార్దనం, చంద్రశేఖరం కలిసి ప్రిన్సిపాల్‌దగ్గరకు వచ్చారు. వేదమూర్తి వూరికివెళ్ళాడని, మధ్యాహ్నం విచారణజరుపుతాననీ చెప్పాడు ప్రిన్సిపాల్. వాళ్ళు మాటాడకుండా వెళ్ళిపోయారు.

వేదమూర్తిని ఊరికిపంపించివేసి, విచారణనెపంతో నాటకమాడదలచుకున్నాడు ప్రిన్సిపాల్ అంటూ ప్రచారం ప్రారంభమైంది.

మధ్యాహ్నంనుంచి క్లాసులకు వెళ్ళగూడదు--సమ్మెఅని గేట్లదగ్గర పికెటింగ్‌చేస్తున్నారు పదిమందివిద్యార్థులు. వాళ్ళను తప్పించుకొని లోపల ప్రవేశించిన కొద్దిమందీ, మధ్యాహ్నం యింటికి వెళ్ళకుండా కాలేజీకే కాఫీ· తెప్పించుకొనే విద్యార్థినులూ తప్ప, తరగతుల్లో విద్యార్థులు లేరు.

నాలుగుగంటలకు మునిసిపల్ కౌన్సిలరైన పురప్రముఖుడొకాయన, కమిటీమెంబర్లలో ఒకర్ని వెంటబెట్టుకొని, ప్రిన్సిపాల్‌తో మాటాడటానికి వచ్చాడు.

"ఈ సమస్య ఏవిధంగా పరిష్కారంచెయ్యదలచారు?" అని ప్రశ్నించాడు కమిటీమెంబరు.

విచారణసంగతి చెప్పాడు ప్రిన్సిపాల్. తను ప్రశ్నించ దలచుకొన్న విద్యార్థులపేర్లుకూడా వాళ్ళకు చూపించాడు. వాళ్ళఎదుటే తన విచారణ పూర్తిచేస్తానన్నాడు.

నారాయణస్వామిని పిలిచారు.

ప్రిన్సిపాల్ ప్రశ్నలకు సమాధానమిస్తూ — వేదమూర్తిని నెట్టివేయలేదు; కాని కాలు తొక్కినప్పుడు "మేష్టారూ, నా కాలండీ!" అని అరచి ఆయన్ని చేత్తో తాకాడు దారిలేకపోయి నందువల్ల కాబోలు! కోపంతో వేదమూర్తి తన చెంపమీదగట్టిగా అందరూ చూస్తూండగా, కొట్టాడు, అని నారాయణస్వామి వివరించాడు.

ప్రిన్సిపాల్ సావధానంగా అంతా విని, ఒక్కసారి అతని కాళ్ళవైపు చూచి "నిన్న నువ్వీ కాబూలీశాండల్స్ వేసుకో లేదా?" అని తటాలున ప్రశ్నించాడు.

"వేసుకొన్నాను" అని చెప్పి మళ్ళీ వెంటనే "లేదండీ, మరచిపొయ్యాను; నిన్న యివి రిపేరుకు యిచ్చాను, అందుకని చెప్పులు వేసుకొన్నాను" అన్నాడు నారాయణస్వామి.

"నీకు బాగా గాయంతగిలిందా? వాచిందా? ఏదీ చూపించు."

"గాయమేమీ లేదండీ. కాని ఆయనతొక్కినప్పుడు విపరీతంగా బాధకలిగిందండీ, అందువల్లే అరిచాను."

"పోనీ కోపంలో కొట్టాడనుకో, అందుకు విచారిస్తు న్నట్లు నీతో ఆయన చెప్పుతాడు, నీ కంగీకారమేనా?"

"అందరిముందూ, మగవాళ్ళూ, ఆడవాళ్ళూ ఎందరో చూస్తూవుంటే నిష్కారణంగా కొట్టారండి. కాబట్టి ఆమాట అందరిలోను చెప్పితేనే బాగుంటుంది."

"ఇక నువ్వు వెళ్ళవచ్చు"

తర్వాత యిద్దరువిద్యార్థుల్ని, ఒకరితర్వాత ఒకరి ప్రశ్నించాడు ప్రిన్సిపాల్.

వేదమూర్తి నారాయణస్వామికాలు తొక్కితే, అతను కేకపెట్టి, ఆయన్ని గట్టిగా తోశాడని, ఆయన తనమీద పడితే పట్టుకొని నిలుచోబెట్టామనీ చెప్పారు వాళ్ళు.

"నిన్న నారాయణస్వామి కాబూలీశాండల్స్ను తొడుకున్నాడా?"

ఒకవిద్యార్థి చూడలేదన్నాడు.

రెండవవిద్యార్థి వేసుకున్నాడన్నాడు.

"వేసుకున్న సంగతి నువ్వెందుకు గుర్తుపెట్టుకొన్నావు?" అని ఆ విద్యార్థిని ప్రశ్నించాడు ప్రిన్సిపాల్.

"నాటకానికి వస్తూ దారిలో నారాయణస్వామితో కలిశాను. తనశాండల్స్‌లో ఒకదానిబెల్టు తెగిపోయిందని, మధ్యలో ఆగి, మాదిగవాడిచేత రిపేరు చేయించుకొని వచ్చాడు"

ఆ విద్యార్థి వెళ్ళగానే ప్రిన్సిపాల్ కౌన్సిలరువైపు, మెంబరువైపు చూశాడు.

"విచారణ ముగిసింది. ఫలితం మీకుకూడ బోధపడే వుంటుంది. వేదమూర్తి పీడికాలు తొక్కినవిషయం అబద్ధం. ఒకవేళ తొక్కినా పీడికి బాధఏమీ కలగలేదు. అంటే వాళ్ళు తెలీక మనిషిని గట్టిగా నెట్టివేసేటంతబాధ కలగటానికి అవకాశంలేదు. నారాయణస్వామి పొగరుగా ప్రవర్తించాడని

వానిఅబద్ధాలు బుజువుచేస్తున్నాయి. ” అని తనవిచారణా ఫలతాన్ని తేల్చిచెప్పాడు ప్రిన్సిపాల్.

*　　　*　　　*

విచారణపర్యవసానం, ప్రిన్సిపాల్‌గారితీర్పు పురప్రము ఖునిద్వారా విద్యార్థిసంఘకార్యనిర్వాహకవర్గానికి తెలిశాయి.

మరునటిరోజు, అనగా మంగళవారం కూడా సమ్మె జరుగుతుందనీ, ప్రొద్దున తొమ్మిదిన్నరకు ముఖ్యవిషయాలు చర్చించటానికి విద్యార్థులసమావేశం వుంటుందనీ రాత్రి విద్యార్థుల్లో ప్రచారంజరిగింది.

సమావేశానికి జనార్దనం అధ్యక్షతవహించాడు. చంద్రశేఖరం కార్యవర్గంతరఫున తీర్మానాన్ని ప్రవేశపెట్టాడు.

“నేను ప్రవేశపెట్టే తీర్మానాన్ని చదువుతూ అందలి భాగాలు క్లుప్తంగా వివరిస్తాను. ఎవరైనా మాట్లాడ దలుచుకుంటే మాట్లాడవచ్చు. తర్వాత తీర్మానాన్ని తమరం దరూ ఏకగ్రీవంగా ఆమోదిస్తారని ఆశిస్తున్నాను.

కార్యవర్గం ఆమోదించి మీముందు పెట్టుతున్న తీర్మానం :

౧. (శ్రీ) వేదమూర్తిగారి అవమానకరమైనచర్యపట్ల నిరసన తెలుపుతూ విద్యార్థులు నిన్న మధ్యాహ్నం సమ్మెచేశారు. వెంటనే ఆయన బహిరంగంగా తనచర్యకు క్షమాపణకోర వలెను. ఈ విషయంలో (శ్రీ) వేదమూర్తిని ఊరికి పంపించి విచారణ అంటూ, ప్రిన్సిపాల్‌గారు ఎట్లా బుకాయింపజూస్తు న్నారో అధ్యక్షులు వివరించారు. మళ్ళీ నేను వేరుగా చెప్ప నక్కరలేదు.

౨. శ్రీ వేదమూర్తిగారు నాటకంరోజునేకాక అంతకు పూర్వంకూడా విద్యార్థిసోదరులను అవమానించివున్నారు. పాతాలవిషయమై ప్రత్యేకంగా క్లాసులుపెట్టమని కోరినందుకు నిరాకరించటమే కాదు. నిర్లక్ష్యంగా మాట్లాడినారు. దీనికి కూడా ఆయన క్షమాపణకోరి, ప్రత్యేకమైనక్లాసులుపెట్ట వలెను...ఇటువంటి బురాక్రసీ, అంటే అధికారమదాంధత, విద్యాసంస్థల్లో పనికిరాదని మనం తెలియజెయ్యాలి.

౩. నాటకాన్ని ఏర్పాటుచేసేవిషయంలో శ్రీ సుందర రావుగారుకూడా అధికారగర్వాన్నే ప్రదర్శించివున్నారు... మొదట ఆయన ఎన్నుకొన్న పాత్రధారుల్లో నేను, రాఘవులు వున్నాము. కారణమేమీలేకుండా మమ్మల్ని తొలగించారు. సంగీతంవిషయంలో నారాయణస్వామివంటివారికి అవకాశం లేకుండా, పోయిన సంవత్సరం పాడిన కుమారి విమలకే మళ్ళీ అవకాశమిచ్చారు. ఇది ఎటువంటి పక్షపాతమో, బాగా ఆలోచించిచండి. మన సోదరీమణులకు ప్రోత్సాహమివ్వటం న్యాయమే కాని, 'విభజించి పాలించే' తత్వంతో ఆడవాళ్ళను ఎక్కువగా, మనల్ని తక్కువగా చూడటం న్యాయంకాదు. ఇంతేకాక, మొన్న నాటకంరోజున వేదమూర్తిగారు క్షమాపణ కోరకుండా నిరాకరించటానికి కారణభూతులు సుందరరావు గారేనని నొక్కిచెప్పగలను. విద్యార్థుల కళాభిరుచినీ, గౌర వాన్ని గుర్తించలేని సుందరరావుగారిని నాటకసంఘంఅధ్యక్షు పదవినుండి వెంటనే తొలగించాలి.

౪. సెలెక్షనుపరీక్షలంటూ, డిటెన్షన్‌పద్ధతి మళ్ళీ ప్రవేశపెట్టాలని ప్రిన్సిపాల్ నిశ్చయించినట్లు తెలిసింది. అసలు

పరీక్షావిధానమే దోషభూయిష్టమని పెద్దలు చెప్పుతూ వున్నప్పుడు, డిటెన్షన్ పద్ధతి ఎంతఘోరమో వివరించనక్కర లేదు. డిటెన్షన్ లేకుండా అందర్నీ యూనివర్సిటీ పరీక్షకు పంపాలి.

౫. ఆడవాళ్ళహాస్టలులో నివసిస్తున్న విద్యార్థినుల బంధువులు, అక్కచెల్లెండ్రు, అన్నదమ్ములు, మిత్రులు వెళ్ళి వాళ్ళతో మాట్లాడటానికి సాయంత్రం నాలుగున్నర నుండి ఆరుగంటలవరకు మాత్రమే అనుమతివుండటం కఠినమైన నిబంధన. ఈ నిబంధనను తొలగించాలి ... ఆడవాళ్ళహాస్టలు బ్రిటిషువారిజైలుకంటె కఠోరంగా వుంది. తక్కువసంఖ్యలో వుండటంమూలాన్న సోదరీమణులు ఆందోళనచేయుటకు వీలు లేదు. వాళ్ళు మనతోటివారే కాబట్టి, వాళ్ళనుగురించిన యీ అంశాన్నికూడా తీర్మానంలో చేర్చటమైంది. విద్యార్థుల్లో చీలికలు కల్పించటానికి ఏర్పడిన నిబంధనలను ప్రతిఘటించటం మన విధి అని ముందే మనవిచేశాను.

౬. విద్యార్థుల కేర్పాటైన రీడింగ్‌రూమ్‌నుండి కొన్ని పత్రికలను ఆడవాళ్ళ వెయిటింగ్‌రూమ్‌కు పంపిస్తున్నారు. దీని వలన ఎవరూ అన్ని పత్రికలను సకాలంలో చూడటానికి వీలు పడటంలేదు...ఇదికూడా విద్యార్థుల్ని విభజించేవిధానంలో భాగమని వేరుగా చెప్పనక్కరలేదు. ...అందువల్ల జనరల్ రీడింగ్‌రూమ్‌లో కొన్ని బెంచీలను ప్రత్యేకించి, ఆడవాళ్ళు కూడా అక్కడికేవచ్చి పత్రికలు చదివేటట్లు ఏర్పాటు చేయవలెను.

"ఈ ఆరు ముఖ్యాంశాలను ఏకగ్రీవంగా మీరందరూ ఆమోదిస్తారని ఆశిస్తున్నాను ... కాలేజివారు పీటీని అంగీక రించేవరకు సమ్మెజేసి మనహక్కుల్ని రక్షించుకోవాలనే యీ తీర్మానాన్ని మీఎదుట ప్రవేశపెట్టటానికి గర్విస్తున్నాను. నమస్తే."

నలుగురువిద్యార్థులు తీర్మానాన్ని, అందులోని అంశా లను బలపరుస్తూ మాట్లాడినతర్వాత, తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదం పొందింది.

అప్పటికే సిద్ధంగావున్న తీర్మానంప్రతులు వెంటనే ప్రిన్సిపాల్ గారికీ, కమిటీ ప్రెసిడెంటు నారాయణరావుగారికీ అందజేశారు.

మంగళవారం సమ్మె నిరాటంకంగా జరిగింది.

* * *

అధ్యాపకవృత్తిలో ప్రవేశించినతర్వాత మొదటి సారిగా సుందరరావుకు తనవృత్తిమీద విద్యార్థులమీద నైరాశ్య భావం కలిగింది.

వేదమూర్తి చిక్కులోపడటానికి కొంతవరకు తనే కారణం. అదంతా తనబాధ్యతను అతనితో పంచుకోబోవటంవల్ల వచ్చిన ప్రమాదం! అనవసరమైనఘర్షణ లేకుండా కార్య క్రమం పూర్తిచెయ్యాలనే ఉద్దేశం, వేదమూర్తిపట్ల విద్యార్థుల కేవిధమైన అసూయ, కోపం లేవన్న ఊహ — నాటకం రోజు అతనిసహాయం కోరటానికి ముఖ్యకారణాలు ఆ ఉద్దేశం ఫలించలేదు. ఆ ఊహ తప్పని ఋజువైంది.

నిష్కళంగా, నిష్కామంగా ఆలోచించవలెనని, అట్లా ప్రవర్తించవలెనని అనుకొంటున్న తనకు అడుగడుగునా అపజయమే ఎదురౌతున్నది. తనమనస్సు ఒక వైపు, యథార్థం యింకొక వైపు—యీ రెండింటికి ఎక్కడో లంకె తెగిపోయినట్లు స్పష్టమౌతున్నది.

విద్యార్థులతీర్మానం, దానిలోని వాళ్ళఆశయాలు, ఊహాలు చూస్తే ఎంతో ఆశ్చర్యం కలుగుతూవుంది. తనకు వాళ్ళమనస్సు అందనిమానిపండు. అధ్యాపకునికీ విద్యార్థులకూ వుండవలసిన బంధం తెగిపోయింది.

అసత్యం అధికసంఖ్యాకబలంతో, వర్గశక్తితో వికృతస్వరూపందాల్చి నృత్యంచేస్తూవుంటే, సత్యం వ్యక్తిగతమై, మంచికాలానికి ఎదురుచూస్తూ, ఓర్పువహించాలి. ఈ విషయంలో కూడా ఆవేశం పనికిరాదు, మిగతా విషయాల్లో వలెనే.

ప్రస్తుతకర్తవ్యం—విశ్వప్రయత్నంచేసి వేదమూర్తిగౌరవాన్ని నిలబెట్టటమే. అదే సత్యాన్ని సాధించటంకూడా అవుతుంది.

కమిటీమెంబర్లతో ఒక్కొక్కరితో ప్రత్యేకంగా మాట్లాడాలని నిశ్చయించుకుని సుందరరావు బయలుదేరటానికి సిద్ధంగా దుస్తులు వేసుకుని టీ తీసుకుంటున్నాడు.

రమణి వచ్చింది.

"నువ్వు వచ్చావు, కాని నేను పనిమీద వెళ్ళబోతున్నానే! సరే కూర్చో. టీ తాగి వెళ్ళు" అన్నాడు.

"బావా! ఎవరూ కాలేజీకి రావద్దని చెప్పమని జనార్దనం వచ్చి శారదాంబతో చెప్పాడు. ఆమెవాట్లో బాగులేదని ఎట్లాగూ కాలేజికి సెలవుపెట్టింది. రేపు మరి నేనేంజెయ్యను? రాకపోతే ఫరవాలేదా?"

"మిగతా ఆడపిల్లలందరూ ఎట్లా చేస్తే అట్లా చెయ్యి. నువ్వుమాత్రం కాలేజీకి వెళ్ళే హక్కుకోసం పోరాడాలి అనుకో వద్దు. ఒకవేళ నువ్వు కాలేజీకి వచ్చినా నీ కొక్కదానికీ చదువు చెప్పరు కదా! సమ్మె యివాళ వుంటుంది, రేపు పోతుంది. నువ్వింకా ఒక సంవత్సరం ఈ మగవాళ్ళకాలేజీలో చదవాలి కాబట్టి నీకే గొడవా వద్దు."

"నాకు అయ్యేదేమిటో అప్పుడే అయిందికూడా, నీతో బంధుత్వం వున్నందుకు." అన్నది కోపాన్ని అభినయిస్తూ రమణి.

"ఏమిటది?" అన్నాడు ఆశ్చర్యంగా సుందరరావు.

"నేనిక్కడికి వస్తూంటే, యిందాక ఆ రోడ్డుమలుపులో ఎవరో ముగ్గురు విద్యార్థులు ఎదురువచ్చారు. నన్ను చూచి ఒక డేదో అన్నాడు."

"ఏమన్నాడు?"

"సుందరరావు 'వైఫ్' రా, అని" క్రిందకుచూస్తూ రమణి మెల్లగా అన్నది. బొమముడిపాటుతో ఆలోచిస్తూ గదిలో అటుయిటూ తిరుగుతూ వున్నాడు సుందరరావు.

అత నేమీ మాటాడకపోవడం వింతగావుండి, రమణి తలెత్తి అతనివైపు చూచింది.

సుందరరా వేదో ఆలోచిస్తూవుండి, మంగయ్యను పిలిచాడు.

"మంగయ్యా అమ్మాయి టీ తాగినతర్వాత హాస్టలులో దిగబెట్టిరా" అని రమణివైపు తిరిగాడు. "నేనుపనిమీద వెళ్ళాలి. ఈసమ్మెగొడవ తేలేదాకా నువ్వెక్కడా తిరక్కుండా హాస్టల్లోనేవుండు. నాతో మాటాడాలంటే పనిమనిషితో కబురుపెట్టు" అన్నాడు.

"శారదాంబ సెలవుమీద యింటికి వెళ్ళిపోతుంది. రెండురోజుల్లో. ఏదో జబ్బట. నాకు హాస్టల్లో ఆమెలేకుండా ఉండటం భయంగావుంటుంది."

"ఎందుకు భయం? పోనీ, ఏమీతోచకపోతే యింటికి వెళ్ళిపో. తర్వాత రావచ్చు."

"అయితే నేను రేపు వెళ్ళనా బావా?" అన్నదిరమణ

వెళ్ళమని చెప్పి సుందరరావు కమిటీమెంబర్లను చూడటానికి బయలుదేరాడు.

## 17

వేదమూర్తి ఎనిమిదిగంటలకు ఊరినుంచి వచ్చాడు. వెంటనే గదికివెళ్ళి, భోజనంకాగానే, సుందరరావుయింటికి బయలుదేరాడు.

కమిటీమెంబర్లతో మాట్లాడి ఆలస్యంగా యిల్లుచేరుకున్న సుందరరావు, వేదమూర్తి వచ్చేటప్పటికి అప్పుడే భోజనం చేస్తున్నాడు.

వేదమూర్తిని గదిలో కూర్చోబెట్టాడు మంగయ్య.

అకస్మాత్తుగా తండ్రిమరణించటం, వెంటనే కాలేజీలో తన కొకసమస్య ఎదురవటం, తనవెనరో శిక్షిస్తున్నట్టుంది వేద మూర్తికి. తల్లి వైఖరికూడా ఆవిధంగానే వుంది. ఇప్పుడుకూడా ఆమె ముక్తసరిగానే వుంది తనపట్ల. మనసిచ్చి మాట్లాడలేదు. తిరిగివస్తూ బసవన్నకొండతో తనకికసంబంధం తెగిపోయినట్లేనని నిర్ణయించుకున్నాడు.

స్వచ్ఛందంగా, ఆత్మవిశ్వాసంతో భవిష్యత్తునెదుర్కో వాలని మనస్సు గట్టిచేసుకొన్నాడు.

తనదొక విచిత్రప్రకృతి. ఊహాలకు, ఉద్రేకాలకు సమ న్వయం కుదరటంలేదు. అకస్మాత్తుగా కలిగే ఉద్రేకం తన కర్థంకావటంలేదు.

నలభైరెండు ఆగష్టువిప్లవంలో జైలుకు వెళ్ళినప్పుడు, అహింసాయుతమైన సత్యాగ్రహసిద్ధాంతము తనలోజీర్ణించిందని గర్వపడ్డాడు. ఇప్పుడదేమైనట్లు? ఊరేగింపుకు నాయకత్వం వహించి, పోలీసులాఠీదెబ్బలను కోపం, ద్వేషమన్నదిలేకుండా నిబ్బరంతో సహించి జైలుకు వెళ్ళటమేమిటి? అహింసాసిద్ధాం తాన్ని ఆచరణలోపెట్టిన ఆ ఔన్నత్యము, తృప్తి ఏమిటి! ఒక విద్యార్థి తన్ను తెలిసో తెలియకో నెట్టివేస్తే, అగౌరవపరచాడని, వళ్ళు తెలుస ఆవేశంలో వాణ్ణి చెంపమీదకొట్టడమేమిటి? తనలో కలిగినమార్పుకు కారణం?

వేదమూర్తి ఆలోచిస్తూవుండగా, సుందరరావు భోజనం ముగించి గదిలో ప్రవేశించాడు.

ఆ రెండురోజుల్లో జరిగినసంగతులు—ప్రిన్సిపాల్ జరిపిన విచారణ, విద్యార్థులతీర్మానం, కమిటీ మెంబర్ల ధోరణి—సుందరరావు వివరించాడు.

"ఏంచెయ్యదలచుకున్నారు?" అనిప్రశ్నించాడుచివరకు.

వేదమూర్తి అంతా సావధానంగా విని ఆలోచించి

"అహింస, సత్యాగ్రహం—వీటిలో పూర్తి నమ్మక మున్న నేను ఎంతకారణంవున్నా, కోపంతెచ్చుకుని కొట్టటం తప్పనేభావిస్తున్నాను. అట్లాఅంగీకరిస్తున్నప్పుడు బహిరంగంగా క్షమాపణ చెప్పటం కూడా సమంజసమే ననిపిస్తున్నది. మీ రేమంటారు?" అన్నాడు.

" మీ ఆదర్శాలు అంతఃకరణవిషయం నేనేమీ చెప్ప లేను. కాని మీ రనుకునే లక్ష్యాన్ని సంఘంలో సాధించే మార్గాన్ని గురించి కొన్నిమాటలు చెప్పగలను సత్యాగ్రహం అంటే సత్యనిరూపణలో పట్టుదల, అన్యాయాన్ని ప్రతిఘటించటం అన్నమాట; అది మీ లక్ష్యమన్నారు. ఇప్పుడు మీరు క్షమా పణ చెప్పటానికి నిశ్చయించినందువల్ల యీ లక్ష్యసాధన ఎంత వరకు జరుగుతుందో ఆలోచించండి.

"మీరు మీ అంతఃకరణప్రకారం తప్పుచేశారని గుర్తించటం ఒక సంగతి; దాన్ని బహిరంగంగా ఒక సాంఘిక సందర్భంలో చెప్పటం వేరొకసంగతి; రెండింటికి సామ్యం లేదు; పైగా ఫలితాల్లో వైరుధ్యం వుంటుంది. మీలో మీరు తప్పుని గుర్తించటంవల్ల మీకు సంబంధించినంతవరకు మరచిన లక్ష్యం మళ్ళీ గోచరమౌతుంది. కాని బహిరంగంగా దాన్ని చెప్పటం వల్ల సత్యం నిరూపణకాదు. అసత్యానికే యీ సందర్భంలో

విజయం చేకూర్చినట్లవుతుంది. అంతఃకరణను దృష్టిలో పెట్టు కొని పశ్చాత్తాపంతో అన్నా, మీమాటలకు యథార్థంలో, ప్రస్తుతసందర్భంలో, ఆ విలువ రాదు. మీరు పిరికివారు, సాము దాయకమైన అసత్యానికిభయపడి లొంగిపోయారని బలహీనత అనే అర్థమేపిస్తుంది కాని, మీ అంతఃకరణ, అహింస, సత్యా గ్రహం ఎంతమాత్రం ఋజువుకావు. విపరీతార్థంమాట అటుంచి, సత్యనిరూపణ కాకపోగా, అసత్యం శక్తివంతమై విద్యాసంస్థకు కొన్నినష్టాలు కూడా కలుగవచ్చునేమో! సంఖ్యాబలాన్ని ప్రదర్శించి, అసత్యప్రచారంతో అధ్యాపకులను, విద్యావిధా నాన్ని లొంగదీసుకోవటానికి వీలౌతుందన్న అభిప్రాయం విద్యార్థిలోకంలో నాటుకొనిపోయి భవిష్యత్తు బాగుపడదు. ఈ ఒక్క 'క్షమాపణ' తోనే విద్యావిధానంలో ప్రళయం వస్తుందని నే ననటంలేదు. పాతపడి, కూలిపోతున్నభవనంలో ఒక్క యిటుక తీసిపారవేసినంత ఫలితంమాత్రం తప్పదు."

"కాని ఒక్కవిషయం మీ రాలోచించటం లేదేమో! విద్యార్థికి, ఉపాధ్యాయునికి మధ్యనున్న బంధము చాల పవిత్ర మైంది. అది వ్యక్తిగతమైనబంధం. కోపంలో కొట్టానని పశ్చాత్తాపపడుతూ స్నేహభావాన్ని వ్యక్తంచేస్తే, దానివల్ల నారాయణస్వామిలో ఏమీహృదయపరివర్తనకలుగదంటారా? ఆ ఒక్కవిద్యార్థితో కలిగే పరివర్తనప్రభావం మిగతావాళ్ళకు కనువిప్పు కలిగించి, సత్యనిరూపణ చెయ్యలేదా?"

"వేదమూర్తీ మీరుచెప్పే పవిత్రబంధం, మీ హృదయంలో, ఊహలోవుంది కాని, యథార్థంలో, ప్రస్తుతం విద్యాసంస్థల్లో ఎక్కడఉంది? బంధం అనేది యిద్దరికీ చెందాలి,

ఒక్కరికే కాదు. అసలు విద్యార్థిదృష్టిలో మీరొకవ్యక్తి కానేకాదు! మీరొకవస్తువు, ఒక పరికరం మాత్రమే—గ్రామఫోను, రేడియో, సినిమాలాగే. డబ్బుపెట్టి కొనే ప్రయోజనం పరీక్షపాసుకావటం! మీరుచెప్పినట్లు వినకపోతే, సమ్మె అనే సమ్మెటతో సాగదీసి, వంకరతీర్చి, రిపేరుచేసుకుంటాడు; అటువంటి పరిస్థితిలో మీ పశ్చాత్తాపం వ్యక్తం చేసేది ఒక్క మీ అశక్తతను మాత్రమే. నారాయణస్వామిలో కలిగే పరివర్తన వాడు విద్యార్థిలోకానికి వీరుడుగా, విజేతగా మారిపోవటం మాత్రమే...

“మీరన్న స్నేహబంధం నేనుకూడా యిన్నాళ్ళూ కంటున్న మధురస్వప్నమే; అది యిప్పుడే అంతమౌతూవుంది. అది ముక్కలైపోవటానికి మీరూ నేనూ బాధ్యులంకాము. బహుశా కాలపరిస్థితి! వ్యక్తిగతంగా మనశక్తికి, మనలో ఉత్పన్నమయ్యే ప్రేమ సౌహార్దతలకు తటాలున లొంగని పరిస్థితి అది. మనలోని ఆ విలువలు నశించకుండా, నిరీక్షించి వుండటమే ప్రస్తుత కర్తవ్యమనిపిస్తూవుంది. సత్యాగ్రహమని మీరన్న ఆ తపస్సుకు ఓర్పు, ఆలోచన, యథార్థ పరిజ్ఞానం అవసరం. మనహృదయాన్ని కదిల్చే మహత్తరసూత్రాలకు, బాహ్యరూపాన్ని, ఒక ప్రయోజనాన్ని కల్పించటం సులువైన పనికాదు. అహింస, సత్యాగ్రహం ఎన్నాళ్ళనుంచో వస్తున్న సూత్రాలే; వాటిని ఒక చారిత్రకసందర్భంలో ఒక దేశానికి, ఒకజాతికే అనువర్తింపజేసి, గొప్పప్రయోజనాన్ని సాధించటం గాంధిగారికే వీలైంది. అది వారితపస్సుకు ఫలితం. ఆ సూత్రాల ననుసరించిన కర్తవ్యం సంఘంలో, వేర్వేరుసందర్భాల్లో,

వేర్వేరురూపాల్లో వుంటుంది. ఆ కర్తవ్యాన్ని నిర్ణయించుకొని. నిర్వర్తించేబాధ్యత ఎవరిది వారిదే. ప్రస్తుతవిషయంలో సత్యాగ్రహమన్న లక్ష్యానికి నాకు తోచినకర్తవ్యం సూచించాను. మీ రాలోచించండి." అన్నాడు సుందరరావు.

"సత్యనిరూపణవిషయమై మీకు చెప్పినవిషయాలతో ఏకీభవిస్తున్నాను. కాని నేను క్షమాపణచెప్పనని నిరాకరించి నంతలో ఏమౌతుంది? మీరన్నట్లు కమిటీవారే నిర్బంధిస్తే, రాజీనామాయిచ్చి తప్పుకుంటాను. కాని అదిమాత్రం తమకు విజయంగా భావించరా విద్యార్థులు? నా క్షమాపణ కాని. రాజీనామా కాని, ప్రస్తుతపరిస్థితి నేవిధంగాను మార్చబోదు. పోతే, వాతావరణం అసత్యప్రచారంతో కలుషితమైపోయి, విద్యార్థులతో నాకు స్నేహబంధం తెగిపోయిన తర్వాత, నే నిక్కడ వుండి చేసేది, సాధించేదీ వుండదు. సత్యంకోసం నిలబడటంకంటె నాజీవితానికి వేరే లక్ష్యం లేదు." అని, ఆలోచిస్తూ మౌనంగా వుండిపోయాడు వేదమూర్తి.

"దీనికంతా ఒకవిధంగా నేనే కారణం; ఊహాకు ఉద్దేశానికి అతీతంగా జరిగిపోతూవుంటాయి కొన్ని సంఘటనలు. ఊహాతో యథార్థస్వరూపాన్ని తెలుసుకోవటం అసాధ్యమని రుజువవుతూ వుంటుంది." అన్నాడు సుందరరావు. వేదమూర్తి అతనివైపు చూశాడు.

"మీరంటున్నమాటలు సరిగ్గా నన్నుగూర్చి చెప్పినట్లే వున్నాయి. నే నొక నిర్ణయానికిరావటం, దానికి విపరీతఫలితం కలగటం. నే నొకవిధంగా ఊహిస్తూనే ఇంకొకవిధంగా ఉద్దేశంలో ఏదో చేసివెయ్యటం. ఊహాతో జీవితాన్ని తెలుసు

కోవటం వీలుకాదని నేనూ యిప్పుడే అనుకుంటున్నాను. మా నాన్నగారిమరణానికి ఒకవిధంగా కారణం నేనే అన్న విషయం బహుశా మీకు తెలీదనుకుంటాను.” అన్నాడు వేదమూర్తి.

“ఆ విషయం విన్నాను; కాని మీరు దాన్నిగురించి బాధపడకపోవటం ముఖ్యమని అనిపిస్తుంది”

వేదమూర్తి ఆశ్చర్యపడి“ఎప్పుడు విన్నా రావిషయం?” అని ప్రశ్నించాడు.

“మీరు తండ్రిగారుపోయారని ఊరువెళ్ళి తిరిగివచ్చిన రోజు, నేను కాలేజిలో మీ గదికి వచ్చాను మీకోసం. మీరు క్లాసుకు వెళ్ళారట. అప్పుడు రామచంద్రయ్యగారు చెప్పారు.”

వేదమూర్తికి రామచంద్రయ్యనుగురించి యిదివరకు తెలీనిసంగతి ఏమిటో తెలిసినట్లయింది. అతనిమీద కోపం కూడా వచ్చింది. కాని ఇందులో తప్పేముంది? అనుకున్నాడు. వ్యక్తిగతంగా తన్ను రామచంద్రయ్య అగౌరవపరచినట్లని పించింది. రహస్యమేమీ కాదు; సుందరరావుతో తను చెప్ప బోతున్నాడు కూడా; కాని ఎందుకో రామచంద్రయ్య పరో క్షంలో ఆ విషయాన్నిగూర్చి చెప్పటంలో అంత భేదముంది!

అతను మౌనంగా వుండటం గమనించి సుందరరావు అన్నాడు: “మనఊహ వెళ్ళినంతదూరం ఆలోచించి, నిష్క ల్మషహృదయంతో మనంచేసేకార్యం ఒకవేళ విపరీతఫలితాన్ని యిచ్చినా, ఆ విషయమై దుఃఖించరాదు; అర్థంచేసుకోవాలి. అంతే.”

"సులభంగా తెలిసినట్లే కనిపించేవిషయాలు నిజంగా ఎంత క్లిష్టమైనవో అనుభవంలో యిప్పుడే బోధపడుతూవుంది. మీాకు కృతజ్ఞుణ్ణి, సెలవు" అని లేచాడు వేదమూర్తి.

# 18

"ఆ వుత్తరం వట్టి బెదరింపేనని క్రమంగా నమ్మక మేర్పడుతూవుంది. ఈ అయిదారురోజులు, ప్రతిక్షణం ఏం జరుగుతుందోనని ఆదుర్దాతోనే వున్నాను. మా పిన్నీ, బాబాయీవాళ్ళు సోమవారం వచ్చారు గాని, నాకుమాత్రం భయం తగ్గలేదు. ఇవాళ ఎందుకనో అదంతా వట్టిదే ననిపిస్తోంది." అన్నది లీలతో విమల.

"మరి రాచయ్యవ్రాశాడని పార్వతి తేల్చినట్టు చెప్పావేఁ?"

"ఆ రోజు అట్లానే అనిపించింది. ఇవ్వాళ బుధవారం కదా, ఇంతవరకు రాచయ్య నాకుకనిపించలేదు. ఉత్తరం నిజంగా వ్రాసివుంటే ఎక్కడైనా అనుమానం కలిగేటట్లు ప్రవర్తించడా? ఇప్పుడు ఆలోచిస్తే నాకొకటి అనిపిస్తోంది—ఆ రోజు లైబ్రరీలో, పువ్వులు ఎవరివో నిజంగా తెలీకనే నాకివ్వబోయాడు రాచయ్య. పార్వతి తీసుకోవాలనే, ఆ చిన్న టేబిల్ మీాద, ఆమెనిలుచున్నదగ్గర పెట్టివుంటాడు. పార్వతి అనుకొన్నంత రాక్షసుడులా కనిపించడు ఆ రాచయ్య పాపం!"

"అయితే ప్రాక్టికల్ క్లాసు జరుగుతున్నప్పుడు లేబొరేటరీకి అత నెందుకు వచ్చినట్లు?"

"నిజంగానే ఏదోపనిమీాద వచ్చివుంటాడు."

"రాచయ్య కాకుంటే, ఏవరో ఒకరై వుండాలి కదా! ఎవరనుకుంటావ్?"

"అదే ఊహించటం కూడా కష్టంగావుంది. నేను వాడు చెప్పినప్రకారం చెయ్యలేదు; మరి నాకింకా ఏ ఫలితమూ కనిపించలేదే!"

"ఏమో, ఆలస్యంగా కనిపిస్తుందేమో! నువ్వు జాగ్రత్తగా వుండటమే మంచిదని తోస్తుంది నాకు."

లీల, విమల కూర్చున్న డ్రాయింగ్‌రూములోకి ప్రవేశించారు డాక్టరు రమణమూర్తి, అతనివెంట వేదమూర్తి.

వేదమూర్తిని చూచి "నమస్తే" అని ఆహ్వానించి, ప్రక్కగదిలోకి వెళ్ళిపోయారు లీల, విమల.

క్లాసులో మెర్‌మెణహృదయాన్ని చక్కగా చిత్రించ గలిగి, కన్నీళ్ళు తెప్పించిన లెక్చరరు, యీ రెండువారాల్లో అతన్నిగురించిన క్రొత్తసంగతులు తెలియటంతో ఎంతో సన్నిహితుడైనవ్యక్తిగా మారాడు. లీల పనిమీద లోపలికి వెళ్ళింది. విమల వేదమూర్తినిగురించే ఆలోచిస్తూవుంది.

లీల సానుభూతిచూపటం, వాళ్ళకుటుంబంతో వేద మూర్తికి పరిచయం ఏర్పడటం, అంతా ఒక వింతగాథగావుంది. తను పాడుతూవుంటే, తనవైపు అమాయకంగా చూస్తూవుండి, చివర పరధ్యానంలో అందువల్లే మైక్ దగ్గరకు వేదమూర్తి వెళ్ళలేదని తను కనిపెట్టింది. ఆ సంగతి తలుచుకొన్నప్పుడల్లా ఏదో సంతోషంగా వుంటుంది. అంతేకావాలి! మెర్‌మెణను గూర్చి చెప్పుతూ తనకు కన్నీళ్ళు తెప్పించగలిగినవ్యక్తికి అంత మాత్రం పరధ్యానంకలిగించేశక్తి తనసంగీతానికి లేదా! జనం

గోలపెట్టుతూవుంటే, తన్ను పాడమని అడక్కుండా తన వైపన్నా చూడకుండా—ఆ సిగ్గేమిటో మరి! గంభీరంగా, కోపంతో సంగీతం అయిపోయిందని తెర వేయించేశాడు. బండి దాకా వచ్చినప్పుడూ అదే గంభీరత. ఒక్క మాటైనా లేదు. విచిత్రవ్యక్తి కాకపోతే తనసంగీతాన్ని అంతగా విన్నతర్వాత ఒక్కమాటా తనతో మాట్లాడకపోవటం, పలకరించకపోవట మేమిటీ? క్లాసులో గంటసేపు ఉపన్యాసం చెప్పటానికిమాత్రం జంకు ఏమీలేదు. తననిఅభినందిస్తే నోటిముత్యాలు రాలి పోతాయా! విద్యార్థినికొట్టి, సమ్మెఒకటి తెచ్చిపెట్టుకున్నాడు. ఏం జరుగుతుందో మరి! తండ్రిపోయినవిచారం ఒకవైపు, కాలేజీలో యీ గొడవ యింకొకవైపు... మెత్తనివాళ్ళకు...

వేదమూర్తికంఠస్వరం అవతలిగదిలోనుండి హెచ్చు స్థాయిలో వినిపిస్తోంది. తను క్షమాపణ చెప్పలేనని, కమిటీ యెదుట అన్నమాటలు చెప్పుతూ క్షమాపణచెప్పకోవటం ఏవిధంగా సత్యవిరుద్ధమో వివరిస్తూవున్నాడు.

ఆ మాటలు చెప్పుతూవున్న వేదమూర్తిని ఒక్కసారి చూడవలెనని ఆసక్తికలిగింది విమలకు. డ్రాయింగ్ రూముకు, తను కూర్చున్నగదికి మధ్య కిటికీ వుంది. దానిక్రిందవైపు, సగా నికి తెరకట్టారు. కిటికీదగ్గర టేబిల్ వుంది. టేబిల్ దగ్గరకువెళ్ళి, దానిమీదుగా వంగి, తెరచివర వ్రేలితో కొంత పత్తిగించి తొంగిచూచింది విమల. ఆవేశంతో మాట్లాడుతున్న వేద మూర్తి ఎదురుగా స్పష్టంగా కనిపించాడు.

క్లాసులో పాఠంచెప్పేటప్పుడు సహజగాంభీర్యంవల్లనో లేక విషాదచ్ఛాయతోనో, మొగ్గవలె వుండే అతని ముఖకవళిక

స్వచ్ఛందమైన ఆవేశంతో వికసించి ఏదో క్రొత్తదనంతో విమల నాకర్షించింది. ఆమె అతనివైపు చూస్తూ, మాటలు వింటూ వుంది.

లీలవచ్చి మెల్లగా వీపుమీద తాకింది. విమల వెనక్కు తిరిగి చిరునవ్వునవ్వి, చూడమని సంజ్ఞ చేసి తప్పుకొన్నది. కాని లీల వెళ్ళి ఒక కుర్చీలో కూర్చొని, విమలనుకూడ కూర్చో మన్నది.

మాటలు వినబడుతున్నాయి.

"కాలేజీలవాతావరణం పూర్తిగా చెడిపోయింది. మీరు అస లీ గొడవ వదలిపెట్టి, ఐ. ఏ. యస్. పరీక్షకు కూర్చోగూడదూ ?" అన్నాడు డాక్టరు రమణమూర్తి.

"మనకు ఆంధ్రుల కేమీా అవకాశంలేదండీ. అంతా అరవవాళ్ళు, మళయాళీలు, బెంగాలీలు—వాళ్ళ పేర్లే కనిపిస్తున్నాయి ప్రతిసంవత్సరం లిస్టుల్లో. మనకు ప్రత్యేకరాష్ట్రం వస్తేకాని లాభంలేదేమో" అన్నాడు వేదమూర్తి.

"ఇట్లా యువకులందరూ అనుకొని ప్రయోజనమేమిటి? ఇంగ్లీషు ఆనర్సు పాసై, మీరు ప్రయత్నంచెయ్యకపోతే ఎట్లా ? పోనీ చివరకు రాకపోతేపోతుంది."

"కుటుంబపరిస్థితులవల్ల, లెక్చరర్ ఉద్యోగంమీాదిప్రీతి వల్ల నే నా విషయం ఆలోచించలేదు."

"ఇప్పు డాలోచించండి. మీరు ఇంకా ఒక ఛాన్సు వుందనుకుంటాను పరీక్షకు వెళ్ళడానికి. ఈ సమ్మె ఎట్లాపోయినా, మీరు యీ కాలేజిమాత్రం వదిలిపెట్టండి. కావలిస్తే, నాకు మద్రాసులో కొందరు మిత్రులున్నారు; మద్రాసుకాలేజీల్లో

ఎందులోనైనా ప్రవేశించండి. అక్కడేవుంటే లైబ్రరీసదు పాయం వుంటుంది. చదువుకుని పరీక్షకు వెళ్ళవచ్చు."

"అవును, మీరు చెప్పేవిషయం ఆలోచించదగ్గ విషయం. నాకు పరీక్షకువెళ్ళటానికి ఒక్క ఛాన్సుమాత్రం వుంది." అన్నాడు వేదమూర్తి.

"అమ్మాయ్ లీలా, ఏదీ, యింకా టీ తీసుకురాలేదే" అంటూ లీలను పిలిచాడు డాక్టరు.

"వస్తున్నా, నాన్నా!" లోపలికి వెళ్ళి టీ ట్రే తీసుకొని, డ్రాయింగ్‌రూమ్‌లోకి వెళ్ళింది లీల.

"ఆ అమ్మాయిని కూడా రమ్మను; మీరిద్దరూ ఇక్కడే టీ తీసుకోండి మాతో" అన్నాడు డాక్టరు.

విమల, లీలతోపాటు వెళ్ళి డ్రాయింగ్‌రూములో కూర్చుంది.

"మీ అమ్మగారిని రేపుప్రొద్దున తీసుకొనిరామ్మా! పరీక్షచేస్తాను. ఇవ్వాళ మందు తీసుకొనివెళ్ళారుగద" అన్నాడు డాక్టరు, విమలనుద్దేశించి.

"అలాగేనండి" అన్నది విమల.

"వీలైతే యీ క్రిస్ట్‌మస్‌సెలవుల్లో మద్రాసుకు వెళ్ళి చూపించితే మంచిది. మీ బంధువులు వచ్చారన్నావు గదా, ఒక్కసారి మద్రాసు వెళ్ళిరండి. ఆపరేషన్ తొందరగానే అవుతుంది. మొత్తంమీద పదిహేను, యిరవై రోజులకన్న మీ రక్కడ వుండవలసినపనిలేదు."

అ ను బం ధా లు

టీ తీసుకొన్నతర్వాత డాక్టరు, "నేను ఆస్పత్రికి వెళ్ళి రావాలి. మూర్తీ! మీరిక్కడే వుండండి, నేను తొందరగానే వచ్చేస్తాను" అని వెళ్ళిపోయాడు.

డాక్టరు వెళ్ళగానే టీ సామగ్రి తీసుకొని లీల లోపలికి వెళ్ళింది.

వేదమూర్తిఎదుట మౌనంగా కూర్చోవటం ఏమీ కష్టంగాలేదు విమలకు. ఆ నిశ్శబ్దంలో ఏదో తృప్తికనుపించింది. మనస్సు ఆత్మవిశ్వాసంతో ప్రశాంతంగా వుంది. ఇప్పుడైనా వేదమూర్తి తనతో మాట్లాడుతాడో లేదో చూడవలెనను కొని వేచివుంది విమల.

"ఆ రోజు సంగీతం మనోహరంగా వుంది." అన్నాడు వేదమూర్తి, తనవైపు చూడకుండానే.

తనవైపు చూస్తూ అనివుంటే చిరునవ్వు ఆ మాటకు సమాధానం; కాని యిప్పుడేదో అనాలి...

"మీరు క్లాసులో చెప్పేఉపన్యాసం కూడా ఎంతో మనోహరంగా వుంటుంది" అన్నది, ఏమంటాడో వినాలనే కుతూహలంతో.

తటాలున తలెత్తి తనవైపు చూచాడు; ఆచూపులోని ఆశ్చర్యం తనకు గిలిగింతపెట్టింది. అదేధోరణిలో ఇంకా అన్నది.

"నేను, లీల ఎప్పుడూ మీ క్లాసుల్ని గురించి గొప్పగా అనుకుంటాము; మీరుబోధించినతర్వాత ఆ భాగం చదవాలంటే ఎంతో యిష్టంగా వుంటుంది. ప్రతివాక్యంలోను మీ వివరణ, కంఠస్వరము గుర్తువస్తాయి."

అట్లానే చూస్తూవుండి, తను ఆగగానే మధురంగా నవ్వాడు.

"చాల బాగా పాడటమేకాదు, పొగడటంకూడ వచ్చునే!" అన్నాడు. ఆమెకు తగని సిగ్గువేసింది. తను అనుకొన్నంత అమాయకత్వం, మెత్తదనమేమీ లేదు యీాయనలో; గడుసుగానే మాట్లాడగలడు! అనుకున్నది విమల.

అంతలో లీల తిరిగివచ్చింది.

"మేష్టారూ! మాకు మళ్ళీ కాలేజి ఎప్పుడండీ?" అన్నది లీల.

"మీ విద్యార్థులకే తెలియాలి; మీరేకదా సెలవు పుచ్చుకొన్నారు!" అన్నాడు.

"కాలేజివుండటంకన్న సెలవే బాగుంది కదూ లీలా!" అన్నది విమల. లీలను తనతో ఏకీభవించమని అడుగుతున్నట్లు.

"నిజమే, కాని మనకు పీరిక్లాసుపోతుందనేవిచారం ఒకటి తప్ప" అన్నది లీల.

"అవును" అని నవ్వింది విమల.

"మీారిద్దరూ నన్ను పొగడటమే పెద్ద సంభాషణ అనుకుంటే నేను వెళ్తాను" అన్నాడు వేదమూర్తి.

అందరూ నవ్వారు.

"పోనీ, విమలను మొన్నటిపాటలు పాడమందామా మాస్టారూ!" అన్నది లీల.

"పోవే! నన్నెప్పుడు పాడమంటే అప్పుడు పాడలేను... క్షమించాలి మీారు" అన్నది విమల వేదమూర్తినుద్దేశించి.

"నిజంగా ఆ పాటలు ఇంకొకసారి వినాలనే నాకోరిక" అన్నాడు వేదమూర్తి.

లీల విమలను బలవంతంచేసింది.

"నిజంగా పాడలేను, నన్ను బలవంతపెట్టకండి; క్షమించండి" అన్నది విమల ప్రాధేయపడుతూ.

"మీరున్నారని సిగ్గుపడుతోందండి" అన్నది లీల.

"అదేమీకాదు. నాకు ఒక్కొక్కసారి పాడాలనివుడందు, అంతే" కోపంగా లీలవైపు చూచి అన్నది విమల.

"అలాకాదు లీలా! ఆ అమ్మాయి మొన్న అంతమంది విద్యార్థుల్లో పాడలేదూ! ఒకొ్కక్కసారి సరైనమూడ్ రావాలి. అంతే."

కొన్నిక్షణాలు మౌనంగావున్నారందరూ.

"లీలా, ప్రొద్దుపోతూవుంది, నేను వెళ్ళాలి. మీజవాను వుంటే బండి తెప్పించు" అన్నది విమల.

లీల వెళ్ళింది.

"నేను పాడలేనందుకు ఏమీఅనుకోకండి. అది ఒకొ్కక్కసారి నా అశక్తతే మీరన్నట్లు, అంతే" అన్నది వేదమూర్తితో విమల.

"ఫరవాలేదు...నాకు తెలుసు" అన్నాడు.

లీల తిరిగివచ్చి, కాలేజిసమ్మెవిషయం వేదమూర్తిని ప్రశ్నించింది. వేదమూర్తి కమిటీవారివైఖరినిగురించి చెప్తూవున్నప్పుడు బండివచ్చింది. విమల 'వెళ్తా'నని సెలవుతీసుకొన్నది

* * *

వేదమూర్తి క్షమాపణ, సుందరరావు నాటకసంఘం నుండి తొలగింపబడటం, డిస్మిషన్ విధానము రద్దుచేసినట్లు స్పష్టంగా ప్రకటించటం చాల ముఖ్యమైన, కనీసపుకోర్కెలని కరపత్రాలుఅచ్చొత్తించి ప్రచారంచేశారు విద్యార్థినాయకులు.

గురువారం ప్రిన్సిపాల్ ఆఫీసుగదికి వెంకట్రావు, శేషయ్యశాస్త్రి వచ్చారు. వెంకట్రావు కొమార్తెకు పెళ్ళిసంబంధం చూడటానికి ఒకవారం సెలవుమీద వెళ్ళివుండి, ముందురోజే తిరిగివచ్చాడు. సమ్మెవిషయమంతా శేషయ్యశాస్త్రిద్వారా విన్నాడు.

ప్రిన్సిపాల్ వాళ్ళని "విశేషాలేమిటి?" అని ప్రశ్నించాడు.

"ఇవాళకూడ సమ్మె జరుగుతూవుంది" అన్నాడు శేషయ్యశాస్త్రి.

ఆవిషయం నాకూ తెలుస్తూనేవుంది. . . ఇతరవిశేషాలు"

"ఇదుగో, యీ కరపత్రం అచ్చువేసి, సమ్మె ఎన్నాళ్లైనా జరిపిస్తామని ఘంటాపథంగా చెప్పుతున్నారు. నిన్నటి నిర్ణయాలకు ఈషణ్మాత్రమైనా ఫలితం వున్నట్టు తోచదు."

"అంతేకాదు, పరిస్థితులు విషమిస్తున్నాయేమోనని పిస్తోంది. లైబ్రరీ రాచయ్యను, రాత్రి సినిమానుండి వస్తుంటే, నలుగురువిద్యార్థులు కొట్టారట" అన్నాడు వెంకట్రావు.

"ఎవరు వాళ్ళు? రాచయ్య వచ్చి చెప్పలేదే. పోలీసులకు కంప్లైంట్ యిచ్చాడా?" అన్నాడు ప్రిన్సిపాల్.

"వాడిమొహం! ఏమిసాడు! వాళ్ళెవరో చీకట్లో గుర్తు లేదట. వాడికి అవమానంగా తోచి ఏమీ చెయ్యదలచుకోలేదు.

మా యింటిదగ్గిరే వాడియిల్లు. ప్రొద్దునవచ్చి అఘోరించాడు. ఇవాళ కాలేజీకి సెలవుచీటీ పంపించాడనుకుంటాను."

"ఏదీ, నాకింకా చేరలేదే. బహుశా ఆఫీసులో మేనేజరు దగ్గర వుంటుంది. ఇప్పుడు రావచ్చు.

"మనం ఆ విషయం ఏం చెయ్యలేముగాని, మేష్టారూ పరిస్థితి శ్రుతిమించి రాగానపడకముందే ఈ సమ్మె పరిష్కరించుకోవడం ముఖ్యం. ఈ కుఱ్ఱవాడు వేదమూర్తి చేసిన పొరపాటుకు క్షమాపణ చెప్పుకోడానికి అంత గర్వమేమిటి? కొంతవరకైనా వినయం లేకపోతే, అధ్యాపకవృత్తికేం పని కొస్తాడు!" అన్నాడు శేషయ్య.

కమిటీప్రెసిడెంటు నారాయణరావుగారు ఆకస్మికంగా వచ్చారు. అందరూ చప్పున లేచి ఆయన్ను ఆహ్వానించారు.

ఆయన కుర్చీలోకూర్చుంటూ, ప్రిన్సిపాల్‌తో "మీతో మాట్లాడాలని వచ్చాను ప్రత్యేకంగా" అన్నాడు.

వెంకట్రావు, శేషయ్యశాస్త్రి తమ కుతూహలాన్ని ప్రయత్నంమీద అణచుకొంటూ బయటికి నడిచారు.

"మంత్రిగారినుండి టెలిగ్రామ్ వచ్చింది. ఈ సమ్మెను ఏదోవిధంగా పరిష్కారం చెయ్యాలి. మీరు వేదమూర్తిని పిలిపించండి. అతను ఒప్పుకొనితీరవలసిందే. ఒకవ్యక్తి యిష్టానిష్టాలకోసం ఒకసంస్థ మంచిచెడ్డల్ని కాదనలేము. అతనైనా క్షమాపణ చెప్పటం న్యాయమే!" అన్నాడు నారాయణరావు.

వేదమూర్తి వచ్చాడు. క్షమాపణవిషయంలో తన నిర్ణయానికి తిరుగులేదని స్పష్టంచేశాడు. కళాశాలనుండి వెళ్ళిపొమ్మంటే వెళ్ళడానికి తను సిద్ధమేనన్నాడు.

ప్రెసిడెంటు, ప్రిన్సిపాల్ ఆలోచించి సుందరరావును పిలిపించారు. అతను వేదమూర్తికి నచ్చజెప్పి నిర్ణయం మార్చుకోనేటట్లు చెయ్యవలెనని వారిఉద్దేశం

సుందరరావు అది తనచేతకాదని, దానివల్ల ఫలితం వుండదని నొక్కి చెప్పాడు. వాళ్ళ కంగీకారమైతే తనొక మార్గం సూచిస్తానన్నాడు. కళాశాలకు యివ్వవలసిన క్రిస్టమస్ సెలవులు వెంటనే యిచ్చివేసి, ఇరవైరోజులతర్వాత మళ్ళీ కళాశాల తెరవగానే పరీక్షలు ప్రారంభమౌతాయంటూ, యింకేమీ చెప్పకుండా, విద్యార్థులు సెలవుల్లో చదువుకోవలసిందని కోరుతూ ప్రకటనచెయ్యమన్నాడు.

"అప్పుడుమాత్రం యీ సమస్య ఒకదారికి వచ్చినట్లెలా అవుతుంది ? వేదమూర్తి వైఖరి నా కర్థంకావటంలేదు. అంత స్వాభిమానంవుంటే మనసంస్థకు పనికిరాడని నా అభిప్రాయం" అన్నాడు నారాయణరావు.

"సెలవులిచ్చివేస్తే మనకు కొంత వ్యవధి వుంటుంది. చిక్కులు చక్కబడటానికికూడా అవకాశంకలుగుతుందని మనవి చేస్తున్నాను. వేదమూర్తిగాని, విద్యార్థులుగాని ఆలోచించుకోవటానికి, వైఖరి మార్చుకోవటానికి వీలవుతుంది" అన్నాడు సుందరరావు.

నారాయణరావు ఒకక్షణం ఆలోచించి అన్నాడు.

"అదేం లాభించేట్టు తోచదు. ఈ సమస్యను పరిష్కారం చెయ్యకుండా వాయిదా వేయటంలో నష్టమేవుంటుంది కాని లాభం వుండదు. కాబట్టి మనకు ముఖ్యమైనవిషయమేదో నిర్ణయించుకొని, ఆ విషయంలో పట్టుదలగావుండి, మిగతా

వాటిలో వాళ్ళని కొంత సంతృప్తిపరచటం మంచిది. నాకు పరీక్షలవిషయం ముఖ్యంగా తోస్తుంది.''

సత్యానికంటె పరీక్షలు ముఖ్యమైనవా? అని తన్ను తాను ప్రశ్నించుకొని సుందరరావు సెలవుతీసుకొన్నాడు.

కళాశాల అధిపతులు ఆ సాయంత్రం తమ నిర్ణయాన్ని ప్రకటించారు. "వేదమూర్తి తన లెక్చరరుపదవికే రాజీనామా ఇచ్చాడు. నాటకసంఘము యీ సంవత్సరాంతంవరకు రద్దు చేయబడింది. ఇరవైరోజులు క్రిస్టమస్ సెలవులు శుక్రవారం నుండి ప్రారంభం. సెలవులతర్వాత అన్నితరగతులవాళ్ళకు పరీక్షలు జరుగుతాయి. విద్యార్థులు సెలవుల్లో చదువుకోవాలని కళాశాల అధికారవర్గం ఆశిస్తున్నది.''

విద్యార్థులు తమ ఘనవిజయాన్నిగూర్చి వెంటనే సభ చేశారు. పరీక్షలవిషయంలో స్పష్టమైన ప్రకటన లేకపోయి నప్పటికి, యింతవరకు పొందినవిజయమువల్ల, డిటెన్షన్‌విధానం వుండదనే భావించవచ్చునని తమవిశ్వాసాన్ని ప్రకటించారు.

"విద్యార్థిసమాజసమైక్యతను నిరూపించుకొని, గతచరిత్రకు ఇంకొక ఉజ్జ్వలమైన అధ్యాయాన్ని చేర్చిన విద్యార్థి సోదరుల మహత్తరదీక్షవల్ల మిగిలిన ఆశయంకూడా—పరీక్షలనుగూరించి—సిద్ధింపకపోదు. మనం అందుకు ఐక్యతతో కృషి చెయ్యాలి.'' అని తనఉపన్యాసం, విజయగర్వంతో ముగించాడు చంద్రశేఖరం.

# 19

"ఏమిటి తమ్ముడూ, మా బ్రాహ్మలంతా కలిసి నిన్ను కాలేజినుంచి సాగనంపేస్తున్నారట. ఎవరిమీదో వెళ్ళవలసిన విద్యార్థుల జగన్నాథరథం, ఏ పాపమెరుగని నీమీదుగా వెళ్ళింది, యిదేంకర్మం! ఈ విషయం నాతో ఒక్కమాటైనా అనకపోతివి! నాకూ ఆ సమయానికే పెద్దకష్టం వచ్చి, నిన్ను కలుసుకునే తీరిక లేకుండాపోయింది. ఇదంతా విధివైచిత్ర్యం కాకపోతే యింకేమిటి!" అన్నాడు రామచంద్రయ్య వేద మూర్తిగదికివచ్చి, శుక్రవారంనాడు.

"మీకు వచ్చిన కష్టమేమిటి?"

"సమ్మె యిట్లా ఏడుస్తూవుందిగదా అని మంగళవారం మధ్యాహ్నం నేను యింట్లోనే వున్నాను. రెండున్నర గంటల వేళ, బళ్ళో సురక్షితంగా వుంటుందనుకొన్న మా రెండోది శోభ రైలుపట్టాలదగ్గిర బోర్లగిలపడిపోయి కుడిమోచెయ్యి విరుచుకొంది. పక్కింటివాళ్ళఅబ్బాయి నెమ్మదిగా తీసు కొచ్చాడు. ఇంకా నయం! రెండున్నరగంటలరైలు ఆ రోజు ఆలస్యమట; ప్రాణం దక్కింది!"

"బడినుంచి ఆవేళప్పుడు ఎందుకు వచ్చినట్లు?"

"పంతులమ్మ మూడుగంటల కేదో సరస్వతీపూజ వుంటుందని పిల్లల్ని ఒక్కొక్కర్ని నాలుగణాలు తెమ్మన్నదట. మా అమ్మాయి తీసుకుపోవటం మరచిపోయి, రెండుగంటలకు యథాప్రకారం బడికివెళ్ళింది. ఇంటికివెళ్ళి వెంటనే తీసుకు రమ్మని ఆజ్ఞాపించిందట ఆవిడగారు. ఇదీ పంతులమ్మలుచేసే

నిర్వాకం! పోనీ, మరుసటిరోజు తెమ్మనవచ్చు గదా! అసలు య్యా,పూజలు ఏమిటనుకున్నావు! మధ్యాహ్నం పప్పుబెల్లాలు తింటూ హాయిగా కాలంగడపటానికి. పిల్లలకు పప్పులు, కొబ్బరి, వాళ్ళ కేమో—అంటే మొత్తం ముగ్గురువంతులమ్మలున్నారు-వాళ్ళకు కాఫీ, ఫలహారాలు హోటల్నుంచి. అదీ పిల్లల చందాలోనుంచే అన్నమాట. ఉపాధ్యాయవృత్తి క్రిందనుంచి పైవరకూ ఈరకంగా వుంది."

"చేతికి పెద్దగా తగిలిందా దెబ్బ?"

"పెద్దగా ఏమిటి? ఎముకవిరిగింది. 'ఫ్రాక్చరే' అన్నాడు డాక్టరు. బుధవారం గురువారం నాకూ మా ఆవిడకూ హాస్పిటలుకు తిరగటమే పని. ఇవ్వాళ ఇంటికి తీసుకువచ్చాను. చేతికి కట్టుగట్టిపంపించారు. ఏంచేసేది? ఆడపిల్ల, అందులో కుడి చెయ్యి!"

"చిన్నవయస్సు కాబట్టి, చెయ్యి సర్దుకుంటుందనుకుంటాను."

"భగవంతుడిదయ! సరే, నా విషయం అట్లావుంచు; నీకూ పెద్ద disaster జరిగిందికదా. ఇవాళనుండి సెలవులనీ, నువ్వు ఉద్యోగంమానుకోవడంతో సమ్మె పరిష్కారమైందనీ విన్నాను...అంతేకాదు, దీనికి వెనకాల వున్న రాచకీయం కూడ నీకు తెలీలేదని వెంటనే గ్రహించాను."

"ఏమిటంటారు ఆ రాచకీయం? నేను బుద్ధిపూర్వకంగానే క్షమాపణ యివ్వటానికి నిరాకరించాను. సమ్మె నా క్షమాపణనుగురించే కావటంవల్ల నేను తప్పుకోవలసిన పరిస్థితి వచ్చింది; సరేనని తప్పుకున్నా నంతే. ఉద్యోగంపోయిందని

నాకు చింతలేదు. ఒక ఆదర్శమని అనుకొన్నప్పుడు సిద్ధంగా వుండాలి మరి.”

“అదికాదు. నీ కిక్కడిమనుష్యులు, వాళ్ళతత్త్వాలు, రాచకీయాలు అర్థంకావు. క్రొత్తగా వచ్చావు; ఎంతసేపు ఊహాలూ, ఆదర్శాల్లోనే ఉంటున్నావు. నేను చెప్పతా విను, దీని వెనుకవున్న భాగవతమంతా. అసలు విద్యార్థుల ఆగ్రహమంతా సుందరరావుమీద వుంది. ఆ రోజు నాటకంలో జరిగినతంతు నాకు తర్వాత తెలిసింది. నే నక్కడికి రాకపోవటం ఒక దురదృష్టమే! సంసారపుగొడవల్తో నా కిలాంటి నాటకాలూ అవీ చూడటం అలవాటులేదు. అక్కడ జరిగిం దేమిటి! కార్యక్రమాన్ని మైక్ ముందు నిలబడి చెప్పవలసిన సుందరరావు అలాకాకుండా తను లోపలికి వెళ్ళి, నీ కిచ్చాడు ఆ పని! ఎందుకు? తర్వాత, ‘సంగీతం పూర్తిఅయిపోయింది’ అంటూ నువ్వు తెరవేయించేస్తే, తను తెరతీయించి ఇంకో రెండు పాటలు పాడించటం యెందుకు? కుఱ్ఱవాళ్ళ కేమో నీమీద కోపంవచ్చింది కదా—వుత్తపుణ్యానికి! ఆ పరిస్థితిలో వాళ్ళను మంచిచేసుకోవటానికి సుందరరావుమాత్రం అలా ఎందుకు ప్రయత్నించాలి? అది అలా వుంచు; తర్వాత ఏంజేశాడు? నిన్ను ఆ అమ్మాయితో బండిదాకా, కుఱ్ఱవాళ్ళసమ్మర్దాన్ని తప్పించుకొనివెళ్ళమని పురమాయించాడు. నీమీద వాళ్ళు అసలే కోపము తెచ్చుకుని ఉంటే—నువ్వు ఆఅమ్మాయివెంట, వాళ్ళందర్నీ తోసుకుంటూ వెళ్ళడం తెలివితక్కువగాక ఏమౌతుంది? నీకోపంవచ్చి లెంపకాయకొట్టావు; దాన్తో వాళ్ళంతా నీ మీద విరుచుకుపడ్డారు. సుందరరావు చేసింది

ఎంత తెలివిగావుందో చూడు! పోయినసంవత్సరంనుండి ఆ అమ్మాయితో సుందరరావుస్నేహం, ఆమెకు సంగీతప్రదర్శనలు ఏర్పాటుచెయ్యడం విద్యార్థుల్లో బాగా కోపాన్ని రెచ్చగొట్టింది. కాని, తీరాచూస్తే ఆ కోపానికి ఆహుతికావడం నువ్వా!"

"మీరు సుందరరావునుగురించి చెప్పేవిషయాలు నేను నమ్మను. ఆ రోజు నాటకంలోజరిగినగొడవ అతని దురుద్దేశం వల్ల జరిగిందికాదు; ఆ క్షణంలో అలా జరిగిపోయింది ఒకదాని కొకటి; అంతే!"

"నీ కలానే తోస్తుంది. అసలిది బ్రాహ్మలకాలేజి అనేది గుర్తుపెట్టుకో. నువ్వూ, ఉర్దూమున్షీ తప్ప బ్రాహ్మణేతరులెవ్వరున్నారు ? ఇంగ్లీషుఆనర్సువాళ్ళు దొరకటంలేదని నిన్ను తీసుకున్నారు. అదీ అసలురహస్యం. సుందరరావుకుగాని, కమిటీవాళ్ళకుగాని నీమీద ప్రేమేమిటి ? నిన్ను ముందుకునెట్టి సుందరరావు తప్పించుకున్నాడు. ఇరవైఎనిమిది, ముప్పైఏళ్ళు వచ్చి బ్రహ్మచారిగా వుండటమేమిటి ? వరసైన మరదలేమో ఒకప్రక్క కాలేజీలోవుండగానే తనకులంకానిఅమ్మాయితో స్నేహమేమిటి ? సంఘసంస్కారణ అనే ఉద్దేశం వుంటే ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకుంటే ఎవరైనా హర్షిస్తారుగాని, ఈ వేషాలేమిటి ?"

"మనం అనవసరంగా సుందరరావును, ఆ అమ్మాయిని గురించి ఎందుకిట్లా మాట్లాడుకోవాలి! రెండుమూడుసార్లు పాడమనటంలో, పరిచయంలో తప్పేమిటి ? ఆడపిల్లలకూ-మా

కాలేజీలో అవకాశాలివ్వటం న్యాయమే. అంతకంటె సుందర రావు ఏం చేశాడు?"

"మంచి అవకాశాలిస్తున్నాడు! సరే, అతనిగోల మన కెందుకు? మధ్య నువ్వెందుకు ఉద్యోగంవదులుకున్నట్టు? ఇట్లా ఉద్యోగంమానెయ్యడం ప్రారంభిస్తే, ఇంక నువ్వెక్కడమాత్రం స్థిరంగావుంటావు? ఇప్పటిపరిస్థితుల్లో ఉద్యోగం పోగొట్టు కోవడం మంచిపనికాదు."

"ఎక్కడో యింతమాత్రం మళ్ళీ దొరక్కపోదు. నేటి పేపర్లోనే మద్రాసులో ఒక ట్యుటోరియల్ కాలేజికి ఇంగ్లీషు లెక్చరరు కావాలని వుంది. ఈ మూడునెలలు అక్కడ, వేసవి కాలంతర్వాత ఏ కాలేజిలోనో ఉద్యోగం దొరుకుతుంది. ఇంతలో ఐ. ఏ. యస్. కి చదవాలనుకొంటున్నాను కూడా. యీ వాతావరణంనుంచి వెళ్ళిపోవటమే మంచిది."

"సరే, అదృష్టం బాగుంటే అన్నీ మంచికే! నీ కేమీ బరువూ, బాధ్యత లేదు కాబట్టి దేశసంచారార్థం బయలు దేరు తావు. నాకే యిట్లాంటి సమస్యవస్తే, నేను ఉద్యోగంవదలి వెళ్ళగలనా మరి!"

"పోనివ్వండి. అవకాశం వుందికాబట్టే, ఏదో ఆదర్శం అంటూ కొంత ఆవేశపడనివ్వండి."

"ఆదర్శం సరే, తమ్ముడూ! కాని నువ్వింకొకరికోసం Scapegoat కావడం నాకు బాధకలిగిస్తోంది."

ఆ సంగతి మళ్ళీ ఎందుకులెండి. నేనీ ఆదివారమే సరాసరి మద్రాసు వెళ్దామనుకుంటున్నాను."

"అయితే వెళ్ళటమే తరువాయి అన్నమాట."

"ఈకాలేజికి గుడ్‌బై చెప్పటానికి నాకేమీబాధగాలేదు. బ్రాహ్మలకాలేజి అన్నారు, బ్రాహ్మలే ఉండండి. మీరూ బ్రాహ్మలే కదా!" అన్నాడు నవ్వుతూ వేదమూర్తి.

"అవును స్వామీ! అందుకే ఏదో నెట్టుకువస్తున్నాను. కాని నిష్కల్మషహృదయంగలవాడివి, నీ కన్యాయంజరగటం నాకు కష్టంగావుంది. అందుకే యిన్నాళ్ళూ అనకపోయినా యివ్వాళ అంటున్నాను బ్రాహ్మలసంగతి. అయినా బ్రాహ్మణే తరులుమాత్రం తక్కువతిన్నారేమిటి? వాళ్ళకాలేజి అయితే ఇంక వాళ్ళదే ప్రభావం అక్కడ! ఈ తత్వానికి అంత మెక్కడ? అందరూ పైకి ఏదో మాట్లాడటం తప్పితే."

"నేను ఆదివారంనాడు మెయిలుకి వెళ్దామనుకుంటు న్నాను. మీరు నాదగ్గరతీసుకున్న వందరూపాయలు సర్దగలిగితే బాగుంటుంది."

"అమ్మాయిని ఆస్పత్రికి తీసుకువెళ్ళానా, చేతిలోవున్న డబ్బెళ్ళ ఖాళీ! ఇప్పుడు యింటిఖర్చుకే దేవుళ్ళాడవలసివచ్చింది. నీ అడ్రసు యివ్వు. వచ్చేనెలజీతం రాగానే పంపించేస్తాను. ప్రయాణం ఇంత తొందరలోనే పెట్టుకున్నావు!నిజం చెప్పాలంటే ఇప్పుడు నీదగ్గర ఇంకో ఇరవై అడిగితీసుకుందామనే వచ్చాను."

"నాకు మద్రాసులో వెళ్ళగానే ఉద్యోగం దొరుకు తుందని నిశ్చయంగా తెలిస్తే, ఇచ్చేవాణ్ణే. కాని ఏ సంగతీ తెలీదు. ఆ ట్యూటోరియల్ కాలేజీ ఉద్యోగానికూడా ఎన్ని దరఖాస్తులున్నాయో! అందుకే వెంటనే స్వయంగా వెళ్లుతున్నాను."

"నిజమే, నాకు తెలుసు వుంచుకోను. నే నేదో ప్రయ త్నిస్తానులే."

రామచంద్రయ్య వెళ్ళిన తర్వాత, చాలసేపు ఆలో చిస్తూ కూర్చున్నాడు వేదమూర్తి.

* * *

సాయంత్రం డాక్టరు రమణమూర్తిని కలుసుకోవటానికి వెళ్ళాడు వేదమూర్తి.

లీల, లీలతల్లి ఇద్దరూ డ్రాయింగ్ రూములో కూర్చుని వున్నారు.

"రండి మూర్తిగారూ, ఏమిటి విశేషాలు ?" అన్నది లీలతల్లి.

ఆమె జరిగినసంగతులు తన నోటిద్వారానే వినాలను కొన్నదని గ్రహించి, "ఏమున్నాయి ?" నేను ఎల్లుండి వెళ్ళిపో తున్నాను. ఇక్కడ ఉద్యోగానికి రాజీనామా యిచ్చాను" అన్నాడు ముక్తసరిగా.

తలవంచుకొని ఏదో అల్లుకుంటూ కూర్చున్న లీల తలెత్తి చూచింది. కాని ఏమీ అనలేదు.

కొన్నిక్షణాల నిశ్శబ్దం తర్వాత "కమిటీవాళ్ళు యిమ్మన్నారా, మీరే తొందరపడి యిచ్చేశారా ?" అని ప్రశ్నించిది లీలతల్లి.

వాళ్ళు విద్యార్థులకు క్షమాపణ చెప్పుకోమన్నారు. నేను నిరాకరించాను. ఆ పరిస్థితిలో ఉద్యోగంనుంచి తప్పుకోవ టమే మార్గమైంది... అందుకు నాకేమీ విచారంగాలేదు.

మద్రాసువెళ్ళి ఉద్యోగప్రయత్నం చెయ్యాలనుకొన్నాను" అన్నాడు.

ఆమె తర్వాత ఏమీ మాట్లాడలేదు. కొంతసేపటికి లేచి, లీలతో "అమ్మాయీ, మనం మున్సిఫ్‌గారియింటికి వెళ్ళాలనుకున్నామే. నువ్వు తొందరగా తయారవ్వుమరి. ఆలస్య మవుతుంది" అని చెప్పి లోపలికి వెళ్ళిపోయింది.

వేదమూర్తి కేం చెయ్యాలో తోచలేదు. డాక్టరుగారితో తన భవిష్యత్తునుగూర్చి కొన్నివిషయాలు మాట్లాడవలెనని వచ్చాడు. ఇదివరకు మాటలసందర్భంలో ఆయన తనమీద చూపిన శ్రద్ధనుబట్టి, మద్రాసుకాలేజీలలో ఉద్యోగం లభించటానికేమైనా సహాయంవుంటుందని ఆశించాడు. చివరిసారి వాళ్ల కుటుంబంతో మాట్లాడి, కృతజ్ఞత తెల్పి, సెలవుపుచ్చుకోవలెనని వచ్చిన వేదమూర్తికి ఆశాభంగం కలిగింది.

ఇక తను లేచి వెళ్ళిపోవటమే కర్తవ్యమనుకొంటూ వుండగా లీల అన్నది. "అయితే మీరు వెళ్ళిపోతున్నారు కదా... ఈవూరికి మళ్ళీ ఎప్పుడు వస్తారు ?"

"ఏమో! నా కిక్కడేం పనివుంటుంది? బహుశా రాను. నా కిక్కడ తెలిసింది ఏ యిద్దరో ముగ్గురో... మీ కుటుంబంతోనే ముఖ్యంగా పరిచయం. మీరైనా ఎంతకాలం వుంటారీవూళ్ళో? మీ నాన్నగారికి మళ్ళీ బదిలీఅయ్యేవరకే కదా. నాకూ యీ వూరికి ఏమీ సంబంధం వుండదనుకుంటాను."

లీల మౌనంగా తన అల్లికవైపు చూస్తూవుంది. కొన్ని క్షణాలతర్వాత, అతని ముఖంలోకి చూస్తూ అన్నది.

"అన్నయ్యా! మిమ్మల్నెప్పుడూ మరచిపోను."

ఆమె తన్ను 'అన్నయ్యా' అని పిలవటం తమ అను బంధాన్ని తెలియజెప్పినట్లుంది.

"మీరెక్కడికి వెళ్ళినా, మీకు గొప్ప భవిష్యత్తు వుండాలనే నా కోరిక" అన్నదామె

"లీలా! ఆలస్యమౌతోందమ్మా!" అని లోపల్నుంచి పిలుపు వినిపించింది.

వేదమూర్తి లేచి నిలుచున్నాడు.

"చెల్లాయి ఎప్పుడూ సుఖంగా వుండాలని కోరటంకంటె నేనేం చెప్పగలను? నీ పెళ్ళికి మాత్రం నన్ను పిలవడంమరచిపో వద్దు. ఎక్కడున్నా తప్పకుండా వస్తాను" అన్నాడు.

లీలకూడ లేచింది. వేదమూర్తిని చూచి నవ్వుతూ, "అన్నయ్యా, మీరు పెళ్ళాడబోయే అమ్మాయినిగూర్చి నాకొక చక్కని ఊహ" అన్నది.

"ఏమిటది?" అన్నాడు నవ్వుతూ, కుతూహలంగా.

"ఆ అమ్మాయి ఎట్లావుంటుందో చెప్పనా...?" విమలలాగ!"

"ఎందుకని?" ఆశ్చర్యంగా అడిగాడు.

"అమ్మాయ్ లీలా!" అంటూ లీలతల్లి గదిలోకి వచ్చింది,

"లీలా, నేను వెళ్తాను. నీకు నా ఆశీస్సులు. ఏమండీ, నేను శెలవుతీసుకుంటాను. ఎప్పుడైనా కలుసుకుంటామోలేదో మీ అభిమానంమాత్రం నాకు జ్ఞాపకంవుంటుంది" అన్నాడు నమస్కారంచేస్తూ.

ఆమె ప్రతినమస్కారం చేసింది.

వేదమూర్తి ఆస్పత్రివైపు నడిచాడు. కడసారి వీళ్ళను కలుసుకోవటం యీవిధంగావుంటుందని తను ఊహించలేదు. మొదట చూపిన శ్రద్ధ, అభిమానం లేకపోగా, లీలతోనైనా సరిగా మాట్లాడేందుకు అవకాశమివ్వలేదు డాక్టరుగారిభార్య. దీనికి కారణమేమైవుంటుంది? తను ఉద్యోగంవదలిపెట్టి వెళ్ళి పోతున్నందుకా, యీ అశ్రద్ధ!"

డాక్టరుతో మాట్లాడవలెనన్న ఉత్సాహం పోయింది. కాని యీ మార్పు ఎందువల్ల వచ్చిందో తెలుసుకోవాలని మాత్రం కుతూహలంగా వుంది.

ఆస్పత్రివార్డులదగ్గరకు వచ్చేటప్పటికి డాక్టరు ఎదురు పడ్డారు. ఆయన దారిలో నిలబడి ఒకనర్సుతో మాట్లాడు తున్నాడు.

"Good evening డాక్టర్" అన్నాడు.

"Good evening" అని తనవైపు చూచి తలఆడించి, తర్వాత నర్సుతో సంభాషణ సాగించాడు.

"డాక్టర్ల ధోరణి యింతే, వాళ్ళు డ్యూటీమీద వున్న ప్పుడు" అని మనస్సులో అనుకుని, ఆయనకోసం నిరీక్షిస్తూ నిలుచున్నాడు.

సంభాషణ సుదీర్ఘంగావున్నట్లు అనిపించింది. రెండుసార్లు బయలుదేరబోయికూడా డాక్టరు మళ్ళీ నర్సుని వెనక్కి పిలిచి, మాట్లాడాడు. తను చాలసేపు వేచివున్నట్లుంది వేదమూర్తికి.

"హల్లో! ఏమిటండీ విశేషాలు?" అని పలకరించాడు డాక్టరు—సరిగ్గా ఆయనభార్య అన్నట్లే! — "కాలేజీకి సెలవు లిచ్చారట కదూ!" అన్నాడు దగ్గరగా వచ్చి.

చిరునవ్వుతో "నేను కాలేజినుంచి ఏకంగా సెలవు పుచ్చుకొన్నానులెండి!" అన్నాడు హాస్యధోరణిలో. ఆయన నవ్వలేదు. ఇద్దరూ నాలుగడుగులు ముందుకు వేశారు. "అవును. మీరు ఆ రోజునే చెప్పారుగా మీ నిశ్చయం. మంచిదే—అయితే కాలేజివదలిపెట్టి వెళ్తున్నారన్నమాట!" అంటూ నిలబడిపోయ్యాడు డాక్టరు.

"అవును, ఎల్లుండి మద్రాసు వెళ్తున్నాను. అక్కడ ట్యూటోరియల్ కాలేజిలో ఒక ఖాళీ వుందని ప్రకటన చూశాను. తర్వాత కాలేజీల్లో ఎక్కడైనా ప్రయత్నించాలని ఉద్దేశం. ఐ.ఏ.యస్. పరీక్షకుకూడ కూర్చోవాలనుకున్నాను."

"అట్లాగే, ప్రయత్నించండి. పోటీ ఎక్కువగావుంటుందేమో! కాని ప్రయత్నించవలసిందే!"

వేదమూర్తికి ఆయనలో మార్పువచ్చినట్లు తోచింది. అక్కడే నిలబడి మాట్లాడుతున్నాడుగాని "రండి యింటికి వెళ్దామని "అనలేదు.

ఇక చివరిసంగతికూడా చూద్దామని "మీకు మద్రాసులో ఎవరో తెలుసునన్నారే?" అన్నాడు.

"ఆఁ... కాని యిప్పుడేంప్రయోజనం సంవత్సరం మధ్యలో? జూలైలో అయితే వీలుగావుండేది." అంటూ చేతివాచీ చూచుకొన్నాడు. "మీరు ఎల్లుండి,—అంటే ఆది వారం వెళ్తున్నారా?" అన్నాడు.

"అవును." వేదమూర్తి యీ ప్రశ్నతర్వాత ఏమి వస్తుందో అనే కుతూహలంతో డాక్టరువైపు చూస్తున్నాడు.

"మీతో పరిచయం మాకుటుంబాని కెంతో సంతోషం కలిగించింది. మే మెప్పుడూ మిమ్మల్ని గుర్తుంచుకుంటాము. ముఖ్యంగా మా అమ్మాయి లీల. రేపు నేను పనిమీద వెళ్తున్నాను. మనం మళ్ళీ కలుసుకోమనుకుంటా. Good luck... Good-Bye" అన్నాడు డాక్టరు.

"నేనుకూడా మరచిపోలేను, Goob-bye." అని చెప్పి గేటువైపు తిరిగాడు వేదమూర్తి.

*    *    *

రైలు రావటానికి ముప్పావుగంట వ్యవధి వుంది. వేదమూర్తి, సుందరరావు వెయిటింగ్ రూములో కూర్చున్నారు.

"నే నిక్కడికివచ్చి యిన్నిసంవత్సరాలైనా, నాకు సన్నిహితులైనమిత్రులెవరూ ఏర్పడలేదు. మనస్నేహానికి నాదృష్టిలో అందుకే ఒక విశిష్టత వుంది. ఈ వారంరోజులఅనుభూతిలో విడదీయటానికి వీలులేకుండా కలిసిపోయిన మంచిచెడ్డల్ని గూర్చి ఆలోచిస్తే, జీవితం ఎంత విచిత్రమైంది! అనిపిస్తూంది. ఒకవైపు మీరు సన్నిహితులు కావటానికి కారణమైన పరిస్థితులే, మిమ్మల్ని నన్ను వేరుచేస్తూ, మీరు వెళ్ళటానికికూడా కారణాలయినాయి. మిమ్మల్ని అనాలోచితంగా, సులువుగా చిక్కుల్లోపెట్టాను కాని, ప్రయత్నంచేసి ఆ చిక్కు విప్పలేకపోయ్యాను. పరిసరాలకు, నాకు ఏదో సమన్వయం లేకపోవటం ఉద్దేశాలకు సంబంధంలేని విపరీతఫలితాల్ని, నావలన యితరులకు కలిగేనష్టాన్ని చూస్తే, ఏదో లోపం నాలోనే వుందని భావిస్తూవున్నాను." అన్నాడు సుందరరావు.

"ఇక్కడివాతావరణంలోనే ఆ లోపం వుందని నా అభిప్రాయం."

"కావచ్చు, కాని అట్లాఅని నిర్ణయించుకొనేముందు ఆత్మపరీక్ష చేసుకోవాలి! నాలో ఏదో నిస్పృహా, నిర్లిప్తత ప్రవేశించింది. కొన్నాళ్ళతర్వాతగాని దీని అర్థం బోధపడదు."

"మీరు వివాహ మెందుకు చేసుకోరు?"

సుందరరావుమౌనం చూచి, బహుశా ఆ ప్రశ్న వేసివుండకూడదేమో, అనిపించింది వేదమూర్తికి.

"మీ రిందాక అడిగినప్రశ్న నన్ను మా నాన్నగారే అడగటంలేదు." అన్నాడు సుందరరావు చిరునవ్వుతో. "వివాహ మెందుకుచేసుకోవాలి? దానికి వ్యక్తుల్నిబట్టి ఎన్నో కారణాలు వుంటాయి. శారీరకవాంఛ అనేది సామాన్య కారణమే అయినా, వ్యక్తిగతంగా ఒక్కొక్కరు కొన్ని యితరకారణాలను దానితో ముడిపెట్టుకొనివుంటారు. శారీరక వాంఛనుమించి దాన్ని అదుపులోపెట్టగల బలవత్తరకారణం ప్రతికూలంగా ఏదైనా వుందనుకోండి; అప్పుడు వివాహం జరగదు." అన్నాడు.

"మీరనేది నాకూ చూచాయగా తెలిసిందను కుంటాను—మీకునచ్చిన, ప్రేమింపదగిన వ్యక్తి యింకా ఎదురవలేదనేనా దాని అర్థం. శారీరకవాంఛను మించిన కారణం వ్యక్తిత్వాన్నిగురించే అయివుండాలి." అని ఊహించాడు వేదమూర్తి.

"అదికాదు! నేను ఏవ్యక్తికోసమూ ఎదురుచూడటం లేదు. ఆ కారణం నా జీవితంలో గతానికి సంబంధించినది."

"అంటే ఒకప్పుడు భగ్నమైపోయిన ప్రేమానుభూతి కారణం; అంతేనా?"

"నేనింకేమీ దాన్ని గూర్చి చెప్పలేను...అనుబంధాలు అన్నవి విచిత్రమైనవి. వాటికి జీవితంలోగల ప్రాముఖ్యతను గురించే అన్వేషణ నేను సాధించేదేదైనా వుంటే వాటితత్త్వాన్ని అవగాహనచేసుకోవడమే. దానితో నన్ను నేను అర్థంచేసుకోవడం పూర్తవుతుంది."

గంటకొట్టారు. పోర్టరు సామాన్లు తీసుకోవటానికి వచ్చాడు. వేదమూర్తి, సుందరరావు ప్లాట్‌ఫారమ్‌మీద నిలుచున్నారు.

"ఉత్తరాలు వ్రాస్తూవుండండి. మీ రెక్కడ ఉద్యోగంలోచేరిందీ తెలపండి వెళ్ళగానే" అన్నాడు సుందరరావు.

"తప్పకుండా. నిన్న మీతో అన్నాను కదా, ఇక్కడి నుంచి నావెంట తీసుకుపోతున్న జ్ఞాపకాలు రెండు...ఒకటి మీస్నేహం, రెండు లీలఅభిమానం...నిన్న మీకు వాళ్ళను గురించి చెప్పానుకదా! ఎందుకని కడసారి డాక్టరుగారూ, ఆయనభార్య అట్లాచేశారంటారు?"

"నా ఊహ ఏమిటో చెప్పమంటారా? బహుశా డాక్టరుగారు మిమ్మల్ని అల్లుణ్ణిచేసుకోవాలనుకొనివుంటాడు. కాని మీకుగాని, లీలకుగాని ఆ అభిప్రాయంలేదని చివరకు తెలిసివుంటుంది. అందువల్ల వాళ్ళకు మీమీద శ్రద్ధ పోయి వుంటుంది. అంతకిన్నా కారణంవుండదు."

"వాళ్ళఅమ్మాయిఅభిప్రాయం మొదటినుంచీ వాళ్ళకు తెలీదంటారా?"

"తెలిసివుండదు. మీమీద ఆ అమ్మాయి కెంతో అభిమానమని తెలుస్తూనేవుంది. మీతో పరిచయంకలిగింది. అందువల్ల వివాహానికి అవకాశవుందని వూహించి, ఆ ఉద్దేశం తోనే మొగట మీమీద శ్రద్ధచూపివుంటారు."

ఇంతలో నలుగురువిద్యార్థులు వారిదగ్గరకు వచ్చారు. రైలుకూడా వచ్చింది. ఆ తొందరలో వేదమూర్తి విద్యార్థుల్ని గమనించలేదు. పోర్టరు సామాన్లు లోపలపెట్టినతర్వాత ద్వారంలో నిలుచున్న వేదమూర్తికి విద్యార్థులు నమస్కారం చేశారు. సుందరరావు వాళ్ళకు వెనుకగా నిలుచున్నాడు. వేదమూర్తి వాళ్ళకు ప్రతినమస్కారం చేసి, చిరునవ్వునవ్వి సుందరరావువైపు చూశాడు.

ఒకవిద్యార్థి చేతిలోనిపొట్లం విప్పి ఒక చిన్నబొమ్మ తీసి వేదమూర్తికి ఇచ్చాడు. అది ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో చేసిన చిన్న గాంధీవిగ్రహం.

"ఇదేమిటి!" అన్నాడు వేదమూర్తి ఆశ్చర్యంగా.

"మీరు వెళ్లిపోవటం మాకు విచారంగావుంది మేష్టారు! ఇది మేము నలుగురంమీకు జ్ఞాపకార్థం ఇవ్వాలని తెచ్చాము." అన్నారు.

వేదమూర్తి బొమ్మను చూస్తూ, ఏం చెప్పాలో తోచక, మౌనంగా వుండి, "ఎందుకు తెచ్చారుఇది?" అన్నాడు.

వాళ్ళకు అర్థంకాక ఒకరినొకరు చూచుకొంటున్నారు.

"దయచేసి తీసుకోండి" అన్నాడొకవిద్యార్థి. "బజారులో ఇదే మిగతా బొమ్మలకన్న బాగా నచ్చింది మేష్టారూ!" అన్నా డింకొక విద్యార్థి.

"థాంక్స్" అన్నాడు వేదమూర్తి.

విజిల్ ఇచ్చారు, రైలు కదిలింది. సుందరరావు చెయ్యి ఊపుతూ "గుడ్ బై" అన్నాడు. విద్యార్థులు నమస్కారం చేశారు. వేదమూర్తి చేతిలోని విగ్రహం పైకెత్తి సుందరరావుకు చూపించాడు.

# 20

సముద్రతీరాన యిసుకలో కూర్చున్నాడు వేదమూర్తి.

కోరిన స్వేచ్ఛ లభించింది. ఎడతెగకుండా తీరాన్ని తాకుతున్న సముద్రతరంగాల శబ్దంలో ఒక నిర్లిప్తత, మానవ లోకంతో సంబంధంలేని నిర్లక్ష్యత వ్యక్తమాతున్నవి. మొదటిసారి సముద్రందగ్గర కూర్చున్నవాళ్ళకు సముద్రుడికి తమమీద ఏదో సానుభూతివున్నట్లు తోస్తుంది; కాని అది మిథ్య, నిజం కాదని సముద్రంతో కొన్నాళ్ళు పరిచయమైతే తెలుస్తుంది.

మన ఊహలు, భావనలు మనవి; సముద్రుని హోరు సముద్రునిది.

అలల తాకిడితో, తీరాన యిసుక అంచుల్ని చేరిన నురగ సముద్రుడు టూత్ పేస్టు పెట్టి పళ్ళుతోముకుంటూవుంటే నోటి చివర జారుతూవున్న నురగలావుంది. లయబద్ధమైన తరంగాల కదలిక సముద్రునినోటిలో ముందుకు వెనక్కి పరుగెత్తే బ్రష్ లాగ, తరంగశీర్షాలమీది తెలుపు అతని పళ్ళ తళతళలాగ వున్నాయి. సముద్రుణ్ణి చూస్తే తనకు నవ్వువస్తుంది. జనం గుమిగూడిన మెరీనాబీచీలో వేరుకడలమ్మేవాళ్ళ కేకల్లో,

శేడి యోసంగీతంలో, జనసందడిలో సముద్రుణ్ణి చూస్తే నవ్వే వస్తుంది. ఎడ తెరిపి లేకుండా వళ్ళుతోముకుంటూ, మాట్లాడలేని పరిస్థితిలో ఉరికే ఎదుటివాళ్ళను గమనిస్తూ వున్న వ్యక్తిలా వున్నాడు సముద్రుడు.

సముద్రాన్ని గురించి ఎన్నివిధాలుగానైనా ఊహిస్తాము. ఒకవ్యక్తివిషయంలో కూడ ఎన్నో ప్రతిబింబాలు కనిపిస్తాయి. మనం చూచేకోణంమీద ఆధారపడివుంటుంది ప్రతిబింబాలలో భేదం. తనకు సుందరరావు ఆదర్శవాది, వేదాంతి; రామ చంద్రయ్యదృక్కోణంలో అతను జిత్తులమారి బ్రాహ్మడు. తప్పించుకొని తిరుగగల ఉపాయశాలి. పెళ్ళి చేసుకోకుండా యథేచ్ఛగా జీవితంగడుపుచున్న బాధ్యతలెరుగని బ్రహ్మచారి! రామచంద్రయ్య ఎప్పుడూ వాస్తవికంగా ఆలోచిస్తానంటాడు.

లీల తనమీదచూపిన సానుభూతి, అభిమానం ఆమె తల్లిదండ్రులకే అర్థంకాలేదు. ఆ విషయాన్ని గురించి సుందర రావు ఊహించింది సమంజసంగానేవుంది. అదే నిజమైవుంటుం దని తనూ అనుకున్నాడు.

ఏమైనా ఒకవ్యక్తినిగూర్చి, ఒకవిషయాన్నిగూర్చి, ఊహాలే ఉండటానికి సాధ్యం; నిజమిదంటూ నిర్ధారణచెయ్య టానికి అవకాశంలేదు. ఇది తనకు క్రొత్తగా తట్టిన పరమార్థం. క్రొత్తఅనుభవాలు క్రొత్తవిజ్ఞానాన్ని యిస్తాయి.

రామచంద్రయ్య, సుందరరావు ఎటువంటివ్యక్తులు ? లీలతల్లిదండ్రులవైఖరిలో వచ్చిన మార్పేమిటి ? అది మార్పేనా లేక తన అపోహా? ఈ ప్రశ్నలకు నిజమైన సందేహం లేని సమాధానాలు ఎప్పుడూ దొరకవు కాబోలు!

సముద్రుడు ఏడుస్తున్నాడో, వళ్లు తోముకుంటున్నాడో, నిజంగా ఏంచేస్తున్నాడో ఎవరికీ తెలీదు. వ్యక్తులమనసుల్లో అన్నీ అన్నీ ప్రతిబింబాలు! అని సముద్రతరంగాలవలెనే క్షణిక ప్రాయమైనవి. జీవితం సముద్రంలాగే నిరూపణకాని రహస్యం!

కొన్నివిషయాలకు అర్థం, వివరణ అంటూ వుండదు. కొన్నింటికి ప్రత్యేకంగా మనకు సంబంధించినంతవరకే అర్థం, వివరణ. వ్యక్తులనిజతత్వాన్నిగురించిన సమాధానం రెండవ సూత్రాన్నే అనుసరిస్తుంది.

ఒక్క లీలవల్లనే. తన్ను స్పృశించి, కదిలించే సానుభూతి సందేహంలేకుండా లభించింది. లీలమాటల్లోని నైశిత్యం హృదయాన్ని తాకగలశక్తి నిచ్చిత్రమైంది. ఆమె చివరకన్న మాట—విమలను గూర్చి—తనమనస్సుని తఱచి బయటకు తీసిన రహస్యం! విమల తన్నెంత ఆకర్షించి, వశంచేసుకొన్నదో తనకే తెలీలేదు; ఆమె తనమనస్సులో మెదులుతూ వుండటం నిజమే; కాని లీల ఆ రహస్యాన్ని గ్రహించినట్లు, తనతో ఆ మాట చెప్పటంవల్ల, తనరహస్యం తనకే స్పష్టంగా తెలిసివచ్చింది!

ఒక్కరోజు మాత్రమే, కొన్ని నిమిషాలపాటు విమలతో మాట్లాడాడు; లీలకూడా అక్కడున్నది. అంతమాత్రంతో లీలకీ ఊహ రావటానికి కారణమేమిటి?

వాళ్ళు నన్నుగురించి ఎప్పుడైనా మాట్లాడుకోవటం వుందని లీల ఒకసారి అన్నది. విమల తన్నుగూర్చి ఏవిధంగా భావిస్తూవుందో! తనరహస్యాలేవైనా ఆమె లీలతో చెప్పిందికాబోలు!

ఈ విషయాన్ని గురించికూడా తెలుసుకోవటానికి వీలు లేదు. ఆలోచనల్ని కవ్వించే యీ మర్మమే అనుభవాలకు, వ్యక్తులకు మనదృష్టిలో విలువను, ప్రభావాన్ని కలుగజేస్తోంది కాబోలు !

ఏమైనా తనకు స్వేచ్ఛ లభించింది.

వేదమూర్తి సముద్రంవైపు చూశాడు. పసిపిల్లల కథల్లో, జానపదసాహిత్యంలో వీరుడైన రాకుమారుడు ఏడు సముద్రాలు దాటి, రహస్యాన్ని బద్దలుకొట్టి, ఏ మణినో సాధించి, సుందరిని పెళ్ళిచేసుకొంటాడు. ఈ సముద్రుణ్ణిగూర్చి ఊహిస్తూ, జీవితరహస్యాన్ని తెలుసుకోగోరుతున్న తనుగూడ రాకుమారుడేనా? తన్నే సుందరి వివాహమాడుతుంది?

విమలతో పరిచయం వృద్ధిపొంది, ప్రేమగా పరిణామం చెందటానికి అవకాశం కనిపించింది; కాని అంతలోనే తను అక్కడినుండి వచ్చివేశాడు. ఇప్పుడిక ఆ అవకాశం ఎన్నటికీ వుండదు.

ఇక్కడివాతావరణంలో వైశాల్యం, స్వేచ్ఛ వున్నాయి; కాని ఎటు వెళ్ళాలో దారి తెలీదు. ఏదో ఒంటరితనం కనిపిస్తూ వుంటుంది.

ఆరున్నర అయింది. వేదమూర్తి లేచి మెరీనా కాంటీన్ వైపు నడిచాడు.

ఎవరూలేని టేబిల్ దగ్గర కూర్చున్నాడు. వెయిటర్ కోసం చూస్తూ ఆ హాల్లో కూర్చున్నవాళ్ళందర్నీ గమనిస్తు న్నాడు. ఆ హాలుచివర కిటికీప్రక్కన, యిద్దరుస్త్రీలు కూర్చు న్నారు. పెద్దావిడముఖం మాత్రం కనిపిస్తోంది; యువతి అవతలి

వైపుగాతిరిగి కూర్చున్నది. ఆ అమ్మాయిని వెనుకవైపునుండి చూస్తూంటే విమల జ్ఞాపకంవస్తుంది.

వెయిటర్ వచ్చాడు. ఫ్రూట్ సేలడ్ తీసుకురమ్మని చెప్పి, ఆ అమ్మాయివైపే చూస్తున్నాడు, ఏక్షణంలోనైనా వెనక్కితిరిగి చూస్తుందేమోననే కుతూహలంతో. దేహవిన్యాసంలో విమలపోలికలున్న అమ్మాయి మద్రాసులో కనిపించటం యిది మూడోసారి. కాని ముఖం కనుపించక రెండుసార్లు ఆశాభంగమైంది. అందుకే యీ సారి చూడవలెనన్న కుతూహాలం ఎక్కువగావుంది.

సేలడ్ సగంతినేప్పటికి వాళ్ళు లేచారు. ఆ అమ్మాయి అచ్చంగా విమలే. వాళ్ళు వెళ్ళిపోతున్నారు. విమలే మద్రాసు వచ్చివుంటుందనుకొన్నాడు. కాని ఎందుకువస్తుందన్న ప్రశ్నకు జవాబు దొరకలేదు. వ్యక్తినిపోలినవ్యక్తులుంటారుగద! ఏమైనా నిజం తెలుసుకోవాలని, ఉద్వేగంతో లేచి వెళ్ళాడు.

వాళ్ళు ద్వారందాటి దారిప్రక్కగా ఒకక్షణం నిలబడ్డారు. పెద్దావిడ తన చెప్పులు వేసుకొంటోంది. అక్కడ నీడగావుండి ముఖాలు స్పష్టంగా కనిపించటంలేదు. ద్వారం దాటి, సందేహిస్తూ ఆగిన తన వైపే ఆ అమ్మాయి వచ్చింది. వేదమూర్తి విమలేనని తెలుసుకున్నాడు. "నమస్కారం మేష్టారూ!" అన్నది విమల.

వేదమూర్తి నవ్వుతూ "నువ్వేనా కాదా అని సందేహంకలిగి, గబగబ లేచివచ్చాను. ఇక్కడికి ఎప్పుడు వచ్చావు?" అని ప్రశ్నించాడు.

"రెండురోజులైంది. మా అమ్మకు ఇక్కడ ట్రీట్‌మెంట్ కోసం వచ్చాము" అన్నది.

వెయిటర్ వచ్చి "సార్" అని పిలిచాడు. బిల్లుసంగతి గుర్తువచ్చి "సారీ" అని పర్సుతీసి డబ్బుచెల్లించాడు.

విమల వేదమూర్తిని తనతల్లికి పరిచయంచేసింది.

అందరూ రోడ్డువైపు నడిచారు.

విమల పినతల్లిభర్త, పనిమీద ఊరికివెళ్ళి మూడు రోజుల్లో తిరిగివస్తానని, ఆ రోజే వెళ్ళాడు. ఆయనరాగానే నర్సింగ్‌హోమ్‌లో చేరి ఆపరేషన్‌చేయించుకుంటుందట విమల తల్లి. ట్రిప్లికేన్‌లో తెలిసినవాళ్ళయింట్లో ఒకగదిలో వుంటున్నారు ప్రస్తుతం.

లీలయింట్లో డాక్టరుగారు విమలతో జబ్బుసంగతి చెప్పటం గుర్తువచ్చింది వేదమూర్తికి

"లీల బాగుందా? వచ్చేముందు కలుసుకున్నావా?"

"ఆఁ...మీరక్కడనుండి వచ్చేస్తూ చివరిసారిగా వాళ్ళింటికి వెళ్ళారనికూడా చెప్పింది."

"ఇం కేం చెప్పింది?" అన్నాడు కుతూహలంగా.

"ఆ రోజు, వాళ్లెవరియింటికో వెళ్ళవలసివుండి మీతో మాట్లాడటానికి వ్యవధిలేకపోయిందని విచారించింది."

మొదటిసారి కలుసుకున్నప్పటికన్న ధారాళంగా, స్నేహపూర్వకంగా విమల మాట్లాడుతున్నది. మద్రాసు క్రొత్త వాతావరణంలో తలవనితలంపుగా కలుసుకోవటంవల్ల కాబోలు!

రోడ్డుదాకా వచ్చి, పేవ్‌మెంటుమీద ఒకప్రక్కగా నిలబడి మాట్లాడుతున్నారు.

వేదమూర్తి తనసంగతి చెప్పాడు. ట్యూటోరియల్ కాలేజీలో ప్రొద్దున ఎనిమిదినుండి పంద్రెండువరకుపని. మధ్యాహ్నం స్వేచ్ఛ. యూనివర్సిటీ లైబ్రరిలో చదువుతూగాని సినిమాకు వెళ్ళిగాని కాలం వెళ్ళబుచ్చుతాడు. ప్రస్తుతం స్నేహితులుకూడా లేరు. ఉన్న యిద్దరూ సెలవులకు ఇంటికి వెళ్ళారు.

విమల తల్లి అన్నది.

"నర్సింగ్ హోమ్‌లో పరీక్ష పూర్తయింది. మూడు రోజులతర్వాత వస్తామని చెప్పాము. అప్పటికి మా మరది వచ్చేస్తారు. కాని యీ మూడురోజుల్లో "ఏవో కొనాలనీ, మద్రాసు చూడాలనీ అంటూంది అమ్మాయి. నాకు ఓపిక లేకపోయినా విధిలేక ఒప్పుకున్నాను. ఈ సాయంత్రం సముద్రం దాకా నడిచిరావటమే కష్టంగావుంది. నేను బజార్లూ అవీ ఏం తిరగ్గలను చెప్పండి. మీరేమీ అనుకోకుంటే, రేపొక్కపూట తనకు కావలసినవేవో అమ్మాయి కొనేట్టు చూడండి. నాకు బాధ తప్పించినవారవుతారు."

విమల మాట్లాడకుండా ఆసక్తిగా వేదమూర్తివైపు చూస్తూవుంది.

"దానికేంలెండి! రేపు మూడింటికి వెళ్ళవచ్చు. మీ అడ్రసేమిటి?"

విమల అడ్రసు యిచ్చింది.

వాళ్ళు వెళ్ళినతర్వాత, అక్కడే నిలబడిపోయిన వేదమూర్తి "భలే బీబి, భలే సముద్రుడు" అనుకుంటూ బస్సువైపు నడిచాడు.

* * *

విమలనుగూర్చి లీలఅన్నమాట, విమల మద్రాసువచ్చి తలవనితలంపుగా మద్రాసులో కలుసుకోవటం, ఆమెతో పరిచయానికేర్పడిన అవకాశము వేదమూర్తికి తన భవిష్యత్తుమీాద, అదృష్టంమీాద నమ్మకం కదిల్చి, జీవితంమీాద ఏదో కొంత అధికారం వచ్చినట్లనిపించింది.

పెళ్ళిళ్ళు విధిపూర్వకంగా జరుగుతాయన్న పాతకాలపు వాళ్ళమాట తోసివేయదగిందికాదు. పెళ్ళిళ్ళన్నీ అట్లా జరిగినా జరగకపోయినా ప్రేమానుబంధాల్ని ముడివెయ్యటంలో మాత్రం విధికి తప్పకుండా ఎంతో కొంత ప్రవేశముందని అనుకొన్నాడు.

జనసమ్మర్దం, బస్సులు, అంగళ్ళు, సినిమాథియేటరు, మ్యూజియం, మెరీనాబీచి, ఆ మద్రాసులోకం వాళ్ళని సన్నిహితుల్ని చేశాయి.

మూడవరోజు అదివారం; ఆడయారు వెళ్ళారు.

దివ్యజ్ఞానసమాజంఆవరణలో ప్రవేశించి బిసెంటు సమాధి, లైబ్రరీ, పెద్ద మర్రిచెట్టూ దర్శించి, మర్రిచెట్టు కొక ప్రక్కన కనుపించిన కాలిదారివెంట వెళ్ళారు. రమణీయంగా యిసుకతిన్నె, సముద్రం కనిపించింది.

ఇసుకలో కూర్చుని తెచ్చుకున్న పళ్ళు, బిస్కట్లు తిని, ప్లాస్కులోనికాఫీ తాగారు.

నీలాలసముద్రం ఆనందంతో ఉరకలుపెట్టుతూ ఆడుకుంటున్నది. తెలిమబ్బులతో కప్పబడి అక్కడక్కడ తొంగి చూస్తున్న ఆకాశం, పాలపొంగువంటి ఉత్సాహం వెనుకదాగి ఆలంబనమైన గాఢవాంఛవలె ప్రభావంతంగా వుంది.

"కాలమనే సముద్రతీరంలో యిసుకమేడలు కట్టుతూ ఆడుకుంటారు చిన్నపిల్లలు—మానవుల జీవితాలు వాళ్ళు తన్మయత్వంలో నిర్మించే వాంఛాసౌధాలే!—అన్న ఊహా చక్కని యథార్థచిత్రంగా స్ఫురిస్తోంది యిసుకలో విమలతో కూర్చుని, ఆ దృశ్యాన్ని ఆకళింపుకు తెచ్చుకో ప్రయత్నిస్తున్న వేదమూర్తికి.

ఎక్కడి బసవన్న కొండ, దేవాలయం, చెరువునీటి తళ తళ, పైరు పచ్చదనం, నీలాకాశం—ఆ దృశ్యస్వరూపం వేరు. తను అనూహ్యమైన యీ స్వేచ్ఛాప్రపంచంలోకి, సముద్ర తీరానికి దాటుకున్నాడు. తను సాధించిన స్వేచ్ఛకు సంజ్ఞా రూపమైన దృశ్యమిది. ఇక్కడే తన ఆశాసౌధాన్ని నిర్మిస్తాడు.

ఆకాశాన్ని, సముద్రాన్ని చూస్తూ యిసుకలో పడు కున్న వేదమూర్తిని విమల పలకరించింది.

"మెర్మెన్ యిటువంటి సముద్రతీరంలోనే విలపిస్తాడు కాబోలు!"

"కాదు, తరంగాలు ఉద్ధృతంగావుంటాయి; యీ తెల్ల మబ్బులకూ మూగఎండకు బదులు వెన్నెల తీరాన దొంతరలై వుంటుంది. ఈ సముద్రం వ్యక్తంచేసేది ఆనందమైతే, ఆ సము ద్రం దుఃఖోన్మాదంతో విజృంభిస్తూవుంటుంది."

"మీరా రా కావ్యంలో లీనమైపోయినట్లెందుచేత చెప్ప గలిగారంటారు ?" అని ప్రశ్నించింది విమల.

"కారణమేమీలేదు." అన్నాడు నవ్వుతూ ...

"విమలా నువ్విప్పుడు పాడాలి."

విమల విననట్లు సముద్రంవైపు చూస్తూవుంది మౌనంగా.

ఆ రోజు లీలయింట్లో mood రాలేదు సరే; కాని ఇప్పుడు పాడాలి" అన్నాడు మళ్ళీ.

అవతలివైపు తిరిగి, ఎందుచేతో విమల మాట్లాడకుండా వూరుకుంది.

పడుకునే ఆమెకుదగ్గరగా జరిగి, విమల ఇసుకపై మోపిన హస్తాన్ని స్పృశిస్తూ "విమలా, నిన్నే, నువ్వు పాడాలి" అన్నాడు. ఆమె ఊరుకుంది. ఆమెచేయిపట్టుకుని ఊపుతూ "ఓ విమలా దేవీ !" అన్నాడు గట్టిగా. అతనివైపు తిరిగిచూచి, కిల కిల నవ్వి "ఊహూఁ" అంటూ తలవూపి, మళ్ళీ చప్పున ముఖం త్రిప్పుకున్నది విమల.

పాటసంగతి మరచిపోయి ముగ్ధుడయ్యాడు వేదమూర్తి సముద్రసాన్నిధ్యంలో, తరంగాలమ్రోతతో ఆమె చేతిని వదలకుండా, ఒకదానిపై ఒకటి మణికట్టుదగ్గర దొంతరగా చేసే గాజుల్ని క్రిందికి పైకి కదిలిస్తూ, ఒక్కొక్కటి వేరు చేయబోతూ, ఆలోచిస్తున్నాడు.

విమల తనచేతినట్లానే ఉంచి సముద్రంవైపు చూస్తూ. ఉంది.

"ఆ రోజు నువ్వుపాడినప్పుడు నాలోకలిగినఅనుభూతికి అర్థం యివ్వాళ చెప్పదలచుకున్నాను, విమలా! నేను మద్రాసు వచ్చివెయ్యటంతో ఆ అనుభూతికి అర్థపేంమీ లేదనుకొన్నాను; విధి మనల్ని వేరుచేసిందనుకొన్నాను. తలవనితలంపుగా నువ్వు రావటమేకాదు, మనం ఒకరినొకరు తెలుసుకోవటానిక్కూడా అవకాశంకలిగింది. అది నా అదృష్టమని భావిస్తున్నాను...

నన్ను వివాహంచేసుకోవటం నీకిష్టమేనా ?" అన్నాడు వేదమూర్తి.

ఆమె మెల్లగా తనచెయ్యి విడిపించుకొన్నది.

వేదమూర్తి సముద్రంవైపుచూస్తూ, దగ్గరున్న ఇసుకను పిడికిళ్ళగా ఎత్తిపోస్తూ చిన్నరాసులు చేస్తున్నాడు.

కొంతసేపటికి లేచికూర్చుని, ఆమెవైపు చూస్తూ, "విమలా, ఏం, మాట్లాడవా?" అన్నాడు.

ఆమె అతనివైపు తిరిగి, క్రిందకు చూస్తూ "ఏం మాట్లాడాలో తెలీక" అన్నది.

"మనవివాహంవిషయం ?"

ఆమె కొంచెం నిదానించి "నాకు వివాహవ్యవస్థలో నమ్మకంలేదు." అన్నది.

"ఎందుకని ?" అని ఆశ్చర్యంగా అడిగాడు.

"మీకు నా కుటుంబవిషయం తెలీదనుకుంటాను... మానాన్న దేశాంతరం వెళ్ళి మాఅమ్మను విడిచిపెట్టి ఇప్పటికి పధైనిమిదవత్సరాలు! అంటే సరిగ్గా నా వయస్సుకు సరిపోతుంది. పెళ్లైనమూడేళ్ళకు, నేను జన్మించబోయేముందు ఇంజనీరింగుచదువుకని మానాన్న అమెరికా వెళ్ళిపోయారు. ఆయనకు ఆస్తి ఏమీ లేదు. మా అమ్మఆస్తిపెట్టి చదువుకోవటానికి వెళ్ళమని మా తాతయ్యే ప్రోత్సహించి పంపాడు. ఆయన అమెరికావెళ్ళిన రెండవఏట, మాతాతయ్య మరణించాడు. మా అమ్మకు అన్నదమ్ములెవరూ లేరు. చనిపొయ్యేటప్పటికి వున్న ఆస్తి మా పినతల్లికి, మాకూ చెరిసగమిచ్చిపోయాడు తాతయ్య. నాన్నచదువుకోసం మావాటాలో

సగం అమ్మకమైపోయింది. నాలుగేళ్ళు గడిచాయి. వస్తారని ఆత్రంగా వేచివున్న అమ్మకు ఇంకోపేడాదితర్వాతగాని రావటానికి వీల్లేదని వుత్తరం వచ్చింది. చదువైపోయిందనీ, డబ్బు పంపనక్కరలేదనీ, అక్కడే సంపాయిస్తూ పైచదువు చదువుకోవాలనుకున్నాననీ వ్రాశారు. తర్వాత వుత్తరాలు రాలేదు. ఎన్ని వ్రాసినా జవాబులేదు. రెండేళ్ళతర్వాత ఒక వుత్తరం వచ్చింది. తా నెప్పుడు స్వదేశంవస్తానో చెప్పలేననీ, వచ్చే ముందు వ్రాస్తాననీ, ఆదుర్దాపడవద్దనీ వ్రాశారు. తర్వాత జాడ లేదు. యుద్ధంవచ్చింది. ఏ వార్తా తెలీలేదు. నేను పెరిగి పెద్దదాన్నయాను; మా నాన్నను మాత్రం నేను చూడలేదు. రెండేళ్ళక్రితంవ్రాసిన వుత్తరంలో ఆమెరికాలో వేరే వివాహం చేసుకొన్నాననీ, తన్ను మరచిపోవలసిందనీ, తనచదువుకోసం ఖర్చుపెట్టుకున్న డబ్బుమాత్రం తిరిగి యిచ్చివేస్తాననీవ్రాశారు. అంతే! బంధువులు ఏదో ప్రయత్నించాలన్నారు. వ్యాజ్యెం వెయ్యటానికి వీలుందేమో తెలుసుకోవటానికి లాయర్ల దగ్గరకు వరుగెత్తబోయ్యారు. కాని అమ్మమాత్రం అభిమానంతో గుండె నిబ్బరం చేసుకుని ఆ ప్రయత్నాలేమీ అవసరంలేదన్నది. తర్వాత, పోయినసంవత్సరం, ౧౫ వేలకు చెక్కువచ్చింది... వివాహంచేసుకొని మా అమ్మ యీవిధంగా సుఖపడింది" అన్నది విమల. ఆమెకళ్ళు అశ్రుపూరితాలయ్యాయి.

మెర్ మెన్‌గాథ యీమెహృదయాన్ని కదిలించటానికి యిదా కారణం! అనుకున్నాడు వేదమూర్తి.

"కాని అందరూ ఆవిధంగా అమెరికా వెళ్ళిపోరుగదా!" అన్నాడు.

విమల కళ్ళు తుడుచుకొన్నది.

"నిజమే, అయినా వివాహంకన్న స్వతంత్రంగా వుండటంలో తక్కువైందేముంది? మా అమ్మను సంరక్షించు కోవటంకంటె నాకు కర్తవ్యం జీవితంలో వేరేమీ కనిపించదు." అన్నది.

వేదమూర్తి కొంతసేపు మౌనంగావుండి. "విమలా, నా విషయంకూడ నీతో చెప్పాలి..." అని తన వివాహ ప్రసక్తి మొదలు తండ్రిమరణానంతరం తను బసవన్నకొండ నుండి నిప్పుల్రహతో వచ్చివెయ్యటంవరకు చెప్పాడు.

"వివాహవ్యవస్థలో నీకు నమ్మకంలేకపోవచ్చు. కాని నన్ను చేసుకోవటం యిష్టమేఅయితే, అదొక పెద్ద అభ్యంతరం కాదు. అసలు నీ యిష్టమేమిటో వినాలనివుంది."

"ఈవిషయంలో మాఅమ్మనిశ్చయమే నానిశ్చయం" అన్న దామె.

"మీ అమ్మగారితో యీవిషయం నువ్వే ప్రస్తా విస్తావా? లేక నేను అడగనా?"

"వద్దు. రేపు ఆమె ఆపరేషన్‌చేయించుకోబోతోంది. తర్వాత నెమ్మదిగా మాట్లాడవచ్చు."

తిరిగిరావటానికి లేచారు. నాలుగడుగులు వేసినతర్వాత ఆగిపోయి, వేదమూర్తి అన్నాడు "నా ప్రశ్నకు సమాధానం కావాలి; నేనంటే నీ అభిప్రాయమేమిటి? చెప్పు విమలా, నాకది ముఖ్యం!" అతను నిలబడిపోయి, ప్రశ్నించేతీరుచూచి, ఆమె నవ్వింది. "నాకూ, లీలకు మీరంటే యిష్టమని మేము చాలసార్లు చెప్పాంకదా!"

"నువ్వు మళ్ళీ సందిగ్ధంగా లీలను జతపరుస్తున్నావు. లీలకు నామీదవున్న ప్రేమ వేరు; నీ సంగతి కావాలి నాకు!"

"పోనివ్వండి. లీల వేరు, నేను వేరు కదా, మా యిష్టాల్లోకూడా భేదావుండటం సహజమే!"

* * *

గాజులు కదిలిస్తూవున్న ఆ వ్రేళ్ళస్పర్శ, తనచేతిని గట్టిగా తనలో యిముడ్చుకొన్న ఆ చేతిపటిష్టి, యింకా అనుభవిస్తున్నట్లే అలజడిపరుస్తున్నవి.

ఆ సంఘటన తనెన్నడూ ఊహించనిఆనందాన్ని కలిగించింది. పార్వతితో లీలతో తనకున్న అరమరికలేని స్నేహ భావంవంటిదే కాని, ఏదో క్రొత్తదనం యీ స్నేహానికి విశిష్టత నిస్తూవుంది; 'ప్రేమం'టే యిదే కాబోలు!

కాని ఎందుకు వివాహవ్యవస్థతో దాన్ని ముడిపెట్టి తీరాలి? ఇదివరకే తను చేసుకొన్ననిశ్చయానికి అది విరుద్ధం. కాని ఆయనదృష్టిలో వివాహం చాల ముఖ్యమని తెలుస్తూ వుంది. నిరాకరిస్తే, తర్వాత యిద్దరికీ స్నేహం, మాటలు వుండవు. ఆశాభంగమే కాదు, వ్యక్తిగతంగా తనకుజరిగిన అవమానమని కూడా భావిస్తాడేమో!

ఈవిషయంలో ఏంజెయ్యాలి? అమ్మకు సంగతంతా చెప్పితే ఆమె ఏమంటుందో తెలుస్తుంది;ఒకవిధంగా కర్తవ్యమూ నిర్ణయించుకోవచ్చు. కాని యిప్పుడే చెప్పటం అవసరమా? ఆపరేషన్‌తర్వాత చెప్పవచ్చు. వేదమూర్తితో తను ఆవిధం గానే అన్నది కూడా.

ఆలోచిస్తూ వరాండాలో కూర్చున్న విమలను, గదిలో నుండి తల్లి పిలిపించింది. "ఏమమ్మా" అంటూ లోపలికి వెళ్ళింది.

తల్లి పెట్టె తెరచి ఏవో కాగితాలు తీసి చూస్తూవుంది. పొలమూ, యిల్లు తాలూకు కాగితాలు, అకౌంటుపుస్తకం, చెక్కు పుస్తకాలు అవి ఎప్పుడూ తన దగ్గరే వుంచుకొని, ఎక్కడికి వెళ్ళినా తీసుకుని వెళ్ళటం ఆమె కలవాటు. అన్ని విషయాలు సొంతంగా, మరదిని ప్రశ్నించి తెలుసుకొని, ఒక నిశ్చయానికి వచ్చి కాని ఏవనీ చేసే అలవాటు లేదా మెకు. ఆమె తీసుకొనే జాగ్రత్తకు మరదికి కోపం వస్తూవుంటుంది.

విమలకు, తనకు సాధారణంగా ధరించడానికి కావలసిన నగలు తప్ప ఆమె ఎక్కువగా నగలేమీ వుంచుకోలేదు. పాతవి ఎప్పుడో అమ్ముడుపోగా, తర్వాత నగలుకొనే ప్రయత్నం చెయ్యకుండా, పొలంమీద వచ్చిన డబ్బు బ్యాంకులో నిల్వచేస్తూవుంది. ఇది వాళ్ళనాన్నగారిదగ్గర ఆమె నేర్చుకున్న అలవాటు. భర్తదగ్గరనుండి వచ్చిన ౧౫ వేల చెక్కు మార్చటానికి మద్రాసు పంపుతూ, అక్కడే ఇంపీరియల్ బ్యాంకులో విమలపేరుతో ఆ మొత్తం డిపాజిట్ అయ్యేట్టు ఏర్పాటుచేసింది. మిగతా డబ్బు విమల చదువుతూవున్న ఊళ్ళో బాంకిలో వుంది. ఈ డబ్బుపోను మిగిలిన ఆస్తి పదెకరాల పొలమూ, ఇల్లూ.

ఈ వివరాలన్నీ ఆమె చెప్పుతూవుంటే విమల, "ఇప్పుడెందుకమ్మా యీ సంగతులన్నీ ?" అన్నది.

"ఎందుకంటే ఎటువచ్చి ఎటుపోయినా నీకీ విషయాలు సవిస్తరంగా తెలీటం మంచిది. రేపు నేను వెళ్ళి ఆస్పత్రిలో పడుకుంటే, నువ్వు తర్వాత యిబ్బందుల్లో పడగూడదు."

"ఎందుకిబ్బంది? ఆపరేషనుతర్వాత పదిరోజులు వుంటే చాలునన్నాడుగా డాక్టరు. అందులో రేపుప్రొద్దున్న బండికి బాబాయి వస్తాడు."

"ఆపరేషన్ ఫలితం ఏమవుతుందో నమ్మకమేమిటి ? మనంతీసుకునే జాగ్రత్త మనం ఎట్లాగూతీసుకోవాలి" అంటూ ప్రక్కకుతిరిగి, విమలచూడకుండా, కళ్ళుతుడుచుకొన్నదామె.

"ఏమిటే అమ్మా ఆ మాటలు, నీకు భయంగానూ, అనుమానంగాను వుంటే ఆపరేషన్ మానెయ్యరాదూ ? అయినా ప్రమాదమేమీ వుండదని డాక్టరు చెప్పుతున్నాడు కదా! "

మళ్ళీ యధాస్థితిలోకి వచ్చి ఆమె అన్నది.

"నాకు భయమేమీ లేదు. ఊరికే మామూలుగా జాగ్రత్తపడాలి డబ్బు మొదలైనవిషయాల్లో, అంతే. చూడు నీతో ఎప్పుడూ అనలేదుగాని మీ పిన్నీ, బాబాయి వాళ్ళ విషయంలో మాత్రం ఎప్పుడూ మెలకువగావుండటం మంచిది. మీ నాన్నగారు పంపిన చెక్కులో సగంవాటా వాళ్ళకు రావాలన్న అభిప్రాయం తెలిపారుకూడా. 'కానీ, అందరం కలిసేవున్నాం కదా !' అని ఊరుకోబెట్టాను. ఈ విషయమే కాదు, మొదటినుంచీ వీళ్ళతో తెలివిగా నెగ్గుకొస్తున్నాను. వాళ్ళతో మనకు అవసరంవుంది. మనదగ్గర డబ్బున్నంతకా లమూ వాళ్ళసహాయం, ఆదరణా వుంటాయి. కాని డబ్బు పోగొట్టుకొన్నో, లేక అది వాళ్ళకప్పగించో చేతగానివాళ్ళ మైనానడు ఆ ఆదరణ నిలుస్తుందో లేదో నేను చెప్పలేను. ప్రొద్దున మీ బాబాయి వచ్చినతర్వాత మాట్లాడటానికి అవ

కాశం వుండదు. యిప్పుడే యీ విషయాలు చెప్పదామనుకొన్నాను. ఇంపీరియల్ బాంక్ లో నీపేరవున్న డబ్బుకాక, మిగిలినదానికి పేచీలేకుండా నీపేర చెక్కువ్రాసి వుంచాను. అది నీ పర్సులోనే వుంచుకో. ఈ కాగితాన్ని నీసూట్ కేస్ లో భద్రంచెయ్యి. మనదగ్గరున్న అయిదువందల్లో రేపు నూట యాభై బాబాయిచేతికిస్తాను. తతిమ్మాది నీదగ్గర వుంచు. ఏది ఏమైనా యికనుంచి వ్యవహారాలు నువ్వేచూసుకోవడంమంచిది నాకు ఓపిక చాలటంలేదు." అన్నదామె.

తల్లి యిచ్చినవన్నీ తీసుకొని, వాటివైపుచూస్తూ విమల "ఏమిటమ్మా యిది!" అని ఏడవటం ప్రారంభించింది.

కొమార్తెను దగ్గరకుతీసుకొని ఆమె "ఏమీ లేదులేవే! ఊరికే నీ దగ్గరుంచుకోమన్నాను. అంతే...ఏడవటమెందుకూ? ఛీ! ఆపరేషన్ సులువేనని డాక్టరు చెప్పాడు కదా!" అని ఓదార్చింది.

సూట్ కేసులో కాగితాలు, డబ్బు భద్రంచేస్తూ ఆ రోజు వచ్చిన తన వివాహప్రసక్తి, వేదమూర్తిసంగతి తల్లితో అప్పుడే చెప్పివెయ్యాలనుకొన్నది విమల.

విమల వరండాలోకి వచ్చేటప్పటికి పక్కలువేసి పడుకొన్న తల్లి "దీపం తీసివెయ్యవే" అన్నది.

"తీసివేస్తానుగాని, నీదగ్గర కాసేపు పడుకోనా?" అంటూ విమల, స్విచ్చి నొక్కి వచ్చి, తల్లిప్రక్కన పడుకొని ఆమెను గట్టిగా కౌగలించుకొన్నది.

"అమ్మా, యివాళ ఒకసంగతి జరిగింది, అది నీతో చెప్పాలి" అని ప్రారంభించింది. సముద్రాన్ని చూస్తూ అడ

యారులో వేదమూర్తి, తను గడపిన ఆ మధ్యాహ్నం జరిగిన దంతా వివరంగా చెప్పింది.

తల్లి మాట్లాడకుండా అంతా విన్నది. విమల చెప్పటం ముగించినతర్వాత అన్నది "ఆ అబ్బాయికి ఆస్తి, డబ్బు ఏమీ లేదంటున్నావు! తండ్రిపోయాడు. తల్లిమాత్రం వుంది...సరే, నీ యిష్టమేమిటో మరి నాతో చెప్పు?"

"నాకు పెళ్ళిచేసుకోవాలని లేదు. చదువుకొని నే నేదైనా ఉద్యోగంచేస్తూవుంటే మనిద్దరం హాయిగా వుండ వచ్చునని అనుకుంటున్నాను. పెళ్ళి చేసుకొని నువ్వేం సుఖ పడ్డావమ్మా?"

నా విషయం వేరు. నాకు యింగ్లీషు చెప్పించలేదు మా నాన్న. బాగా చదువుకొని, ఆస్తి ఏమీలేనివర్ణి తెచ్చి చేశాడు. చదువుకొన్నందువల్ల బుద్ధిమంతుడనీ, ఆస్తి లేనందు వల్ల తనదగ్గరేవుండి తనకు కొమారుడులేనిలోపం తీరుస్తాడనీ ఆయన భావించాడు. కాని ఆయనఉద్దేశం ఫలించలేదు. ఇప్పు డీ అబ్బాయివిషయంలో ఆస్తి లేకపోయినప్పటికీ, నీకు పరిచయ మయ్యాడు. నువ్వుకూడ ఇంగ్లీషు చదువుతున్నావు. అందువల్ల నీకు తగినవాడే అనుకుంటాను...కాని అతను డబ్బువల్ల ఆకర్షింపబడలేదని నీకు నమ్మకమేనా?"

"డబ్బుసంగతి ఆయనకు ఏం తెలుసు? ఆ వివరాలు నేను తర్వాత కదా చెప్పాను."

"అది కాదు. మద్రాసు రాకపూర్వం కాలేజిలో నీతో ఎక్కువ పరిచయం లేదన్నావు. ఇక్కడ అతనితో బజారుకు వెళ్ళి మూడువందలదాకా ఖర్చుపెట్టావు; నేనేమో ఆపరేషన్

కని యింతదూరం వచ్చాను; మనమిద్దరమే వున్నామని, నువ్వు నా కొక్కర్తెవేనని తెలుసు. ఇవన్నీ గమనించిన మనిషికి డబ్బు వున్నదీ లేనిదీ సులువుగా తెలుస్తుంది."

"నేనే యింకా యీ బైదాకా యివ్వాలి ఆయనకు. ఒక కొట్లులో పొరపాటున బిల్లు ఆయనచేతికిస్తే ఆయనే చెల్లించివేశారు. ఆ డబ్బు నే నింకా యివ్వలేదు."

"దాన్నిబట్టి ఏమీ తెలీదు...కాని ఆ డబ్బు నువ్వింకా ఎందుకు యివ్వలేదు? రేపు యిచ్చివెయ్యి. ఎప్పుడూకూడా పరాయిమగవాళ్ళు అనవసరంగా వస్తువులు తీసి యిచ్చినా, డబ్బుసాయంచేసినా తీసుకోరాదు. అంటే ఈ అబ్బాయిని అనుమానించమని నా ఉద్దేశం కాదు; ఏమైనా నువ్వు బి. ఏ. పూర్తి చేసేదాకా ఆగి, తర్వాత వివాహంచేసుకోమని చెప్పితే అన్నివిధాలా బాగుంటుంది."

"నీ కిష్టంలేకుంటే నేను చేసుకోను. నా కసలు పెళ్ళే వద్దనుకుంటున్నాను." అన్నది విమల.

"నా కిష్టంలేదని నేననటంలేదు. పెళ్ళెందుకు చేసుకోవు? ఒకవేళ ఉద్యోగంలోచేరాలనుకున్నా, నీ ఉద్దేశాలను అంగీకరించేవాణ్ణే చేసుకోవచ్చు. కాని పెళ్ళిమానుకోవటం మంచిది కాదు."

"పోనీలే అమ్మా! ఇప్పుడెందుకు? ఇంకో రెండు మూడేళ్ళతర్వాత ఆలోచిద్దాం."

"అట్లాగే. కాని అతనితో నువ్వు చేసుకోనని చెప్పవద్దు. ఆ విషయం నేను మాట్లాడుతానులే; అది నాకు వదిలెయ్యి."

విమల కళ్ళుమూసింది. ఎప్పటివలెనే తల్లి తనభారం వహించటానికి సిద్ధంగావుందన్నతృప్తితో నిద్రనాహ్వానించింది.

# 21

ఆపరేషన్ అయిపోయి, స్ట్రెచర్ మీదవచ్చినతల్లిని ఆత్రంగా చూచింది విమల. ఇంకా తెలివిరాలేదు. బహుశా అరగంటపట్టవచ్చు అన్నాడు డాక్టరు.

విమలబాబాయిని ప్రక్కకు తీసుకొనివెళ్ళి మాట్లాడాడు డాక్టరు. ఆయన వెళ్ళినతర్వాత బాబాయి అన్నాడు. "నువ్వీ రోజంతా జాగ్రత్తగా కనిపెట్టివుండాలమ్మా! ఊహించని 'కాంప్లికేషన్సు' ఏవో వచ్చాయన్నాడు. కాని భయమేమీ లేదట. తరచు వచ్చి ఆయన చూస్తూవుంటాడు. నేనువెళ్ళి నీ భోజనంసంగతి చూస్తాను."

బాబాయివెళ్ళిన కొంతసేపటికి తలికి తెలివివచ్చింది. డాక్టరువచ్చి రెండు యింజక్షన్లు యిచ్చాడు. తల్లి దగ్గరే ఆమెను చూస్తూ కుర్చీలో కూర్చున్నది విమల.

మూడుగంటలకు విమలబాబాయి, తను ఏదో వ్యవహారంమీద వెళ్ళిరావాలన్నాడు. "నాకు కొంత అవసరమైన పని వుంది. చూచుకొని ఆరుగంటలకు వస్తాను. ఇక్కడ పని వాడితో నీకు కాఫీ తెచ్చిపెట్టమని చెప్పాను. వచ్చేటప్పుడు పళ్ళు పట్టుకొస్తాను. డాక్టరు బహుశా అయిదింటికి వస్తాడు. నా పని తొందరగాఅయితే ఆ వేళకుముందే తిరిగివచ్చేస్తాను."

ఆయనవెళ్ళినతర్వాత ఒకగంటకు వేదమూర్తివచ్చాడు.

నర్సు వచ్చి టెంపరేచర్ తీసుకొని వెళ్ళింది. డాక్టరు వచ్చి మళ్ళీ రెండుయింజక్షన్లు యిచ్చి, విమలబాబాయికోసం అడిగాడు. లేడని విని తర్వాత నర్సుతో ఏదో చెప్పి వెళ్ళి పోయాడు. బాబాయితో మాట్లాడాలని డాక్టరు కోరినందువల్ల విమలకు తల్లి పరిస్థితినిగూర్చి ఏదో అనుమానం కలిగింది. వేద మూర్తిని వెళ్ళి డాక్టరుతో మాట్లాడమని కోరింది.

తల్లి కళ్ళుమూసుకొని నిద్రలో వున్నట్లే వుంది. ఆపరేషన్ తర్వాత రెండుసార్లుమాత్రం మాట్లాడింది. తర్వాత ఆ స్థితిలోనే వుంది.

"కొంత జాగ్రత్త అవసరమనీ, ఇవాళ గడిస్తేకాని తనేమీ చెప్పలేననీ అంటున్నాడు" అని వేదమూర్తి డాక్టరుతో మాట్లాడివచ్చి చెప్పాడు. తల్లివైపు తదేకంగా చూస్తున్న విమల ఏడుపు ఆపుకోలేకపోయింది.

"అధైర్యపడకు విమలా! డాక్టరు మళ్ళీ వస్తాడు" అన్నాడు వేదమూర్తి.

కొంతసేపటికి విమలతల్లి కళ్ళువిప్పి చూచింది.

"ఎట్లావుందమ్మా?" అని ప్రశ్నించింది విమలమెల్లగా.

"బాధగావుంది...మీ బాబాయి ఏడీ?"ఆమెకష్టంతో మాట్లాడింది.

"పనివుందని వెళ్ళాడు. ఇంకోగంటలో వస్తాడు."

వేదమూర్తివైపు తిరిగాయి ఆమెకళ్ళు. అతను నిలబడి వుండటం చూచి ఆమె చేత్తో కూర్చోమని సంజ్ఞచేసింది. విమల "మీరుకూర్చోండి"అని, కుర్చీ వేదమూర్తివైపులాగింది. వేదమూర్తి కూర్చున్నాడు. ఆమె కొమార్తెముఖంవైపు పరి

శీలనగా చూస్తూ, దగ్గరగారమ్మని పిలచి, తనమీదుగా వంగిన విమలతో "ఏడుస్తున్నావు ఎందుకే. ఆ కళ్ళు చూడు. మొహం కడుక్కో పో" అన్నది.

'ఫరవాలేదులేమ్మా' అన్న విమలతో మళ్ళీ ఆమె "పోమ్మని" తల ఆడిస్తూ బలవంతంచేసింది. తల్లి మాట్లాడు తున్నందుకు మనసు తేలికపడి, టవలు తీసుకొని, గదికవతల వున్న కొళాయిదగ్గరకు వెళ్ళింది విమల.

పరధ్యానంగావున్న వేదమూర్తి, కొన్నిక్షణాలతర్వాత విమల తల్లివైపు చూచి ఆమె తననే చూస్తూవుండటం గమ నించి, దగ్గరగా వెళ్ళి, "ఏంకావాలండీ?" అని అడిగాడు. అతన్ని స్పృశిస్తూ ఆమె అన్నది. "విమల చెప్పింది...పెళ్ళి ... విమల జాగ్రత్త... నేను నమ్మకం లేదు" మాటలు రాక ఆయాసపడుతూ కళ్ళుమూసింది. అప్పుడే గదిలోప్రవేశిస్తూన్న విమల వేదమూర్తి తల్లిప్రక్కన నిలబడివుండటంచూచి "ఏమి టండీ!" అని ఆతృంగా దగ్గరకు వచ్చింది.

"ఆయాసంవచ్చి మళ్ళీ స్పృహ తప్పినట్లుంది. డాక్టర్ని తీసుకొస్తాను" అని తొందరగా వెళ్ళాడు వేదమూర్తి.

డాక్టరు వచ్చి చూచాడు. "ఆమెకు స్పృహవస్తే మీరు మాట్లాడించకూడదు. కళ్ళుమూసుకుని అట్లానే పడుకోమని చెప్పండి. ఇప్పుడు పరిస్థితిలో భేదమేమీ లేదు. నేను మళ్ళీ వస్తాను" అన్నాడు.

మౌనంగా కూర్చున్నారు వేదమూర్తి, విమల.

"మీకు ఆలస్యమౌతుందేమో వెళ్ళండి, ఫరవాలేదు. మా బాబాయి యిక వచ్చేస్తాడు" అన్నది విమల.

"ఆయన వచ్చినతర్వాతే వెళ్తాను. నేనిప్పుడే చేసేదేమీ లేదు" అన్నాడు వేదమూర్తి.

ఆరుగంటలు, ఏడుకూడా దాటింది, కాని విమల బాబాయి రాలేదు. ఆమెతల్లి పరిస్థితిలో మార్పేమీలేదు.

తొమ్మిదయింది. వేదమూర్తిని వెళ్ళమని చెప్పి, ఒంటరిగావుండటానికి విమలకు ధైర్యంచాలలేదు. ఆలస్యంచేస్తూవున్న బాబాయిమీద కోపంగా వుంది. ఆయన అవసరమైనపనులేవో, యీ రోజే మునిగిపోయినట్లు చూచుకోవాలి కాబోలు! వేదమూర్తి వరండాలో పచార్లుచేస్తూ అప్పుడప్పుడు మంచందగ్గరకు వచ్చి చూచి వెళ్తున్నాడు.

తొమ్మిదిన్నరకు వచ్చాడు విమలబాబాయి.

"ఏమిటి బాబాయ్, యింతసేపు!" అన్నది విమల.

"ఏంచేసేది అమ్మాయ్! వ్యవహారం ఎంతకూ తెగలేదు. రావలసినవాళ్ళలో ఒకమనిషి రాకుండా చాల ఆలస్యం చేశాడు...ఇవాళే ఆ విషయం తేల్చుకోకుంటే నాకు వ్యాపారంలో పెద్ద నష్టంవస్తుంది" అన్నాడు. విమల అతనిమాటలు వినిపించుకోలేదు. వేదమూర్తిదగ్గరకువెళ్ళి,

"మీకు ప్రొద్దుపోయింది; క్షమించండి! మా బాబాయి వచ్చేశాడు" అన్నది.

"ఏమిటీ క్షమాపణలు!" అని వేదమూర్తి ఒకక్షణం విమలకళ్ళల్లోకి చూస్తూ ఆగి "ప్రొద్దున్నే ఏడింటికి వస్తాను, సరేనా?" అన్నాడు.

"కాలేజి వుందికదా, ఎట్లా వస్తారు?"

"సెలవుపెట్టుతాను."

"వద్దు, కాలేజి వదలిన తర్వాతే—మూడింటికి రండి"

*　　　*　　　*

విరూపాక్ష దేవాలయంవలె వున్న పెద్దఆలయంలో తిరుగుతూవున్నాడు విమలతో. దేవాలయంబయట 'హంపీబజారు'లో వున్న శిథిలవిహారాలవంటివే కనిపించాయి. ఇది హంపీయే! అనుకుంటూ దేవాలయందాటివచ్చి విమలతో నడుస్తున్నాడు. కొంతదూరం వెళ్ళేటప్పటికి ఒకవైపునుంచి ఇద్దరుమనుష్యులు ఏదో మోసుకొనివస్తూ కనిపించారు. తల నిండా ముసుగుపెట్టుకొని, వాళ్ళొక చచ్చిపోయినగుఱ్ఱాన్ని తల క్రిందుగా దానికాళ్ళను ఒక పొడుగాటికఱ్ఱకు కట్టి వేలాడదీసి, ఆ కఱ్ఱచివరలు భుజాలమీద మోపుకొని ఒకరివెనుకఒకరు నడుస్తూ తొందరగా ముందు వెళ్ళిపోతున్నారు. "చూడండి! ఆ గుఱ్ఱం నాది, నేను చిన్నప్పుడు ఆడుకొన్నది, అది నాకు కావాలి" అని చిన్నపిల్లలా విమల వాళ్ళవెంట పరుగెత్తింది. "ఇదేమిటి? విమలా! విమలా! అది చచ్చినశవం" అని వెంట పరుగెత్తాడు. ఆ గుఱ్ఱంఎముకలు కనిపిస్తూ, చాలభాగం మాంసం పీక్కుపోయి అసహ్యంగా, దుర్భరంగా వుంది. దాన్ని చూస్తూ దాన్నుంచి కళ్ళుతిప్పుకోలేక విమలతో తనూ నడుస్తున్నాడు. ఎదురుగా సముద్రం! దాన్నిచూచి ఆగాడు. యంత్రపుబొమ్మలవిధంగా ఆగకుండా, ఆ మనుష్యులిద్దరు మాత్రం సముద్రంవైపే వెళ్ళిపోతున్నారు. నడుస్తున్న విమలను "సముద్రం!" అంటూ పరుగెత్తి చెయ్యిపట్టుకొని ఆపబొయ్యాడు. చెయ్యి విసురుగా విడిపించుకొని, విమల సముద్రంలోకి వెళ్ళిపోతూవుంది. గుఱ్ఱంతో ఆ మనుష్యులిద్దరూ

నీళ్ళమీద నడుస్తూ వెళ్తూనేవున్నారు. అయ్యో! విమల వెళ్ళి పోతూవుంది! తను వెళ్ళలేడు! "అయ్యో" అంటూ నిస్సహాయంగా కేక పెట్టాడు.

మెలకువవచ్చింది. వేదమూర్తికి. సముద్రం వైపునుంచి చల్లనిగాలికూడ వస్తూవుంది. ఏమిటీ కల ? అనుకున్నాడు.

చచ్చినగుఱ్ఱం ఎక్కడిదో జ్ఞాపకంవచ్చింది. తండ్రిచని పోయిన ఆ సాయంకాలం తను సుందరరావుతో షికారు వెళ్ళి నప్పుడు కనిపించిన దృశ్యం అంతా అదే! ఎముకలు కనిపిస్తూ అసహ్యంగా వుంది! హంపీ తను వెళ్ళిచూచినచోటే! అడయారులో విమలచేయి తనచేతిలోకి తీసుకొన్నాడు. సముద్రాన్ని చూస్తూ కూర్చున్నారిద్దరూ! అన్నీ గతానుభవంలోనివే. కాని గుఱ్ఱాన్ని చూచి విమల పరుగెత్తడమేమిటి? తననుండి వెళ్ళి పోవటం ఏమిటి ? అది విమల తన్ను వివాహంచేసుకోదేమో నన్న సందేహానికి ప్రతిబింబం కాబోలు! కాని విమల నిరాకరించ లేదే! తల్లితో ఆ విషయం ప్రస్తావిస్తాననికూడా అన్నది.

ఆరోజు హాస్పిటల్లో విమలతల్లి తనతో ఏదో చెప్ప బోయినసంగతి తటాలున గుర్తువచ్చింది.

అప్పుడామె ఏమన్నదో సరిగా అర్థంకాలేదు. తర్వాత ఆ సంగతి యింతవరకు గుర్తురాలేదు. ఆమె ఆయాసపడుతూ వున్నప్పటికీ స్పష్టంగానే చెప్పింది. విమలను తను పెళ్ళిచేసు కోవటం ఆమెకిష్టమే! ఆమెస్థితి ఏమీ బాగులేదు. బ్రతకనను కొన్నది కాబోలు! లేకపోతే తనతో ఆమాట చెప్పటానికి కారణమేముంటుంది?

ప్రొద్దున ఏడింటికే కాలేజికి సెలవుపెట్టి, హాస్పిటల్‌కు వెళ్ళాలి; పాపం! అక్కడి పరిస్థితి ఎట్లావుందో!

ఏంజరిగినా విమల తన్ను తప్పకుండా వివాహంచేసుకొంటుంది. ఆమెతల్లి అంగీకారాన్ని తెలిపినసంగతి యింతవరకు గుర్తురాలేదే! అయితే అడయారులో అనుకున్నసంగతి ఆ రాత్రే విమల తల్లితో చెప్పివుండాలి!

వేదమూర్తికి నిద్రపట్టింది.

పెళ్ళి జరుగుతూవుంది. పీటలమీదికి పెళ్ళికూతుర్ని తీసుకొనివస్తున్నారు. విమల పచ్చని పసుపుబట్టలతో తయారై ముఖానికి చేతులకు పసుపురాచుకొంది. తనకు కోపంవచ్చింది. ఏమిటీ మొరటువేషం! ప్రక్కనున్నవాళ్ళెవరినో అడిగాడు. 'ఇప్పు డేమీ అనగూడదు, ఊరుకోవా"లని చెప్పారు. కోపాన్ని అణచుకొన్నాడు. మంగళసూత్రం కట్టాడు. పెళ్ళయిపోయింది. అదేదో పల్లెటూరు, విమలస్వగ్రామము కాబోలు! అంతా రైతులూ, మొరటుగావున్న పల్లెరకంస్త్రీలే కనిపిస్తున్నారు. వధూవరులఊరేగింపు అన్నారు. విమల ఏదీ? విమల మళ్ళీ అదే పసుపుబట్టలతో పసుపుముద్దవలె తయారైవుంది. "ఏమిటీ వేషం?" అన్నాడు. "మీ కెందుకూ? అట్లానే వుండాలి!" అన్నది కోపంగా విదిలిస్తూ. చెంపమీద కొట్టాడు. విమల అక్కడనుండి వెళ్ళిపోయింది. ఏంచెయ్యాలో తోచక బాధ పడుతున్నాడు. విమలతల్లి వచ్చింది. ఆమెకు గద్గదికతో మాటలురాలేదు. "విమలను...పెళ్ళి చేశాను...ఇదా నువ్వు చేసేది!" అంటూ వుంది. రమ్మని చెయ్యిపట్టి తీసుకొనివెళ్ళింది. కన్నీళ్ళతో తడిసి జాలిగా, ప్రేమగా తన వైపుచూచిన

విమలను హృదయానికి జేర్చుకొని ముద్దుపెట్టుకొన్నాడు. ఊరేగింపుకు ఎడ్లబండి తయారుచేశారు. ఎడ్లనీ, బండినీ చూస్తూ వుంటే మళ్ళీ కోపంవస్తూవుంది. ఒకఎద్దు తన్ను ఓరకంట చూస్తూవుంది. వెక్కిరిస్తూవున్నట్లు కన్పార్పింది. ఇంతలో ఆ బండిలో కూర్చోమన్నారు. బండికదలగానే చుట్టూ భజన చేస్తూ పాడుతున్నారు జనం. తనకు కష్టంగావుంది; "చాలు, ఆపండి." అని కేకవేశాడు.

వేదమూర్తి మేలుకొనేటప్పటికి వీధిలో అరవవాళ్ళు పదిమంది ఏదో భజనచేస్తూ పాడుతూ వెళ్తున్నారు. తెల్లవారుతూవుంది; అయిదుగంటలైవుంటుంది.

రాత్రంతా విమలనుగూర్చిన కలలే! విమలతో తన వివాహం నిశ్చయమైనట్లనిపించి, మనసు తృప్తిగావుంది. కలలో విమలమీద వచ్చిన కోపమంతా ఆమె "తల్లితో ప్రస్తావించి కాని పెళ్ళిచేసుకోను" అని చెప్పటంవల్ల కాబోలు! అది తనకు అవ్యక్తంగా కలిగిన కోపమని ఊహించాడు. ఆమెతల్లి వివాహానికి అంగీకరించటంతో అదంతాపోయింది. ఆస్పత్రికి వెళ్దామా అనుకొన్నాడు; కాని తను వెళ్ళిమాత్రం చేసేది ఏముంది? వరండాలో తిరగటంతప్ప. సాయంత్రం వెళ్ళినట్లయితే, ఆమెకు నయంగావుంటే, విమల తనతో ఎక్కడికైనా కాస్సేపు వస్తుంది కూడా.

వేదమూర్తి కాలేజికి వెళ్ళాడు. విమల తనదైనట్లు, స్వప్నంలోజరిగినవివాహం యథార్థంలాగే, మనస్సు ఉత్సాహంగా తృప్తిగావుంది.

మూడుగంటలకు బయలుదేరి. ఫ్లవర్‌బజారుస్టాప్‌దగ్గర దిగి గులాబీలుకొని, ఆస్పత్రికి వెళ్ళటానికి త్యాగరాయనగరం బస్సెక్కాడు. పువ్వులు తీసుకొని వెళ్ళటం, 'సెంటిమెంటల్'గా ఉందనిపించి, కొంత సిగ్గుగావుంది. విమల ఏమనుకుంటుంది? నవ్వుకొంటుంది కాబోలు! "నీ కోసం కాదులే!" అని పువ్వులు వాళ్ళమ్మచేతికిస్తే సరిపోతుంది. విమలకూడా సంతోషిస్తుంది.

అస్పత్రిలో అడుగుపెట్టగానే, ముందురోజు టెంపరేచర్ చూసిన నర్సు కనిపించింది. తన్నుచూడగానే దగ్గరకువచ్చింది; "వాళ్లు వెళ్ళిపోయారండి" అన్నది.

అశ్చర్యంతో "ఎక్కడికి?" అన్నాడు.

"ఆమె రాత్రి పదిన్నరకు చనిపోయింది. పాపం ఆ అమ్మాయి ఒకటే ఏడుస్తూవుంది. నాగదికి తీసుకువెళ్ళి కూర్చో బెట్టుకున్నాను. తనకు పినతల్లివాళ్ళు తప్ప యింకెవరూలేరట! ప్రొద్దున ఎనిమిదింటికి దహనంచేశారు. వాళ్ళబాబాయి అంతా ఏర్పాటుచేశాడు."

ఆమె చెప్పుతూవుంటే వేదమూర్తి నిశ్చేష్టుడయ్యాడు.

"నే నా అమ్మాయితో స్మశానానికి వెళ్ళాను. వాళ్ళ బాబాయి యిక్కడే దహనంచెయ్యటం మంచిదన్నాడు. డాక్టరుగారుకూడా అట్లానే సలహాయిచ్చారు. మొదట వాళ్ళ వూరికి తీసుకొనివెళ్ళాలనుకున్నా, తర్వాత ఆ అమ్మాయి అంగీకరించింది."

"ఆ అమ్మాయి ఎక్కడుంది?"

"దహనసంపూర్తికాగానే నేనిటు వచ్చేశాను; వాళ్ళు టాక్సీమీద ట్రిప్లికేన్ వెళ్ళారు...మీరువాళ్ళకుబంధువులా?" అని ప్రశ్నించింది నర్సు.

"అవును" అన్నాడు పరధ్యానంగా.

"అయితే వాళ్ళకు మీ అడ్రసు తెలీదు కాబోలు."

"తెలీదు; మీరు సహాయంచేసినందుకు కృతజ్ఞుణ్ణి... ఇవి తీసుకోండి" అని గులాబీలు ఆమెచేతిలో పెట్టి ఆస్పత్రి బయటికి వచ్చాడు.

వేదమూర్తికి పిచ్చెత్తినట్లుంది. తన వూహాలేమిటి? జరిగిన విపరీత మేమిటి? ఆ క్షణాల్లో విమలదగ్గర తను లేడు. అనుకొన్నప్రకారం ఏడింటికే వస్తే ఎంత బాగుండేది! స్వప్నాలకు అర్థం యిదే కాబోలు. పెళ్ళి, పసుపుబట్టలు, కలలో కనిపిస్తే మృత్యువును సూచిస్తాయని ఎక్కడో విన్నాడు. నిజమే, తనకు తెల్లవారేటప్పుడు వచ్చిన ఆ స్వప్నానికి అర్థం అదే. మొదటిస్వప్నంలో చచ్చినగుఱ్ఱం కూడ మృత్యువునే స్ఫురింపజేస్తుంది. కాని తనఆలోచన ఆవిధంగా వెళ్ళలేదు.

ట్రిప్లికేన్ చేరుకొనేటప్పటికి నాలుగుగంటలైంది. విమల వాళ్ళున్న మేడమీదికి వెళ్ళటానికి, వీధితలుపు దాటి ప్రక్కనున్న మెట్లెక్కి వెళ్ళాలి. వీధితలుపుదగ్గర యింటియజమాని మొదలియార్ ఎదురయ్యాడు. అతన్ని ప్రశ్నించాడు. "అవును, పాపం! పెద్ద కష్టంవచ్చింది. మీ సంగతే ఆ అమ్మాయి అనుకొంటూవుంది. మీ అడ్రసు తెలీదట...ఇప్పుడే మావాళ్ళు బలవంతంచేసి క్రిందికి తీసుకొచ్చి కాఫీ యిస్తున్నారు. ప్రొద్దుటి నుండి ఏమీతీసుకొన్నట్లు లేదు! వాళ్ళబాబాయి అరగంట

క్రితం ఏదో పనిమీద వెళ్ళాడు; వస్తాడు...కూర్చోండి... ఆ అమ్మాయితో చెప్పుతాను మీరు వచ్చారని" అని కుర్చీలో కూర్చోబెట్టి లోపలికి వెళ్ళాడు మొదలియార్.

విమల వచ్చింది; వేదమూర్తిని చూడగానే ఆమెకు దుఃఖం పొంగివచ్చింది. వేదమూర్తికి నోట మాటరాలేదు. లేచి నిలుచున్నాడు. మొదలియారు "ధైర్యంగా వుండాలమ్మా!" అంటున్నాడు.

"పైకి వెళ్దాం పదండి, కొంచెం పనివుంది" అన్నది విమల వేదమూర్తిదగ్గరగావచ్చి; యిద్దరూ మేడమీదికివెళ్ళారు.

వేదమూర్తి కుర్చీలో కూర్చున్నాడు. విమల యిటూ అటూ తిరుగుతూ తనవస్తువులు, చీరలు సర్దటం ప్రారంభించింది.

"ఏమిటి విమలా! ఏం జెయ్యాలి, ఏదో పనివుంద న్నావు?"

"నే నిప్పుడే యిక్కడినుంచి వెళ్ళిపోవాలి. అందుకు మీ సహాయం కావాలి" అన్నది.

"అయితే మీ బాబాయి ఏమయ్యాడు? నిన్ను ఒక్క దాన్ని విడిచిపెట్టి వెళ్ళిపొయ్యాడా!"

"నన్ను విడిచిపెట్టి వెళ్తేనే బాగుండేది."

"ఏమైంది? జరిగినసంగతి చెప్పు."

"మా అమ్మ ఆపరేషన్‌కు ముందురాత్రే ఏదో అనుమానంతో, బాబాయి విషయంలో నన్ను జాగ్రత్తగా వుండమని చెప్పింది. దానికి సరిపోయినట్లే చేస్తున్నాడు. మేమక్కడ దహనంపూర్తిచేసి వచ్చామో లేదో, తనకు డబ్బుకావాలి, చెక్కు వ్రాసియిమ్మని అడిగాడు. అంటే ఖర్చుకోసం కాదు.

నిన్న తనువెళ్ళిన వ్యాపారం విషయంలో తనకు అర్జంటుగా మూడువేలు కావలసివచ్చిందట. క్రిందనున్న మొదలియారు గారికి ఒక వేయి యిదివరకే యివ్వవలసివుందట. మళ్ళీ ఆయన్ను అప్పుఅడగటం బాగుండదట. నేను యింపీరియిల్ బ్యాంక్‌లోవున్నడబ్బుకి చెక్కుయిస్తే, తనకు మళ్ళీ డబ్బుఅంద గానే తిరిగి ఇస్తాడట. చెక్కు మధ్యాహ్నమే వ్రాయమన్నాడు. చెక్కుపుస్తకం అమ్మ ఎక్కడపెట్టిందో, తర్వాత వెదకి వ్రాసి యిస్తానన్నాను. దుఃఖంలోవున్న నన్ను బలవంతంచెయ్యటం యిష్టంలేక కాబోలు, అప్పటికి వెళ్ళాడు."

"ఇస్తే డబ్బు మళ్ళీ తిరిగి రాదంటావా?"

"అంతే! అమ్మ ఆ విషయం యిదివరకే చెప్పింది. డబ్బు లాక్కోవటానికిది ప్రారంభంమాత్రమే. పూర్తయ్యే దాకా వదిలిపెట్టడని నాకు తెలుసు. అమ్మదగ్గర ఆయన ప్రయత్నాలు సాగలేదు. మధ్య మధ్య ఏదైనా డబ్బుసాయం వుంటూవుందని యిన్నాళ్ళూపట్టుకుని తిరిగాడు. నాదగ్గర సులువుగా అంతా లాగేసుకోవచ్చని అభిప్రాయం కలిగినట్లుంది."

వేదమూర్తికి విమలమాటలు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నాయి. ఆమె ఏడవటంలేదు, భయపడటం లేదు. తడిసిన చెక్కిళ్ళు, చెదిరినతల; కంఠస్వరంలో, మాటల్లో పట్టుదల, తను ఎన్నడూ వూహించని కాఠిన్యం వ్యక్తమాతున్నవి. చీరలు మడతపెట్టి, సూట్‌కేస్‌లోసర్ది వేసి, తాళంవేసి నిలుచున్నది విమల. ఆమె తానిదివరకెరిగిన విమల కాదు.

"పోనీ, ఇవ్వనని గట్టిగా చెప్పరాదూ?"

"లాభంలేదు. చెక్కుపుస్తకం తీసి బలవంతాన్నైనా నాచేత యీ రాత్రి సంతకంపెట్టిస్తాడు. అమ్మ ప్రాణం అటు పోయిందో లేదో, అంతమాత్రం దాక్షిణ్యంలేకుండా, ఇక్కడికి రాగానే డబ్బుకోసం ప్రయత్నం ప్రారంభించాడే, ఇక దేనికి వెనక్కి తీస్తాడు ? ... ఆయనతో యిక మాట్లాడలేనుకూడా. నా కిక్కడ వుండటం యిష్టంలేదు. ఆయన వచ్చేంతలో నేను వెళ్ళిపోవాలి. మీరు వస్తారనే యింతసేపు ఎదురుచూశాను. నన్నెదైనా హోటలుకు తీసుకువెళ్ళండి."

"ఇట్లా చెప్పకుండా వెళ్ళిపోతే బాగుంటుందా? ఆయనతో నువ్వు సంబంధం పూర్తిగా తెంచుకుంటావా ?"

"మీకు అర్థంకాదు..." విమలఏడుస్తూ, నిస్పృహతో పరుపుచుట్టమీద కూర్చుంది. "అట్లాంటి మనిషితో నాకు సంబంధమేమీ అక్కరలేదు. లోకంలో ఒంటరిగా వుండటానికి ఎక్కడికైనా వెళ్ళడానికి నాకేం భయంలేదు." అని ఉద్వేగంతో, పెద్దగొంతుతో అని, చేతుల్లో ముఖం దాచుకొన్నది.

వేదమూర్తి లేచి దగ్గరకువెళ్ళి ఆమెనుతాకి, "విమలా" అన్నాడు మృదువుగా. విమల లేచి నిలుచుని కళ్ళు తుడుచుకుంటూ వుంది. ఆమెను చేత్తో తనదగ్గరకు తీసుకొని "సరే, వెళదాం విమలా ! టాక్సీలు ఇక్కడ దొరకవు. నేను మౌంట్ రోడ్డుకు వెళ్ళి తీసుకొస్తాను" అన్నాడు.

అతనిచేయి మెల్లగావిడిపించుకొని, టవల్ తీసి, ముఖం తుడుచుకొని తలసరిచేసుకుంటూ అన్నది విమల. "టాక్సీ యిక్కడికి వద్దు. క్రింద మొదలియార్ ఏమైనా అడ్డం చెప్తాడేమో ! టాక్సీ వీధిమలుపుదగ్గరే ఆపి, మీరు వచ్చి

సూట్ కేస్ పట్టుకొని ముందు వెళ్ళండి. తర్వాత అయిదునిమి షాలకు నేను వస్తాను. సూట్ కేస్ సంగతి ఒకవేళ మొదలియార్ అడిగితే, ఇది మీరే కొన్నారని, మళ్ళీ తీసుకువెళ్ళవచ్చునని యిక్కడవుంచారని చెప్పండి. ఇది ఈవూళ్ళోనే కొన్నసంగతి అతనికీ తెలుసు."

విమల యిదంతా యిదివరకే ఆలోచించిపెట్టుకొన్న పథకమని గ్రహించి వింతచెంది, ఆమెవైపు చూస్తున్నాడు వేదమూర్తి.

"అతనెందుకు అడ్డం వస్తాడు నీవస్తువులు నువ్వు పట్టుకు పోవటానికి ?"

"మీ కింతే తెలుసు! తనకురావలసినడబ్బు యిచ్చేస్తా నని బాబాయి అన్నాడో ఏమో, బలవంతంచేసి తీసుకొని వెళ్ళి కాఫీ యిచ్చాడు. బాబాయి వచ్చేదాకా అక్కడే వుండ మన్నాడు. ఎప్పుడూ వీధితలుపుదగ్గర నిలబడి రావటం పోవటం చూసేవాడే కాని ఒక్కమాటైనా మాట్లాడలేదు. ఇవ్వాళ మాత్రం యింత అభిమానం."

అయితే యీ రోజుపరిస్థితి వేరు. ఇవ్వాళ్ళపరిస్థితీ వేరు కదా! పాపం ఊరికే అనుమానిస్తున్నావేమో!"

"ఏమైనా మనజాగ్రత్త మనం పడాలి. సామానుతో వెళ్లడం చూస్తే తప్పకుండా అడుగుతాడు. బాబాయికి తెలీ కుండా వెళ్ళిపోతున్నానంటే, ఆయనవచ్చేదాకా ఆగమని, సందేహంలేకుండా మీతో పేచీపెట్టుతాడు. మిమ్మల్ని అను మానిస్తాడు,"

ఈ ఊహా సమంజసంగానే తోచింది వేదమూర్తికి.

"ఆలస్యమౌతోంది, ఇక వెళ్ళండిమరి." అన్నదివిమల.

ఆమె తనమీద చూపిస్తున్న అధికారమూ క్రొత్తగానే వుంది వేదమూర్తికి.

వీధితలుపుదగ్గర మొదలియారు లేడు.

అకస్మాత్తుగా తల్లి పోయిన దుఃఖమేమిటి? డబ్బు విష యమై యీ విపరీత భయమేమిటి? విమలకేమైనా దుఃఖం వల్ల మతిపోయిందా అనిపిస్తూవుంది. కాని ఆ భయానికి, వాళ్ళ బాబాయినిగురించి అనుమానించటానికి తగిన కారణాలు వుండ వచ్చుకూడా. వాళ్ళకుటుంబసంగతులు తన కేమి తెలుసు? డబ్బే ప్రధానమై, యితరమేమీ గమనించనివ్యక్తులు తప్ప కుండా లోకంలోవున్నారు. లేకపోతే అటు వదినెమరణించిందో లేదో, ఆమెడబ్బుకోసం వెంటనే ప్రయత్నం చెయ్యటమేమిటి? ఏపాటి అవసరమైనా, విమలదుఃఖాన్ని చూస్తే అడగ్గలడా?

తనమీద ఏదో సహజమైన అధికారంతో తన సహా యాన్ని కోరుతున్న విమల, కర్తవ్యాన్ని ఆలోచించుకొని ధైర్యంగా ప్రవర్తిస్తున్న విమల క్రొత్తవ్యక్తి. ఆమె యిదివరకు తనవూహకందని విమల. ఈ విమల స్వప్నంలో తన్ను వివా హంచేసుకొని తనదైపోయిన విమల. అది స్వప్నవివాహం కాదు. నిజంగాజరిగిన వివాహమే! భార్యకాగానే ఎక్కడలేని హక్కు, అధికారం వస్తుంది కాబోలు! కలలో పసుపుబట్టల్లో వుండి "మీ కేందుకూ" అని తన్ను కసురుకొన్న విమలకూ, కొన్నిక్షణాలక్రితం "మీకింతే తెలుసు?" అనీ, "ఇక వెళ్ళండి మరి!" అనీ, తనేదో ఆమె సొంతంఅయిపోయినట్లూ, ఆజ్ఞా పిస్తూ, మాట్లాడేవిమలకూ భేదమేమీ లేదు.

టాక్సీలో కూర్చుని మళ్ళీ ట్రిప్లికేన్ చేరుకుంటున్న వేద మూర్తికి జరుగుతున్నదంతా కలలాగే వుందనిపించింది. స్వప్నానుభూతికీ, జాగ్రదావస్థలో అనుభవానికీ భేదం ఏమీ కనిపించటంలేదు. రెండింటివల్లా వ్యక్తిలో కలిగే భావసంచలనం, భావపరివర్తన ఒకవిధమైనదే. ఆలోచనమాత్రం స్వప్నానుభవాన్నీ, యథార్థాన్నీ జాగ్రత్తగా వేరుచేసి వుంచుతుంది.

కాని యథార్థసంఘటనలే స్వప్నంలో వింతమార్పులతో తరచు కనిపించునట్లు, స్వప్నంలోనిసంఘటనలప్రభావం ఒక్కొక్కప్పుడు యథార్థజీవితంమీద ప్రసరించి వ్యక్తి దృక్పథాన్ని, ఆలోచనని మారుస్తుంది. అందువల్ల స్వప్న వివాహం విమల అంటే తనభావనలో మార్పు తేవటం సహజమే! కాని అటువంటిమార్పు ఏదీ తనప్రవర్తనలో వ్యక్తంకాక పూర్వమే విమలకూడా స్వప్నవివాహం సత్యమని గుర్తించినట్లు తనతో ప్రవర్తించటం విచిత్రమైన సంగతి.

తన ఊహాలకు కళ్ళెం లాగాడు వేదమూర్తి. ఏమిటిదంతా? తను వివాహం చేసుకుంటాననేకోరిక యిదివరకే ఆమెకు వ్యక్తంచేశాడు. ఆమెతల్లి కూడా వివాహానికి అంగీకారాన్ని విమలకు తెలిపివుంటుంది. కాబట్టి పెళ్ళిచేసుకోబోతూ వున్న తనతో, యీ పరిస్థితిలో, విమల యీవిధంగా కాక ఏవిధంగా ప్రవర్తిస్తుంది! తనకు రాత్రివచ్చినకల జ్ఞాపకంతో మతిపోతూవుంది.

టాక్సీ వీధిమలుపుదగ్గర ఆపమన్నాడు.

సూట్‌కేస్ పట్టుకుని మెట్లుదిగుతూవుంటే, సరిగ్గా విమలఊహించినట్లే అక్కడున్న మొదలియార్ "ఏమిటి

సూట్ కేస్?" అన్నాడు. "మొన్న బజారులో కొన్నది, యిప్పటిదాకా ఇక్కడే వుంది." అంటూ తొందరగా బయట పడ్డాడు వేదమూర్తి; తను చెప్పింది సత్యం కాని సత్యం; సందిగ్ధంగావుంది; అసత్యం చెప్పనందుకు సంతోషించాడు.

వేదమూర్తి టాక్సీలో కూర్చుని విమలకోసం నిరీక్షిస్తున్నాడు. పది పదిహేనునిమిషాలు గడిచాయి; విమల రాలేదు. క్షణ మొక యుగంగా వుంది. ఆలస్యానికి కారణమేమిటో!

అరగంటతర్వాత చేతిసంచి పట్టుకుని విమల వచ్చి టాక్సీలో ఎక్కింది. డ్రైవరుకు అడ్రసు చెప్పినతర్వాత వేదమూర్తి విమలవైపు తిరిగి "ఎందు కింత ఆలస్యంచేశావు?" అన్నాడు.

"మొదలియారు లేచి యింట్లోకి వెళ్తాడేమోనని చూశాను. కాని ఎంతకూ లేవలేదు. తలుపు తాళంవేసి, దిగివచ్చి, తాళంచెవి అతనిచేతికే యిచ్చి, 'ఆస్పత్రిలో కొన్ని వస్తువులు మరచి వచ్చాను. వెళ్ళి తీసుకొస్తాను'అని చెప్పాను. 'పాపం, మీరే వెళ్ళాలా? మీ పినతండ్రి వస్తారుగా' అన్నాడు. 'ఆయన ఎంతసేపటికి వస్తాడో! ఒంటరిగా గదిలోకూర్చోవటం కన్న నాకు వెళ్ళిరావటమే బాగుంటుంది; ఇంతలో ఆయన వస్తే తాళంచెవి యివ్వండి!' అన్నాను."

"అయితే మీ బాబాయి ఆస్పత్రికి వెళ్తాడన్నమాట?"

"వెళ్ళడు. గదిలో ఆయన కొక ఉత్తరం వ్రాసి పెట్టాను." నా మనస్సు బాగులేక ఊరికి వెళ్ళిపోతున్నాననీ, తర్వాత పిన్నిపేర వుత్తరంవ్రాస్తాననీ" రెండు వాక్యాలు

వ్రాశాను. ఏ మాత్రం ఇంగితజ్ఞానం వున్నా నేనెందుకు వెళ్ళి పోయ్యానో గ్రహిస్తాడు!"

"విమలా, నిన్ను నే నుండే గదికి తీసుకువెళ్తున్నాను."

"ఎందుకు? ఏదైనా హోటలుకు తీసుకువెళ్ళండి."

"ఆడవాళ్ళు ఒంటరిగా వుండటానికి తగిన హోటళ్ళేవీ మద్రాసులో లేవు; నా గదికి రావటానికి అభ్యంతరమా?"

"నాకేం అభ్యంతరంలేదు."

కాని, వేదమూర్తికి తృప్తిగాలేదు. ఇప్పటి ఆమె మనస్థితిలో ఆమెను ఏవిధంగాను తను నిర్బంధంచేసినట్లుండ కూడదనిపించింది.

"పోనీ, మెయిలు కింకా చాల టైముంది; ఊరికి వెళ్ళిపోతావా?" అని అడిగాడు విమలను.

"ఇప్పుడు ప్రయాణంచేసేస్థితిలో లేను; మీగదికి పదండి" అన్న దామె.

## 22

"నాకు విపరీతంగా తలనొప్పివచ్చింది, మీదగ్గర ఆస్ప్రో ఏమైనా వుందా?" అన్నది విమల, గదిచేరుకోగానే.

"ఉంది, కాని నువ్వేమైనా తింటే బాగుంటుంది విమలా! ప్రొద్దున్నుంచి ఏమీ తిననందుకే తలనొప్పి" అని బిస్కట్లు, మంచినీళ్ళు టేబిల్ మీద పెట్టాడు వేదమూర్తి. తర్వాత "నేను వెళ్ళి కాఫీ తెస్తాను. నువ్వు పడుకోవాలనుకుంటే, ఆ కిటికీదగ్గ రున్న బెడ్ నాది; అది వేసుకో" అని చెప్పి ఫ్లాస్కు తీసుకొని హోటలుకు వెళ్ళాడు.

అతను తిరిగివచ్చేటప్పటికి పరుపుచుట్టమీద వాలిపోయి కళ్ళుమూసుకునివుంది విమల. టేబిల్‌మీద పెట్టినవి పెట్టినట్లే వున్నాయి; ఏమీ తిన్నట్టులేదు. "విమలా" అని పిలిచాడు వేదమూర్తి. ఆమె కళ్ళుతెరచి లేవబోయి, తూలి కూర్చుంది.

"ఏం, విమలా, ఎట్లావుంది నీకు?" అన్నాడు దగ్గరకు వెళ్ళి.

"ఏంలేదు. తలనొప్పి, నీరసంగాకూడ వుంది. ఆస్ప్రో యివ్వండి; కాఫీ తాగి పడుకుంటాను" అన్నది.

వేదమూర్తి ఆస్ప్రోకోసం వెదుకుతూవుంటే, మెల్లగా పక్క వేసుకుంది విమల. ఆమె ఆస్ప్రోవేసుకుని కాఫీతాగి పడుకున్నతర్వాత వేదమూర్తి వెళ్ళి వరండాలో కూర్చున్నాడు.

రాత్రి జరిగిన స్వప్నవివాహం యిప్పుడీవిధంగా యిల్లాలిని తీసుకొనిరావటం! జీవితం చాలవిచిత్రమైంది! తనకు తండ్రి ఆమెకు తల్లి ఇద్దరూ నెలరోజులవ్యవధిలో మరణించారు తలవనితలంపుగా! ఒకరికొకరు తప్ప ఆత్మీయులైనవాళ్ళు యిద్దరికీ లేరు. తండ్రిమరణించటంతో తల్లి తనకుకాకుండాపోయింది; కాని వివాహంతర్వాత కోడల్ని చూచైనా ఆమె రాకుండా వుంటుందా?

మద్రాసులోగాని లేక ఏవూళ్ళోనైనా సరే లెక్చరరు వుద్యోగం లభిస్తే చాలు, తనకు తృప్తిగావుంటుంది. విమల చదువుకూడా పూర్తవుతుంది; తనజీవితం అనుకున్నదారినే వెళ్ళుతుంది.

తల్లిదండ్రులతో అభిప్రాయభేదం వచ్చినతర్వాత యీ నాలుగునెలలూ ఒంటరితనంఅంటే ఏమిటో తెలుసుకున్నాడు.

విద్యార్థిగావున్నప్పుడు, చదువుమీదిదీక్షవల్ల నేకాదు, ఎక్కడో వెనకాల తన్ను ప్రేమించేవాళ్ళు తనవాళ్ళు, వున్నారనే అవ్యక్తభావంవల్లకూడా ఒంటరితనాన్ని అనుభవించలేదు. కాని వాళ్ళతో కలహించినతర్వాత, తండ్రి అకస్మాత్తుగా తనమీదికోపంతో అట్లానే మరణించటం, తనకు కళాశాలలో వచ్చిన చిక్కుల సంఘటనలన్నీ, ప్రేమమీద తనెంతగా ఆధారపడుతాడో, ప్రేమఅవసరం తనలో ఎంత బలవత్తర మైందో, బాగా గుర్తుకుతెచ్చాయి, ఈ ఒంటరితనాన్ని బుద్ధిపూర్వకంగా యింతవరకు ఒప్పుకోలేదు; స్వేచ్ఛను చూచు కొని గంభీరంగా, నిర్లక్ష్యంగా వున్నాడు. కాని తెలీకుండా హృదయంలో ప్రవేశించిన శూన్యత ఏమిటో విమలనుకలుసు కొన్న యీ వారంరోజుల్లో బోధపడింది. స్వేచ్ఛకు ప్రత్యేక మైన స్వతంత్రప్రయోజనం ఏముంది? వ్యక్తిత్వవికాసానికి స్వేచ్ఛ, చెట్టుకు గాలి, నీళ్ళవలెనే, ఒక అవసరమైన పరిస్థితి మాత్రమే. విమలనుకలుసుకోవటంతో, తనహృదయంలో నిండుదనమూ, ఉత్తేజమూ మళ్ళీ ప్రవేశించాయి. ఆ స్వేచ్ఛ కొక అర్థం వచ్చింది.

సాహిత్య, వేదాంతాల్లో తన జిజ్ఞాస ఆ పథాల్లో ప్రయాణంచెయ్యగలిగితే ఎంతో కొంత సాధించితీరవచ్చుననే ఆత్మవిశ్వాసాన్ని కలిగిస్తూవుంది. వివాహంతో ఆ ప్రయాణా నికి తను సిద్ధపడినట్లే.

ఏడున్నర అయింది. వేదమూర్తి లేచి వరండాలో దీపం వెలిగించి తలుపుదగ్గరకు వెళ్ళి "విమలా!" అని పిలిచాడు. అట్లా పిలవటమే ఎంతో మధురమైన కొత్త అనుభవంగా

తోచింది. మళ్ళీ "విమలా!" అన్నాడు. ఆమెకు నిద్రపట్టిందో కాబోలు, పలకలేదు.

మళ్ళీ వరండాలో కూర్చున్నాడు వేదమూర్తి.

రాత్రినుండి నిద్రాహారాలు లేక దుఃఖం ఒకవైపు, పిన తండ్రిని గురించిన అనుమానం, భయం ఒక వైపు—విమల బాగా సలిగిపోయివుందేమో, సొమ్మసిలి నిద్రపోయింది. ఈపాటికి పినతండ్రికి తెలిసేవుంటుంది. విమల వ్రాసివుంచిన వుత్తరం చూచుకొని, తను వచ్చివెళ్ళినసంగతి మొదలియార్ ద్వారా విని, తనే ఆమెను రైలెక్కించివుంటాడని ఊహిస్తాడు. సూట్ కేసుసంగతి కూడా గ్రహించివుంటాడు. బహుశా రైలు దగ్గరకు వెళ్తాడేమో! అతనికి స్వీయప్రవర్తనవిషయం యిప్పటికైనా తెలిసివచ్చివుంటుందా?

డబ్బు పాపిష్టిది! దాన్ని తగినస్థానంలో వుంచకపోతే, స్నేహాన్ని, ప్రేమను కలుషితం చేసి, మానవత్వాన్ని నిర్మూలిస్తుంది. జీవితావసరాలకు కావలసినడబ్బు చాల ఎక్కువైనా, చాల తక్కువైనా ప్రమాదమే! తిండికిలేని దరిద్రుడూ, డబ్బు పోగుచెయ్యటమే పరమావధియైన ధనికుడూ, యిద్దరూ డబ్బునే ఆరాధిస్తారు.

ఎనిమిదయింది. గదిలో లైటు స్విచ్చివేసి "విమలా, విమలా!" అని పిలిచాడు. ఆమె మేలుకొని అతనివైపుచూచింది.

"ఎట్లావుంది?" అన్నాడు.

"తలనొప్పి తగ్గింది"

"లేచి ముఖంకడుక్కో; భోజనానికి వెళదాం; ఎనిమిదయింది."

"నా కిప్పుడేమీ సయించదు, మీరు వెళ్ళండి."

"సయించినంతే తిందువుగాని, లే వెళదాం."

"నాకు వద్దు"

"అయితే నేనూ వెళ్ళను." అని వరండాలోకి వెళ్లాడు వేదమూర్తి.

కొంతసేపటికి విమల వరండాతలుపుదగ్గరకు వచ్చి

"నేను నిజంగానే ఏమీ తినలేను. మీకోసం హోటలు దాకా వచ్చేస్థితిలో కూడా లేను. దయచేసి మీరు వెళ్ళిరండి" అన్నది.

వేదమూర్తి ఆమెదగ్గరకు వచ్చి "పోనీ, గదిలో రొట్టె, జామ్, బిస్కట్లు వున్నాయి తీసుకో, నేను వెళ్ళి ఓవల్టిన్ తెస్తాను" అన్నాడు.

"సరే, మీరు వెళ్ళండి"

"అట్లాకాదు, నువ్వు తిన్నతర్వాతనే వెళతాను."

* * *

వరండాలో పడుకున్న వేదమూర్తి ప్రొద్దున అయిదు న్నరకే లేచాడు. వరాండాకు గదికి మధ్యనున్న తలుపుకు లోపల గడియపెట్టుకొన్న విమలను నిద్రలేపితేగాని అతను కాలేజికి సిద్ధంకావటానికి వీలులేదు. విమల లేచి తలుపు తీసి, మళ్ళీ పడుకొన్నది.

వేదమూర్తి స్నానంచేసివచ్చి దుస్తులు వేసుకుంటూ వుంటే, విమల ముఖంకడుక్కొని తలదువ్వుకొన్నది. హోటలుకు వెళ్ళారు. అక్కడినుండే — తాళంచెవి విమలకిచ్చి — కాలేజికి వెళ్ళిపోయాడు వేదమూర్తి.

ఒంటిగంటకు అతను తిరిగివచ్చేటప్పటికి, విమల స్నానం చేసి, చీరమార్చుకుని, పడకకుర్చీలో పడుకుని పరధ్యానంలో వుంది. ఇద్దరూకలిసి భోజనంచెయ్యటానికి వెళ్ళారు.

భోజనమై గదికిరాగానే, వేదమూర్తి టేబిల్‌దగ్గర కూర్చుని టెస్టుపేపర్లు దిద్దటానికి తీశాడు.

పక్కమీదకూర్చున్న విమల "మెయిల్ ఎన్నింటికి?" అన్నది.

"ఎనిమిదింబావుకి. ఇవ్వాళ వెళతావా ?"

"రేపు స్టేషన్‌కు రమ్మని పార్వతికి టెలిగ్రామ్ ఇచ్చాను. వెళ్ళి హాస్టలులో దిగాలి. తర్వాత మేముండిన ఇల్లు ఖాళీ చెయ్యాలి."

"టెలిగ్రామ్ ఎప్పుడిచ్చావు?"

"మీరు వెళ్ళినతర్వాత పోస్టాఫీసుకు వెళ్ళాను ... హాస్టల్లో ప్రవేశం యిస్తారో లేక ఖాళీ లేదంటారో అన్నదే కొంత భయంగా వుంది."

"ఎందుకూ ?"

"పార్వతికీ వార్డెన్ శారదాంబకూ పడదు. నేను పార్వతికి స్నేహితురాలినని, ప్రవేశమివ్వకుండా ఇబ్బందిపెట్టుతుందేమో !"

"ప్రిన్సిపాల్ మంచివాడు; వెళ్ళి ఆయన్నడిగితే తప్పకుండా యిస్తాడు. లేక సుందరరావుతో చెప్పినా సహాయం చేస్తాడు."

"ఆయనసహాయం కోరటం నాకిష్టంలేదు. ప్రిన్సిపాల్‌నడుగుతాను."

"సుందరరావునడగటం ఎందుకిష్టంలేదు? ఆయన నీకు బాగా తెలుసే !"

"ఆయనతత్వం మీకూ యీపాటికి అర్థంకావాల్సిందే ఆయ నొకతరహావ్యక్తి. మాటల్లో ఎంతో మంచివాడని, గొప్ప వాడని అభిప్రాయం కలుగుతుంది. కాని నిజంగాచూస్తే, నాకు ఆయనలో స్వార్థంతప్ప ఏమీ కనిపించలేదు. ఎప్పుడూ తనకు బాధ్యతలేకుండా తప్పించుకోవాలన్న ప్రయత్నమే.నాటకంరోజు గొడవలో మీరు చిక్కుల్లోపడటానికి, సమ్మె జరగటానికి ఆయనే చాలవరకు కారణంకదా !"

"సుందరరావుకు పెద్ద అన్యాయంచేస్తున్నావు విమలా. అతనిలోని ప్రత్యేకత ఒక్కొక్కసారి అట్లానే కనిపించవచ్చు. కాని అతనివల్ల నాకుమాత్రం ఏమీ అపకారంజరగలేదనే నా భావం."

"మీ మంచితనంవల్ల మీ రట్లా భావిస్తున్నారేమో!"

"పోనీ, నా మంచితనంలోనైనా నీకు నమ్మకంవుంది !" అన్నాడు నవ్వుతూ వేదమూర్తి.

"ఇప్పటిదాకా వుందిలెండి."

"భలేదానివే!" వేదమూర్తి కొంచెమాగి, "మన వివాహంవిషయం ఏమైంది? నిన్నిప్పుడు ప్రశ్నించటం నాకిష్టం లేదు. కాని నువ్వు యివాళ వెళ్ళిపోతున్నావు,మళ్ళీ నిన్నెప్పుడు చూస్తానో!" అన్నాడు.

"నేను వివాహమే చేసుకోను." విధిలేక అనవలసివచ్చి నట్లు నిదానించి స్పష్టంగా మెల్లగా అన్నది విమల.

వేదమూర్తికి ఏమనాలో తోచలేదు. లేచి, మౌనంగా గదిలో ఇటూ అటూ తిరిగాడు కొంతసేపు.

"మరి ఆరోజు నన్ను చేసుకోవడం యిష్టమే కానీ, మీ అమ్మగార్ని అడగాలని, తుదినిర్ణయం ఆమె దేననీ అన్నా వెందుకూ?"

"మీ రంటే యిష్టమే! కాని వివాహం ఎందుకు చేసుకోవాలి?"

"వివాహానికి వేరే ఏం కారణం వుండాలంటావు?"

"నేను వివాహాన్ని గురించి అసలు ఆలోచించటమే లేదు."

"అయితే ఆ 'యిష్టా'ని కర్థమేమిటి? దానికి జీవితంలో ఒక స్వరూపం, సాంఘికంగా ఒక ప్రయోజనం, ఏర్పడాలనే కదా వివాహం!"

"కాని వివాహంవల్ల దాని నిజస్వరూపం అసలు నాశనమైతేనో! ... వివాహంతో నామీద నా కధికారం వుండదు; అప్పు డీ 'యిష్టా'నికీ అర్థంవుండదు!... పెళ్లైనతర్వాత స్వార్థం ఎక్కువై ఒకరిమీదఒకరికి గౌరవమూ తగ్గుతుంది."

"ఈ విషయాలన్నిటిగురించి నువ్వు కొంత ఆలోచించా వన్నమాట! మంచిదే! కాని, నీ ఊహ యథార్థవిరుద్ధంగా వుంది. వివాహం మానవనైజానికి సరిపడిన వ్యవస్థ అని నా అభిప్రాయం. ఇక మనిద్దరవిషయంలో నేను చెప్పవలసిందేమి టంటే — వ్యక్తిత్వంవిలువ నేనూ గుర్తిస్తాను; వివాహంవల్ల మనకు పరస్పరగౌరవం ఎన్నటికీ పోదు."

"మనం ఎన్నైనా ఊహించవచ్చు. కాని ఒకవిధంగా మనల్ని మనంబంధించుకున్న తర్వాత, ఆపరిస్థితుల్లో ఊహాల్ని

అనుకొన్న విధంగా ఆచరణలో పెట్టడం కష్టమేఅవుతుంది. మా అమ్మ చనిపోయిన క్షణంనుంచి యీ విషయాన్ని గురించి, నా కర్తవ్యాన్ని గురించి ఆలోచిస్తూనేవున్నాను. నాకు ఏ నిశ్చయమూ సులభంగా లేదు. కాని చివరకు తోచింది యిది. మీరు వివాహానికి ఎందు కింత ప్రాముఖ్యత యిస్తున్నారో అర్థంకావటంలేదు. ఎవరిజీవితం వాళ్ళు జీవిస్తే ఎంత బాగుంటుంది. నాకు బాగా నచ్చిన స్నేహితులున్నారు. పార్వతి, లీల—వాళ్ళిద్దరికీ ఎక్కడా సామ్యమంటూ లేదు. కాని వాళ్ళిద్దరిలో కూడా నాతో ఆత్మీయత ఏర్పరచుకోగల గుణమేదో వుంది. మీ విషయంలోనూ అంతే. పార్వతి లీలలాగే మీరూను. వాళ్ళు ఆడవాళ్ళు, మీరు కాదు అన్న భేదం ఆ ఆత్మీయత నే విధంగా ను మార్చబోదు. వాళ్ళకు అక్కచెల్లెళ్ళని, సాంఘికమైన పేరొకటి అవసరంలేనట్లే, మీకు భర్త అంటూ సాంఘికమైనవరస కల్పించకుండా, ఆత్మీయతను, స్నేహాన్ని, గౌరవాన్ని నిలుపుకోగూడదా?''

"మనిద్దరిమధ్యా స్నేహంతప్ప యింకేమీ లేదని నువ్వంటూవుంటే యిక వాదించి ప్రయోజనమేమిటి?" వేదమూర్తి విసుగ్గా వరండాలోకి వెళ్ళిపోయాడు. అతనికి తనొకటీ విమల ఒకటీ మాట్లాడుతూవున్నట్లు తోచింది.

పదిపది హేను నిమిషాలు గడిచాయి. అతను గదిలోకి రాలేదు. ఆలోచిస్తూకూర్చున్న విమల లేచి, ద్వారందగ్గరకు వెళ్ళి, అతనిను ద్దేశించి "మీకు కోపంవచ్చిందా?" అన్నది.

వెనక్కితిరిగిచూచిన వేదమూర్తికి ఆమెకళ్ళల్లో వ్యక్తమౌతూవున్న భావం, అంతవరకు అతన్ని వేధిస్తున్న సమస్యను

తీర్చింది. దగ్గరగావచ్చి, భుజాలు రెండూ గట్టిగాపట్టుకొని ఆమె పెదవులమీద ముద్దుపెట్టుకొన్నాడు. చేతుల్తో అతన్ని త్రోసి, గిరుక్కున తిరిగి, తనముఖం కనిపించనీకుండా టేబిల్ ఆనుకొని క్రిందికిచూస్తూ, నిలుచున్నది విమల.

వేదమూర్తి ఆమెనుసమీపిస్తూ అన్నాడు.

“లీల వాళ్ళతో నీకున్న ఆత్మీయతకూ, మనఆత్మీయతకూ యీ ఒక్కభేదం వుంది. అందుకే వివాహం అవసర మంటున్నాను. ఈ విషయాన్ని మరచిపోయి, ఎంతసేపు వాదించి మాత్రం ఏంలాభం?”

విమల మాట్లాడలేదు. వేదమూర్తి ఆమెవెనుక దగ్గరగా నిలబడి మెల్లగా అంటున్నాడు; “మీ అమ్మగారినిర్ణయమే తుదినిర్ణయం అన్నావే! ఆవేశవశ అయినరోజున ఆమె నన్ను పిలిచి చెప్పింది...మనం పెళ్ళిచేసుకోవాలనీ, నేను నిన్ను జాగ్రత్తగా చూడాలనీ. మరి ఆమెమాటలకు నువ్విస్తున్న విలువ ఏమిటి?”

“ఎప్పుడు చెప్పింది?” అని విమల అక్కడనుంచి వెళ్ళి టేబిల్ కటువైపున నిలుచున్నది.

“ఆమె నిన్ను ముఖం కడుక్కోమని వెళ్ళమన్నప్పుడు నేను కుర్చీలో కూర్చునివున్నాను. నా వైపుమాస్తూ దగ్గరకు రమ్మని సంజ్ఞచేసింది. ఆయాసంతో మాట్లాడటం కష్టంగా వుంది...విమల జాగ్రత్త—పెళ్ళి—నేను నమ్మకం లేదు, అని ఆమె స్పష్టంగా అన్నమాటలు.”

“మరి నాతో మీ రెందు కింతవరకు చెప్పలేదు?” అతనివైపు చూడకుండానే ప్రశ్నించింది విమల.

"ఏదీ, అవకాశమే లేదు. నువ్వీవిషయం ఆపరేషన్ ముందురాత్రే ఆమెతో ప్రస్తావించావనుకుంటాను కదూ ?"

"నిజమే. కాని ఆ రాత్రి నాతో వివాహంచేసుకొమ్మని ఆమె చెప్పలేదు. ఆపరేషన్ అయినరోజున మీరు రాకముందు నాతో రెండుసార్లు మాట్లాడింది. అప్పుడూ చెప్పలేదు. కాని మిమ్మల్ని కూర్చోమన్నతర్వాత, నేను కొళాయిదగ్గరకు వెళ్ళి నప్పుడు చెప్పిందంటున్నారు."

"అవును. నువ్వు తిరిగివచ్చేటప్పటికి నేను ఆమెదగ్గర నిలబడివున్నాను. జ్ఞాపకంవుందా? అప్పుడే అన్నది."

"మరి ఆ సంగతి మీరు నాతో అప్పుడు చెప్పలేదే!" విమల పరిశీలనగా అతనివైపు చూస్తూ ప్రశ్నించింది.

"వెంటనే ఆమెకు ఆయాసంతో స్పృహతప్పిపోయింది. ఆమర్గాగా నేను డాక్టరుకోసం వెళ్ళాను. ఆసంగతి మరిచాను."

విమల మౌనంవహించింది. ఆ నిశ్శబ్దం వేదమూర్తికి భారంగా తోచింది. అది ఆమెసందేహాన్ని వ్యక్తంచేస్తూవుంది.

"విమలా, నువ్వు నామాటలు నమ్మటం లేదా ?" అన్నాడు ఆతురతతో. అతనితో. నిస్పృహ ప్రవేశించింది.

విమలకళ్ళనుంచి జారి టేబిల్ మీద పడుతున్న కన్నీళ్ళు ఆ ప్రశ్నకు జవాబిచ్చాయి. అట్లా వాల్చినతలతోనే తటాలున విమల వరండావైపు వెళ్ళిపోయింది.

వేదమూర్తి మెల్లగా కుర్చీలోకూర్చొబడి టేబిల్ కేసి చూస్తూ, ఆమెకన్నీళ్ళతో తడిసినచోటు వ్రేళ్ళతో తాకాడు.

కొంతసేపైనతర్వాత, విమల గదిలోకి వచ్చి పక్కమీద గోడవైపు తిరిగి పడుకొన్నది.

సాయంత్రం నాలుగున్నర అయింది. విమల కళ్ళు మూసుకుని పడుకునేవుంది. వేదమూర్తి హోటలుకు వెళ్ళి కాఫీ తాగి, ఫ్లాస్కులో ఆమెకోసం కాఫీ తీసుకొనివచ్చాడు.

అతనువచ్చేటప్పటికి విమల లేచి, ముఖంకడుక్కొన్నది. ఫ్లాస్కుటేబిల్‌మీదపెట్టి వేదమూర్తి కుర్చీలోకూర్చుని పుస్తకం తీశాడు. గ్లాసుతీసుకొనివచ్చి ఫ్లాస్కుమూత విప్పుతూ అతనితో అన్నది విమల.

"చూడండి! నేను చెప్పేది వింటారా?" వేదమూర్తి ఆమెవైపు చూశాడు. విమల మూతతీసి ప్రక్కనపెట్టి, ఒక క్షణం ఆగి అన్నది.

"అమ్మ నాతో ఆపరేషన్‌ముందురాత్రి ఏమన్నదంటే—నేను చదువు పూర్తిచేసుకొని, తర్వాత ఏ విషయమూ నిర్ణయించుకోవాలని. మీతో అన్నమాటల్లోకూడా పెళ్ళి యిప్పుడే చేసుకోమని అనలేదు కదా! నా పరిస్థితి ఆలోచించండి. నే నివ్వాడేసంగతీ నిశ్చయించుకోలేకుండావున్నాను. నా చదువు పూర్తయ్యేదాకా—అంటే రెండుమూడేళ్ళు—మన మే నిశ్చయానికీ రాకుండా ఆగకూడదా?"

విమల కాఫీ గ్లాసులో పోసుకొన్నది.

"నామీద నీకు నమ్మకంలేనప్పుడు, ఎన్నాళ్ళుఆగి మాత్రం ప్రయోజనమేమిటి?"

"లేదని ఎందుకనుకుంటారు? నమ్మకంలేకపోతే మీ సాహాయ్యంకోరి, మీతో ఇక్కడికెందుకువస్తాను? ఈ రెండు రోజుల్లో కలిగిన అనుభవాలు, ఆవేదన నా ఆలోచన కంద

కుండా నన్ను పిచ్చిదాన్నిచేస్తున్నాయి. నాలో నాకే నమ్మకం లేదు. కొంతకాలం జరిగితే ఏదైనా ఆలోచించగలుగుతాను."

"నాలో నమ్మకమేవుంటే, మీ అమ్మగారు నాతో అన్నమాటలకు నువ్వు విలువయివ్వగలిగితే, ఇక సందేహించటంలో అర్థంలేదు."

"ఎందు కర్థంలేదు ? మీరుమాత్రం ఉద్రేకపడకుండా, కొంత వ్యవధి కల్పించుకుంటే తప్పేమిటి ?" అన్నది విమల శాస్త్రి తీవ్రంగానే.

వేదమూర్తికి కోపంవచ్చింది.

"ఉద్రేకమేమిటి? నానిశ్చయానికి తిరుగులేదు. నువ్వన్న ఆ మాటలోనే తెలుస్తూవుంది, ఎంతగా నమ్ముతున్నావో నన్ను. అసలు నన్ను చేసుకోవాలని నీకులేనప్పుడు, యింత ప్రసంగం దేనికి? ఉన్న సంగతి సూటిగా చెప్పేస్తే బాధవుండదు."

కాఫీ తాగటం పూర్తిచేసి విమల అతనివైపు తిరిగి "నేనెప్పటికైనా వివాహంచేసుకుంటే, మిమ్మల్నితప్ప యింకెవర్నీ చేసుకోను. సరేనా ?" అని అక్కడినుంచి ఆమె గ్లాసుతో స్నానాలగదివైపు వెళ్ళిపోయింది.

# 23

సుందరరావుకు తండ్రి ఉత్తరం వ్రాశాడు.

"మీ కళాశాల లెక్చరరు శ్రీ వేంకటరావుగారు నాకు వ్రాసినలేఖ నీకు పంపిస్తున్నాను. అందులోనివిషయాలను గురించి నేనేవిధమైనఅభిప్రాయానికి రాలేదు. ఇదివర కెప్పుడో ఒకటిరెండుసార్లు నీ వివాహప్రస్తావన వచ్చినా, నీ జీవితాన్ని

గురించి ఆలోచించుకోగలసమర్థత, విజ్ఞానం నీకు వున్నాయని నిర్ణయించుకొని, ఏవిధమైనజోక్యం నేను కలిగించుకోలేదు. ఆ నిర్ణయం యిప్పటికీ అట్లానేవున్నది...

"నువ్వు వేసవిలో తప్పకుండా రావలెను...

ఆ శీ స్సు లు
శ్రీ ధ ర రా వు

ఎప్పుడో రెండుమూడు నెలలకుగాని, ఏమైనా విషయా లుంటే తప్ప తండ్రీ కొడుకులు వుత్తరాలు వ్రాసుకోరు. సుందరరావుతల్లి పదేళ్ళక్రితంచనిపోతే, శ్రీధరరావు రెండవ వివాహం చేసుకొన్నాడు. అప్పుడు సుందరరావు కాలేజిలో ఇంటరు చదువుతున్నాడు. ఆ వివాహాంతర్వాత సెలవుల్లో ఎప్పుడైనా యింటికివెళ్ళి కొన్నిరోజులు వుండిరావటం తప్ప అతనిజీవితం పూర్తిగా వేరుపడిపోయింది. తనకూ, వెంక ట్రావుకూ సంబంధమేమిటని వింతగా రెండవవుత్తరం చదివాడు సుందరరావు.

"...మా రెండవఅమ్మాయిని మీ అబ్బాయి సుందర రావుకు చేసుకొనే విషయం గతసంవత్సరం ఒకసారి నేను మీతో ప్రస్తావించినసంగతి మీరు మరచిపోలేదనుకుంటాను. 'పనితొందరవల్ల తర్వాత ఆలోచిస్తా'నని చెప్పియుంటిరి. ఈ ఏడాది వివాహంచేయవలెనని మేము అనుకొంటూ వున్నందువల్ల ప్రస్తుతం ఈ లేఖ వ్రాస్తున్నాను...

"మొన్న కళాశాలలోజరిగిన విద్యార్థులసమ్మెసంగతి మీరు వినేవుంటారు. ఆ సందర్భంలో మనఅబ్బాయినిగూర్చి విద్యార్థులలోను, కొందరు ఉపాధ్యాయులలో కూడ ఏవో

అపోహాలు బయలుదేరినవి. వాటిలో నిజమెంతమాత్రమూ లేదన్నవిషయం అందరికీ తెలిసిందే. సమ్మోసమయానికి దుర దృష్టవశాత్తు నేను ఊళ్ళో లేను. ఏమైనా బ్రహ్మచారిగా ఇరవై ఎనిమిది ఇరవైతొమ్మిదేళ్ళవరకు వుండిపోవటం లోకాని కొకవింతగా వుంటుంది. పెద్దవాళ్ళమైన మనంకూడా యీ విష యంలో కొంత బాధ్యతవహించక తప్పదు. ఇవి నేను మా అమ్మాయివిషయమై తొందరపడుతూ వ్రాసే మాటలుకావు. మీతో వున్న పరిచయంవల్ల, మీ అబ్బాయిశ్రేయస్సు మా పిల్లలశ్రేయస్సు ఒక్కటేనన్న భావంతో యీసంగతి వ్రాస్తు న్నాను. మీరు వివాహంసంగతి ఆలోచించి త్వరలో జవాబు వ్రాస్తారని నమ్ముతున్నాను. నమస్కారములు."

యథార్థాన్ని గౌరవించేపద్ధతిలో మనస్సును నియ మబద్ధంచేసుకోనివాళ్ళు, ఆత్మపరీక్ష అలవాటులేనిమనుష్యులు, తాముఊహించే ప్రతిఊహా, తలపెట్టే ప్రతికార్యమూ అవతలి వాళ్ళమేలుకే, లోకకళ్యాణార్థమేనని భ్రమిస్తారు; నిజంగా నమ్ముతారుకూడా. వెంకట్రావుకు వయసుమళ్ళింది; సంసార భారంతో సతమతమౌతున్న వ్యక్తిమీద కోపంతెచ్చుకోవటం కూడ సమంజసంకాదు.

గతసంవత్సరమే వెంకట్రావు ప్రయత్నించినప్పటికి, ఈ విషయం తనతండ్రి ప్రస్తావించలేదు. ఇప్పుడీ వుత్తరంమూలాన యింతమాత్రమైనా వ్రాశాడు. తనమీద సంపూర్ణవిశ్వాసం కలిగి, తనని బాగా అర్థంచేసుకోగలిగిన ఆయన వాత్సల్యం యొక్క ఉదాత్తత, తనలో వెంకట్రావువంటివారివల్ల విద్యార్థుల

ప్రవర్తనవల్ల కలిగే నిస్పృహను పోగొట్టి, హృదయానికి క్రొత్తశక్తిని చేకూరుస్తూవుండి.

కళాశాల తెరచి వారంరోజులైంది పరీక్షలు ముగింపుకు వస్తున్నాయి. ఆరోజుమధ్యాహ్నం పోస్టులోవచ్చిన యీ వుత్తరాలు చూచి వెంకట్రావుతో ఏవిధంగా యీ వ్యవహారం తేల్చుకోవాలా అనుకుంటున్న సుందరరావుకు ఎవరో ఒక మనిషి ఒక ఆహ్వానపత్రిక అందిచ్చి వెళ్ళిపోయాడు.

అది జనార్దనం వివాహసందర్భంలో ఆదివారంసాయంత్రం కళాశాలఉపన్యాసకులందరికీ యివ్వబోతున్న టీపార్టీ ఆహ్వానం. ఉపన్యాసకులకు ప్రత్యేకించబడిన ఆ పార్టీ, కళాశాలలోనే ఒక గదిలో జరపటానికి ప్రిన్సిపాల్ అనుమతియిచ్చినట్లు అప్పటికే తెలిసింది సుందరరావుకు.

వెంకట్రావుఉత్తరమూ, జనార్దనంఆహ్వానమూ రెండూ ఒక్కసారే రావటంలో ఆ రెండింటికున్న సందర్భసామ్యం, విలువా అతనికి బాగా స్ఫురించాయి. తన్నుగురించి అపోహలు కలిగించుకొని, అపవాదులువేసినవైపునుండి తనకు కన్యనిస్తామన్నగౌరవం! తనమీద దోషారోపణచేసి, నాటకసంఘం అధ్యక్షుపదవికి తగడని ఆందోళనచేసినవారివైపునుండి విందుకు రమ్మనే మర్యాద! ఈ సాంఘికగౌరవ, మర్యాదలకు సుహృద్భావంతో అవసరమేమీ లేదు కాబోలు!

సాయంత్రం రమణి వచ్చింది. సెలవుల్లో ఇంటికివెళ్ళి వచ్చినతర్వాత రమణి రావటం అదే మొదటిసారి.

"విశేషాలేమిటి?" అన్నాడు సుందరరావు.

"నాన్న నన్ను చదువుమానెయ్యమన్నాడు." అన్నది.

"అదేమిటి!" అని సుందరరావు ఆశ్చర్యపడ్డాడు.

"డబ్బుకు యిబ్బందిగావుందట. నేనేమో విపరీతంగా ఖర్చుచేస్తానట. నువ్వే చెప్పు బావా, నేనేంఖర్చుచేస్తున్నాను?"

"సినిమాలు, చీరలు—ఒకటేమిటి? బాగానే ఖర్చు చేస్తావు!" అన్నాడు నవ్వుతూ,

"పో బావా! నెలకు రెండుసినిమాలు, అంతేకదా. మిగతావాళ్ళు వారానికి రెండు చూస్తారే, మాటినీలతోసహా."

"సినిమాలమాట సరే, మరి వారాని కెన్నిచీరలు కొంటావో చెప్పు?"

"మహా ఎగతాళి! కొనిపెట్టినవాళ్లైనా చెయ్యరు! కాని, అసలు ఆ విషయంమీదే వచ్చింది గొడవ; చదువు మానెయ్యి, వెళ్ళొద్దు. అన్నాడు.

"వెళ్ళొద్దు అంటే, ఎట్లా వచ్చావు మరి?"

"మళ్ళీ వెళ్ళమన్నాడులే! అసలు నువ్వే చూడు, ఎట్లా వుందో! మొదటిటర్మ్‌లో నాన్న మద్రాసు వెళ్తున్నానని వ్రాస్తే, నాకు ఫలానారంగుల్లో రెండు జార్జెట్‌చీరలు కావాలని వ్రాశాను,—అంతే కదా! అప్పుడు తీసుకురానూలేదు, కొనటానికి డబ్బూ పంపలేదు. అందుకని యిప్పుడు వెళ్ళినప్పుడు అడిగాను. కోపంతెచ్చుకొని "చదువే వద్దు" అన్నాడు."

"కాస్త పొదుపుగావుండాలని అనివుంటాడులే"

"అదికాదు. నేను కాలేజికి వచ్చినతర్వాత ఏమీ కొనందే! ఖచ్చితంగా చెప్పివేశాడు. వచ్చేసంవత్సరం ఇంటరు అయిపోగానే మాన్పించేస్తాడు!"రమణికళ్ళల్లో నీళ్ళుతిరిగాయి.

"పోనీ మా కివ్వవలసిన డబ్బుతోనైనా చదివించమని చెప్పకపోయావా?"

రమణి తలవంచుకొని మాట్లాడలేదు. చేతిరుమాలుతో కళ్ళు తుడుచుకున్నది. తర్వాత అన్నది.

"ఎట్లా మానిపిస్తాడో చూస్తాను. నేను మెడిసన్ చదివే తీరాలి."

"అది ఇంకొకసంవత్సరంతర్వాత వచ్చే సమస్యకదా! ఇప్పట్నుంచీ ఎందుకాలోచిస్తావు?"

"చూడు బావా! చివరకు తల్లిదండ్రీ లేని విమలకూడా మెడిసిన్ చదువుతుందట."

"తల్లి ఎందుకు లేదు?"

"నీ కింకా తెలీదా? సెలవుల్లో ఏదో ఆపరేషన్ చేయించుకుని అకస్మాత్తుగా పోయిందట, పాపం! ఇప్పుడా అమ్మాయి హాస్టల్లోవుంది."

సుందరరావు యీ వార్తవిని కొంతసేపు నిర్వణ్ణుడై ఏమీ మాట్లాడలేదు. మళ్ళీ రమణి అన్నది.

"ఆ అమ్మాయి కెవరూ లేరట. డబ్బుంది; స్వేచ్ఛగా చదువుకుంటుంది."

"నీ కెవరు చెప్పారు?"

"పార్వతి."

"నువ్వామెతో మాట్లాడవే!"

"ఎందుకు మాట్లాడను. బాగానే మాట్లాడుతాను. ఒకటిరెండుసార్లు వార్డెన్ మూలంగా ఏమైనా అనుకున్నప్పటికీ, మళ్ళీ సర్దుకొనిపోతాం. పార్వతే చెప్పింది. అసలు విమల ఎవరి

తోనూ మాట్లాడటంలేదు. ఎప్పుడూ పుస్తకం చేతిలోవట్టుకుని కూర్చుంటుంది. మొత్తానికి క్లాసురావాలని గట్టిప్రయత్నమే చేస్తోంది."

సుందరరావు ఏదో ఆలోచిస్తూ మౌనంగా వుండి పోయాడు.

రమణి అన్నది. "మద్రాసునుంచి విమల తెచ్చు కొన్నది—నాక్కావాలని యిన్నాళ్ళూ కోరుకుంటున్న ఆ రెండు చీరలు. ఎంత బాగున్నాయని! పార్వతి చూపించింది."

"పార్వతి ఎందుకు చూపించింది?"

వాళ్ళు అక్కచెల్లెళ్ళకన్న ఎక్కువగా వుంటారు. దుఃఖంవల్లనేమో పరధ్యానంగావుంటోంది విమల; ఇక ఆమె కన్నీ చూడటం పార్వతే; ప్రిన్సిపాల్ దగ్గరకు వెళ్ళి హాస్టల్‌లో సీటుసంగతికూడా తనే మాట్లాడింది. చివరకు అన్నంతినేటప్పుడు ఆమెకు 'అదివెయ్యి, ఇదివెయ్యి' అని చెప్పడంకూడ యీావిడ గారే!"

"ఒక్కొక్కరు అట్లా కలిసిపోతూవుంటారు."

"ఆ చీరలు ఎంత బాగున్నాయో! బావా, నువ్వు కొనిపెట్టవూ ?"

సుందరరావు నవ్వుతూ "మీ నాన్నకిచ్చినదానికి ఇది వడ్డీ కాబోలు!" అన్నాడు.

"మా నాన్న కేవరిమ్మన్నారు మిమ్మల్ని ?"

"అదీతప్పేనా?" అంటూ సుందరరావు "మంగయ్యా" అని వంటవాణ్ణి పిలిచాడు.

"సార్" అని వచ్చాడు మంగయ్య.

"కొంచెం కాఫీ ఏమైనా ఇస్తావా మరి ?"

ఇందాకే పెట్టాను. తయారైంది. తీసుకొస్తున్నాను"
అని మంగయ్య లోపలికి వెళ్ళాడు.

"ఆ చీరలు ఈపూళ్ళో దొరుకుతాయా మరి?" అన్నాడు
రమణికేసి చూచి సుందరరావు.

తలవూపింది రమణి ఉత్సాహంగా.

"సరే, మంగయ్యతో వెళ్ళి తెచ్చుకో" అని లేచి లోప
లికి వెళ్ళి ఆరు పదిరూపాయలనోట్లు తెచ్చి యిచ్చాడు.

మంగయ్య తెచ్చినకాఫీ తాగి రమణి బజారుకు వెళ్ళింది.

ఒక గంటతర్వాత చీరలతో వాళ్ళు తిరిగివచ్చారు.

రమణి చీరలుతీసి మడతవిప్పి చూపించింది.

వాటివిశిష్టతనుగురించి ఆమె చెప్పినదంతా వింటూ
"బాగున్నా"యని ఒప్పుకున్నాడు సుందరరావు. రమణిసంతో
షం, ఉత్సాహం అతనికి తృప్తినిచ్చాయి.

చీరలు మళ్ళీ మడిచిపెట్టి "ఇవి శారదాంబకంటబడ
నివ్వను." అన్నది.

"ఏం ?"

"ఆవిడ ఎప్పుడూ మంచిచీరలు నావి తీసుకొని కట్టుకొం
టుంది; వీటినిచూస్తే వదిలిపెట్టదు."

"నిజంగానా? ఆ వాడుకేమిటి !" అని ఆశ్చర్యపడ్డాడు.

"ఆవిడఅంటే ఇప్పుడు నాకూ కొంచెం విసుగుపుట్టి
తూంది."

"ఆమె ఊరినుంచి తిరిగివచ్చిందా ?"

"ఆఁ, నిన్న వచ్చింది. రావటమేతడవుగా ఆ జనార్ధనం పెళ్ళివిషయం అడిగింది. నాకేం తెలుసు? అన్నట్టు అతను రేపు లెక్చరర్లందరికీ పార్టీ ఇస్తాడట కదూ. ఇందాక మధ్యాహ్నం శారదాంబను పిలవడానికి స్వయంగా వచ్చాడు. ఈమె వాడంటే ఎందుకో పడిచస్తూవుంది. ఇంతకుపూర్వం అప్పుడప్పుడు వచ్చి మాట్లాడే పరిచయంవుండేది. శుభలేఖ పంపించాడట. కాని తనకు పెళ్ళికి వెళ్ళడానికి వీల్లేకపోయిందే అని విచారమట. అంత విచారమేమిటో నా కర్థంకాదు. మాటి మాటికి వాడిసంగతి, వాని డబ్బుసంగతే చెప్పతుంది విసుగు పుట్టేటట్లు."

"నీ కామెతో ఇంత చనువేమిటి? నీ చదువేదో నువ్వు చూచుకోని, ఆమెతో మామూలుగా అందరివలె వుండక?"

"ఇకనుంచి అట్లానేవుంటాను బావా! సమ్మెలో ఆ జనార్ధనంకూడా ఒక లీడరు కదా! మరి నువ్వు రేపు పార్టీకి వెళతావా ?"

"అదే ఆలోచిస్తున్నాను. వెళ్ళినా వెళ్ళకపోయినా పెద్ద భేదమేమీ ఉండదు. ఈ ఆహ్వానానికి ప్రత్యేకమైన అర్థమేమీ లేదు. బహుశా వెళ్ళనేమొ!"

*　　　　*　　　　*

సోమవారంసాయంత్రం అయిదున్నరకు శారదాంబ జనార్ధనంఇంటికి వెళ్ళింది.

జనార్ధనం మేడమీదగదులు అద్దెకు తీసుకొన్నాడు. వంటకు, స్నానానికి కూడ మేడమీదే సదుపాయాలున్నాయి క్రిందిభాగంలో ఆడపిల్లల హైస్కూలులో పనిచేసేపంతులమ్మ

వుంది. ఆమెభర్త మునిసిపల్ హైస్కూలులో పనిచేస్తున్నాడు పంతులమ్మతో శారదాంబకు పరిచయంవుంది. వాళ్ళకుటుంబం సహకారపద్ధతిమీద నడుస్తూవుంటుంది. ప్రొద్దునవంట భార్య, రాత్రివంట భర్త చేస్తారు. మధ్యాహ్నం హోటల్లో కాఫీ త్రాగుతారు. సాయంత్రం ఫలహారం భార్య చేస్తుంది. ఆమె కొంచెం ఆలస్యంగా ట్యూషన్ చెప్పడానికి వెళ్ళి, ఏడున్నరకుగాని రాదు. భర్తషికారువెళ్ళి ఆరున్నరకు వంట ప్రారంభిస్తాడు. ఆలస్యంగా, ఎనిమిదన్నరతర్వాతే వాళ్ళ రాత్రిభోజనం.

జనార్దనం బాగా డబ్బున్నవాడు. ఎప్పుడూ దర్జాగా వుంటాడు. మొదట్నుంచీ ఆగదుల్లోనే అద్దెకున్నాడు. అందులో ముందువసారా, తర్వాత ఒకటి పడకగది. ఇంకొకటి చదువుకోవటానికి, ఎవరితోనైనా కూర్చొని మాట్లాడడానికి వీలైనగది ఈ రెండుగదులను దాటి, ఒకచిన్నగది. ఇన్నాళ్ళూ అది ఖాళీగావుండేది. ఇప్పుడు దాన్ని వంటగదిగా చేశాడు జనార్దనం. ఆ గదికిఎదురుగా ఒకప్రక్క స్నానాలగది, పైన కప్పేమీలేకుండా వుంది. నీళ్ళు పైకి తీసుకురావటానికి వెనుక భాగంలో వేరే మెట్లుకూడా వున్నవి.

పెళ్ళయి, కళాశాలతెరవగానే భార్యను తీసుకొచ్చి జనార్దనం కాపురంపెట్టాడు.

శారదాంబ వెళ్ళేటప్పటికి జనార్దనంస్నానంచేసి దుస్తులు వేసుకొని తలదువ్వుకుంటున్నాడు.

"రండి, కూర్చోండి !" అని కుర్చీ చూపించాడు.

శారదచూపు పడకటింటివైపు వెళ్ళింది.

"ఆమె ఏదీ ?" అని ప్రశ్నించింది.

"స్నానానికి వెళ్ళబోతూవుంది." అని పడకగదివైపు చేత్తో చూపించాడు.

జనార్దనంభార్య చీర, టవలు తీసుకొని గదిలోనుంచి బయటకు వచ్చింది.

"వీరే నేనుచెప్పిన తెలుగు లెక్చరరుగారు" అని పరిచయంచేశాడు జనార్దనం. కొంచెం సిగ్గుపడుతూ దగ్గరకు వచ్చి "నమస్కారం" అన్నది. చీర, టవలు భుజంమీద వేసుకొని, చేతులు జోడిస్తూ.

"స్నానానికి వెళ్తున్నట్టున్నావు. వెళ్ళిరామ్మా" అన్నది శారద.

ఆమె వెళ్ళితర్వాత జనార్దనంముఖంవైపు కోపంగా చూచింది శారద.

చిరునవ్వుతో అన్నాడు అతను "ఏం, నచ్చలేదా ?"

"అన్నీ అబద్ధాలు !"

"ఏమిటి శారదా ?" అన్నాడు ఆశ్చర్యంగా అర్థం కానట్లు.

"ఆమె బాగుండదని ఎందుకు చెప్పావ్ ?"

"నీకు నచ్చిందా ? పోనీ, కనీసం అదొకతృప్తి ! ఆమెలో నాకు కనిపించే ఆకర్షణేమీలేదు. నన్నడిగితే అనాకారి కాదు అనవచ్చు...ఏం జేస్తాం చెప్పు. మా నాన్న ఆస్తిఅంతా స్వార్జితంకావడంతో వచ్చినచిక్కు ! మళ్ళీ ఆసంగతి తవ్వడమెందుకులే ఇప్పుడు?" అని ఒక నిట్టూర్పు వదిలాడు.

శారద ఏమీ మాట్లాడలేదు. ఆమె తన హాండ్ బాగ్ తెరచి, అందులోనుండి ఒక తాళంచెవి తీసి, జనార్దనానికి ఇవ్వబోయింది.

దాన్ని చూచి అతను "ఇదేమిటి?" అన్నాడు.

ఆమెకళ్ళల్లో దుఃఖం తొంగిచూచింది.

"నీ యింటితాళంచెవి యింకా నాకెందుకు? ఇది ఆమెకివ్వు" అన్నది.

రెండునీటిబొట్లు కళ్ళనుండి జారి, పవుడరుఅద్దుకొన్న చెక్కిళ్ళపై చారలు కట్టాయి. చేతిరుమాలుతో తుడుచుకొని సర్దుకొంది.

"ఎన్నిసార్లు చెప్పినా యింతే! మనల్ని ఎవరూ వేరు చెయ్యలేరు. శారదా! నువ్వు ఎంతో చిక్కిపోయావు." జనార్దనం ఆమెచెయ్యి పట్టుకొని ఒత్తి తాళంచెవి తీసుకొని "నీదగ్గరే వుంచరాదూ, మన అనుబంధానికి గుర్తుగా !" అన్నాడు.

"ఇదిగో, ఇది తీసుకో గుర్తుగా!" అని శారద తను తెచ్చిన అట్టపెట్టె అతనికిచ్చింది.

దాన్ని తెరచి చూచాడు. అందులో ఒక 'స్టవ్' వుంది.

"ఈ ప్రెజెంట్‌కు అర్థమేమిటి?" అని అడిగాడు.

"అది నా హృదయజ్వాలని గుర్తుకుతెస్తుంది."

దాన్ని పరీక్షిస్తున్నట్టు తల బాగా క్రిందికివంచుకొని వస్తున్ననవ్వు ఆపుకొని, "మరి యిప్పుడు ప్రశాంతంగానే వుందే" అన్నాడు.

"నువ్వు వెలిగిస్తే వెలుగుతుంది" అన్నది.

జనార్దనం స్టవ్ మళ్ళీ పెట్టెలో పెట్టి, దాన్ని టేబుల్ మీద ఉంచాడు.

"నీ ఆరోగ్యం ఎట్లావుంది?" అన్నాడు.

"చాల నీరసంగావుంది. ఇంక రెండుమూడు నెలలైతే కాని మామూలు ఆరోగ్యం రాదు."

"విశ్రాంతిగా టానిక్కులు తీసుకో; కొన్నాళ్ళు నీ అపోహాలు అవీ మరచిపో. నా ప్లాన్ ఏమిటో తెలుసా? పరీక్షలవగానే మద్రాసు వెళ్ళడం. తర్వాత బి. యల్. చదవడం. నువ్వూ మద్రాసులో ఏదైనా కాలేజీలో చేరితే బాగుంటుంది."

"నేను ఆ విషయమే ఆలోచించాను. ఉద్యోగం దొరుకుతుందనుకుంటాను. మరి యీమె? మద్రాసు వస్తుందా?"

"వస్తే వస్తుంది, లేకపోతే లేదు...ఆ విషయమేమీ అభ్యంతరంవుండదు. యీ వూళ్ళో వుండేంతవరకు మాత్రం కొంత ఎడబాటు తప్పదు. నీఆరోగ్యానికి అది ముఖ్యంకూడా."

జనార్దనంభార్య స్నానంముగించి వచ్చింది.

ఆమెకు స్టవ్ చూపించి "వీరు మనకు పెళ్ళిబహుమతి తెచ్చారు." అన్నాడు. ఆమె దాన్ని తీసిచూస్తూ "బాగుంది; ఉపయోగంగా కూడా వుంటుంది. పొయ్యితో పడలేకుండా వున్నాను. మంచి ప్రెజెంట్" అన్నది శారదతో.

"నీ పేరు సరస్వతి కదమ్మాయ్! మన యిద్దరిపేర్లూ ఒకటే. నా పేరు శారద" అన్నది శారదాంబ.

"నువ్వు వెలిగిస్తే యీ స్టవ్ వెలగదేమో" అన్నాడు భార్యతో జనార్దనం.

ఆమె అతనివైపు చురుగ్గాచూస్తూ "నేనెప్పుడూ స్టవ్ లు చూడలేదనుకున్నారు కాబోలు! వెలిగించడం నాకు బాగానే చేతనవు." అన్నది.

"నువ్వేంచదువుకున్నావమ్మాయ్?" అని ప్రశ్నించింది శారద.

"ఎస్సెస్సెల్సీపాసై, కాలేజీలో చేరాను. చేరిన పది రోజులకు జ్వరంవచ్చి ఒకనెల వెళ్ళలేదు. తర్వాత మానిపించే శారు పెళ్ళిచెయ్యాలని."

"మీరిద్దరూ మాట్లాడుతూవుండండి; కాఫీసంగతి కనుక్కుంటాను" అన్నాడు జనార్దనం.

"నేను తీసుకొస్తానులెండి. ఫిల్టరులో డికాక్షన్ తయారై వుంటుంది యీపాటికి." అన్నది సరస్వతి.

"వద్దు...వారితో మాట్లాడు, ఆమె నీతో మాట్లాడాలని వస్తే!" అని లోపలికి వెళ్ళాడు.

"బి.ఏ.తర్వాత జనార్దనం లా చదువుతాడట; నువ్వూ కూడా మళ్ళీ కాలేజీలో చేరుతావా?"అని ప్రశ్నించింది శారద.

"అట్లా అనుకోవటంలేదు. మా నాన్నగారికి బిజినెస్ వుంది; ఆ బిజినెస్ లో ప్రవేశించేటట్లే ఏర్పాటుచేసుకొన్నారు" అన్నది శాస్త్ర ఆశ్చర్యంగా.

జనార్దనం కాఫీ పాట్ లోపోసుకొని తెచ్చాడు. కప్పులు తీసుకురావడానికి సరస్వతి లేచివెళ్ళింది.

"నాతో మళ్ళీ అబద్ధాలే! నువ్వు బిజినెస్ లో ప్రవేశించాలనుకొంటున్నావట కదూ?"

"అవును, లా తర్వాత. సరస్వతి చెప్పిందా ? నీ కన్నీ అనుమానాలే !"

సరస్వతి తిరిగివచ్చినతర్వాత కాఫీతీసుకుంటూ శారద మళ్ళీ ఆ విషయమై సరస్వతితో "లా చదివినతర్వాత బిజినెస్ అట, ఇందాక అడిగాను మీఆయన్ను" అన్నది...

"లా చదివితే బిజినెస్‌కు కొంత వుపయోగపడుతుం దన్న మీ అభిప్రాయం ఒప్పుకోతగ్గదే ! ఇంకా మూడు నెలల మాట కదా; ముందు బి. ఏ. కానివ్వండి." అని తీక్షణంగా చూశాడు శారద వైపు.

శారద మాట్లాడ లేదు.

కాఫీకాగానే "మేం సినిమాకు వెళ్ళాలనుకున్నాము. మీరూ వస్తారా ?" అన్నాడు జనార్దనం లేచి.

"లేదు...మీరు వెళ్ళండి" అన్నది శారదకూడ లేచి వసారాలో అడుగుపెట్టుతూ. సరస్వతి పడకగదిలోకి వెళ్ళింది.

జనార్దనం వసారాలోకి వచ్చినతర్వాత "శారదా, ఏమిటి నీ ధోరణి ?" అన్నాడు.

"కోపంవచ్చిందా" అన్నది ప్రాధేయపడుతూ, ప్రియంగా శారద.

"నువ్విట్లా చేస్తే చిక్కువస్తుంది ! లాభంలేదు. నాలో నమ్మకంలేకపోతే ఎట్లా ?"

"ఇదివరకే నమ్మాను; ఇంకా నమ్ముతాను" అన్నది శారద.

సినిమాకు వెళ్ళడానికి తయారై సరస్వతి వచ్చింది.

* * *

వెంకట్రావు రీడింగ్ రూములో కూర్చుని పేపరు చదువుతున్నాడు. సుందరరావు ఆయనదగ్గరకు వెళ్ళి "మీరు దయచేసి ఇటొకసారి వస్తారా? మీతో మాట్లాడాలి" అన్నాడు.

"తప్పకుండా" అని పేపరు వెంటనే టేబిల్ మీద పడవేసి ఆత్రంగా సుందరరావుతో వరాండాలోకి వచ్చాడు వెంకట్రావు.

"మీరు మా నాన్నకొక ఉత్తరం వ్రాశారట, అది నాకు పంపించారు. దానిసంగతి నన్ను నిర్ణయించుకోమన్నారు. నన్ను గూర్చి మీరు ఆలోచించనవసరం లేదు. మీ అమ్మాయికి ఏదైనా సంబంధం కుదర్చండి!" అని చరచరా వెళ్ళిపోయాడు సుందరరావు.

ఏదో చెప్పబోయి, వీలు లేక అతనివైపు చూస్తూ నిలుచున్నాడు వేంకట్రావు.

*　　　*　　　*

ఫిజిక్సురికార్డు తీసుకోవటానికి వచ్చిన విమలతో "విమలా; మీ అమ్మగారు పోయారని విని విచారించాను" అన్నాడు సుందరరావు.

నాటకంరోజు తర్వాత తనతో మాట్లాడనేలేదు; సుందరరావు లేచి తనకుదగ్గరగా వచ్చి మాట్లాడినందుకు కొంత విస్మయంచెంది, "అవును" అని చేతిలోని నోటుబుక్కువైపు చూస్తూ పూరుకున్నది విమల.

ఆమెముఖంలో విషాదగాంభీర్యం చూచిన సుందరరావుకు తర్వాత ఏమనాలో తెలీలేదు.

"వచ్చేఏడు మెడిసిన్ చదువుతావట కదూ?"

"ఎవరు చెప్పారు?"

"పార్వతి రమణితో అన్నదట"

కొన్నిక్షణాలు ఆలోచించి "లేదు, నేనేమీ నిశ్చయించుకోలేదు" అన్నది చిరునవ్వుతో విమల.

పార్వతి రమణిగర్వం తగ్గించటానికి, ఆమెఅభిప్రాయలకు తగినట్టు తను మెడిసిన్‌కు వెళ్తుందని గొప్పలు చెప్పివుంటుందని అర్థమైంది విమలకు.

## 24

మెరీనాబీచిలో దూరంగా వెళ్ళి, జనంలేనిచోట, అలలకు దగ్గరగా కూర్చున్నాడు వేదమూర్తి.

వారంరోజుల్లో ట్యూటోరియల్ కాలేజిలో ఉద్యోగం పూర్తిఅవుతుంది. మార్చి మొదటివారంనుండి జూన్ ఆఖరు వరకు ఎక్కడా ఉద్యోగందొరికే సూచనలు కనిపించటం లేదు. ఏ కాలేజిలోనైనా జూలై నెలలోనే క్రొత్త లెక్చెరర్లను నియమిస్తారు.

డబ్బు మార్చినెలఆఖరువరకే సరిపోతుంది. ఏప్రిల్, మేనెలలసంగతేమీ తోచటంలేదు.

విమలపంపిన యాభైరూపాయలచెక్కు వుంది. దాన్ని మార్చదలచుకోలేదు. ఆ చెక్కును చూడగానే అతనికి కోపం వచ్చింది.

దానిఅంతరార్థంకూడ రాను రాను తెలిసివస్తోంది స్పష్టంగానే. 'ఎప్పటికైనా పెళ్ళిచేసుకుంటే మిమ్మల్నే చేసుకుంటాను, అన్న ఆమెమాట, అప్పటి శోకవిధమైన మన

శ్శాంతి, తృప్తి కలిగించినా, అది ఎండమావి తప్ప ఇంకేమీ కాదని క్రమంగా తెలిసివస్తూవుంది. ఆమె తల్లిపోయిందన్న దుఃఖంలో ఒకనిర్ణయానికి రాలేకపోవటం సహజమే. తను ఆ పరిస్థితుల్లో వివాహప్రసక్తి తేవటంకూడా బాగులేదు!

తర్వాత విమలవ్రాసిన రెండుఉత్తరాలధోరణి, రెండవ ఉత్తరంతో బాటు వచ్చిన చెక్కు, ఇదివరకు మరుగుపడిన సత్యాన్ని తేటతెల్లంచేశాయి. ఇంకా రెండుమూడేళ్ళు చదువుకోవాలనేది పెద్ద ఆటంకంకాదు పెళ్ళికి. పెళ్ళిచేసుకుని కూడా చదువుకోవచ్చు అని, తను వ్రాసిన రెండవఉత్తరంలో మళ్ళీ వాదించాడు. దానికి ప్రత్యుత్తరం తనడబ్బు తనకు చెక్కు రూపంలో పంపటం! చనువైపోయేదాకా అసలీ ప్రసక్తి తీసుకురావద్దని కచ్చితంగా చెప్పటం.

చెక్కుకు, ఉత్తరంలోమాటకు వున్న సూక్ష్మసంబంధం విమల తనకిచ్చిన వాగ్దానంవిలువను చక్కగా కొలిచిచూపించింది. అంతేకాదు, ఆరోజు జరిగిన వాగ్వాదంలో విమలవైఖరి కూడా ఇప్పుడే సరిగా అర్థమౌతూవుంది.

ఆలోచన ఒక్కసారి ఎంతగ్రుడ్డిగావుంటుందో, విచిత్రమైన సంగతే! ఆరోజు ఆమెను తనగదికి తీసుకొనివచ్చినందుకు కారణం ఆమెకు పినతండ్రిమీద కలిగిన అనుమానం; పినతండ్రి ఆమెడబ్బు నాశించాడు. అంత అనుమానం మనస్సులో వేధిస్తున్నవ్యక్తి తననుమాత్రం నమ్మి ఎట్లా పెళ్ళిచేసుకుంటుంది? తనుకూడా ఆమెడబ్బుకోసమే ప్రయత్నిస్తున్నట్లు తప్పకుండా అనుమానిస్తుంది. ఆమెతల్లి చనిపోతూ పెళ్ళిని గూర్చి ప్రత్యేకంగా ఏదో చెప్పిందని, తను డబ్బుకోసమే

అబద్ధంఆడినట్లుకూడా అనుకొనివుంటుంది! ఆమెభావాలు ఈవిధంగావున్నట్లు తనకు చూచాయగా కూడా తెలీలేదు ఆక్షణంలో! తల్లి పెళ్ళికి సమ్మతించిందన్నవిషయాన్ని విమల నమ్మనట్లే వ్యక్తంచేసింది; కాని అదంతా తన ఉద్రిక్తభావాల మీాద ఆమెకుకలిగిన అపనమ్మకమనుకున్నాడు; ఆమె డబ్బు విషయమై అనుమానిస్తున్నట్లు తెలుసుకోలేకపోయాడు.

ఇప్పుడు తెలుస్తూవుంది. డబ్బువిషయమైన అనుమానం అట్లా విమలకు కలగటం సహజమే! ఆమెతండ్రి ఏంచేశాడు? పినతండ్రి ఎల్లా ప్రవర్తించాడు? వాళ్ళిద్దరితర్వాత మూడో వ్యక్తి అయిన తనమీాద మాత్రం ఉన్నట్లుండి ఆమెకు నమ్మకం ఏవిధంగా కుదురుతుంది? ఎంతటి స్నేహభావం ఏర్పడినప్పటికి, తనకు డబ్బేమిా లేనివిషయం ఆమె మరచిపోలేకపోయింది.

ఒక్క వారంరోజులు కలసిమెలసిఉండటంతో, ఆమె పూర్తిగా తనకు అవగాహన అయిపోయి శాశ్వతమైన ప్రేమానుబంధం ఏర్పడిందనుకొన్నాడు; దానికితోడు తనకు వచ్చిన కలలు, ఆ కలలే నిజమైనట్లు విమల తలవనితలంపుగా తనమీాద ఆధారపడి ఆరోజున తనగదికి వచ్చి వుండటం, అంతా తన కొక పెద్ద భ్రమకలిగించాయి. ఎవరుమాత్రం ఆ భ్రమనుండి, ఆ పరిస్థితుల్లో తప్పించుకోగలరు?

అసలు విమల మద్రాసురావటం, యీా బీచీదగ్గరే తనకు కనబడటం, యిద్దరూ ఒక్క వారంరోజులు అరమరికలేని స్నేహంతో కలిసిపోవటం, యీా సముద్రుడి ఎదుటే వివాహం చేసుకోమని ఆమెనుకోరటం, ఆమె తనలో ఆశకల్పించటం, అంతా విచిత్రమైన విధివిలాసం! సముద్రవిలాసం కూడా!

ఆనెతల్లి చనిపోకపోయినట్లయితే, లేక చనిపోతూ విమలతో గూడా తనతో చెప్పినమాటలే చెప్పినట్లయితే కథ సుఖాంతంగా వుండేది. కాని విధి అక్కడే చిరునవ్వునవ్వి, కొంటెగా కథను విషాదాంతంగా మార్చివేసింది! తర్వాత చాల నెమ్మదిగా ఆ విషాదసత్యాన్ని తేటతెల్లం చేస్తూ వుందిప్పుడు.

తెల్లనినురగ తన్ను చూచి వెక్కిరిస్తూవున్న సముద్రుని నవ్వులా వుంది.

ఆ వూహ నిజమేనన్నట్లు, సముద్రుడు పెద్ద తరంగంతో వేదమూర్తికి దగ్గరగా వచ్చి చాచివున్న అతనిపాదాల్ని చీలమండలందాకా తడిపివేశాడు. వేసుకున్న 'కాబూలీశాండల్స్' తడిసి పాడయ్యాయి. వాటిని విప్పి ప్రక్కన పెట్టి, దుర్మార్గునికి దూరంగావుండాలన్న ఊహతో, కొంచెం వెనక్కిజరిగి కూర్చున్నాడు వేదమూర్తి.

సముద్రం తన్ను వెక్కిరిస్తోంది, 'కాళ్ళుపట్టుకొని లాగుతోంది, ఇంగ్లీషునుడికారం ప్రకారం. సముద్రానికీ, విధికీ సంబంధించిన అంతరార్థం, రహస్యం ఏదో గుప్పిట్లోకి తెచ్చుకోవాలని ప్రయత్నిస్తున్న తనకు, చేతిలో ఏమీ మిగులకుండా అదంతా వ్రేళ్ళసందుల్లో జారిపోతూవుంది.

తనజీవితం అంతుపట్టటంలేదు ఎంత ఊహించినా. తండ్రి మరణం, కాలేజి సమ్మె, విమలనిరాకరణ—ఈ మూడింటిలో తన ఆలోచన, ఊహ ఒకటి, ఫలిత మింకొకటి అయిపోయింది!

తనకు మిగిలింది స్వేచ్ఛ అని తృప్తిపడాలి. కాని ఆ స్వేచ్ఛకూడా ఆర్థికపరిస్థితిమీద ఆధారపడిందేనని యిప్పుడు

తెలిసివస్తూవుంది. ఇంకొక నెల తర్వాత మద్రాసులో వుండ టానికి వీలులేదు; ఉద్యోగ మేదో వుంటే తప్ప యీ స్వేచ్ఛకు అర్థంవుండదు. వ్యక్తిగతమైనస్వేచ్ఛ ఆర్థికస్వేచ్ఛ మాత్రమేనా!

జీవితంలో ప్రతిసమస్యను ఎంతో కొంతడబ్బువిషయ మైనసంబంధం వుంటుంది. ఆర్థికదృక్పథంలేనిసమస్య లేనే లేదేమో! చివరకు మనుష్యుల వ్యక్తిత్వాలుకూడ ఆర్థికపరిస్థితి వాతావరణంవల్ల రూపొందుతాయి. సంఘంలో వర్గాలు, వ్యవస్థలే అట్లా రూపొంకుతాయి కదా!

తల్లిదండ్రులు తెచ్చిన వివాహసమస్య అచ్చంగా ఆర్థికసమస్య; కాలేజిసమ్మెలో తన ఉద్యోగానికి రాజీనామా యివ్వటమనేదీ ఆర్థికసమస్యే. కాని యీ రెండింటిలో డబ్బు వ్యక్తిగతంగా తనమీద వత్తిడిచూపలేదు. అందువల్ల సులభం గానే ఆ సమస్యల్ని తేల్చుకున్నాడు. తన వివాహవిషయంలో బాధపడినవాడు తండ్రి; ఉద్యోగంపోయినవిషయంలో బాధ పడవలసింది తనే అయినా, మళ్ళీ ఉద్యోగం దొరికింది కాబట్టి, ఇంకా బాధపడలేదు; ఇకమీద పడవలసివస్తుందేమో! ఏప్రిల్, మే నెలల్లో దానిఫలితం అనుభవిస్తాడు. మూడవ విషయం విమలనిరాకరణ; ఇదీ ఆర్థికసమస్యే. తనకు డబ్బు లేదు; ఆమెకు వుంది; ఆ పరిస్థితి ఆమెకు అనుమానం కలిగిస్తోంది. డబ్బుజోక్యం, దానివత్తిడి మూడోవిషయంలో తను పూర్తిగా అనుభవించాడు.

తను విమలవ్యక్తిత్వంవిషయంలో సత్యాన్ని గ్రహించ లేకపోవటానికి కారణం, జీవితంమీద ఆర్థికప్రభావాన్ని గుర్తింప లేకపోవటమే! కార్ల్‌మార్క్సుసిద్ధాంతాలమీద, అతను ఆర్థిక

శక్తికి ప్రపంచచరిత్రలో ఇచ్చే ప్రాధాన్యంమీద, తన కింతవరకు గౌరవము, నమ్మకమూ లేదు. సామ్యవాదాన్ని గురించి ఇదివరకే కొంతవరకు తెలుసుకున్నా, ఆ విజ్ఞానాన్ని పక్కకు త్రోసిపుచ్చాడు. ఇప్పుడిప్పుడే తెలుస్తున్నది ఆర్థికశక్తినిగురించిన సిద్ధాంతంలోని సత్యం.

విమల తనకు చెక్కు పంపి, డబ్బు తిరిగి ఇచ్చివెయ్యటం, ఎట్లా బాధకలిగించి; ఆమెమన స్తత్వాన్ని తనకు అవగాహన వచ్చిందో అట్లే రామచంద్రయ్య తనకివ్వవలసిన వంద రూపాయలు ఇంకా పంపకపోవటం కూడా బాధకలిగిస్తోంది. రెండుమూడు ఉత్తరాలు వ్రాస్తే, రామచంద్రయ్య, తప్పకుండా ఒకటో తారీఖున జీతమందగానే పంపిస్తానన్నవాడు, రెండు నెలలు దాటినా పంపలేదు. ఈ అనుభవంతో, తన కిదివరకు కనిపించనిసత్యం—అతనిస్నేహాన్ని గురించి—చప్పున గోచర మైంది! 'తమ్ముడూ!' అంటూ చనవుగావుండి, తనసమస్యల్ని గురించి ధారాళంగా, దీర్ఘంగా చర్చించే రామచంద్రయ్య తనవద్ద చేబదుళ్ళు తీసుకునే అవకాశంకోసమే తనపరిచయాన్ని కోరాడన్న మాట.

తనుమాత్రం ఆవిధంగానే ప్రవర్తించటంలేదా? సుందరరావుకు తను వ్రాసినవుత్తరంస్నేహంకోసం కాదు. ఖూా డబ్బుకోసమే! రామచంద్రయ్యను అడగమని! 'అడిగితే పది రోజుల్లో తనే పంపిస్తానన్నాడం''టూ సుందరరావువద్దనుండి జవాబువచ్చింది. తర్వాత తనూ వ్రాయలేదు, అతనూ వ్రాయలేదు. సుందరరావు ఒక వింతవ్యక్తి. స్నేహాన్ని కోరి తపించే గుణం అతనిలోలేదు. ఇతరులు అతనిమీద ఆధార

పడవచ్చు కాని, అతను ఎవళ్ళమీద ఆధారపడడు. అందువల్లే ఆతనితో స్నేహంలో తనకు ఏ ఆకర్షణా లేదు.

ఇన్నాళ్ళుగా నిర్లక్ష్యంచేసి, వ్యక్తిత్వంతో సంబంధం లేదనుకొన్న 'ఆర్థికశక్తి' విషయ మింక ఆలోచించాలి!

నిరుపేదలు, మధ్యతరగతివాళ్ళు, సంపన్నులు, వ్యాపారులు—ఈ వర్గవిభేదాలు, వర్గాలకు చెందిన ఆ మనుష్యుల వ్యక్తిత్వాలు ఆర్థికశక్తివల్లే రూపొందుతాయి. ఆర్థికపరిస్థితి వ్యక్తిత్వాన్ని పోతపోసి, రూపంకల్పించేదిమ్మో. దాన్ని తెలుసు కోకపోతే జీవితాన్ని తెలుసుకోవటం కష్టమే!

విధి, సముద్రం—ఇవి తనఅజ్ఞానానికి, ఆలోచనా శూన్యతకు రమణీయమైన నామధేయాలు. విధివిలాసం, 'సముద్రం వెక్కిరింపు' కవిత్వమౌతుంది; కాని యథార్థాన్ని అర్థంచేసుకుని, జీవితాన్ని జయించటం కానేరదు.

'ఆర్థికప్రభావం' అనే ప్రధానవిషయాన్ని వదిలిపెట్టి నందుకే ఇంతవరకు ఆలోచనలో పొరపాట్లు కలిగాయి; తన బ్రతుకు అంతుపట్టటం లేదు. సంఘంలో ఆర్థికవిప్లవం వస్తేకాని మానవుని వ్యక్తిత్వపువిలువ తెలీదు.

వేదమూర్తి తనవైపెవరో నడచివస్తూవుండటం గమ నించాడు. కొంత దగ్గరకు రాగానే అతను ఇదివరకు కాలేజిలో పరిచయుడైన 'సుకుమారన్' అనే మళయాళీ యువకుడని తెలిసింది.

వేదమూర్తి లేచి అతనివైపు వెళ్ళాడు. సుకుమారన్ వేదమూర్తిని గుర్తించి "హల్లో! మిస్టర్ మూర్తి!" అంటూ చెయిచాచి ముందుకు వచ్చాడు.

"ఏం చేస్తున్నావ్ మద్రాసులో ?" అని సుకుమారన్ ప్రశ్నించాడు. వేదమూర్తి తనసంగతి చెప్పగా, సుకుమారన్ తను యూనివర్సిటీలోనే రిసెర్చిచేస్తున్నట్లు చెప్పాడు. ఎకనామిక్స్ ఆనర్సు తర్వాత రిసెర్చివిద్యార్థిగా చేరాడు. వేదమూర్తి తరచు యూనివర్సిటీలైబ్రరీకి వెళ్ళినా సుకుమారన్‌ని కలుసుకోలేదని ఆశ్చర్యపడ్డాడు. ప్రొద్దునపూటతప్ప తను లైబ్రరీకి వెళ్ళనని చెప్పాడు సుకుమారన్. వేదమూర్తి మధ్యాహ్నం మాత్రమే వెళతాడు.

"రెండు నెలలక్రితం నువ్వూ, ఇంకెవరో అమ్మాయి, ఒక షాపులోకి వెళుతూండటం చూశాను. నేను వెళుతున్న బస్సు మౌంట్‌రోడ్‌స్టాప్‌దగ్గర ఆగివుంది. మాట్లాడేఅవకాశం లేకపోయింది. నీకు పెళ్ళయిందాఏమిటి?" అన్నాడు సుకుమారన్.

"లేదు." విమల తన విద్యార్థి అనీ, ఆమె మద్రాసుకు సొంతపనిమీాదవచ్చి, వెళ్ళిపోయిందనీ వివరించాడు వేదమూర్తి.

"అదృష్టవంతుడివి ! అంత అందమైన అమ్మాయిని స్టూడెంటుగా కలిగివున్నందుకు అభినందిస్తున్నాను" అన్నాడు సుకుమారన్.

వేదమూర్తి విషయం మార్చాడు. సుకుమారన్‌మీాద అతనికి క్రొత్తగా ఆసక్తికూడ కలిగింది. అందుకుకారణం అతను ఆనర్సులో వున్నప్పుడు కమ్యూనిస్టుగా వుండేవాడు. అతనితో ఆర్థికసిద్ధాంతాలనుగురించి మాట్లాడాలని తోచింది.

"నువింకా మార్క్సిస్ట్‌వేనా?" అన్నాడు వేదమూర్తి.

"ఆ, నువ్వు నాతో పెద్దగా వాదించేవాడివి జ్ఞాపకం వుందా? ఇప్పుడేమైనా మార్పువచ్చిందా నీ అభిప్రాయాల్లో?"

"మళ్ళీ ఇప్పుడు నీతో వాదిస్తే వస్తుందేమో!" అన్నాడు నవ్వుతూ వేదమూర్తి.

అది స్నేహపూర్వకమైనపొగడ్త అనుకొని సుకుమారన్ వేదమూర్తి రెండుభుజాలు గట్టిగాపట్టుకొని ఆప్యాయంగా ఊపుతూ "నిన్ను కలుసుకున్నందుకు సంతోషంగావుంది మూర్తీ" అన్నాడు.

ఇద్దరూ మెరీనా కాంటీన్ వైపు నడిచారు.

"ఐస్ క్రీమ్‌తో మనకలయిక సెలిబ్రేట్ చేద్దాం!" అన్నాడు సుకుమారన్.

వేదమూర్తి అతనితో కాంటీన్‌లో ప్రవేశిస్తూ, డబ్బువిషయంలో ఇకనుంచీ పొదుపు అవసరం అనుకున్నాడు.

*　　*　　*

విమల హాస్టల్లో తనగదిలోకూర్చుని చదువుకొంటూ వుంది. యూనివర్సిటీపరీక్షలు పదిహేనురోజులున్నాయి.

ఉత్తరాలు తీసుకుని పోస్టుమన్ వచ్చాడు.

వేదమూర్తినుండి వచ్చిందేమో అనుకున్న ఉత్తరం తీస్తా చూస్తే విమలపిన్ని వ్రాసినది. తను మద్రాసునుండి రాగానే వ్రాసిన ఉత్తరానికి రెండునెలలతర్వాత ఇప్పుడూ జవాబు.

విమలకు మనస్థిమితం ఏర్పడి, అపోహాలేమైనావుంటే పోవాలని ఇంతవరకు జాబు వ్రాయలేదట; పరీక్షలుకాగానే యథాప్రకారంగా వేసవికి విమల ఇంటికి వస్తుందని ఎదురు చూస్తూన్నట్లు వ్రాసింది పినతల్లి.

ఉత్తరంవిషయం విమల ఆలోచిస్తూ వుండగానే పార్వతి కాలేజీనుంచి వచ్చింది.

రాగానే చేతిలోని పుస్తకాలు టేబిల్‌మీద గిరాటు పెట్టి, గబగబవచ్చి విమలప్రక్కనకూర్చుంది. ఏదో చెప్పబోయి అంతలో విమలచేతిలోని ఉత్తరం చూచి,

"వచ్చిందా నువ్వు రోజూ ఎదురుచూచే వుత్తరం? ఏమి వ్రాశాడేమిటి? ఎందుకంటాడు ఇంత ఆలస్యం? ఏమి టూ ఉపేటు?" అన్నది.

"అది కాదులేవే! మా పిన్ని వ్రాసింది."

"మీ పిన్నీ! ఏమని? కూతురుమీద మరచిపోయిన ప్రేమ జ్ఞాపకంవచ్చిందటనా?"

"ఏమీ లేదు. పాపం! నాకు మనసు కుదుటబడాలని ఊరుకున్నారట; పరీక్షలవగానే నన్ను రమ్మని వ్రాసింది."

"వెళ్తావా?"

"ఎట్లా వెళ్తానూ? వాళ్ళనుకునే మనస్థిమితం నాకేమీ కలగలేదుకదా! నా చదువు పూర్తయ్యేవరకు నాకెవరితోనూ ఏవిధమైనసంబంధం వద్దని నిర్ణయించుకున్నాను గదా!"

"మరి నాతో సంబంధంపెట్టుకున్నావే!"

"వద్దంటే, నీతోనూ అక్కరలేదు."

"గట్టిదానివేలే! అయినా నామాట విను. నీ నిర్ణయం కొంత తెలివితక్కువగానే వుందని చెప్పాలి! నీకు మద్రాసు నుండి ఉత్తరం ఎందుకురాలేదు ఇరవై రోజుల్నించీ, అని నాకూ అనుమానంగానే వుంది. నే నప్పుడే అన్నానుకూడా—నువ్వు అంత కచ్చితంగా మూడు మాటల్లో జవాబు వ్రాస్తున్నావు

ఆయన వ్రాసిన మూడు పేజీల ఉత్తరానికి, ఏమనుకుంటాడో అని! తప్పకుండా కోపం వచ్చివుంటుంది! పైగా దాంతో చెక్కు కూడా పంపావు. ఏమంటే, ఆయనకు డబ్బు ఇబ్బంది వుంటుందన్నావు. నీ ఊహ బాగానే వుంది కాని, నీకు చీరలకోసం యిచ్చిన డబ్బు, అప్పుడే వాపసు చెయ్యాల్సింది; పోనీ చెయ్యనిదానివి ఇంత జరిగిన తర్వాత ఇప్పుడు చెయ్యడమేమిటి? చెయ్యకూడదు. ఇప్పుడు చెయ్యటంవల్ల ఏదో తెంచుకుంటున్నట్లే అర్థం వస్తుంది కదా!"

"నీ దంతా చాదస్తం. ఎందుకు వస్తుంది? నాకు చీరలు కొని పెట్టటానికి ఇంకా పెళ్ళి చేసుకోలేదుగా! అదీగాక నాకు ప్రెజెంటు అంటూ ఇవ్వలేదే! ఏదో కొట్టువాడి పొరపాటువల్ల అట్లా జరిగింది. ఆ డబ్బు తిరిగి యిచ్చేస్తే తప్పేమిటి?"

"తప్పేమీ లేదు! ముందే ఎందుకివ్వలేదు? అనేదే ప్రశ్న. తర్వాత పెళ్ళిమాటలు వచ్చాయి. ప్రస్తుతం ఎటూ నిర్ణయం కాకుండా నిలిపివుంచిన స్నేహం, ప్రేమవిషయంలో నువ్వు చేసినదానికి అర్థమేమిటి? అందులో అతను నీ నిర్ణయాన్ని మార్చుకోమని ప్రాధేయపడుతూ వ్రాసిన ఉత్తరానికి జవాబుగా యీ పని చేశావ్ కదా! ఆలోచించు?"

"నే నంతదూర మాలోచించలేదు! కాని ఒకసారి చెప్పినతర్వాత కూడా ఆగకుండా ప్రతిఉత్తరంలో ఆ విష యాన్ని గురించే వ్రాయటమెందుకు ?"

"ప్రేమించే మగవాళ్ళు అట్లానే చేస్తారనుకుంటాను! మనం చదివిన ఏ నవలలో మాత్రం ఒక్కసారి 'నో' అని చెప్ప గానే, తనమీద ప్రేమవుందని గట్టిగా తెలుసుకొన్న యువ

కుడు మళ్ళీ మళ్ళీ ప్రాధేయపడకుండా ఊరుకున్నాడు? అది సహజం. అంతే కాదు, నీవొక్కదానివి తప్ప, అది ఆడవాళ్ళందరు 'ఎక్స్‌పెక్ట్' చేసేసంగతి కూడా!"

"మహా తెలిసినట్లు చెప్పుతున్నావ్! ఆ పరిస్థితులు వేరు; నా పరిస్థితి వేరు. ఆ విషయం అట్లావుంచు కాని, ఆ తెలుగునవలసంగ తేంచేశావు? అది ఒక్కసారైనా పూర్తిగా చదవకుండా పరీక్ష ఎట్లా వ్రాయను, నోట్సుమీద ఆధారపడి? ఏం, లైబ్రరీలో కాపీ దొరకలేదా?"

"ఆఁ! అదే, ఆవిషయమే చెప్పాలని పరుగెత్తుకొచ్చి, నీ ఉత్తరాలగొడవలోపడిపోయాను. ఆ నావెల్ కోసం పోతే, ఇంకో, 'నావెల్ రోమాన్సు' ప్రత్యక్షమైంది." అని పార్వతి నవ్వి, అరచేత్తో నొసటిమీద చిన్నగాకొట్టుకొని అన్నది.

"అయ్యో అదృష్టమా! పాపం, నాకంటనేపడాలా?... బాగుంది; ఇద్దరూ ఇద్దరే! దేవుడుకూడా మంచివాళ్ళనే కూరుస్తాడు."

"ఎవరిసంగతో ఏమిటో! ముందు విషయం చెప్ప రాదూ, వేదాంతాలు మాట్లాడకుండా."

"ఇంకెవరు? మన మేథమ్ వార్డన్‌గారిసంగతే! నేను లైబ్రరీకి వెళ్ళాను. రాచయ్య కౌంటరుదగ్గర లేడు; అటెండరు వున్నాడు. "అతనేడీ? నాకు ఫలానాపుస్తకం కావాలి అర్జంటుగా" అన్నాను. 'ఆయన లేడు, తర్వాత రండి' అన్నాడు. "అస లీ తెలుగునవల ఉందో, ఎవరైనా తీసుకున్నారో అదైనా చెప్పు" అన్నాను. వాడు విసుక్కుని "అతను రావాలండి, ఇప్పుడేం వీలుకాదు" అన్నాడు. నేనే లోపలికి వెళ్ళి,

తెలుగుపుస్తకాలబీరువాలు కలిపి ఒక చిన్నగదిలాగ అమర్చిన ఆ మూల వుంది చూశావూ, అక్కడికి వెళుతూ, "పోనీ నీకు వీలులేకపోతే నేనే చూచుకుంటానులే" అన్నాను. వాడు కొంచెం ఆదుర్దాగా "వద్దు" అంటూనే మళ్ళీ ఎందుకో ఊరుకున్నాడు. నేను తటాలున అక్కడికి వెళ్ళి చూద్దును గదా! ఇంకేముంది, మన 'మేథమ్' గారిని వాడు గాఢంగా నిమ్మళంగా ముద్దెట్టుకుంటున్నాడు. ..." అని పార్వతి పకపకనవ్వింది.

"వాడెవరు?"

"ఇంకెవరు? రాచయ్యే! లైబ్రరీరాచయ్య!! పాపం తటాలున విడిపోయ్యారు; కాని వాళ్ళీలోకంలోకి వచ్చేంతలో నేను ఒక టీపరుగు! సరాసరి ఇక్కడొచ్చిపడ్డాననుకో! పాపం మళ్ళీ నేను శారదముఖం చూడాలి ఇవ్వాళ!"

"కాని రాచయ్యకు పెళ్ళాం, బిడ్డలు ఉన్నారు కదా?"

"ఉంటేనూ, తమేమిటే? నీ చాదస్తం. Love is free! చలంపుస్తకాల్ని ఆరాధించే రాచయ్యకు అంతమాత్రంస్వేచ్ఛ, రొమాన్స్ ఉండదంటావా? వంటయింటిలో పొగచూరి, నలుగురుపిల్లల్ని కన్న భార్యలో ఏం సౌందర్యముందని ఆరాధిస్తాడు, చెప్పవే!"

"శారదాంబ యిలాంటిమనిషి అనుకోలేదు సుమా; నా కాశ్చర్యంగావుందే! వానిసంసారం కూలుస్తుందంటావా?"

"ఎందు కట్లాఅంటావు? వాడు నీకు బెదిరిస్తూ ఉత్తరం వ్రాయలేదూ? వాడేం తక్కువవాడా? అందుకే అన్నాను, దేవుడు మంచివాళ్ళనే ఏర్చి కూర్చాడూ అని"

"వాడిమొఖం! వాడు నాకు వుత్తరం వ్రాయలేదనే నా నమ్మకం. ఇంకెవరో వ్రాశారు, వాడు కాదు."

"సరే, ఆ విషయంలో మళ్ళీ వాదన ఎందుకు? నీ అభిప్రాయం నీది, నా అభిప్రాయం నాది. ఇంతకూ ఏమంటావ్? శారదాంబ వచ్చిందేమో ఒకసారి వెళ్ళి మాట్లాడిరానా?"

"ఇక చాల్లే! నీకు తెలిసిపోయింది కాబట్టి, నీముందు ఆవిడే ఎల్లానూ తగ్గుతుంది. నువ్వుకూడా ఆమె నేమీఅన కుండా ఊరుకుంటే పోతుంది."

"నాలోనూ అంతమాత్రం మంచితనం వుందిలే! కాని మొదట ఆవిడ ఎన్నిమెట్లు తగ్గిపోయిందో ఒక్కసారి కనుక్కో వద్దూ? ఇప్పుడే వస్తా వుండు" అంటూనే పార్వతి శారదాంబ గదివైపు వెళ్ళింది

# 25

సంవత్సరం గడచింది. ౧౯౫౦ జూన్ నెలలో పరీక్షాఫలి తాలు తెలిసిన వారంరోజులకు సుందరరావుకు రమణినుండి ఉత్తరం వచ్చింది. రమణి ఇంటరుమీడియేట్ ఫస్టుక్లాసులో పాసైంది. పరీక్షలై వెళ్ళిపోతూ చెప్పింది ఆమె సుందరరావుతో — తనింకా చదువుకోవాలనుకొంటున్నాననీ; తండ్రి కొంచెం వ్యతిరేకిస్తూవున్నా ఫలితాలు తెలియగానే ఏ విషయం తేల్చు కుని ఉత్తరం వ్రాస్తాననీ.

"బావా!

పరీక్షాఫలితమేమో తృప్తిగానే వచ్చింది. ఆ రోజే అమ్మతో మెల్లగా ప్రారంభించి మరుసటిరోజు నాన్నగారిదాకా వెళ్ళాను. కాని ఫలితం చాలా విపరీతంగా తయారైంది. "చదువుకోవటానికి ఇంక వీల్లేదు—డబ్బు లేదు." అని గట్టిగా చెప్పిన నాన్న అంతటితో ఆగినా బాగుండేది. "పెళ్ళి కుదుర్చుతున్నాను. ఫలానా చోట-అని ఏదో అడ్రెసుకూడా చెప్పారు. బి.యస్.సి. చదివాడట—ఇంక మిగతావిషయం నేను విన లేదు. అమ్మేమో "చదివి ఏంజేస్తావే? నాలుగువేలు కట్నం యిస్తే పెళ్ళవుతుంది. అది నువ్వుకోరేచదువుకు ఎట్లాగూ చాలదు. నువ్వు చదివినా, తర్వాతమాత్రం కట్నమివ్వొద్దా అంటూ అంతరార్థం వివరించింది. "నాకు పెళ్ళి వద్దు, ఆ డబ్బు నా చదువు కిమ్మన్నాను. కాని ఒప్పుకోవటంలేదు. ఇట్లావుంది పరిస్థితి... నేనుమాత్రం ఆ ఫలానావాణ్ణి ఏమైనా సరే చేసుకోను! మెడిసిన్ చదవాలన్న ఆశతో కష్టపడి క్లాసుకూడ తెచ్చుకున్నాను. కాని ఏం లాభం? నాకు పిచ్చెత్తుతూవుంది.

"బావా, నా మనస్సు నీకు తెలుసు! నువ్వేంచెయ్యమంటావో చెప్పు? నీవేంచెప్పితే అది చెయ్యటానికి తుది నిశ్చయంచేసుకొన్నాను.

రమణి"

ఉత్తరం చదివి ఆలోచించి సుందరరావు ఒక నిర్ణయానికి వచ్చాడు. అతనికి ఆ సంవత్సరమే ఆరునెలలక్రితం ప్రధానోపన్యాసకుడుగా ప్రమోషన్‌వచ్చింది. అకస్మాత్తుగా అదివరకున్న నలభైఅయిదేళ్ళ విశ్వేశ్వరరావుగారు మరణించారు. ఇదివరకంటే తన ఆర్థికపరిస్థితిలో అభివృద్ధికలిగింది; తనకు

ఖర్చులుకూడా ఏమీలేవు. రమణికి యిలా ఉత్తరం వ్రాశాడు.

"రమణీ !

పెళ్ళివిషయం కాని, చదువువిషయం కాని నువ్వే ఒక నిశ్చయానికిరావటం చాల ముఖ్యం.

నేను నీ చదువుకు ఆర్థికంగా కొంత బాధ్యతవహించ గలనేమో అనుకుంటున్నాను. కాని నీకు మీవాళ్ళు పెళ్ళిలో కట్నంగాఇస్తామన్న నాలుగువేలు ముందుగా చదువుకు ఖర్చు అట్లా చెయ్యగలను. మీ నాన్నగారీ విషయంలో తప్పించుకోవటం నా కిష్టం లేదు. కాబట్టి నువ్వా డబ్బు మొదట తీసుకుని, చదువుకునేందుకు మీవాళ్ళఅనుమతిని కూడా పొందితే, నువ్వు మెడిసన్‌చదివేటందుకు ఏమీ అభ్యంతరం వుండకూడదు. ధనాభావంవల్ల నీ కిష్టంలేనివిధంగా నీ భవిష్యత్తు రూపొందటం జరుగదనే ఆశిస్తూవున్నాను.

ఆశీస్సులు,

సుందరరావు."

వారంరోజులతర్వాత రమణి తను మెడిసన్‌చదవటానికి తల్లిదండ్రులు అంగీకరించినట్లు వ్రాసింది. మెడికల్‌కాలేజీలో ప్రవేశంకోసం దరఖాస్తుకూడా తయారుచేసి పంపించిందట.

జూలై మొదటివారంలో రమణితండ్రి సుందరరావుకు ఉత్తరం వ్రాశాడు.

"చిరంజీవి మేనల్లుడికి దీవనలు.

నువ్వు అమ్మాయి రమణికివ్రాసిన వుత్తరం చూశాను. దానికి మెడిసన్ చదవాలని ఒకటేపట్టు; నే నేం చెయ్యగలను? నా స్థితిగతులు ఏమీ బాగులేనట్లు నీ కిదివరకే అర్థమైవుండాలి.

నేను మాటనిలబెట్టుకోలేని అశక్తుణ్ణయినందువల్లనే, మీ నాన్నగారిఅపోహకూ, ఆగ్రహానికీ గురికావలసివచ్చింది. నా అశక్తతని ఆయన మోసంగా అర్థంచేసుకోవడం నాదురదృష్టమే!

మామీద అభిమానం నీకైనా ఉన్నందుకు, చిన్నవాడివైనా నిక్కచ్చిగా రమణిభవిష్యత్తువిషయంలో ఒకఏర్పాటును సూచించినందుకు నాకు ఎంతో సంతోషంగా వుంది. పెద్ద బరువును తీసినట్లైంది! రమణికి కట్నంగా ఇవ్వాలనుకున్న నాలుగు వేలు రొక్కంరూపలోం ఇందు వెంట డ్రాఫ్టుగా నీకే పంపించేస్తున్నాను. దానిభవిష్యత్తుభారంకూడా ఇక పూర్తిగా నీకు వదులుతున్నాము. ప్రస్తుతపరిస్థితుల్లో ఇంతకంటె నేను చెయ్యగలిగిందీ లేదు.

ఆశీస్సులు,
హనుమంతరావు."

సుందరావుకి వుత్తరం ఆశ్చర్యంకలిగించింది. తనుపెట్టిన షరతువల్ల కొంత బాధతోనే మేనమామ ఈ వుత్తరం వ్రాసి వుంటాడేమో! కాని, డబ్బు నాలుగువేలు తనకుపంపడం, రమణిభవిష్యత్తు తనభారమే అనడం అతనికి నచ్చలేదు. దాని అర్థం రమణిని తనకిచ్చి పెళ్ళిచేస్తానని కాదుగదా! తనేమీ అందుకు అవకాశంఇవ్వలేదు. సహాయం చేస్తానన్నాడు కాని, తను అనుకున్న దానికంటె ఎక్కువభారం మోయడం తనకిష్టం లేదు. తండ్రియైనవాడు ఈవిధంగా మొండికెత్తటం, లేకపోతే తప్పించుకోవట మేమిటి కూతురువిషయంలో! ఏమైనా జరిగిందాంట్లో తప్పేమీలేదు. రమణిభవిష్యత్తు ముఖ్యం. సుందరరావు మేనమామ కొక చిన్నవుత్తరం వ్రాశాడు.

"నేను రమణివిషయంలో చేసిన సూచనకు మీరు మనసునొచ్చుకున్నారు కాబోలు! ఏమైనా రమణిభారం, భవిష్యత్తు మీవి కాక తప్పవుకదా! రమణిమీద నాకు సహజంగా వుండే వాత్సల్యంవల్లే ఆమెఇష్టంప్రకారం ఆమెభవిష్యత్తు వుండాలనే కోరికతో, ఆ సూచనచేశాను, అంతే! మీరు పంపిన డబ్బు రమణిపేర బ్యాంక్‌లో వేస్తున్నాను. ఇంక అయిదారేళ్లు, ఆమె చదువు పూర్తిచేసుకునేంతవరకు మీరు నిశ్చింతగా వుండవచ్చు. తర్వాత ఎవరిమీద ఆధారపడకుండా తనవిషయం తనే రమణి నిశ్చయించుకోగలదు అనుకుంటాను..."

సుందరరావు వ్రాసిన యీ వుత్తరానికి మళ్ళీ జవాబుగా తనేమీ నొచ్చుకోలేదని వ్రాస్తూ, సుందరరావును సెలవుల్లో తమయింటికి రమ్మని ఆహ్వానించాడు మేనమామ.

రమణి మెడికల్ కాలేజీలో చేరింది. సుందరరావు మేనమామఆహ్వానాన్ని మన్నించలేదు.

* * *

నవంబరులో ఒక అదివారం న్యూగ్లోబ్ థియేటరుకు, క్వీనుమేరీసుకాలేజివాళ్ళు యిరవైమంది మాటినీ చూడటానికి వచ్చారు. వాళ్ళలోవున్న విమలకు రమణి ఒక స్నేహితురాలితో అక్కడ కనిపించింది.

"రమణీ!" అని పిలుస్తూ దగ్గరకు వెళ్ళి విమల, రమణి చెయ్యి పట్టుకొన్నది.

"ఇప్పు డేం చదువుతున్నావ్?" అన్నది రమణి.

"బి.ఎస్‌సి. రెండవసంవత్సరం" అని చెప్పింది విమల.

రమణితను స్టేన్లీమెడికల్ కాలేజిలో చేరినట్లు సగర్వంగా చెప్పింది. నాలుగునెలలనుంచి మద్రాసులోనే వున్నా, ఒకరి సంగతి యింకొకరికి తెలీకపోవటం ఆశ్చర్యమనుకున్నారు యిద్దరూ.

థియేటర్లో ప్రవేశించారు. క్వీన్ మేరీసువాళ్ళసీట్లు ముందుగానే రిజర్వు చెయ్యబడినవి; విమల, రమణి విడిపోవలసి వచ్చింది. కాని విమల తన స్నేహితురాలొకఅమ్మాయిని ప్రాధేయపడి, ఇంటర్వెల్ దాకా రమణి తనప్రక్కన కూర్చునేటట్టు ఏర్పాటుచేసింది. రమణిస్నేహితురాలు, విమలస్నేహితురాలు వెళ్ళి వేరుగా కూర్చున్నారు.

"బి.ఎస్సి.లో చేరావెందుకూ? మెడికల్ కాలేజీలో సీటు రాలేదా?" అన్నది రమణి.

"నేనసలు మెడికల్ సీటుకు ప్రయత్నంచెయ్యలేదు. బి. ఎస్సి యే కావాలనుకున్నాను."

"అదేమిటి, మెడిసిన్‌కు వెళ్తావనుకుంటూ వుండే వాళ్ళమే! పార్వతి ఏంచేస్తూంది?"

"నే నెప్పుడూ మెడిసిన్‌నుగురించి అనుకోలేదు; పార్వతి ఇంగ్లీషుఆనర్సు చదువుతూ వుంది.

"పార్వతే చెప్పుతూవుండేది నిన్నుగురించి. మరి బి.ఎన్సి. తర్వాత ఏంచెయ్యాలని?"

"ఇంకాఏమీఅనుకోలేదు...నీకు వివాహంకాలేదా?... సుందరరావుగారు బాగున్నారా?" అని ప్రశ్నించింది విమల.

"ఆఁ...చదువు పూర్తయినతర్వాతే వివాహం!" అన్నది రమణి.

సినిమా ప్రారంభించారు. విమల, రమణి తమ సంభాషణ ముగించవలసివచ్చింది.

ఇంటర్వల్‌లో యిద్దరూ బయటికివెళ్ళి 'డ్రింక్స్' త్రాగారు.

"లీల ఎప్పుడైనా కనిపించిందా? పెళ్ళితర్వాత మళ్ళీ ఆమె ఆవూరు ఎప్పుడైనావచ్చిందా? నువ్వు పోయినసంవత్సరం అంతా అక్కడేవున్నావుకదా" అని లీలనుగురించి ప్రశ్నించింది విమల.

ఇంటరు పూర్తవగానే లీలకు పెళ్ళిచేశారు; వరుడు ఇంజనీరింగు చదివాడు. పార్వతి, విమల పెళ్ళికి వెళ్ళారుకూడా. లీల పెళ్ళవగానే కాపురానికి వెళ్ళింది. తర్వాత వాళ్ళ కామె నుంచి వుత్తరాలు రాలేదు.

"లీల చనిపోయింది. నీకు తెలీదా?" అన్నది రమణి.

నిర్ఘాంతపోయింది విమల. రమణి చెప్పుతూవుంది.

"జనవరిలో కాన్పుకని ఆవూరు వచ్చింది. మార్చిలో అంటే సరిగ్గా మా పరీక్షలుజరుగుతున్నరోజుల్లో పురుడొచ్చి పోయింది. పరీక్షగొడవలో వెళ్ళి చూడటానికికూడ వీలులేక పోయింది. ఫిబ్రవరిలో ఒకసారి వాళ్ళింటికి వెళ్ళాను. అదే కడసారి చూడటం."

"ఎందుకొచ్చినపెళ్ళి! పెళ్ళిలేకపోతే లీల బ్రతికి వుండేది." అన్నది, కోపాన్నీ, దుఃఖాన్నీ వ్యక్తంచేస్తూన్న గొంతుతో విమల.

"అవును, మనిషి ఎప్పుడూ పల్చగా, బలహీనంగా వుండేది." అన్నది రమణి.

సినిమా మళ్ళీ ప్రారంభంకావటానికి గంటమ్రోగింది. విమలస్నేహితురాలు అక్కడకు వచ్చింది.

"మా హాస్టల్‌కు ఎప్పుడైనా రా, రమణీ!" అన్నది విమల సెలవుతీసుంటూ.

"నువ్వూ ఎప్పుడైనా రావాలి మెడికల్‌హాస్టల్‌కు" అన్నది రమణి తన స్నేహితురాలిదగ్గరకు వెళుతూ.

విమలకు యింక పిక్చరుమీాద ఆసక్తిపోయింది. లీల జ్ఞాపకంవచ్చి ఆమె పరధ్యానంగా కూర్చుంది.

*　　　*　　　*

రమణీ వాళ్ళు సినిమాఅవగానే బస్సుస్టాప్‌దగ్గరకు వెళ్ళేటప్పటికి కళ్ళకు గాగిల్స్ పెట్టుకొని చాల నాజూకుగా తయారైన ఒకావిడ రమణిని చూచి నవ్వుతూ దగ్గరకువచ్చింది. ఎవరో గుర్తురాక అట్లాగే చూస్తూన్న రమణితో "ఏం రమణీ, గుర్తులేదా ?" అంటూ గాగిల్స్ తీసివేసిం దామె.

శారదాంబ ! ఎంత మారిపోయింది ! నల్లద్దాలు పెట్టుకుంటే చప్పున గుర్తురాలేదు. "అవును, ఇక్కడే ఏదో కాలేజీలో ఉద్యోగంచేస్తున్నారు కదూ ?" అన్నది రమణి.

శారదాంబ రాచయ్యను పెళ్ళిచేసుకొని, తన ఉద్యోగానికి రాజీనామాయిచ్చి,మద్రాసులో ఉద్యోగం సంపాయించి సంవత్సరం దాటింది. రమణి ఇంటరు సీనియర్‌లో ప్రవేశించిన జూలైలో మద్రాసువెళ్తున్నానని చెప్పింది, కాని పెళ్ళిసంగతి చెప్పలేదు. తర్వాత నెలరోజులకు 'లైబ్రేరియన్ డిప్లొమా' చదవటానికి వెళ్తానని రాచయ్యకూడ లీవుపెట్టి వెళ్ళాడు. శారదాంబకు అతనికి అంతకుపూర్వమే వేసవిలో బెంగుళూరులో

రిజిష్టరుమారేజి జరిగినట్లు హాస్టలులో, కాలేజిలో అందరికి తెలిసింది. రమణికి శారదాంబమీదవున్న గౌరవం పూర్తిగా పోవటమేకాక అసహ్యంకూడా వేసింది. ఆమెతో ఒక సంవత్సరం చనువుగా ఉండినందుకే సిగ్గుపడింది. ఇప్పుడు తలవనితలంపుగా మద్రాసులో తారసిల్లటం, ఆమెతో మాట్లాడవలసిరావటం కొంచెం కష్టంగానేవుంది.

“కొత్తగా పెట్టిన కాలేజిలో లెక్చరరుగా ఉన్నాను. నువ్వెక్కడ చేరావు? మెడికల్ కాలేజిలోనేనా?”

“స్టాన్లీ మెడికల్”

“గట్టిదానివే! నాకు తెలుసు నీకు మంచిపట్టుదలవుందని. మరి మీ బావ? నీకు పెళ్లైందా?”

“ఇప్పుడు దానికేం తొందర?” అని మాట్లాడటం ఇష్టంలేనట్లు ముఖంతిప్పుకొని రమణి బస్సుకోసం చూస్తూవుంది.

“ఏం రమణీ! చాల మారిపొయ్యావు సుమా. అక్కయ్యా! అని పిలుస్తూ ఎంతో ఆప్యాయంగా వుండేదానివి. మరచిపోయావా?” అని శారదాంబ అంటూవుంటే రమణి నవ్వు తెచ్చిపెట్టుకొని “అబ్బే, మరచిపోలేదు. మా బస్సు వస్తోందనుకుంటూ.” అన్నది, దూరంలో వస్తూన్న బస్సును చూపిస్తూ.

శారదాంబ తొందరగా హాండ్ బాగ్ లోనుంచి విజిటింగ్ కార్డు ఒకటి తీసి, పెన్నుతో “౮౩, మాబ్రేస్ రోడ్” అని ఇంటి అడ్రెస్ వ్రాసి, రమణికిస్తూ, వచ్చేశనివారంసాయంత్రం మాయింటికి రా తప్పకుండా” అంది.

"ఊఁ" అని మళ్ళీ ఆమెవైపు చూడకుండానే బస్సెక్కింది రమణి.

తలవనితలంపుగా ఇవాళ ఇద్దరు పాతవాళ్ళు కనిపించారే! అనుకుంది బస్సులో కూర్చుని రమణి. తన ఇంటరుమీడియేట్ జీవితాన్ని గురించి ఆలోచిస్తే నవ్వు వస్తోంది. విమలనుగురించి ఊరికే అపోహపడి, ఒక సంవత్సరంపైగా ఆమెఅంటే చులకనగా చూచింది. అదేకాలంలో శారదాంబ గొప్పవ్యక్తిలా కనిపించింది. విమలతో పెద్ద స్నేహమేమీ కుదరకపోయినా, ఇప్పుడు విమలనుచూస్తే తన కిష్టంగావుంది. ఏమైనా విమల డబ్బున్న స్వతంత్రురాలు. మెడిసిన్ ఎందుకు చదవలేదో! మార్కులూ బాగానే వచ్చాయి! బి.యస్‌సి. చదివి ఏం చేస్తుంది? తర్వాత మళ్ళీ యీ కోర్సుకే వస్తుందేమో! అప్పుడు తనకు ఒక సంవత్సరం జూనియర్ అయిపోతుంది! శారదాంబతో తన కేమిటీ స్నేహం? పెద్దగా రహస్యమంటూ గొప్పచెప్పకొని తీరా లైబ్రేరియన్‌ను తక్కువకులంవాడైన రాచయ్యను, అదీ పెళ్ళాం బిడ్డలున్నవాడిని పెళ్ళిచేసుకుంది. మొదట్లో ఏదో లెక్చరరు, వార్డన్ అనుకుని మోసపోయింది కాని యీవిడ తనచీరల్ని నాశనంచేస్తూవచ్చినప్పుడే, మనిషినిజమైనతాహాతు తెలిసిపోయింది! ఇంతవరకు తనచేతిలో నేవున్నా జ్ఞాపకంలేని విజిటింగ్ కార్డువైపు చూచింది రమణి. "మిసెస్ శారదా రాచయ్య, ఎం.ఏ., లెక్చరర్ ఇన్ తెలుగు, S. M. కాలేజి" అని వుంది. దానికింద ఇంటిఅడ్రసు వ్రాసింది. తన పెళ్ళిసంగతిమాత్రం ఇప్పుడూ ఏమీ చెప్పలేదు. ఎట్లా చెప్తుంది? ఆ పెళ్ళిగొప్ప తనకు బాగా తెలిసినసంగతియే. కాని

మద్రాసులో ఎవరికి తెలుస్తుంది? రాచయ్యాంటే ఎవడో, ఏమో ఎంతగొప్పవ్వక్తో, ఎంత డబ్బుందో! అంతా ఊహాకు వదిలిపెట్టబడిన విషయం. కనిపించేది నాజూగ్గా తయారైన లెక్చరరుగారు! రమణి విజిటింగ్ కార్డును మెల్లగా చేత్తో నలిపి ఉండచేసి అవతల పారేసింది.

*  *  *

"లీలకు వేదమూర్తిమీద ఎంతో అభిమానం, గౌరవం. ఇంతమంది మద్రాసులో తటస్థపడుతారు కాని యింతవరకు వేదమూర్తిగారే కనిపించటంలేదు." అన్నది పార్వతి, లీలమరణవార్త విని చాలసేపు విచారించినతర్వాత.

"నేను చెప్పాను కదూ! అదంతా ఒకతాత్కాలికో ద్రేకం అని. నేనేదో ప్రత్యుత్తరంవ్రాస్తే మాత్రం, నిజంగా నామీద ఆపేక్షవుంటే, ఎక్కడున్నా మళ్ళీ యీపాటికి గుర్తు వచ్చివుండాలి."

"గుర్తువస్తేమాత్రం ఏం చేస్తాడు? ఇప్పుడు నీ అడ్రసు వేదమూర్తికి తెలీలేదు, ఆయనఅడ్రసు నీకు తెలీదు!"

విమల ఆలోచించి అన్నది. "అట్లాకాదు. నేను పంపిన చెక్కు ఇంతవరకు తను మార్చుకొనలేదు. దానివల్ల నా అడ్రసు ఆయన కెప్పుడూ తెలిసినట్లేవుంటుంది"

"ఆ వూహా తట్టలేదేమో!"

"నువ్వెప్పుడూ అవతలిపక్షమే కాని, నాపక్షం మాట్లాడవు!" అన్నది విమల కోపంగా.

"నీకు అర్థంకానివిధంగా నీపక్షమే మాట్లాడుతున్నాను. నేనేమిటి? లీల నీతో ఏం చెప్పిందో గుర్తుతెచ్చుకో. వేద

మూర్తి వ్రాసిన ఆ చివరిపుత్తరంలో లీలకూడ మీ పెళ్ళి తన కిష్టమని సూచించినట్లు ఆయన వ్రాస్తే, నువ్వు నమ్మలేక పోయావు. తర్వాత లీలను అడిగి, లీలమీద కోపంతెచ్చు కున్నావు. లీలవన్నీ అసందర్భపుమాటలు, విచిత్రమైనఊహాలు తెక్కేమిటి అన్నావు. కాని, లీలవంటివ్యక్తిని మళ్ళీ మనం చూస్తామా! సానుభూతి, స్నేహం, ఒకర్ని అర్థంచేసుకోవటమే కాదు, మనుష్యుల అంతరాత్మల్లోకే తొంగిచూడగలిగిన దేవతామూర్తి లీల. ఆమె ఒక్కొక్కమాటకు ఎంతో విలువ వుంది. ఇప్పుడాలోచిస్తే నాకే అనిపిస్తుంది — అప్పుడెంత నిర్లక్ష్యంగా, ఏదో సాధారణంగా, అందరిలాంటిదే అని యెట్లా అనుకున్నామా అని.''

''ఇప్పుడామె దేవతామూర్తిగా నీకు కనిపిస్తోంది. నాకేమో అప్పుడూ యిప్పుడూ కూడ లీలా, పార్వతీ ఇద్దరూ స్నేహితులే. నాకిద్దరిమాటా నచ్చలేదు, అంతే.''

''నీ నిష్పక్షపాతానికి సంతోషించాం. కాని ఇప్పుడైనా ఒక్కవిషయం ఆలోచించు. లీల—ముక్తసరిగా, నిమ్మళంగా వుండే లీల—వేదమూర్తితో కడసారి నిన్ను గురించి ఆ ఒక్క ఊహ ఎట్లా చెప్పిందో, ఎందుకు చెప్పిందో అని ఆశ్చర్యపడి నువ్వు నమ్మలేకపోయావు. కాని లీల, ఆ అభిప్రాయం వ్యక్తం చేయటం నిజమేనని తేలింది. అదేవిధంగా నువ్వు నమ్మలేక పోయినా, వేదమూర్తితో పెళ్ళివిషయమై మీ అమ్మ అంగీకారం తెల్పటం నిజమేనని ఇప్పుడైనా గ్రహించు.''

''ఆయన అబద్ధాలు చెప్పాడని నే నెప్పుడూ అనలేదు. కాకపోతే, మా అమ్మ నాకు చెప్పిన మాటలకు ఎక్కువవిలువా?

ఇంకొకరికి చెప్పిన మాటలకు ఎక్కువ విలువా? అన్న ప్రశ్న వచ్చింది. ఎటొచ్చీ రెండుమూడుసంవత్సరాలు ఆగటం మంచి దనుకున్నాను. తప్పేమిటి ?"

"సరే తప్పేమిటో యిప్పుడైనా తెలిసివస్తోంది కదా! వేదమూర్తిమనస్సెట్లావుందో, ఏమనుకున్నాడో, ఎక్కడికి వెళ్ళాడో తెలీదు. మద్రాసులో మాత్రం లేడని నాఅభిప్రాయం. నీకు మళ్ళీ కనిపిస్తాడో కనిపించడో, మీ తల్లి, లీల ఇద్దరూ నిన్ను ప్రేమించేవాళ్ళే. ఇద్దరూ యిప్పుడు లేరు. నువ్వుమాత్రం వాళ్ళఆదేశాన్ని నిర్వర్తించకుండా వున్నావు."

"నీకు మతిపోతూవుందనుకుంటూనే పార్వతీ! ఇంత Fanciful గాను, Superstitious గాను మారిపోతున్నావేమిటి? ఈమధ్య నీలో హాస్యధోరణి, చిలిపితనం పూర్తిగా మాయమైపోయి, పెద్ద వేదాంతం పుట్టుకువస్తోంది. ఏమిటి వాళ్ళ ఆదేశం నాకు? వాళ్ళకోరికేదో చెప్పారు. కాని పెళ్ళి నా కిష్టంలేదు. ఎందుకు చేసుకోవాలి? చేసుకొని లీలలాగే ఏడాదిమళ్ళకుండా నన్ను పరలోకయాత్ర చెయ్యమంటావా?"

"ఛీ! విరుద్ధానికి ఏదేదో యిష్టమువచ్చినట్లల్లా అంటు న్నావు. వేదమూర్తి కనుపించనందుకు బహుశా ఉడుకుమోత్తనం వచ్చిందేమో! కాని ఒకటి చెప్పుతా విను. మనం చస్తామన్నా చావలేం. విమలా, చావు సులభంగా రాదు; లీల ఒక అపురూపమైనవ్యక్తి. అట్లాంటివాళ్ళని దేవతలే ప్రేమిస్తారు. అందుకే అకాలమరణం వాళ్ళకు. Those whom Gods love, die young!"

# 26

౧౯౫౧ జనవరి. సం|క్రాంతిపండుగ వెళ్ళిన మరునటి రోజు రంగయ్య తన మిల్లులో కూర్చుని మేనేజరుతో మాట్లాడుతున్నాడు.

"ఎవరో తమకోసం వచ్చారండి...కొత్తమనిషి, చాల దూరంనుంచి వచ్చినట్లున్నాడు...తమరెక్కడున్నారని అడుగుతున్నాడు" అని బస్తాలుమోసే కూలీ వెంకన్న చెప్పగా "ఇక్కడికి తీసుకురా పో" అన్నాడు.

మొదట గుర్తుపట్టలేకపోయి, తర్వాత బావమరది వేదమూర్తి అని తెలిసి వి|భ్రాంతిచెందాడు రంగయ్య. వెంటనే "యింటికిపోదాం పద" అంటూ బయల్దేరాడు.

"ఎప్పుడో పెళ్ళికివచ్చినప్పుడు చూచాడు. యీ మిల్లు చాల మారిపోయింది, వ్యాపారం మంచి అభివృద్ధిలో వుందన్నమాట!" అంటూ నవ్వాడు వేదమూర్తి.

"ఇక్కడ మార్పుసంగతి చెప్పుతున్నావు. నీలో వచ్చిన మార్పేమిటి? ఇప్పటికి ఏడాదిన్నరదాటింది, నీసంగతి తెలిసి... అక్కడ మీ అమ్మావాళ్ళకూ తెలీదు, మాకూ తెలీదు... ఇంత చిక్కిపొయ్యావు...జబ్బుపడ్డావా? ఇన్నాళ్ళూ ఎక్కడున్నావు? మేం ఉన్నామనా, లేమనా యింతకాలం ఉపేక్ష చెయ్యటం?"

"ఉన్నారనేగా యిప్పుడిక్కడికి వచ్చింది." అని మళ్ళీ నవ్వాడు. "జబ్బేమీ లేదు; ఆరునెలలు జైల్లోవుండటమే పెద్ద జబ్బు."

"జైలా! ఎందుకు? ఏం చేశావని?"

"అంతా నిదానంగా చెపుతాను వద. నేనేం దొంగ తనమో హత్యో చెయ్యలేదులే! కమ్యూనిష్టుపార్టీలో చేరి కొంత కార్యకలాపం నిర్వర్తించినందుకు."

"అయితే నువ్వు కమ్యూనిష్టువా?"

రంగయ్యలో వ్యక్తమైన భయం, అనుమానం, అయిష్టత వేదమూర్తికి అర్థమైంది "నేనా పార్టీ మెంబర్ను కాను; భయంలేదులే!" అన్నాడు.

"ఏమిటిదంతా? మద్రాసులో ఉద్యోగం ఎందుకువదలి నట్లు? కమ్యూనిష్టుకావలసిన కర్మమేమొచ్చింది? తర్వాత జైలేమిటి? ఇప్పుడు మళ్ళీ ఆ పార్టీతో సంబంధం లేకపోవట మేమిటి? చాలసంగతులు జరిగిపోయినట్టున్నయ్యే! నీఆరోగ్యం బాగా పాడైపోయినట్టుంది. ఇతకూ అదేనా ఫలితం యిన్ని అగచాట్లకు?" అన్నాడు రంగయ్య, వేదమూర్తి కాస్తదూరం నడచినందుకే అలసిపోయి చెమటలు తుడుచుకుంటూవుండడం చూచి.

హైమవతి వేదమూర్తిని చూచి దిగులుపడి, వలవలా ఏడ్చింది. "నీకెంత కష్టమొచ్చిందిరా, బాబూ! ఏదో ఉద్యోగం చేస్తావనుకుంటే, యీ స్థితిలోనా నిన్ను చూడాల్సింది, తమ్ముడూ! ఇన్నాళ్ళూ నేను చచ్చిపొయ్యాననుకున్నావా... ఇక్కడికి రాక ఎక్కడో తిరుగుతూ కష్టాలుపడవలసిన కర్మ ఏం పట్టిందిరా నీకు!"

"అక్కయ్యా! ఇప్పుడు వచ్చాను కదా!" అన్నాడు నవ్వటానికి ప్రయత్నిస్తూ. కాని అప్రయత్నంగా అతనికళ్ళలో నీళ్ళు నిండాయి.

పదిరోజులు గడిచాయి. తినటం, పొలాలవెంబడి తిర గటం, బాగా నిద్రపోవటం. ఎన్నాళ్ళనుంచో కోరుకుంటున్న, అవసరమైన విశ్రాంతి లభించినట్లు, అలసటతీర్చుకుంటున్నట్లు న్నాడు వేదమూర్తి. అతనిఆరోగ్యంకూడ కుదుటబడుతోంది.

మిల్లుకి ఇంటికి సుమారు ఒక ఫర్లాంగుదూరం వుంది. ఇల్లు పాతది, పూర్వులు కట్టింది. మిల్లుదగ్గర ఒకమేడ కట్టాడు రంగయ్య. పైనగదుల్లో తను మిత్రులతో పేకాడటానికి, ఎవ రైనా ఆఫీసర్లు వస్తే విడిదికి, సత్కరించటానికి, లేక తనే మిల్లు పని చూడవలసివచ్చినప్పుడు విశ్రమించటానికి తగిన ఏర్పాట్లు చేసుకొన్నాడు. క్రిందగదుల్లో మేనేజరు వుంటున్నాడు; కొంత భాగంలో మిల్లుకు సంబంధించిన యంత్రభాగాలు పనికిరానివి, పాతవి, మిగులుగావున్నవి పెట్టారు. ఆ మేడలోకి కాపురం మార్చటానికి హైమవతి అంగీకరించలేదు. మిల్లు ఊరికి ఒక చివర వుంది. అందువల్ల రంగయ్య మేడను యీవిధంగా ఉప యోగానికి తెచ్చాడు.

వేదమూర్తి మేడలోనే ఉంటున్నాడు. ఇంటికివచ్చి భోజనంచేసినా, ఇంట్లో పిల్లలగోలతో అతనికి చిరాకుకలుగు తుంది. అయిదుగురు సంతానంతో తెరపిలేని చాకిరీతో హైమ వతిఆరోగ్యంకూడా చెప్పుకోదగిన పరిస్థితిలో లేదని చూడగానే అర్థమౌతుంది. పైపనులు చూడటానికి మనుషులున్నా, వంట పని, పిల్లలపోషణ ఆమెఓపికకు మించినభారంగా వున్నాయి.

వేదమూర్తిని పెళ్ళిచేసుకోమంటూవుంది హైమవతి. అతన్ని చూచినప్పుడు ఆమె కళ్ళనీళ్ళుపెట్టుకోవడం మామూలై పోయింది. నరాలబలహీనత కాబోలు, హైమవతి తరచు ఏడు

స్తుంది. ఇదంతా భరించలేక వేదమూర్తి దినంలో చాలా కాలం మిల్లుదగ్గర మేడలోనే గడుపుతున్నాడు.

కడచిన ఏడాదిన్నరకాలం వేదమూర్తి ఎక్కడున్నాడో ఏం చేశాడో రంగయ్య గుచ్చిగుచ్చి ప్రశ్నించాడు. కాని ఆ విషయాన్ని గురించి విపులంగా మాట్లాడటం వేదమూర్తికిష్టం లేదన్నవిషయం కూడ గ్రహించాడు. చివరకు తెలిసిన విషయా లివి:

౧౯౪౮ మేనెలలో బసవన్నకొండ వెళ్ళి వేదమూర్తి తనయిల్లు రామయ్యకు విక్రయంవ్రాసి, ఈశ్వరరెడ్డి ఋణం తీర్చివేశాడు. అప్పటికే కమ్యూనిస్టుపార్టీతో సంబంధమేర్ప రచుకొన్నందువల్ల, పార్టీవాళ్ళు కొద్దివేతనంమీద తెలంగాణా వెళ్ళమని పంపారు. అక్కడిసంగతులను రిపోర్టుచెయ్యటం, ముఖ్యులైనవాళ్ళమధ్య వార్తలందివ్వటం అతనిపని. అతనికి పార్టీలో పూర్తిసభ్యత్వంయివ్వటానికి కూడా ఏర్పాట్లు జరిగాయి.

౧౯౪౮ జూన్‌నుండి ౧౯౫౦ జూన్‌లో అరెస్టయ్యేంత వరకు వేదమూర్తి తెలంగాణాలోనే వున్నాడు.

అతనిఅరెస్టు విచిత్రంగానే జరిగింది. ఇద్దరు పార్టీ మెంబర్లను నిర్ణీతస్థలంలో కలుసుకోవటానికి ఒక గ్రామానికి వెళ్ళాడు. తలవనితలంపుగా పరిచితురాలైన కామ్రేడ్ రాజ్యం కనిపించింది. ఆమెవల్ల సంకేతస్థలానికి వెళ్ళటానికిఆలస్యమైంది. తీరా వెళ్ళబోతూవుంటే అరెస్టయ్యాడు. పార్టీతో సంబంధం వున్న అనుమానంతప్ప తనమీద చార్జీలేమీ లేవు. కాని రాజ్యంమీదవున్న చార్జీలవల్ల ఆమెతోకలిసిదొరకటమే తగి

వంత నేరమయింది. హైదరాబాదునుంచి మద్రాసుప్రభుత్వానికి ఒప్పగింతపెట్టారట డిటెన్యూగా.

చివరకు పార్టీతో సంబంధం వదులుకొంటానని హామీ యిచ్చినతర్వాత, మలేరియావచ్చి ఆరోగ్యం క్షీణించినందువల్ల విడుదలచేశారు. వేలూరుజైలునుంచి సరాసరి హైమవతి, రంగయ్యలదగ్గరకు వచ్చాడు వేదమూర్తి.

తెలంగాణావిషయాలనుగూర్చి రంగయ్య ప్రశ్నలు వేశాడు. "అబ్బ! గొడవ, అంతా నేను మరచిపోవాలనుకుంటున్నాను" అనో, విషయం మార్చివేస్తూనో, వేదమూర్తి వివరాలేమీ చెప్పటంలేదు. నిట్టూర్పో, నవ్వో మాత్రం తన మౌనంతో జతపరుస్తూఉంటాడు.

హైమవతి చెప్పటంవల్ల నేకాక, రంగయ్యకుకూడా వేదమూర్తి వివాహంచేసుకుంటే అతని భవిష్యత్తుకొక దారి ఏర్పడుతుందనిపించింది. ఏదో కొంత కట్నంవస్తే, వేదమూర్తి ఆ డబ్బు వ్యాపారంలోపెట్టడానికి అంగీకరిస్తే, తన మిల్లులో భాగంఇవ్వటానికి రంగయ్య ఆలోచించాడు. వ్యాపారం ఇష్టం లేకపోతే, పోనీ ఏ కాలేజీలోనైనా మళ్ళీ లెక్చరరుఉద్యోగానికి ప్రయత్నించవచ్చు. ఎటొచ్చీ ఒకస్థిరత్వం, జీవితంమీద లక్ష్యం ఏర్పడటానికి వివాహం తప్పనిసరిఅని నిశ్చయించారు వేదమూర్తిఅక్క, బావ.

వివాహానికి అంగీకరించలేదు కాని, మళ్ళీ కాలేజిలో ఉద్యోగంచెయ్యటమే తన ఉద్దేశమని చెప్పాడు వేదమూర్తి. జూన్ నెల వస్తేగాని ఉద్యోగప్రయత్నం వీలుకాదు. ఈలోపుగా

ఆరోగ్యంకూడదీసుకోవాలని, సామ్యవాదంమీద ఒక గ్రంథం వ్రాయాలని సంకల్పించాడు.

మూడు నెలలు గడిచాయి. వేదమూర్తివైఖరి, దినచర్య రంగయ్యకు విచిత్రంగా కనిపించాయి. ఏదో ఆలోచించుకుంటూ, వ్రాసుకుంటూ, చాలసేపు ఏకాంతంగానే కాలం గడుపుతున్న వేదమూర్తి నేవిధంగా అర్థంచేసుకోవాలో రంగయ్యకు తెలీలేదు.

"నీ ధోరణి చూస్తుంటే సన్యాసి అయిపొయ్యేలా వున్నావే! ఇక్కడేదైనా ఆశ్రమం ఏర్పాటుచెయ్యమంటావా?" అన్నాడు రంగయ్య ఒకరోజున.

వేదమూర్తి మెలగా నవ్వాడు అదే జవాబు అన్నట్లు.

కొంతసేపు ఊరుకుండి రంగయ్య మళ్ళీ సాహసించాడు. ఈసారి తన తనమనస్సులో మెదుల్తూన్న సందేహాన్ని చెప్పివేసి, కుతూహాలం తీర్చుకోవాలనిపించింది రంగయ్యకు.

"నీకు అసలు పెళ్ళే అవసరం లేదా ఏమిటి?...అంటే స్త్రీతో అనుభవం ఇంతవరకు నీకు తెలీదనేనా?" అన్నాడు.

వేదమూర్తి మళ్ళీ చిరునవ్వునవ్వి ఊరుకున్నాడు.

రంగయ్య కొంతఉత్సాహంతో "చెప్పవయ్యా నీ సంగతేమిటో!...చెప్పు, నిజంగా నీకు అసలు ఆ కోరికే లేదా? ఇంతవరకు స్త్రీనే ఎరగవా?...నిన్నుచూస్తే జాలేస్తుంది!"

"అనుభవం వుంది, లేదు...ఇప్పుడీ విషయం తెలుసుకొని ఏం చేస్తావు బావా? పెండ్లికి స్త్రీవాంఛ ఒక్కటే కారణం కాదు. ఆ వాంఛకోసమే పెళ్ళిచేసుకోవడం పీలువడదు;

చేసుకుంటే సంసారం, ఇబ్బందులు చాలావున్నాయి...అవన్నీ మెడకుచుట్టుకోవాలి."

"భేష్, నీ వుద్దేశం అర్థమైందిలేవోయ్! అంటే బాదర బందీ ఏమీ లేకుండా స్త్రీసుఖంమాత్రం లభిస్తూవుండాలి! మంచి కమ్యూనిస్టులాగ మాట్లాడుతున్నావ్! కమ్యూనిష్టులకి పెళ్ళిలో నమ్మకంలేదుగా; స్వేచ్ఛగా, విచ్చలవిడిగా...... అందరూ అందరికీ చెందినవాళ్ళలాగ వుంటారటకదూ?"

"ఛట్టి అపోహ! అది కాదు కమ్యూనిజం అంటే. పెళ్ళి ఎందుకుచేసుకోరు? చక్కగా చేసుకుంటారు; నీతిగానూ వుంటారు. అదికాదు వాళ్ళనేది; నీతిపేరిట, ఒక వ్యవస్థపేరిట 'దోపిడీవిధానం' చెలామణీ కారాదంటారు. అంతే; కొంతమంది సెక్సువిషయంలో స్వేచ్ఛగా వుంటారనుకో; మరి అట్లాంటి వాళ్ళు సంఘంలో ఇతరత్రాకూడా వుంటారు"

"అయితే, నువ్వువాళ్ళనుంచి ఎందుకుతప్పుకున్నావ్?"

"నేను తప్పుకున్నది వేరే కారణాలవల్ల. స్త్రీపురుష సంబంధాల్లోని నీతి ముఖ్యకారణం కాదు."

'ఆఁ...అదే నేననేది! ఎంతమంది ఆడకామ్రేడ్లు స్నేహితులయ్యారేమిటి?"

వేదమూర్తి ఊరుకున్నాడు "చెప్పితే నీకు లాభమేమిటి బావా?"

"ఫరవాలేదు చెప్పవోయ్, ఆ కామ్రేడ్ రాజ్యం అందులో ఒక రైతనుకుంటా...ఏం కదూ? తర్వాత!"

అతనిఉత్సాహానికి వేదమూర్తి నవ్వుతూ, "తర్వాత లేదు, గిర్వాతాలేదు! ఇంతమందిపిల్లలతండ్రివైవేమిటి కుర్రాడిలా

యీ కుతూహలం నీకు?" ఆగి నింపాదిగా అందుకున్నాడు. స్వగతంలాగే వుంది.

"మనుష్యులభావాలు, వాళ్ళ ప్రవర్తన, వాళ్ళుచేసే మంచీ చెడ్డల, నిర్ణయం చాలవరకు ఆర్థికవ్యవస్థమీాద ఆధారపడివుంటాయి నీతికి సమాజంలోని వ్యక్తులు వాళ్ళతరగతిని, అంతస్థునుబట్టి వ్యాఖ్యానం చెప్పుకుంటారు...మధ్యతరగతి వాళ్ళకున్నన్ని భయాలు, సంకుచితదృష్టి, ఇటు చివరితరగతి వాళ్ళకూ లేవు, అటు పైతరగతివాళ్ళకూ లేవు. స్త్రీపురుష సంబంధాల్లో విచ్చలవిడితనం గాని, పెళ్ళిళ్ళు రద్దుచేసుకుని సులభంగా విడాకులిచ్చుకోవటం గాని, మధ్యతరగతివాళ్ళకు కనిపించినంత అవినీతిగా, తప్పుగా, మిగతావాళ్ళకు కనిపించదు. దైవభక్తివిషయంలోనూ అంతే! మధ్యతరగతివాళ్ళమనసుల్లో మెదలినంతగా దేవుడు మిగతా రెండుతరగతులవాళ్ళనూ ఆందోళనపరచడు! చెప్పవచ్చేదేమిటంటే—నేనూ రాజ్యం ఒక ఉద్రిక్తపరిస్థితిలో, కేవలం స్త్రీ పురుషులుగా వ్యవహారించటాన్ని గూర్చి, 'నీతి–అవినీతి' అంటూ విచారణచెయ్యటం, ఒక తరగతికిచెందిన మనస్తత్వాన్నే తెలుపుతుంది. అవినీతి అని ఒకవైపు అనుకుంటూనే, అట్లా చెయ్యటంలో వున్న స్వేచ్ఛను, సరదాను ఇంకోవైపు అభిలషిస్తూ ఆనందించే వైరుధ్యం నీ మనస్సులో వుండటంవల్లనే నీకు నాకథ కావాల్సి వచ్చిందనుకుంటాను. నువ్వు చలంవ్రాసిన కథల్ని అందుకే ఆసక్తిగా చదువుతావు. అదంతా ఒక రి–యాక్షన్ (Re-action) సూచిస్తుంది! కాని నిజమేమిటి? నాలో అనుభవంలేకపోవటం వల్ల కలిగిన ఒక కుతూహలం, ఆవిడకు అనుభవంవల్ల కలిగిన

ఒకసరదా అట్లా జరగటానికి కారణాలు. మా యిద్దరిపరిస్థితు లను, వ్యక్తిత్వాలనుబట్టి చూస్తే, ఇంతకుమించిన 'నీతి,అవినీతి' ఆ సంఘటనకు లేదు. అందుకే నీతి అవినీతి విచారణ దానికి చెందదు. అది ఒక amoral... అయిన అనుభవం!

"కాని యీ అనుభవంతో నాకు వ్యక్తిగతంగా కలిగిన కనువిప్పు ముఖ్యమైంది. దానివల్లనే పార్టీని వదులుకున్నాను కూడా. అదేమిటో చెప్పుతాను...రాజ్యం చాల పెద్ద కట్టు బాట్లలో, ఆచారంలో పెరిగి, బి. ఏ. పాసై, శృంఖలాల్ని వదిలించుకోవటానికి పార్టీలోచేరినవ్యక్తి. ఎంత సంకుచితమైన వాతావరణంలో పెరిగిందో అంత విచ్చలవిడిగా వుంటూ, ఆవిధంగా గతంమీద అక్కసుతీర్చుకుని, సరదాపడుతోంది. బాగా నొక్కి వదలిపెట్టిన స్ప్రింగులాంటి మన స్తత్వం ఆమెది. ఆమెవిశృంఖలత అంతా ఆమెప్రవణయకలాపంలోను, విపరీత మైన ధైర్యంలోను, కఠినత్వంలోను వ్యక్తమౌతూవుందికాని, పార్టీసూత్రాలను గురించి స్వేచ్ఛగా, స్వతంత్రంగా ఆలో చించటంలో కాదు. అటువంటి ఆలోచనలు ఆమెకు రావు. ఇక్కడే వుంది కీలకమంతా—మగవాళ్ళు కాని, ఆడవాళ్ళు కాని, కొంతమంది—మళ్ళీ అందరూ కాదు—ఒక 'రి – యాక్షన్‌తో బాధపడుతూ రాచకీయపార్టీల్లో చేర్తారని తోచింది నాకు. కొందరు ఏదో ఫాషన్ అనుకొంటూ సర దాకు చేరేవాళ్ళూ వున్నారు. నిజంగా ఆర్థికవ్యవస్థలో విప్లవం తీసుకురావాలనుకొన్నవాళ్ళు, ఆ సూత్రాలు అర్థమైనవాళ్ళు ఆలోచించేవాళ్ళు కొంతమంది లేకపోలేదు. ఇట్లాఅనటంలో

ఏ పార్టీని తీసివెయ్యటంలేదు; రాజకీయపార్టీలలో వివిధ స్వప్రయోజనాలకోసం సభ్యులయ్యేవాళ్ళసంఖ్య ఎక్కువే.

"అయితే ఆ రాత్రి నాకు కలిగిన అనుభవమేమిటి? రాజ్యంతో నాకు పరిచయమైతే వుంది; కాని, ఎప్పుడూ మే మిద్దరం ఏకాంతంగా వుండటం తటస్థించలేదు. ఆమెవల్ల ఉద్రిక్తుణ్ణయి ఆకర్షింపబడే ప్రమాదం వుందనికూడా నేను అనుకో లేదు. ఆ రాత్రి ఏకాంతానికీ, కుతూహలానికీ లొంగిపొయ్యాను. తర్వాత రాజ్యం నిద్రపోయింది; నాకు నిద్రపట్టలేదు. నాలో వెంటనే కలిగిన మార్పునుగూర్చి ఆలోచిస్తూవున్నాను... అంతవరకూ అందరిలో నేను గుర్తించినదోషం—వాళ్లు రి-యాక్షన్‌తో బాధపడుతూ, స్వేచ్ఛగా వుంటున్నామనుకో వటం!—అది నా విషయంలోకూడా వున్నదోషమేనని అప్పుడు గుర్తించాను. బహుశా నాలో తృప్తిపొందని స్త్రీ వాంఛ, మనస్సును కప్పివేసినమబ్బు కారణం అనుకుంటాను. అది తొలగగానే నా మనస్సుస్వరూపం నాకు గోచరమైంది. నేనుకూడా స్వేచ్ఛఅంటూ ఊహాప్రపంచంలో సిద్ధాంతాల వెంట పరుగెత్తుతూ, నాలోని మానవత్వాన్ని వ్యక్తిగత స్వాతంత్ర్యాన్ని మరచాను. ఆర్థికవిప్లవం అవసరమే. కాని, దాన్ని సాధించటానికి హత్యలు, ఘోరాలు, ఒకపార్టీకి భావ దాస్యం ఎంతవరకు అవసరం? అన్నప్రశ్న నన్ను బాధించ లేదు ఆ క్షణంవరకు. నాలో యిన్నాళ్ళుగా ప్రవేశించిన నిర్దాక్షిణ్యత, కాఠిన్యత ఏమిటి? జరుగుతున్నవిషయాలు బాగా తెలిసి, కొన్ని కళ్ళారచూచికూడా నా హృదయంలో సంచలనమేమీ అంతవరకూ కలగలేదు. నా సిద్ధాంతం

ఒక్కటే—ఒక రాజకీయసంస్థ, ఆర్థికపరిస్థితులమూలంగా మను ష్యులమధ్య ఏర్పడే ఎగుడుదిగుళ్ళు, హెచ్చుతగ్గులు నిర్మూ లించబోతూవుంది; అందులో సైనికుడుగా చేరటంతో నాకూ సమానత్వం, స్వేచ్ఛ లభిస్తాయి; ఆర్థికశక్తుల ప్రభావాన్నుంచి బయటపడతాను అన్న ఊహ! కాని, ఆరాత్రి నాలోవచ్చిన మార్పు ఆ ఊహ తప్పని గుర్తించటం! హత్యలు, హింసాకాండ, దౌర్జన్యం—"వీటికికూడా నీతి—అవినీతి లేదు; వీటివిషయంలో కూడా అటువంటివిచారణ, ఒకతరగతికిచెందిన మన స్తత్వమే!" ననటానికి వీలేదని గ్రహించాను. మానవత్వం, కారుణ్యం అన్న విలువలమీద నాకు మళ్ళీ కలిగిన నమ్మకం—అది నా తరగతికి సంబంధించిన రి-యాక్షన్ అని, పార్టీవాళ్ళు వాదించ వచ్చు కూడా! కాని నా హృదయంలో నేను గుర్తించిన సత్యం - మానవత్వము సాంఘికనీతి మాత్రం కాదు. అది కాలాతీతమైన విలువ. ఆ స్తిపాస్తులనుగురించిన నీతి, స్త్రీపురుష సంబంధాల్లోని నీతి, సాంఘికమైనదే—అందులో కాలాన్నీ, దేశాన్నీ అనుసరించి మార్పులువస్తాయి; రావటం సహజమూ, అవసరం కూడా. ఏ మార్పులు రావాలన్నది వాదనకులొంగే విషయం—ఈ రెండింటిలోను, ఆర్థికవ్యవస్థను రూపొందించే ప్రధానలక్ష్యంలోను, కమ్యూనిస్టుల సోషలిస్టుల పక్షమే నా పక్షంకూడా! కాని హత్య, హింస విషయాల్లోమాత్రం నేను పూర్తిగా వ్యతిరేకిస్తాను. దాన్నిగురించి ఏ వాదన వీలులేదని నా అభిప్రాయం.

"ఈ సంగతి గుర్తించగలిగాను ఆ రాత్రి, కేవలం శారీరకమైన ఆ అనుభవంతర్వాత. విచిత్రంగా లేదూ?

రాజ్యానికి నిద్రావస్థను, నాకు సంపూర్ణమైన జాగ్రదావస్థను కలిగించింది ఆ అనుభవం. అంతవరకు నిద్రాణమైన మానవత్వం మళ్ళీ నాలో మేలుకొని, హృదయంలో ధారాపాతంగా వరవళ్ళు త్రొక్కినట్లయి, కన్నీళ్ళతో తడిశాను. హృదయంలో ఏదో మెత్తదనం, తేలిక అనుభవించాను. నిద్ర పోయి లేచేటప్పటికే ప్రొద్దెక్కిపోయింది. నేను వెళ్ళవలసిన సంకేతస్థలానికి అసలు వెళ్ళాలనిపించలేదు. ఆలస్యంగా మెల్లగా సిద్ధమౌతూంటే పోలీసులు దర్శనమిచ్చారు. వాళ్ళేమీ తక్కువగా హింసించలేదు నన్ను, ఆమెను. కాని అదంతా నా కెందుకో తృప్తిగానే తోచి, అనుభవించాను. నేను పార్టీ రహస్యాలు వాళ్ళకు బయటపెట్టలేదు; అసలు నేను పార్టీ సభ్యుణ్ణే కాను...తర్వాత నా జైలుజీవితం.

"ఇంతకూ అనేదేమిటంటే ఆ రాత్రిఅనుభవం విశిష్టమైంది, విచిత్రమైంది; మూసినవాకిళ్ళు తెరచి, అంధకారంలో చంద్రకిరణంలా నా మార్గం నాకు వ్యక్తంచేసింది. రాజ్యమెవరో, నే నెవరో! మా కిద్దరికీ ఎందులోనూ సంబంధం, సామ్యం లేదు, ఉండ బోదు! కాని ఆమెకు మానవత్వంలో యీవిధంగా ఋణపడ్డాను."

ఏమీ మాట్లాడకుండా రంగయ్య వేదమూర్తిస్వగతాన్నంతా విన్నాడు. "ఏదో వేదాంతం మాట్లాడుతావు. ఇంతకూ జరిగిం దేమిటి? కామ్రేడ్ రాజ్యంతో గడిపిన ఒక్కరాత్రి— అది నిన్ను పార్టీలోంచి పరుగెత్తేట్టుచేసింది!...పోలీసులు వచ్చి లాక్కువెళితే!...ఒకవిధంగా మంచిపనే జరిగింది. కాని తర్వాతవిషయం?...సరే ఆ అనుభవం అంత ముఖ్యమైనదని

నీకు తెలిస్తే, అది మూసుకున్న వాకిళ్ళే; తెరిస్తే వివాహంవల్ల...
నీ జీవితం చక్కబడుతుందనీ, ఆ అనుభవం మళ్ళీ నీకు అవసర
మనీ, ఎందుకు గుర్తించవ్?" అన్నాడు రంగయ్య.

"సరే, నేను చెప్పినదేమిటో నీకు బొత్తిగా అర్థం
కాలేదని తెలిసింది నీ వ్యాఖ్యానంతో" అని వేదమూర్తి
ఊరుకున్నాడు.

"అర్థం అయిందిలేవోయ్. కాకపోతే నీ ఎమ్మేచదువు
ఊరికే పోతుందా! అదంతా నువ్వు చెప్పే విధానంలో చూపి
స్తున్నావు, ఏదో పుస్తకంచదివినట్లు మాట్లాడుతూ. అయితే
రాజ్యం అనుభవశాలి. మంచిచేతుల్లోనే పడ్డావన్నమాట నీ
మొదటిట్రయల్‌లోనే!" అని నవ్వాడు రంగయ్య... వేద
మూర్తిలేచి, పనివున్నట్లు గదిబయటకు నడిచాడు.

## 27

రెండునెలలు గడిచాయి. రంగయ్య నాలుగు పెళ్ళి
సంబంధాలు తీసుకొచ్చాడు. వేదమూర్తికి కోపమెక్కువై
రంగయ్యతో పోట్లాడేపరిస్థితి వచ్చింది. రంగయ్యమాటల్లో
వేళాకోళం, వెక్కిరింత సహింపరానివైనాయి. వేదమూర్తికి
అక్కడనుండి వెళ్ళిపోవాలనిపించింది. కాని వెళ్ళటానికి మార్గం
లేదు. ఎక్కడికివెళ్ళినా ఎవరిమీదో ఆధారపడక తప్పదు.

ఈ రెండునెలల్లో మలేరియాతో మళ్ళీ బాధపడ్డాడు.
కాని ఇంజక్షన్లు తీసుకోవడంతో పదిరోజుల్లో లేచి తిరగ
గలిగాడు. వ్రాస్తున్నపుస్తకం "సామ్యవాదం—అనుభవంలో"
సగంపైగా పూర్తి అయింది. రిఫరెన్సుకు కావలసిన కొన్ని
పుస్తకాలు దొరకలేదు; మద్రాసువెళ్ళాలి.

జబ్బుచేసినప్పుడు పదిరోజులు వేదమూర్తిని కనిపెట్టుకుని ఉండటానికి పైడి అనే గొల్లఅమ్మాయిని పురమాయించాడు రంగయ్య. ఇరవైఏళ్ళపైడికి సహజసౌందర్యంలో లోటులేదు; అంగసౌష్టవం, ఆరోగ్యం—ఆ రెండింటిని చక్కగా రాణింప జేసేటంత వయ్యారం, పోకడలు దానిలో వున్నాయి. వేదమూర్తికి అది ఒక్కొక్కసారి మితిమీరిన చనవు చూపిస్తున్నట్లుగా తోచినా, అది జబ్బులో చేసినసేవకి కృతజ్ఞతాభావమే కలిగింది. మళ్ళీ ఆరోగ్యం చేకుకుంటూ వుంది; పైడిని మాత్రం స్థిరంచేశాడు రంగయ్య. అది మిల్లుకికొంచెందూరంలో ఒక పాకలో వుంటూవుంది. దానిమొగుడు దొంగసారాయి కేసులో జైలుకువెళ్ళి మూడునెలలైంది. దానికి ముసలివాడైన తండ్రి తప్ప ఎవరూ లేరు.

జూన్ నెల జరుగుతోంది. వేదమూర్తి మళ్ళీ తనపుస్తకాన్ని పూర్తిచెయ్యటానికి ప్రారంభించుకున్నాడు. రిఫరెన్సు అవసరమైనభాగాలు కొన్ని వదిలిపెట్టి, మిగతాది వ్రాసి ముగించాలనుకున్నాడు. ఇంతలో ఒకసంగతి జరిగింది.

రంగయ్యకు పైడికి సంబంధంఏర్పడిందని వేదమూర్తికి చూచాయగా తెలియవచ్చింది.

హైమవతికి మళ్ళీ అయిదోనెల. ఆమెపరిస్థితి చాలా అన్యాయంగా వుంది. వేదమూర్తి తనమాటవిని పెళ్ళికి ఒప్పుకోలేదని,ఊరికే కూర్చుని తింటున్నాడని, ఉద్యోగప్రయత్నమైనా చెయ్యటంలేదనీ, అతనితో ముక్తసరిగా వుంటున్నాడు రంగయ్య. మాట్లాడినా చులకనగా, నిందాగర్భితంగానే మాట్లాడుతున్నాడు. ఇటువంటిపరిస్థితిలోతననిస్సహాయత, అప్ర

యోజకత్వం వేదమూర్తికి కంటకంగావున్నాయి. ఒకటిరెండు లెక్చరరు పోస్టులు కాలేజీల్లో ఖాళీగా వున్నట్లు పేపర్లోపడితే దరఖాస్తులు పంపించాడు. కాని ఏమీ జవాబులేదు. కమ్యూనిస్టుపార్టీలో తన వ్యక్తిత్వాన్ని చంపుకోవాల్సివచ్చిందనీ, తనకు ముఖ్యమనిపించిన మానవత్వం విలువకోసం మథనపడి తప్పుకున్నాడు. కాని రంగయ్యవంటి మనిషిమీద ఆర్థికంగా తాను ఆధారపడటం అంతకన్న కష్టం అనిపిస్తూవుంది. ఇంకో నెలలో ఏదో ఉద్యోగంవచ్చి తను వెళ్ళటానికి అవకాశం కలుగుతుందని ఆశిస్తూ రోజులు లెక్కపెడుతున్నాడు.

ఆ రోజుసాయంత్రం షికారువెళ్ళి తిరిగివచ్చేటప్పటికి చీకటిపడ్డది. మేడమెట్లెక్కుతూవుంటే వేదమూర్తికి ఎక్కడుందో, తేలుకుట్టింది. పైకివెళ్ళి దీపంతెచ్చి చూసేటప్పటికి అది మాయమైంది. కాలిబొటన వ్రేలికి గట్టిగా దారంబిగించి బాధపడుతూ కూర్చున్నాడు—ఏంచెయ్యాలో తోచక. క్రిందకు వెళ్ళి మిల్లుమేనేజరుతో చెప్పటానికి మనస్కరించలేదు. ఇట్లా ఏదో శారీరకంగా బాధపడటం అతనికి ఒక విచిత్రమైన తృప్తి కలిగిస్తోంది యీమధ్య. తనమీద తనకే యీ కోపమేమిటో అర్థంకావటంలేదు. అరెస్టుతర్వాత పోలీసులు బాగా చితక బొడిచినప్పటినుంచి యీవిధమైన మనఃప్రవృత్తి ఏర్పడ్డది.

అరగంటతర్వాత పైడి అన్నం కేరియరులో తీసుకొని వచ్చింది. ఎప్పుడో ఒకసారి తప్ప ఇంటికివెళ్ళి హైమవతిని చూడటం గాని, మాట్లాడటం కాని లేదు వేదమూర్తి. అతనికి తేలుకుట్టిందని తెలీగానే పైడి తనగుడిసెకు వెళ్ళి ఏదో ఒక పచ్చని ఆకుపొడుంలాంటిది తెచ్చి, కుట్టినచోటపెట్టి, కట్టుకట్టి

చన్నీళ్ళతో తడపటం ప్రారంభించింది. ఆ మందుప్రభావం పని చేసిందేమో బాధ సగంపైగా తగ్గింది. కాని మోకాలిదగ్గర, తొడపైభాగంలో సలుపు యింకా వుంది.

పైడి అన్నంతిని వచ్చి కాలుఒత్తడం ప్రారంభించింది. వేదమూర్తి నీరసంగా, అలసి పడుకున్నాడు.

"సలుపుపోయిందా?" అన్నది పైడి.

ఈమధ్య అయ్యగోరూ, బాబుగోరూ అనడం మానేసింది. మొదట్లో అంటూవుండేది. దానికికూడా తనమీద గౌరవంతగ్గినట్లే అనుకున్నాడు వేదమూర్తి. కాని మర్యాదకు భంగంతీసుకురాలేదు, తలతిరుగుడుతనం చూపించలేదు. తనకు యీ సాంఘికతారతమ్యాలనుగురించి పట్టింపులేదు. ఆ తారతమ్యాలకు మర్యాదకు అతీతమైన వ్యక్తిత్వం ఏమిటో దాన్ని తను కొంతవరకు సాధించాడు. పైడి తనకు సహాయంచేస్తున్న మనిషిగా తప్ప, ఒక పనిమనిషిగా దాన్ని చూడాలనిలేదు.

"ఇక్కడుంది కామాల్ను సలుపు!" అని మోకాలు ఒత్తింది పైడి.

వేదమూర్తి మాట్లాడకుండా కళ్ళుమూసుకున్నాడు. పైడి తనకాలు ఒత్తడం కూడా నచ్చలేదు; కాని సలిపినప్పుడు అది గట్టిగా ఒత్తిపట్టడంవల్ల బాధ కొంత సహించడానికి వీలవుతోంది.

పైడిచెయ్యి వున్నట్లుండి తన తొడపైభాగం ఒత్తడం పారంభించింది.

"వద్దు, తియ్యి" అన్నాడు ఛీత్కారంచేస్తూ.

పైడిచెయ్యి హద్దుమీరింది. దానిచెయ్యి లాగిపారేసి లేచి కూర్చున్నాడు.

"నువ్వు ముందు గదిబయటికెళ్ళు. నిన్నెవరు తాకమన్నారు నన్ను?" అన్నాడు. అతనికంఠం, దేహం వొణికింది అవమానంతో, కోపంతో.

పైడి కిసుక్కుమని నవ్వింది. కదల్లేదు. పోవడానికి ప్రయత్నమైనా చెయ్యలేదు.

"ఊఁ, కదులు..." అన్నాడు.

"ఓ యబ్బో! అయితే నీకు మగతనం లేందే నిజమా?" అన్నది

" ఛీ! మాట్లాడావంటే పళ్ళూడదంతాను, ఫో గాడిదా!" అన్నాడు.

"కోపంమాత్తరం భలే లావుగా వొత్తదే! నూశాను మగాడివో కాదో అని! ఊఁ, పడుకో పాపం!" అని తిట్టుకుంటూ వెళ్ళిపోయింది.

వేదమూర్తికి వొళ్ళంతా తేళ్ళు జెర్రులూ పాకినట్లైంది. ఒక్క తేలు కాదు, నూరు తేళ్ళు ఒక్క చోట కాదు, అన్ని చోట్లా కుట్టినట్లు, బాధ సలిపినట్లు అయింది.

వ్యక్తిత్వంలో ఏదో అమూల్యమైన వస్తువుని, ఉల్లిపొరలలాగ పొరలు పొరలు ఊడదీసి పారవేయగా, చివర మిగిలిన, అక్షీణమైన సత్యాన్ని దేన్నో అగౌరవపరిచారు. రంగయ్య పైడితో ఏంచెప్పాడో తెలుస్తూనే వుంది. ఇంకొక్క క్షణంకూడా అక్కడ వుండ లేడు. వెళ్ళిపోవాలి, ఎక్కడికైనా సరే.

పదిగంటలకి రంగయ్య వచ్చాడు. కొద్దిగా నిద్రపట్టిన వేదమూర్తి అతనిపిలుపు విని లేచాడు.

"ఎట్లావుంది తేలుబాధ ? పైడి చెప్పింది !" అన్నాడు. అతనికంఠంలోని వెటకారం దాచుకోబోయినా దాగకుండా వ్యక్తమౌతూంది.

"పోయింది..." గోడవైపు తిరిగి మాట్లాడకుండా పడుకున్నాడు.

"ఎందుకొచ్చినకర్మోయ్ ! కాస్త సరదాగా వుండరాదూ! నిన్ను చూస్తూవుంటే నాకు జాలిగావుంది! చివరకు మగవాడివనే పేరైనా నిలిపావుకావు !"

"ఛీ, ఫో అవతలికి" అన్నాడు వేదమూర్తి.

ఇద్దరికి మాటలుపెరిగాయి. రంగయ్య భార్యనూ, మానవత్వానికీ ద్రోహంచేస్తున్న పశువనీ, నీచుడనీ వేదమూర్తి తిట్టాడు.

"పుణ్యానికిపోతే పాపం ఎదురైనట్లు అయిదారునెలలు ఇంట్లో మేపినందుకు యిదా కృతజ్ఞత! మాటలు తిన్నగా రానీ!—నువ్వేదో కమ్యూనిస్టుల్లో తిరిగైనా కాస్త తెలివీ, మగతనం సంపాయించుకున్నావనుకున్నానుగాని, ఇంత చచ్చు దద్దమ్మనీ, మాచకమ్మనీ అనుకోలా! చాలు నీ చుట్టరికం, రేపే బయల్దేరు" అన్నాడు రంగయ్య.

ప్రొద్దున లేవగానే వేదమూర్తి తనవస్తువులేవో సర్దుకుని హైమవతిదగ్గరికెళ్ళి "నేను బసవన్నకొండ వెళ్తాను... అమ్మను చూడాలి" అని మాత్రం చెప్పి వచ్చేశాడు. మిల్లు మేనేజరుదగ్గరకెళ్ళి, "రిస్టువాచీ," ఎవరైనా కొనేవాళ్ళుంటే

డబ్బు అర్జంటుగా కావాలి అమ్మిపెట్టమ”ని ఇచ్చాడు. వేద మూర్తికి అమ్మడానికి మిగిలింది వాచీ ఒక్కటే అన్నీ పోయినా వాచీమాత్రం,కాలాన్ని నమ్మకంగా కొలతపెట్టుతూ, తనతోనే వుంటూవచ్చింది. ఆ స్త్రిపాస్తులమీంది మమకారం బూర్జువా మన స్తత్వానికిచెందిఉన్న ఊహ వచ్చి నవ్వుకుని వాచీ యిచ్చాడు.

మధ్యాహ్నం .రెండుగంటలకి మేనేజరు డెబ్బైరూపా యలు తీసుకొచ్చి యిచ్చాడు. వాచీ కొన్నఖరీదు రెండు వందలయాభై. ఎవరో రెడ్డికుర్రవాడు ఎసెసెల్సీకి వెళ్తున్నాట్ట యీ సంవత్సరం; వాచీ కావాలని మారాంపెట్టాడు; ధనవంతు డైన రెడ్డి యీ వాచీ కొన్నాడు కొడుకోసం. వేదమూర్తి ఏమీ మాట్లాడకుండా డబ్బుతీసుకుని ఓ అయిదురూపాయలు మేనేజరుకు అందివ్వబోయ్యాడు... “అబ్బే! వద్దండి. మీ దగ్గర తీసుకుంటానా ?” అని నసిగాడు మేనేజరు. ఆలస్యంచెయ్య కుండా డబ్బు జేబులోపెట్టుకుని, సంచీపట్టుకుని బయల్దేరాడు బస్సుస్టాండుకు. మేనేజరు మర్యాదకోసం ఎందుకు నసిగానా ? అని వెంటనే పశ్చాత్తాపపడినట్లు ముఖంపెట్టాడు.

*           *           *

ఆత్మగౌరవం అంటే ఏమిటి ?

సాంఘికంగా ఒక అంతస్థుకు చెందినవానిమీ, దానికితగి నట్లు ఇతరులచేత మన్ననపొందాలని ఆశించటం, పొందలేక పోయినప్పుడు బాధపడటం ఆత్మగౌరవానికి నిర్వచనం కాదు. సంఘంలో స్థానానికీ ఆర్థికమైన హెచ్చుతగ్గులకు అతీతమైన విలువ వ్యక్తిలో అంతర్గతమైందనీ, దాన్ని మిథ్యఅనటాని

వీలులేదని, తను ఊరికే నమ్మటంకాదు, యథార్థంగా అనుభవించి గ్రహించాడు. ఆ విలువను గుర్తించటమే ఆత్మగౌరవం. ఆ విలువ రంగయ్య అనుకునే 'మగతనం' కాదు.

'స్వేచ్ఛ'అనే పదానికి అర్థంలో నిజంగా స్వేచ్ఛలేదు. ఒక స్వరూపం లేదు. అందుకే దాన్ని అన్వేషిస్తూవెళ్ళటం గాలిలో సాము చెయ్యటం అయింది. కాని అట్లా సాము చెయ్యటంతో, తనలో చివరకు మిగిలేది, నిజంగా తనదైనవస్తువు, ఏమిటోకూడా అర్థంఅవుతూంది.

బస్సుస్టాండుదగ్గర హోటల్లో కాఫీతాగుతూ పైవూరినుండి రావలసిన బస్సుకోసంఎదురుచూస్తూ ఆలోచిస్తున్నాడు వేదమూర్తి.

తనైతే సులువుగా వచ్చేశాడు, కాని హైమవతికి రావటానికి వీలులేదు. ఆమె వెళ్ళటానికి చోటేది? అందరు ఆడవాళ్ళపరిస్థితీ యిట్లానే వుంటుందా? భర్త అవమానిస్తే, అన్యాయంచేస్తే, మిగతావాళ్ళకు వెళ్ళటానికి పుట్టిల్లు, తోడబుట్టినవాళ్ళు అంటూవుంటారు. తండ్రి బ్రతికివుంటే హైమవతి బసవన్న కొండ వెళ్ళగలిగేది. తండ్రిస్థానంలో బాధ్యతలను నిర్వర్తించవలసిన తను హైమవతికి అక్కరకురానివాడై పోయాడు. చివరకు తల్లినికూడా పోషించలేక పరాయివాళ్ళ పోషణలో ఉంచాడు.

తను తనవాళ్ళు అన్నసంగతే విస్మరించి, ఆర్థికవ్యవస్థలో రాజకీయంగా విప్లవంతీసుకురావాలని తను వెళ్ళినదారి—అది తన దారికాదని తెలిసిపోయింది.

తనకు సంఘంలో ఒకస్థానం అవసరం. ఆత్మగౌరవానికి అది పట్టుగొమ్మ. దానివల్ల హైమవతికి కాని, తల్లికికాని ఒక ఆశ్రయం వుంటుంది. వాళ్ళ వ్యక్తిగతగౌరవాల్ని నిలుపుకోవడానికి ఒక అవకాశం ఏర్పడుతుంది. సంఘంలో అట్లా ఒక ప్రత్యేకస్థానంలో స్థిరపడటం ప్రస్తుతవ్యవస్థకు దాస్యంచెయ్యటమే అనిపించి, ఆవేశంతో పార్టీలోచేరి సంఘాన్ని మార్చాలని ప్రయత్నంచేశాడు. కాని పార్టీకోరినదాస్యం, తనలోని వ్యక్తిత్వానికే గొడ్డలిపెట్టని తెలిసింది. ఇటు సంఘం, అటు పార్టీ—ఏదో ఒకటి ఆలంబనంగా వుండకతప్పదు. మనిషి గాలిలో తేలిపోలేడు; భూమిమీదే రెండుకాళ్ళతో నడవాలి. అందుకే సంఘంలో ఒకస్థానం అవసరం.

లెక్చెరరుస్థానం మళ్ళీ దొరక్కపోదు. బహుశా తన పుస్తకానికికూడా కొంత విలువ వుండకపోదు;

బస్సువచ్చింది. క్రిక్కిరిసివుంది. ఎట్లానోఇరుక్కున్నాడు. అయిదుగురికి సరిపొయ్యే చోటులో ఏడుగురు కూర్చోవాలి అన్నాడు కండక్టరు.

వాళ్ళు రైతులు, చుట్టుప్రక్కలవాళ్ళే. పరధ్యానంగా తనజీవితాన్ని పర్యావలోకనంచేసుకుంటున్న వేదమూర్తికి బావ రంగయ్యపేరు వినబడ్డది. తర్వాత వాళ్ళసంభాషణే వింటున్నాడు, ఆ ముప్పైమైళ్ళ ప్రయాణం ముగిసేదాకా.

రంగయ్యకు వ్యవసాయం, మిల్లు—ఇవి రెండే కాదు; ఇంకొక వ్యాపారంకూడా వుందట. అది నాటుసారాయి తయారు చేయించి అమ్మించటం! నాగడు...అంటే పైడి మొగుడు... ఆ సందర్భంలోనే జైలుకువెళ్ళాడు. ఆఫీసర్లు రంగయ్యఆతి

ధాన్యాన్ని స్వీకరించి మిత్రులవుతారు...ఎప్పుడైనా వాళ్ళకు కేసులు కావలిస్తే రంగయ్యే నాగడులాంటివాళ్ళని పట్టిస్తాడు. నాగణ్ణిపట్టియివ్వటంలోని అంతర్యాన్ని కూడా అందరికీ తెలిసిందే, రహస్యమేమీ లేదు.

ప్రభుత్వ నిబంధనలకు వ్యతిరేకంగా ధాన్యం సరఫరా చేసి, రంగయ్య యీ రెండేళ్ళుగా ఎంతెంత గడిస్తున్నాడో కూడా వాళ్ళ సంభాషణలోనే వ్యక్తమైంది.

బస్సులో బహిరంగంగా మాట్లాడుతున్నారు జనం; వాళ్ళమాటల్లో రంగయ్యంటే మెప్పు, అసూయ, భయం, గౌరవం వ్యక్తమౌతున్నాయి కాని, దూషణ, అసహ్యం, క్రోధం చూచాయగా కూడా లేవు. ఇంతగా ఆ జనం మాట్లాడుకుంటూవున్నా రంగయ్యకు ప్రభుత్వంనుంచి, సంఘం నుంచి వచ్చిన నష్టం ఇంతవరకేమీ లేదు. అతన్ని ఎవరూ ఏమీ చెయ్యలేదన్నట్టే వుంది.

వేదమూర్తిలో నిస్పృహా ప్రవేశించింది తనవైపు ఒక్కసారి చూచుకున్నాడు. తను వేసుకున్న షర్టు, కట్టుకున్న పంచ రంగయ్యప్రసాదమే! అది రంగయ్యడబ్బు!...తండ్రి కట్నంతీసుకొని పెళ్ళిచేసుకోమంటే...అది బ్లాక్ మార్కెట్ డబ్బు, అని అప్పుడు నిరాకరించేడు. ఇప్పుడు తను సాధించేదేమిటి ?

ప్లాట్ ఫారంమీద బెంచిమీద కూచున్నాడు. రైలు రావటానికి నాలుగ్గంటలవ్యవధి వుంది.

బస్సుదిగినతర్వాత ప్రకృతంలో పడి ఆగిపోయిన ఆలోచన సాగటానికి మళ్ళీ అవకాశం దొరికింది.

ఇప్పుడు తను సాధించేదేమిటి? అన్నదే ప్రశ్న.

మళ్ళీ మొదటికివెళ్ళితే తనఆశయాల్లో, ఆదర్శాల్లో పొరపాటేమీ కనిపించలేదు. మళ్ళీ ఇంకొకసారి ఆ జీవిత ప్రయాణంచెయ్యమంటే, అదేవిధంగా చేస్తాడేమో కూడా! కాని ఫలితం ఇంతవిపరీతంగా లభించిందేమిటి?

కట్నంపెళ్ళి చేసుకోకపోవటం—కాలేజీలో క్షమాపణ ఇవ్వకుండా ఉద్యోగం వదులుకోవడం—విమలను పెళ్ళిచేసుకోవాలని ప్రాధేయపడటం—దేశానికి మనుష్యులకు నిజమైన స్వాతంత్ర్యము, ఆర్థికవిప్లవం వస్తేకాని ప్రయోజనం లేదనినమ్మి పార్టీలోచేరటం — వ్యక్తిలో మానవత్వం ముఖ్యమైనవిలువ అని గ్రహించటం, ఇందులో ఏ ఒక్కటీ తను పశ్చాత్తాపపడవలసిన సంగతి కాదు. ఆవిధంగా వెళ్ళినందుకు తృప్తిగానేఉంది. మరి గమ్యస్థానం ఏదీ? యీ విపరీతఫలితాలు ఏమిటి? అర్థంకావటంలేదే! తండ్రి మరణించాడు; ఉద్యోగం పోయింది; విమల తన్ను నిరాకరించింది; పార్టీ తన నొక పనిముట్టుగా వాడుకుంది; రంగయ్య తన్నొక 'చచ్చుదద్దమ్మ' అన్నాడు!

జీవితంలో వున్న అర్థంకానితనం యిదేనా?

బసవన్నకొండకు మళ్ళీ తిరిగి వెళ్ళుతున్నాడు!

ఏ విపరీతఫలితాలు వచ్చినా, తనలో కదలిక, ఒకదాన్నుంచి ఇంకొకదానికి వెళ్ళగలిగినశక్తి వుంది. తను సాధించింది, బహుశా, విజ్ఞానం! సంఘాన్నిగురించి మనుష్యుల్నిగురించి చాలా విషయాలు తెలిశాయి. ఆవిధంగా అనుకుని ఎందుకు తృప్తిపడరాదు?

# 28

మొదటిభార్యమీద రాచయ్యకు ఏవగింపు పుట్టింది. రెండవపెళ్ళినిగురించి భర్తను తిట్టిపోస్తూ, ఏడుస్తూ, సాధిస్తూ వుండటం ఆమెకు అలవాటు. దానితో ఆమెనోటినుంచి మాట రావటం ఆలస్యం, పట్టుకుని బాదటం రాచయ్యకు మామూలైపోయింది. తండ్రి చాలసార్లు కసురుకున్నాడు. స్నేహితులు ఒకరిద్దరు చూచాయగా శారదనుగూర్చి, ఆమె ఒకచోటా తనొకచోటా వుండటాన్ని గురించి హేళనచేశారు. వాళ్ళతో కలవడం మానేశాడు. చివరకు ఆ వూళ్ళోవుండటం కష్టమనిపించి, తండ్రి, మొదటిభార్య, పిల్లలు వాళ్ళతో తెంచుకోవటమే మంచిదని తోచి, ౧౯౪౧ ఏప్రిల్ లో మద్రాసు వచ్చేశాడు రాచయ్య. మొదటసెలవుపెట్టి,తర్వాత తనవుద్యోగానికే రాజీనామా యిచ్చాడు.

శారదకుమార్తెకు రెండవఏడు నడుస్తోంది. పేరు నీరద. రాచయ్యకు నీరదమీద ప్రాణం. మళ్ళీమద్రాసులో ఉద్యోగం దొరికేవరకు నీరదను చూచుకోవటమే తన ఉద్యోగంగా నిశ్చయించుకున్నాడు. అందువల్ల శారదకు తిరగటానికి, సెలవులైపోగానే కాలేజీకి వెళ్ళటానికి స్వేచ్ఛవచ్చింది సెలవులకుముందు సహాయంచెయ్యటానికి శారద మేనత్త—ఒక వితంతువు—కొన్నాళ్ళపాటు వచ్చివుంది. కాని ఏప్రిల్ లో రాచయ్య రాగానే ఆమెను మెల్లగా వదిలించుకొంది శారద

ఏప్రిల్, మే, జూన్ నెలల్లో తనకన్న అదృష్టవంతుడు లేడనిపించింది రాచయ్యకు. శారదకు సహాయపడటానికని

ఎన్నడూ లేనిది వంటచెయ్యడం ప్రారంభించి, నేర్చుకున్నాడు. అది అతనికి ఎంతో సరదాగావుంది.

శారద ఆడవాళ్ళ క్లబ్బుకి వెళ్ళటం—ఆమె స్నేహితురాండ్రు ఇంటికిరావటం, టీ తీసుకోవడం, సంక్షేమకార్యక్రమాలలో కార్యదర్శిగా శారద ఎన్నుకోబడటం—అన్నీ రాచయ్యకు భార్యగొప్పదనాన్ని, తనఅదృష్టాన్నీ వ్యక్తంచేశాయి.

తనకుఉద్యోగం దొరికినా, దొరక్కపోయినా శారదకు తోడునీడగా వుండటంకంటే జీవితంలో తృప్తి వేరే అవసరం లేదనిపించింది రాచయ్యకు.

డాక్టరు బాలసుందరం తమిళుడు. మైలాపూరులో ప్రయివేటుప్రాక్టీసు. శారదకు స్నేహితుడు. మే, జూన్ నెల్లో బెంగుళూరు వెళ్ళాడు. జూలైలో మద్రాసుకు తిరిగిరాగానే ఒక సాయంత్రం కారుతీసుకుని శారదకోసం వచ్చాడు.

'గతసంవత్సరం నీరదకు జబ్బుచేసినప్పుడు చాల శ్రద్ధ తీసుకొన్న డాక్టరీయనే' నని పరిచయంచేసినతర్వాత శారద రాచయ్యను లోపలికి తీసుకువెళ్ళి కాఫీ తయారుచేయమని చెప్పింది.

రాచయ్య కాఫీకాస్తూవుంటే శారద డాక్టరుతో మాట్లాడుతూవుంది.

కాఫీ పాట్‌లో పోసినతర్వాత, రాచయ్య చేతులూ, ముఖం కడుక్కొని ముందుగదిలోకి వచ్చి సోఫాలో ఠీవిగా కూర్చున్నాడు.

డాక్టరుదగ్గర నీరదకు చాల చనవు. 'బాబాయ్' అని పిలుస్తూవుంటుంది. దానికివచ్చిన రెండుమూడుమాటల్లో అది ఒకటి.

రాచయ్య శారదవైపుచూచి "డాక్టరుగారికి కాఫీ ఇవ్వరాదూ!" అన్నాడు.

శారద లోపలికివెళ్ళి, ట్రేతో కాఫీసామగ్రి పెట్టుకొని

డాక్టరు త్రాగుతూ "కాఫీ చాల బాగుంది" అన్నాడు ఇంగ్లీషులో.

శారద: "నాభర్త కాఫీ తయారుచెయ్యటంలో ఎక్స్పర్ట్ అన్నది" ఇంగ్లీషులోనే. డాక్టరు సమాధానంగా చిరునవ్వునవ్వాడు; రాచయ్యవైపు తిరిగి, ఓ థాంక్ యూ" అన్నాడు.

రాచయ్యకు వళ్ళుమండింది. కాఫీతాగుతూ కప్పువెనుక ముఖం దాచుకొన్నాడు.

డాక్టరు బెంగుళూరువిశేషాలు చెప్పుతున్నాడు. వాగ్దరిసంభాషణలో రాచయ్యకు ప్రవేశమే లేకుండాపోయింది.

రాచయ్యలేచి "నేను చైనాబజారు వెళ్ళొస్తాను" అని బయలుదేరాడు.

"నాకు జడపిన్నులు కావాలి. మరచిపోకుండా ఒక అరడజను తీసుకురండి." అన్నది శారద.

రాచయ్య విసుగుగా ద్వారంవైపు నడిచాడు.

"He is so helpful." అని డాక్టరుతో శారదఅన్న మాటలకు, రాచయ్యను మొదటిసారిగా, యిదివరకు ఎన్నడూ లేని అవమానం క్రుంగదీసింది.

రాచయ్య ఇంటికి తిరిగివచ్చేటప్పటికి ఎనిమిదిన్నర దాటింది. శారద సోఫాలో కూర్చుని చదువుకుంటోంది. నీరద నిద్రపోతూవుంది. వంటింట్లో సాయంత్రం కాఫీ తాగినకప్పులు వగైరా, అట్లానే ఒకమూల పడివున్నాయి. వంటచేసిన చిహ్నాలేమీ లేవు.

కాళ్ళు ముఖం కడుక్కుని రాచయ్య ముందుగదిలోకి వచ్చాడు.

"ఇంతసేపు ఎక్కడ తిరుగుతున్నావు? వంటెప్పుడు చెయ్యాలనుకున్నావు? పాప పాలుమాత్రం తాగి పడుకుంది" అన్నది శారద.

ఏకాంతంలో ఏకవచనం, ఇతరులముందు బహువచనం వాడటం శారద అతనిపట్ల భార్యగాచూపే ప్రత్యేకమైన చనవు మర్యాద కూడా!

"నువ్వెందుకు చెయ్యలేదు వంట వాడెవడితోనో కబుర్లుచెప్పకపోతే? నేను నీకు వంటవాణ్ణనుకున్నావా?"

"గౌరవంగా మాట్లాడటం నేర్చుకో! పాతవాడుకలు ఎన్నాళ్లైనా పోకుంటే ఎట్లా? నెలకు ఎనిమిదివందలు సంపాయించేడాక్టరు ఆయన, ఎనభైరూపాయల గుమాస్తా కాదు. మనమీాద అభిమానంతో ఇంటికిరావటమే ఎక్కువ. మాట్లాడి మర్యాదచెయ్యాలా, వద్దా? ఆయన వెళ్ళినతర్వాత నీరదను ఎవరుచూస్తారు, నేను వంటచేసి నీకు రెడీగా పెట్టడానికి! చేతు

లాడించుకొంటూ బజార్లలో తిరగటానికి సిగ్గులేదు కాని, ఆలస్యంగావచ్చి, పైగా డబాయింపుకూడానా !"

రాచయ్య కొంత సేపు మౌనంగావుండి, మెలగా అన్నాడు: "నేను కాఫీ తయారుచేశానని నువ్వెందుకు చెప్పాలి ఆయనతో ?"

"ఓ అదా! అందులో తప్పేమిటో నా కర్థంకాదు. కాఫీ బాగుందని ఆయన మెచ్చుకుంటూంటే, ఆ పొగడ్త కాస్తా నీకు చెందవలసిందనే ఉద్దేశంతో అన్నాను. భార్యకు సహాయం చేయటంలో భర్తకేమీ హైన్యంలేదు. ఇంగ్లండులో అంతా అట్లానేచేస్తారు...సమానత్వం, సాహచర్యం అంటే అదే!".

"అవును, నీకు పిన్నులు తెచ్చిపెట్టమని నాకు ఒకవైపు ఆజ్ఞయిచ్చి 'నాకు బాగా ఉపయోగపడుతాడు' అని నువ్వు అనటమూ విన్నాను. అది ఏ జవాన్నుగురించో చెప్పినట్లుంది కాని, భర్తనుగురించి కాదు."

"ఛీ, నువ్వెందు కట్లా లేనిపోని పెడర్థాలుతీస్తావు ? He is helpful, అన్నానేమో ... 'అంటే ఆయన నా కెంతో సహాయపడుతారు' అని మెచ్చుకోవటమన్నమాట... నీ కింగ్లీషు తెలీకపోతే నే నేం చెయ్యను ?" అన్నది శారద.

"నీకు వచ్చినమాత్రం ఇంగ్లీషు నాకూ రాకపోలేదు. నువ్వు తెలుగులో ఎమ్మే చదివావుకాని, ఇంగ్లీషులో కాదు నాకు అర్థం చెప్పడానికి!...నువ్వింతగా నన్నవమానిస్తావని నేను కలలోకూడా అనుకోలేదు !"

"చాల్లే. ఆపు నీ వ్యాఖ్యానం ! Self-pity ఎక్కువౌతోంది. వెళ్ళి కారియర్‌తో అన్నం తీసుకురా ! ఆకలితో

చచ్చిపోతున్నాను. నీకేం ? ఏ హోటల్లోనో భోజనంచేసి వచ్చి వుంటావు; తీరిగ్గా కూచుని వాదించటానికి ?"

శారద లేచి లోపలికి వెళ్ళింది. అతను ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఆమె కారియర్ తీసుకొనివచ్చి అతనిముందు పెట్టింది. భోజనంతేవటానికి బయల్దేరాడు రాచయ్య.

*　　　*　　　*

ఆగస్టునెల గడిచింది. శారదకు రాచయ్యకు మధ్య మధ్య కలహాలు వస్తూనే వున్నవి. డాక్టరు బాలసుందరం అయిదుసార్లు వచ్చాడు. అతనువచ్చినరోజు ఏదో కారణాన ఇంట్లో పోట్లాటతప్పదు.

శారద తరచు సాయంత్రం ఏడింటికిగాని కాలేజినుంచి ఇల్లుచేరుకోవటంలేదు. కాలేజిలో మీటింగులు, స్త్రీ సంక్షేమ శాఖాకార్యకలాపాలు, లేకపోతే ఎవరోమిత్రులు ఈ ఆలస్యా లకు కారణం. రాచయ్యకు ఇంటిపని, నీరదసంరక్షణతో ఊపిరితిరగటంలేదు.

శారద ఇంటికిరాగానే అలసిపోయివుంటుంది. భోజనం తడవుగా నిద్రపోతుంది. ఒకగంట ఆమెతో సరదాగావుండటా నికిగాని, చివరకు తనైనా ఒంటరిగా ఎక్కడికైనా వెళ్ళటానికి గాని రాచయ్యకు వీలుచిక్కటంలేదు.

ఆదివారంవస్తే డాక్టరు మూడున్నరకే ప్రత్యక్షమవు తాడు. రాచయ్య కోపంతో, చేసేదిలేక ఎక్కడికైనా వెళ్ళి పోతాడు. ఆదివారం మాటినీకి శారదను తీసుకుపోదాం— డాక్టరు వచ్చేలోపుగా—అని రెండుమూడుసార్లు ప్రయత్నిం చాడు రాచయ్య. "అబ్బ, ఆదివారమైనా ఇంట్లో సుఖంగా

నీరదతో ఆడుకోనియ్యి; పోనీ, నువ్వు వెళ్ళి చూచిరా ”
అంటుంది శారద. ఇంటినుంచి కదలదు. రాచయ్యకు ఆది
వారాలు తీరికచిక్కుతుంది; కాని మనస్సును విపరీతంగా
బాధించే తీరిక అది; దానికంటె శారద కాలేజిలోనూ, తను
ఇంట్లోనూ వుండటమే మనస్సుకు శాంతిగావుంటుంది!

డాక్టరు బాలసుందరంపీడ వదిలించుకోవాలని నిశ్చయించుకుని, ప్రయత్నించి ధైర్యంగా ఆ మాట అన్నాడు ఒకరోజున రాచయ్య.

“చూడు శారదా, నా కా డాక్టర్ని చూస్తే సరిపడటం లేదు ; మనస్సు బావుండదు. నా కోసమైనా అతనితో మాట్లాడటం మానెయ్యరాదూ ! ఈసారి వచ్చినప్పుడు నేనే అతనితో నిక్కచ్చిగా చెప్పేస్తాను ‘మా గుమ్మంతొక్కవ’ద్దని. సరేనా?” అన్నాడు ప్రాధేయపూర్వకంగా.

“ఏడిసినట్లుంది, నీ జెలసీ నువ్వూ ! నీ అర్థంలేని ఇష్టానిష్టాలు చూసుకుంటే నేనింక ఉద్యోగంచేసినట్లే! నువ్వు కట్టుబాట్లుపెట్టడానికి నీ భార్య—ఆ పల్లెటూరి మొద్దు అనుకుంటున్నా వేమిటి? అబ్బ! అయినా, నువ్వు కాస్త నాగరికతా, విశాలదృష్టీ అలవాటుచేసుకునే దేనాటికి?” అంటూ ఎగతాళి చేస్తూ విసుక్కుంది.

పల్లెటూరిమొద్దుఅయినా తన మొదటిభార్య ఎన్నడూ ఊరుకుని పడివుండలేదు. ఎప్పుడూ తన్ను తిట్టటం, ఏడవటం సాగించి తనకు యిల్లు నరకంచేసింది . ఆమె శారదవిషయంలో చూపిన జెలసీ యింతా అంతా కాదు. తనకు శారదచెప్పే నాగరికత అర్థంకావటంలేదు; కాని తనభార్య అనుభవించిన

'జెలసీ' మాత్రం ఇప్పు డర్థమౌతూవుంది. కనీసం భర్తకు యిల్లు నరకంచేసేశక్తి ఆమెకుంది; కాని శారదను తనేమీ చెయ్యలేదు. మగవానికి ఆడదిలేకుంటే యిల్లూ, సంసారం లేదు. ఆడదానికి మగవాడులేకున్నా తను తనపిల్లలు వున్న చోటే యిల్లూ, సంసారం వుంటుంది.

రామయ్య ఆలోచించాడు. ఆడది బాధపడి తేసాను భూతిచూపిస్తారు చుట్టూవుండే మనుష్యులు, సంఘం; మగవాడు భార్యచేతుల్లో బాధపడితేమాత్రం లోకం నవ్వుతూ ఇంకా బాధిస్తుంది.

ఆర్థికంగా తనకాళ్ళమీద తాను నిలబడటం ఎవరికైనా ముఖ్యమైనసంగతే! శారదకువున్నధీమా వుద్యోగంచేసి, డబ్బు సంపాయిస్తూవుండ నేకాని, నాగరికత, చదువు తనకంటె ఎక్కువైపోయికాదు! చదువురాకున్నా నాలుగెకరాలపొలం, యిల్లూ,ఆస్తి కలిగినఆడదాన్నిచూస్తే తెలుస్తుందిస్వాతంత్ర్యం, నాగరకత అనేవి దేనిమీద ఆధారపడతాయో!

మద్రాసులో ఒక ఉద్యోగం సంపాయించాలని నిశ్చయించాడు రాచయ్య.

* * *

ఏ ఉద్యోగం దొరకలేదు రాచయ్యకు.

ఒకరోజురాత్రి స్నేహితురాలింట్లో విందుకు వెళ్ళింది శారద. కొడుకు పుట్టినరోజు పండుగసందర్భంలో విందు ఏర్పాటుచేసిం దా స్నేహితురాలు.

తొమ్మిదిగంటలకు యింటికి తిరిగిరావలసిన శారద రాలేదు. పదింటికి బస్సులు ఆగిపోతాయి. రాచయ్యకు ఆందో

శనకలిగింది. అంతకన్న అనుమానం వేధిస్తోంది. నిద్రపోయిన నీరదను పక్కింటికివారికి అప్పగించి బయల్దేరాడు. ట్రిప్లికేనులో దిగేటప్పటికి మైలాపూరువెళ్ళే చివరిబస్సు బయలు దేరుతూ వుంది. తిరిగివెళ్ళేందుకు రిక్షాయే గతి అనుకుని, శారద స్నేహితురాలియింటికి వెళ్ళాడు.

వరండాలో కూర్చుని ఆ యింటివాళ్ళు, భార్యా భర్త ఏదో మాట్లాడుకుంటున్నారు. రాచయ్య వెళ్ళగానే యింటావిడ గుర్తుపట్టింది.

"శారదాంబ ఎనిమిదింటికే వెళ్ళిందే !" అన్నది.

"ఇంకా రాలేదు." అన్నాడు.

"ఆమె, సంస్కృతంలెక్చరరు ఎవరో తెలిసినవాళ్ళ కారులో యింటికి బయలుదేరారు" అన్నది

రాచయ్య వెనక్కు తిరిగాడు.

"ఎవరు ?" అని ప్రశ్నించాడు భర్త.

ఆమె అంటున్నది "తెలుగులెక్చరరుయింట్లో వంట మనిషి...వాళ్ళ బంధువే."

రాచయ్యకు వళ్ళు తెలీని కోపంవచ్చింది...రిక్షాఒకటి పిలిచి అందులో కూర్చున్నాడు.

శారద తనని ఎంత పనికిమాలినవాడుగా అందరికీ చెపుతూవుందో బాగా అర్థమైంది. తనని భర్తఅని చెప్పుకోవడమే ఆమెకు అవమానం; వంటవాడని చెప్పుతూవుంది.

కాని మిసెస్ రాచయ్య అని వ్యవహరించుకుంటూ వుంది. ఎవరు కొత్తవాళ్ళు యింటికివచ్చి అడిగినా, ఉత్తరాల మీద, విజిటింగ్ కార్డులమీదఅదే పేరు. అందువల్లే తను మోస

పోయాడు. కాని ఆ పేరులోని రాచయ్య ఇంట్లోవున్న తనే నని ఎవరికీ తెలీదన్నమాట. డాక్టరుగాడికి తెలీదా? తెలిస్తే యేం? తెలిసే నిర్భయంగా ప్రవర్తిస్తున్నాడు. కారుకూడ వాడే పంపించివుంటాడు. ఇప్పుడు వాడింట్లోనే వుంది కాబోలు!

కాని వానిఅడ్రసు తనకు తేలీదు. తను మోస పోయ్యాడు! ఈ మద్రాసువాతావరణం, యీ మనుష్యులు తనకు అర్థంకారు. శారద యిలాంటిమనిషని అనుకోలేదే! తనకన్న డాక్టరు అందగాడు కాడు; వాని కున్నది డబ్బు తప్పితే యింకేమిటి? శారద చివరకు డబ్బుకే అమ్ముడు పోయిందన్నమాట!

ఉద్యోగం వదలి, సొంతవూరు కాదనుకొని, సంబంధా లన్నీ వదలుకొని దీన్ని నమ్మి వచ్చినందుకు మంచి శాస్తి జరిగింది! ఇంట్లో నౌఖరుకింద కాపలాకాసే కుక్కకింద జమకట్టింది.

తను కాసినకాపలామాత్రం ఏమిటి? రాచయ్య వికృతంగా తన్ను తనే వెక్కిరించుకున్నాడు. ఇంట్లో తన్ను కట్టిపడేసి స్వేచ్ఛగా విహరిస్తోంది యీ పక్షి!

తనొక వేటగాణ్నని గర్వించేవాడు; వేటకానినెత్తిమీద తన్నుతూ సవారీచేస్తోంది యీ పిట్ట! దీనిరెక్కలు విరగ్గొట్ట లేడూ? విరగ్గొట్టి పొయ్యిలోపెట్టగలడు; కాల్చుకుని ఎముకలు నమలగలడు! పిట్ట!

మహా నాగరికత అఘోరించినట్టు మాట్లాడుతుంది! దీనినాగరికత కర్థం ఇదీ. దీనితండ్రి రైల్వేగార్డు. అక్కయ్య హాస్పటలునర్సు; ఎంత ఉన్నతమైనకుటుంబం! ఇంటికి వస్తే

తెలుస్తుంది! ఇవాళ ఏం మాయదారిజవాబు పొంకంగా చెపుతుందో!

రాచయ్య పక్కింటిముసలమ్మదగ్గరున్న నీరదను తీసుకొచ్చి, ఇంట్లో పడుకోబెట్టాడు. నీరద అంతా తన పోలికే!...

తప్పు శారదది కాదు, మాయచేసి డాక్టరు లోబరుచుకున్నాడు, అని తోచింది.

వరండాలోకి వెళ్ళాడు; శారద వస్తూవుందేమోనని ఆశ. వీధికుక్క ఒకటి వరాండాలో మూల ముడుచుకొని పడుకొంది. పట్టరానికోపంతో దాన్ని ఒకతన్ను తన్నాడు. 'కయ్యో' మని అరుస్తూ, వెళ్ళలేక దెబ్బలుతింటూ తింటూ వెళ్ళిపోయింది.

చాలసేపు వరండాలో తిరుగుతున్నాడు. కాని శారద రాలేదు. ఈ రాత్రికి రాదేమో అనిపించింది. నిజమే, అప్పుడే ఆవిడకు మంచిసమాధానం చెప్పటానికి కూడా వీలవుతుంది మరి! ఏ స్నేహితురాలియింట్లోనో అవసరంవచ్చి ఉండిపోయానంటుంది.

ఒంటిగంట దాటింది. దీపంఆర్పివేసి రాచయ్య పడుకున్నాడు. నిద్రరాలేదు.

తనింత అధోగతికి ఎట్లా దిగజారాడో ఆశ్చర్యంగా వుంది. ఏముంది ? నమ్మకం, గ్రుడ్డిఅభిమానం, మమకారం !

వీధిలో కారుఆగిన శబ్దం, కారుతలుపు మూసినశబ్దం. మళ్ళ కారు బయల్దేరింది...

శారదేనా ? అవును, వరండాలో ఆమె చెప్పులసవ్వడి. తలుపుకొట్టుతూవుంది.

లేచి లైటువేశాడు. తలుపుతీసి, దారికడ్డంగా నిలబడ్డాడు. లోపలికి రాబోయింది.

"ఆగు" అన్నాడు. "ఇంతసేపు ఎక్కడికెళ్ళావ్ ?"

"రెండోఆటసినిమాకు"

"రెండోఆటకాదు...మూడోఆట అను ! నీ ఆటల వైనం తెలుస్తోనేవుంది. టైమెంతఅయిందండీ, లేడీ మేడమ్ దొరసానిగారు ! ఏం ? కారులోవచ్చింది వాడేనా ? చెప్పు ?" రాచయ్య గద్దించాడు.

"చాలించు నీ వేషం ! తాగావా ఏమిటి ?" అంటూ తోసుకొని లోపలికి వచ్చింది శారద.

వెళ్ళబోతున్న ఆమెజబ్బ పట్టుకుని నిలిపి, చెంపమీద లాగికొట్టాడు.

"బ్రూట్ ! ఇడియట్ !" అంటూ చెంపతడుపుకొంది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"నోర్మూయ్ భడవా !" అని రాచయ్య మరి రెండు దెబ్బలు కొట్టాడు.

శారద తప్పించుకుని గదిలోకి పారిపోయింది.

"నీకు కల్చర్ ఏమిటో నేను నేర్పిస్తాను ! దొరసానీ ! సాని ముండా !" అంటూ నడుముకున్న బెల్టు విప్పుతున్నాడు రాచయ్య.

శారద తన గదితలుపులు దభాలున వేసుకుని గడియ పెట్టింది.

తలుపు బాదాడు రాచయ్య. కోపంతో తలుపుమీదనే బెల్టుతో చెయ్యి నొప్పిపెట్టేవరకు కొట్టాడు.

"తియ్యి...తొందరగా తియ్యకపోతే నిన్ను చంపితీర తాను" అంటున్నాడు.

తలుపులు మూసుకునేవున్నాయి. రాచయ్య అలసి పోయి ఆగాడు. తలుపుకు చేరగిలబడ్డాడు.

దైన్యం ఆవరించి, అతనికి దుఃఖంవస్తోంది. "శారదా, తియ్యి తలుపు!" అన్నాడు మామూలుకంఠంతో.

"నేను సినిమాకువెళ్ళానంటే ఎందుకు నమ్మవు?సినిమా తర్వాత వెన్నెల బాగుంటే మెరీనాలో కాస్సేపు కూర్చు న్నాము...డాక్టరుభార్యకూడ మాతో వుంది" అంది లోప ల్నుంచి శారద.

డాక్టరు అనగానే మళ్ళీ కోపం ఉవ్వెత్తుగాలేచింది రాచయ్యలో. "వాణ్ణి చంపేస్తాను! ఇంకా నన్ను మభ్యపెట్టా లనే! వాడు నిన్ను చెడుస్తున్నాడు! మెరీనాలో వాడితో వెన్నెలవిహారమా! సానిముండా, నువ్వొక్కడి భార్యవే!" అని తల చేతుల్తోపట్టుకున్నాడు. తన్ను వంటమనిషిగా శారద అందరితో చెప్పటం జ్ఞాపకంవచ్చింది అతనికి.

"నేను వంటమనిషిని కదూ!...సరే, తలుపుతియ్యి". నిమ్మళంగా దృఢనిశ్చయాన్ని సూచించే ఆ కంఠం భయంకలి గించింది శారదకు. ఆమె జవాబివ్వలేదు.

"నేను వంటమనిషేనా?" కంఠం హెచ్చింది.

జవాబు లేదు. కొన్నినిమిషాలు నిశ్శబ్దం.

"వెళ్ళి పడుకో!" అన్నది శారద తలుపుదగ్గరగా వచ్చి మెల్లగా.

"నువ్వు అందరితో చెప్పలేదూ, నేను వంటమనిషి నని?...తలుపుతియ్యి" అని తలుపుతట్టాడు.

ఆమె మంచంమీద పడుకున్న శబ్దం విన్నాడు.

కొంచెంసేపు ఆగి, "ఏమీ చెయ్యనులే, తలుపుతియ్యి శారదా!" అన్నాడు ప్రాధేయపడుతున్నట్లు నటిస్తూ.

జవాబులేదు. మంచంమీద ఆమె ఒకవైపునుంచి ఇంకోవైపుకు తిరిగినట్లు శబ్దం వినిపించింది అస్పష్టంగా.

తెల్లవారింది. శారద గదితలుపు తియ్యలేదు. నీరద లేచి ఏడ్చింది. మామూలుప్రకారం పాలుకాచి ఇచ్చాడు. తను కాఫీ చేసుకుని తాగాడు. తలుపుదగ్గరకువెళ్ళి "శారదా" అని పిలిచాడు. జవాబులేదు.

వెళ్ళి సోఫాలో కూర్చుని ఆలోచనలోమునిగి పోయ్యాడు. నీరద ఆడుకుంటూ వుంది. పదకొండుగంటలకు పాపాయినితీసుకుని బజారువైపు వెళ్ళాడు. అక్కడ తను భోజనంచేసి, పాపకు అన్నంపెట్టి తిరిగివచ్చాడు. వీధితలుపుకు తాళంవేసే వెళ్ళాడు. పండ్రెండు గంటలైంది. శారదగదితలుపు వేసింది వేసినట్లేవుంది. వెళ్ళి పిలిచాడు. జవాబులేదు. చివరకు లోపల అలికిడికూడా లేదు.

రాచయ్యకు వింతగా తోచింది. భయపడి, లేక పశ్చాత్తాపపడి ఆత్మహత్య చేసుకుందా? అన్న అనుమానం మొదటిసారిగా కలిగింది. అక్కడే ఆలోచిస్తూ నిలబడివున్న అతనికి

తలుపుసందులో క్రిందభాగంలో ఒక కాగితపుమడత దూర్చి నట్లు కనిపించింది.

ఆదుర్దాగా తీసి చదివాడు. తను ఉరివేసుకుని చని పోతున్నట్లూ, తన్ను క్షమించమనీ వ్రాసివుంది ఆ చీటీలో. తనఅనుమానం నిజమేనన్నమాట.

రాచయ్యకు చెమటపోసింది. భయంతో వణుకు తున్నాడు. చీటీ వున్నందుకు కొంతధైర్యంచిక్కింది. దాన్ని మడిచి జేబులోపెట్టుకుని తొందరగా బయటకు పరుగెత్తాడు. అతనికి శారద చచ్చిపోయినందుకు విచారంకన్న, తనమీద నేరంపడుతుందన్న భయం, ఆదుర్దా ఎక్కువగా వుంది.

పొరుగువాళ్ళనీ, వీధిలోవాళ్ళని పోగుచేశాడు. వాళ్ళకు చీటీ చూపించి, ఏదో సంసారకలహం వచ్చిందనీ, శారద యీ మాత్రానికి తెగించిందనీ చెప్పి, గదితలుపు బాదాడు.

"గడియ అట్లానే ఉన్నట్లుంది. తలుపులు విరగొట్టా ల్సిందే" అన్నారొకరు.

"ఎంత అఘాయిత్యం." అన్నారు తెలుగువాళ్ళు. "రొంబ మోసం!" అంటున్నాడొక తమిళుడు.

ఆశ్చర్యం! తలుపు గడియతీయబడింది. సూట్ కేస్ చేతిలోపట్టుకుని శారద ప్రత్యక్షమైంది.

ఒకరు నవ్వారు, ఒక రేదో అన్నారు, ఇంకొక రేదో ప్రశ్నించారు. రాచయ్యనోట మాటరాలేదు.

శారద ఆలస్యంచెయ్యకుండానే "చూడండి, ఏవో అనుమానాలుపెట్టుకుని నన్ను చంపటానికి ప్రయత్నించా డీయన. నేను స్వతంత్రంగా బ్రతకటమే ఇతనికి కష్టంగావుంది,

నా కీ యింట్లో, ఇతనిచేతుల్లో చావు వ్రాసిపెట్టివుంది. ఇదుగో యీ చెంపమీద అతను కొట్టినదెబ్బతాలూకు వాతలు!" శారదవాళ్ళకు తనచెంప చూపించింది.

"పాపం!" అన్నారొకరు. తమిళుడొకాయన "ఎన్నా అయ్యా అది? బుద్ధి యిల్లే?" అన్నాడు. నీరద 'అమ్మా' అంటూ వచ్చి శారదనుచుట్టుకొంది. నీరద ఆమెను చుట్టు కోవడంతో అక్కడిజనంలో శారదపై సానుభూతి మరీపెరిగింది.

"నేను నా స్నేహితురాలిఇంటికి వెళ్ళిపోతున్నాను. ఈయనకూ నాకూ సంబంధంలేదు. నా బ్రతుకు నేను బ్రతగ్గలను. కోర్టులో అయినా ఇదే మాట చెప్పతాను"అని శారద కూతుర్ని ఎత్తుకుంది. జనంలో ఒకమనిషి ఆమెసూట్ కేసు తీసుకుని సహాయం చేశాడు. శారదజనంతోపాటు వెళ్ళిపోయింది.

జరుగుతున్నదంతా కలగా, నాటకంగా కనిపించి, రాచయ్యనోట మాటరాలేదు. ఆమె వెళ్ళిపోయింది. అందరూ వెళ్ళిపొయ్యారు. ఒకరిద్దరు రాచయ్య నుద్దేశించి "ఎన్న వేల?" (ఏం ఉద్యోగం?) అని ప్రశ్నించుతున్నారు. తను జవాబు చెప్పేటంతలో వెళ్ళిపోతున్న పొరుగింటిమొదలియారు "పాపం ఇన్నాళ్ళూ ఆమె సంపాయిస్తూంటే తింటూవుండాడు. ఇంకదా 'వేల' చూడాలి!" అన్నాడు.

నిజమే 'వేల'లోనే వుంది మనిషివెల! అనుకుని లోపలికి వెళ్ళాడు రాచయ్య.

# 29

రామయ్య రాచకీయాల్లో ప్రవేశించాడు. మొదట కాంగ్రెసులో సభ్యుడుగా వుండి, తర్వాత దానినుండి చీలి పోయిన ఒక పార్టీని తనజిల్లాలో బలపరచి ప్రాముఖ్యత సంపాయించాడు.

సినిమావాటాలపంపకంలో ఈశ్వరరెడ్డికుమాళ్ళతో వచ్చిన తగాయిదా, పార్టీవిభేదాలతో కక్షగా మారి, రామయ్యను వాళ్ళనుండి వేరుచేసింది. ఈశ్వరరెడ్డిమరణించాడు. అతని పెద్దకొమారుడు రాజారెడ్డి కాంగ్రెసుసభ్యుడు; రెండవ కొమారుడు రాచకీయాలకు దూరంగావున్నాడు.

రామయ్యకు తన పార్టీప్రముఖుల్లో మంచి పలుకుబడి వుంది. వేదమూర్తి బసవన్న కొండచేరిన నెలరోజులకు రామయ్య తనపలుకుబడి వినియోగించి క్రొత్తగా స్థాపితమైన ఒకకళా శాలలో లెక్చరరుపదవి యిప్పించాడు.

సెప్టెంబరు నెలలో వేదమూర్తివ్రాసినపుస్తకాన్ని ప్రచు రించటానికి ఒక మద్రాసుకంపెనీ అంగీకరించింది.

ఎన్నికల హడావుడి ప్రారంభమైంది. దేశంలో పార్టీల సంఖ్య పెరిగింది. స్వతంత్రఅభ్యర్థులు చాలమంది పోటీచేసే ప్రయత్నంలో వున్నారు.

డిసెంబరు వచ్చింది; ఎన్నికలప్రచారం, పొగడ్తలు, దూషణలు, వ్రాతలూ, ఉపన్యాసాలు, ఎటువైపు చూచినా వోట్లకోసం ప్రయత్నం సాగుతోవుంది. డబ్బుకు ఎక్కడలేని ప్రాధాన్యత కనిపిస్తోంది యీ ప్రజాస్వామ్యయజ్ఞంలో.

రామయ్య తన పార్టీఅభ్యర్థిగా అసెంబ్లీకి పోటీచేస్తున్నాడు. కాంగ్రెసుపార్టీటిక్కెట్టు ఒక శెట్టికి యిచ్చారు. రాజారెడ్డికి పార్టీటికెట్టు లభించ లేదు; స్వతంత్రఅభ్యర్థిగా పోటీ చెయ్యాటానికి నిశ్చయించుకున్నాడు. ఈ ముగ్గురితోబాటు ఒక కమూనిస్టుఅభ్యర్థికూడా పోటీచేస్తున్నాడు.

రామయ్య వేదమూర్తిని మూడునెలలు సెలవుపెట్టి రమ్మన్నాడు. ఎన్నికల్లో కార్యభారం అతనిమీద మోపాడు రామయ్య. కమ్యూనిస్టుఅభ్యర్థిమీద, ధనికుడైన కోమటిమీద వేదమూర్తి మంచి దెబ్బతీయగలిగాడు. అతని తెలంగాణా అనుభవాలు, కమ్యూనిస్టు సిద్ధాంతాలనుగురించినజ్ఞానం అందుకు బాగా పనికివచ్చాయి.

జనవరివచ్చింది. నామినేషన్‌పత్రాలు దాఖలయ్యాయి. అభ్యర్థుల బలాబలాలు చూచాయగా తెలుస్తున్నవి. రామయ్యకు రాజారెడ్డికి మధ్య మాత్రమే పోటీ తీవ్రంగావుంటుందనీ, మిగతావాళ్ళకు పెద్ద అవకాశంలేదనీ తేలుతూవుంది.

రాజారెడ్డిమీద దెబ్బతీయటానికి రామయ్య తనప్రచారంలో కొత్తవిషయాలు ప్రవేశపెట్టాడు. అంచనాప్రకారం కుల విభేదాలు సరిగ్గా పనిచేస్తే రాజారెడ్డి గెలవడని గ్రహించాడు. అంతేకాదు; రాజారెడ్డితండ్రి యీశ్వరరెడ్డి ఋణదాత. అప్పులు తీసుకొని తిరిగిఇవ్వలేక పొలాలుపోగొట్టుకున్నవాళ్ళు, రైతులు, సామాన్యకుటుంబీకులు, కొంత పలుకుబడివున్నవాళ్ళందర్నీ కూడదీసుకొనిరావటానికి రామయ్య ప్రయత్నం చెయ్యాలన్నాడు.

వేదమూర్తి తన కీవిధమైన ప్రచారంతో ఎన్నికలలో గెలవటం నచ్చదని రామయ్యతో చెప్పాడు. రామయ్య బదులు మాట్లాడలేదు.

కాని, వేదమూర్తికి తెలీకుండా గ్రామాల్లో రామయ్య అనుచరులు యీవిధమైన ప్రచారం తీవ్రంగా సాగిస్తున్నారు.

చివరకు బసవన్నకొండలోనే యీ ప్రచారం ప్రారంభమైంది. వేదమూర్తితండ్రి గోపాలస్వామి పొలమంతా వ్రాయించుకొని ఆయన మృత్యువుకుకూడ కారణమైన వాళ్ళు రాజారెడ్డికుటుంబమేనని గ్రామంలో ప్రచారం ప్రారంభమైంది. గోపాలస్వామిని గౌరవించిన, అభిమానించిన రైతులు ఇతరులు పైకి రాజారెడ్డికి వోటువేస్తామని చెప్పుతూనేవున్నా లోపల తమవోట్లని రహస్యంగా రామయ్యకే వాగ్దానంచేశారు.

వేదమూర్తి సంగతి తెలిసిపోయింది. కులతత్వం, డబ్బు, అసత్యప్రచారం, అన్నివిధాలైన వత్తిడిలు—వీటితో జరుగుతున్న ప్రజాస్వామ్యయజ్ఞంకాదు, ప్రజాస్వామ్యపుమాయా జూదంలో తను చిక్కువడిపోవటం అతనికి కష్టంగావుంది. ఒక రాచకీయపార్టీతో సంబంధం వద్దనుకుని వచ్చిన తను మళ్ళీ యీవిధంగా రాచకీయాల్లోదిగటం బుద్ధిహీనత అని తెలిసి వచ్చింది.

రామయ్యతోటి స్నేహబంధాన్ని కాదనలేక, రామయ్య గెలుపు ఏవో ఆశయాలమీద ఆధారపడివుంటుందనీ, ఆ విషయంలో తనకు పూర్తిబాధ్యతవుంటుందనీ, అనుకొని ఇందులో దిగాడు. కాని తను రామయ్యప్రచారానికీ, అతనిపార్టీకి ఒక

విధంగా ఉపయోగపడటం తప్పితే, తను వాళ్ళమీద చూపిన ప్రభావం ఏమీ కనిపించలేదు.

వాతావరణం, రామయ్య తనచుట్టూ పెంచుకొన్న బంధాలు అటువంటివి ! ఈ రాచకీయాల్లో వ్యక్తిత్వానికి చాల పై మెట్టువరకూ వెళ్ళేవరకు అవకాశంవుండదు కాబోలు!

చాలరోజులతర్వాత, ఆ సాయంత్రం ఒంటరిగా కొండ మీదికి వెళ్ళి, దేవాలయం వెనుకవైపు, చెఱువున్నదృశ్యాన్ని చూస్తూ కూర్చున్నాడు వేదమూర్తి.

అతనిలో ఒకవిధమైన నిర్లిప్తత, వింతశాంతి ప్రవేశి స్తూంది.

విశ్రాంతిలేకుండా దేనికోసమో పరితపిస్తూ ముందుకు వెళ్తూవుంటుంది చైతన్యం.

స్వేచ్ఛ, మానవత్వం, ఆత్మగౌరవం...యిప్పుడు సత్యం ... వీటిఅర్థాల్ని ఒకదానితర్వాత ఇంకొకటి అన్వేషి స్తూనేవుంది తనలోని జిగీష !

కాని ఎక్కడా, ఎప్పుడూ తనకు విశ్రాంతి, పరిపూర్ణత కనుచూపుమేరలో వున్నట్టు కనిపించటం లేదు !

అడుగడుగునా తను ఏదో పొరపాటు చేసినట్లేవుంది.

తండ్రిమాట వినక ఆయనమనస్సులోని అభిమానాన్ని, ఆశలని ఛేదించివేశాడు.

విమలని ప్రేమించటం; ఆర్థికశక్తికి లోబడని వ్యక్తిత్వం మీద నమ్మకం పోగొట్టుకొన్నాడు.

రంగయ్యఇంటికి వెళ్ళటం: ఆత్మగౌరవానికే భంగం తెచ్చుకున్నాడు.

ఎన్నికల్లో రామయ్యపక్షాన బాధ్యతవహించటంకూడ చివరకు పొరపాటుగానే తేలింది.

మంచీ-చెడూ రెండూ అన్నింటా సమభాగాలుగా కలిసే వున్నాయి; ఎక్కడా లోటులేని నిండుదనం, కొరతలేని నైర్మల్యం, ఆవేదనలేని ఆనందం లభించలేదు.

జీవితంతో పోరాటంసాగించేవాళ్ళకు, ఏదో చెయ్యాలని, సాధించాలని, ఫలితాల్ని ఆశిస్తూ జోక్యంకలిగించుకునేవాళ్లకు, యీ పరిస్థితి తప్పకు కాబోలు!

కొండమీద కూర్చుని యీ ప్రశాంతగంభీరతను అనుభవిస్తూన్న క్షణంలో తెలిసివస్తుంది — నిష్కామకర్మ అంటూ గీతలో చెప్పిన వేదాంతానికి బహుశా యిదే అర్థం అయివుంటుంది అని! ఏమని? పోరాటంలో, కర్మలో, లిప్తం కాని దూరస్థమైన, సత్యోన్ముఖమైన, మనస్థితి లభించినప్పుడే తనుకోరే నిండుదనం, ఆవేదనకతీతమైనఆనందం వస్తుందని.

రామయ్యమీద తనకు కోపంలేదు; ఎవరిమీద తనకు కోపంలేదు. రంగయ్యమీద కోపం, అసహ్యం కొన్నినెలల పూర్వం అక్కడినుండి వచ్చివేసినక్షణాల్లో కలిగినా, ఇప్పుడు అతన్నిగురించి కూడా నిర్లిప్తభావం కలుగుతోంది. బసవన్న కొండ విడిచివెళ్ళినతను, మళ్ళీ బసవన్నకొండకు తిరిగి వచ్చాడు. ఎన్నడో మరణించినతండ్రి తనకోసంచేసిన అప్పు,

దాన్ని తీర్చటానికి ధారపోసినభూమి... అది కడచిపోయినగాథ, ఎవరికీ సంబంధంలేనిసంగతి అనుకుంటే, ఉన్నట్టుండి యీ క్షణంలో అసత్యప్రచారమనేరూపంలో ప్రాణంపోసుకుని ఒక ముఖ్యమైన విషయంగా ప్రత్యక్షమైంది! ఎక్కడో గతానికీ, ప్రకృతానికీ కనపడని లంకెలు తగుల్తూవుంటాయి. మరి సత్యం కోసం తనిప్పుడు రామయ్యకు వ్యతిరేకప్రచారం చేయవలసిందేనా? అందువల్ల సత్యాన్ని ఉద్ధరించటంకాదు, రాజారెడ్డిని ఎన్నికల్లో బలపరచటంకూడా అవుతుంది! రామయ్యతో స్నేహబంధం తెగిపోయి ఊరుకుంటుంది. తనొక కృతఘ్నుడుగా తయారవుతాడు.

ఈ అసత్యప్రచారం స్వవిషయాన్ని గురించే అయినందువల్ల సత్యనిరూపణ తనధర్మం కాదా?

ఈ సమస్య ఎంత క్లిష్టంగావుంది! నిర్లిప్తంగా, నిష్కామంగా తనధర్మం — సత్యనిరూపణ చెయ్యటం — తను నిర్వర్తించవలసిందే.

అటుతర్వాత తనకు బసవన్నకొండతో సంబంధమేమీ వుండదు. రామయ్యకు ఎదురుతిరిగాడని, చివరకు తల్లికూడా తనముఖం చూడదు.

ఎక్కడికి వెళ్ళాలి? ఏం చెయ్యాలి?

జూలై 1951 — వినోబాభావే తెలంగాణా, పోచంపల్లిలో "భూదాన" సూత్రాన్ని ప్రవచించాడు. ఆయన ప్రసంగాలు, వ్రాతలూ గమనిస్తూనే వున్నాడు. కమ్యూనిజంతోటి అనుభవం తర్వాత తను వ్రాసినపుస్తకంలో వ్యక్తం

చేసిన భావాలకు ఒక క్రియాస్వరూపాన్ని ప్రసాదించాడు వినోబాభావే భూదానయజ్ఞం ద్వారా.

ఆ ఉద్యమంవిషయం చూడటమే తను తర్వాత చెయ్యవలసింది.

కొండ దిగివచ్చి ఇంటిదారిపట్టేటప్పటికి సూర్యాస్తమయంఅయి మసకగా వుంది.

ఆలోచనతో పరధ్యానంగా నడుస్తున్న వేదమూర్తికి వెనుకనుండి "తప్పుకోండి! తప్పుకోండి!" అనే కేక వినిపించి అతను వెనక్కి తిరిగి చూడబోయేటప్పటికి, దబదబ పరుగెత్తుకొని వచ్చి కోడెదూడ ఒకటి కొమ్ములు విసురుతూ మీద దూకింది. వేదమూర్తి ప్రక్కకి పడిపోయ్యాడు. కోడె పరుగెత్తుకుని వెళ్ళిపోయింది. ఎడ్లనుతోలుకొని వెనుకవస్తున్న పాలేరు వేదమూర్తిని లేవనెత్తాడు.

వేదమూర్తికి బలమైనగాయం తగిలింది.

తడిసిపోగా నేలమీద కాల్వగట్టింది రక్తం.

సంక్రాంతి తర్వాత జరిగే పశువులపండుగకోసం బాగా కొమ్ములు చెక్కి పదనుచేశాడు పాలేరు. ఆ కోడెకొమ్ము బాకులాగా వేదమూర్తికి ఎడమవైపుడొక్కలో దూసుకుని పెద్ద గాయంచేసింది.

వేదమూర్తికి స్పృహతప్పింది. అదృష్టవశాత్తు వెనుకనే వస్తున్నారు ఇద్దరురైతులు. వాళ్ళ సహాయంతో ఆ పాలేరు అతన్ని ఇల్లుచేర్చాడు.

ఆ పాలేరు రాజారెడ్డి మనిషి; ఆ కోడె రెడ్డిఇంట్లోనే పుట్టి ఆప్యాయంగా చూడబడుతున్న దూడ.

ఊరంతా ప్రాకిపోయింది వార్త. ఈసంఘటనలో ఏదో కొంత ద్వేషం, ప్రత్యర్థులస్పర్థ కూడ అంతర్లీనమై వుంటుందని జనం అనుమానపడ్డారు.

రామయ్య గ్రామంలో లేడు.

వేదమూర్తిని వెంటనే బానులో హాస్పిటలుకు తీసుకు వెళ్ళారు.

రక్తం ఎక్కువగానే నష్టమైపోయిందనీ, బలమైనదెబ్బే తగిలింది కాని, ప్రాణభయంలేదనీ చెప్పాడు డాక్టరు.

రెండురోజులక్రితమే హైమవతిదగ్గరనుండిబసవన్నకొండ తిరిగివచ్చిన వేదమూర్తితల్లి ఆస్పత్రిలో కొడుకుదగ్గర వుంది.

మరుసటిరోజు ప్రొద్దున్న రాజారెడ్డి స్వయంగా ఆస్పత్రికి వచ్చి వేదమూర్తిని పరామర్శించాడు. అతని రాక వేదమూర్తికి ఆశ్చర్యాన్ని, ఆనందాన్ని కలిగించింది. ఎన్నికలప్రచారం విషయం చెప్పుదామని వేదమూర్తికి నాలుకదాకా వచ్చింది కాని, ఎందుకో ఊరుకున్నాడు. రాజారెడ్డికూడా అయిదు నిముషాలకుమించి వుండలేదు.

చివరకు ఆ విషయం తను ప్రస్తావించకపోవడమే ఎంతో మంచిదనిపించింది వేదమూర్తికి.

తనకు కలిగిన ప్రమాదంవల్ల తల్లి తనప్రక్కన చేరటం, రాజారెడ్డి తలవనితలంపుగా చూడటానికి రావటం, అదొక తృప్తిగావుంది వేదమూర్తికి. ఈ అనుభవంలో ప్రశాంతంగా ఎన్నికలు, సత్యాసత్యప్రచారాలు, ద్వేషాలు, స్పర్థలు దూరమైపోయి, అప్రస్తుతంగా తోచాయి.

తండ్రిమరణం తర్వాత తల్లివాత్సల్యం, ఆప్యాయత కరవైపోయాయి...యీ ప్రమాదంతో ఆమె మళ్ళీ తనకు దగ్గరై పోవటం ఎంతో విచిత్రంగా వుంది. తనై సాధించలేని ఫలితం అది.

మంచంమీద పడుకుని పైకిచూస్తూ ఆలోచిస్తున్న వేదమూర్తిమనస్సు గతంవైపు చాలదూరం ప్రయాణం చేస్తోంది. మళ్ళీ ఆ క్షణాల్ని అనుభవించినట్లే, ఒక్కొక్క పరిస్థితి, ఆ భావోద్వేగం చూచాయగా తనని స్పృశిస్తూ అదృశ్యమౌతూవున్నాయి.

కాలేజిలో తను పాఠంచెప్పిన ఆబోతుకావ్యం...లీల సానుభూతి...తండ్రిమరణానికి ఆబోతుకూవున్న ఏదో వివరింప లేనిసంబంధం...బసవన్నకొండ యొక్క ఆబోతుస్వరూపం... కొండ దిగివస్తూంటే ఆబోతు కల్గించిన ప్రమాదం...తనకు చిన్నప్పటినుండీ ఆబోతులన్నా, ఎద్దులన్నా ఉన్న భయం.

తను నిశ్చయించుకున్న ప్రయాణానికి అంతరాయం కలిగింది యీ ప్రమాదంవల్ల; అంతేకాదు, ప్రయాణానికన్న ముఖ్యమైనవిషయం—అసత్యప్రచారాన్ని ఖండించటం! ఇప్పుడు దేనికీ అవకాశంలేదు. మంచంమీద పడివున్నాడు. ఎన్నికలు ముగిసేదాకా లేవలేడు.

అంతేకాదు. ఆఅసత్యప్రచారానికి మరికొంత దోహదం కలిగింది. తన్ను పొడిచిన ఆబోతు రాజారెడ్డికి చెందివుండడం దానికి కారణం. తనేం చెయ్యగలడు?

రామయ్య వచ్చాడు. "ఎట్లా వుందయ్యా, వేదూ? నొప్పి ఎక్కువగావుందా ?" అంటున్నాడు ఆప్యాయంగా.

అతనికంఠం తనగాయాన్ని స్పృశించి బాధిస్తుందేమోనన్నంత మృదువుగా వుంది.

"కదలకుండా పడుకుని వుంటే ఫరవాలేదు...కాని కొంచెం కదిలినా నా ప్రాణంతీసినట్లుంటుంది." అన్నాడు వేదమూర్తి.

"ఏదో అదృష్టం! పెద్దగండమే గడచింది అని సంతోషించాలి."

"పొద్దున రాజారెడ్డి వచ్చాడబ్బాయ్!" అని ఆశ్చర్యాన్ని వ్యక్తంచేస్తూ చెప్పింది వేదమూర్తితల్లి రామయ్యతో.

"ఊఁ...ఏమిటి ,విశేషం" అన్నాడు గంభీరంగా రామయ్య.

వేదమూర్తి "బావా!" అని తనచేయి రామయ్యవైపు చాచాడు. రామయ్య "ఏం?" అంటూ చేయి అందించాడు.

"బాధ్యత నీదే, నాకు జోక్యంలేదు...కాని వాళ్ళని గురించి అసత్యప్రచారాలు వద్దు." అన్నాడు వేదమూర్తి.

మాట్లాడకుండా వేదమూర్తిముఖంలోకి చూస్తూ కొంతసేపు వుండి, రామయ్య చివరకు చిరునవ్వుతో అన్నాడు "అందరూ గాంధీమహాత్ములు, వేదమూర్తులూ అయితే లోకం ఏమైపోతుంది? ఎట్లా నడుస్తుంది? బాధ్యతనాదైనప్పుడు బాధ నీ కెందుకయ్యా?"

వేదమూర్తి జవాబుచెప్పలేదు. పనివుందని రామయ్య వెళ్ళిపోయాడు.

రామయ్య తనుకోరినట్లు మాటయివ్వలేదు. కాని అతనన్నమాటల్లో ఒక విశిష్టత వుంది.

ఎవరిబాధ్యత వారిది!

జీవితంలో యథార్థం రామయ్యకు బోధపడినంతగా తనకు బోధపడలేదేమో! సిద్ధాంతాలు, ఆలోచన ఉన్నట్లు కనిపించకపోయినా, రామయ్యలో ఇతరులను అర్థంచేసుకోగల విశిష్టగుణం ఉంది. అతని అభిమానం, ప్రేమ సంకుచిత రూపంలోనే కొందరిమీదే, వ్యక్తమౌతూవుండవచ్చు; కాని వాళ్ళకైనా అతను సహాయకారిగా అండగా నిలిచినంత మాత్రం తను నిలవలేకపోయాడు. ఆ విషయంలో రామయ్య జీవితంలో సాధించిన విజయం తనకు లభించలేదు. ఒకరిమీద ఆధారపడటమే తనకు ఎప్పుడూ సంభవిస్తూవుంది. తను సంఘానికికాని, వ్యక్తులకుకాని చేసిన మేలేమీ లేదు.

ఎన్నికలవిషయంలో రామయ్యధోరణి రామయ్య అనుసరించటంలో ఒకన్యాయం ఉంది. తను సహాయకారి మాత్రమే; బాధ్యత అంతా రామయ్యదే! అదే అతని సమాధానం. తన కిష్టంలేనప్పుడు తప్పుకోవాలిగాని, రామయ్య కెదురుతిరిగి, అతను తనుచెప్పినట్లు చెయ్యాలనీ, చెయ్యకపోతే వ్యతిరేకప్రచారం చేస్తాననటం సమంజసం కాదేమో!

మనవాళ్ళని మనం మార్చటానికి ప్రయత్నించటం, వాళ్ళలోపాల్ని దిద్దటం మంచిదే, కాని అందులో పోరాటం, విరోధం అన్నభావానికి అవకాశం వుండరాదు. తనకు రామయ్యకు వున్నభేదం యిదే.

తనవాళ్ళలోపాల్ని వ్రేలితో చూపిస్తూ, వాటితో తల పడటానికి రామయ్య తొందరపడడు; ప్రేమించి తనకు చేత

నైన సహాయంచేస్తాడు. అట్లా చెయ్యలేకపోవటమే తనలోని లోపం కాబోలు.

తన 'పొరపాట్ల'కు మూలం అదేనా ?

తండ్రి కష్టాన్ని కోరటమే గుర్తించాడు కాని, ఆయన ఆవేదనను, మనస్సును అర్థంచేసుకోలేదు.

విమల నిరాకరించటం, సందేహించటమే గుర్తించాడు కాని, ఆమెపరిస్థితిని, మనస్సును సానుభూతితో గ్రహించలేదు. ఆమెవిషయంలో నిజంగానే తొందరపడ్డాడు.

తనలో తొందరపాటు, అసహనం, స్వార్థం వున్నాయి. తను ఇతరులను ప్రేమించిన దెప్పుడు, ఎంతవరకు ? అందుకే తన కీ అపజయం, అసంతృప్తి! ఆ అహంభావమే రామయ్యా బాధ్యతను తనబాధ్యతగా ఎంచి, అట్లా వీలుకాలేదని రామయ్యతో సంబంధం తెంచుకోవటానికి ప్రోత్సహిస్తూవుంది.

అసత్యప్రచారాన్ని ఆపుచెయ్యమని రామయ్యను కోరటంకంటె మించిన బాధ్యత తనపైన వున్నదా ? ఈ బాధ్యతకు అంతం ఎక్కడ ? ప్రపంచంలోని అసత్యానికి తనబాధ్యత ఎంతవరకు ? అది తేల్చుకోవటం చాల సందిగ్ధవిషయమే ! బహుశా బాధ్యతవుందన్న అహంభావంతోనే ప్రవర్తించే వాడు సాధారణపరిస్థితుల్లో. దానిఫలితం తప్పకుండా రామయ్యతో విరోధమే అయివుండేది !

కాని ధర్మనిర్ణయసమస్య తనకుచెందకుండా, తన్ను అశక్తుణ్ణిచేసి, రంగంనుండి తప్పించివేసింది ఆబోతు ! ఇప్పుడు తను చెయ్యగలిగింది రామయ్యను స్నేహబంధంద్వారా

ఓ త్రిడిపెట్టటం మాత్రమే! అదే తనబాధ్యత అని విధిని ర్ణయం కాబోలు!

జూలియస్ సీజరును చంపటమా వద్దా అన్నవిషయంలో బ్రూటస్‌కు వచ్చిన సమస్యలాగే వుంది తనసమస్యకూడా! వ్యక్తిగత ప్రేమానుబంధం ఒకవైపు, అనిశ్చితమైన ఒక ధర్మ సాధనకోసం ఆ బంధాన్ని త్రెంచివెయ్యటం ఇంకొకవైపు! రెండవమార్గాన్ని ఎంచుకొన్న బ్రూటస్ చివర అన్నమాటలు వ్యక్తిగతప్రేమానుబంధాలవిలువను నిరూపించేమాటలు, తన కెదురైన స్నేహం, విశ్వాసమే అతనికి జీవితంలో పరమార్థాన్ని సూచించాయి అని! వేదాంతసిద్ధాంతాలు ఒక హాంగు మాత్రమే!

బ్రూటస్‌కుకలిగిన సమస్య తన్నెదుర్కొనకుండాచేసింది విధి. ఆబోతు విధిస్వరూపం. గర్వంతో, అహంభావంతో నమ్రత, సహనంలేని తన్ను ప్రక్కకుత్రోసి పడవెయ్యగలిగింది విధి—ఆబోతు స్వరూపంలో పరుగెత్తుకొనివచ్చిన విధి.

ఎడతెగనిఊహాలలో అలసి, కన్నులుమూశాడు వేద మూర్తి.

సాయంత్రం అయిందింటికి రామయ్యభార్య వచ్చింది వేదమూర్తిని చూడటానికి.

కళ్ళుమూసుకుని మెలకువగానేవున్న వేదమూర్తికి తల్లి ఆమెతో చెప్పతున్న మాటలు వినిపిస్తున్నాయి.

"మూడేళ్ళ బిడ్డగావున్నప్పుడు ఇట్లానే జరిగింది. ఎద్దు బెదరి పరుగెత్తివస్తుంటే బోర్లగిలాపడిపోయాడు. కాస్తలో తప్పిపోయిందిగాని, తొక్కివెయ్యాల్సిందే! తెలివితప్పిపోయింది

బాగా జడుసుకున్నాడు...మంత్రం పెట్టించి ఎన్నో చేశాము. చాలరోజులు రాత్రిళ్ళు కలవరించేవాడు...ఎద్దులంటే ఎప్పుడూ భయమే! ఒకనాడైనా పలుపుతాళ్ళు పట్టుకొని ఎరుగునా? గడ్డి వెయ్యటానికి గుండెలున్నాయా? ఒకసారి సంక్రాంతికి పీణ్ణెత్తుకొని వాళ్ళ నాన్న, తను కొత్తగా కొనితెచ్చిన ఎడ్ల దగ్గరకు గొప్పగా తీసుకువెళ్తే అందులో ఒకటి కొమ్ము విసిరిందట. ఒకటే ఏడ్పు. ఆగకుండా. 'పట్టి పిరికిగుండెవాడు, వ్యవసాయం చేసుకొనేవాళ్ళయింట్లో వీడెందుకు! మన కేం పనికొస్తాడు?' అన్నారు వాళ్ళనాన్న.

వేదమూర్తి చటుక్కున తల్లికేసి తలత్రిప్పి, నవ్వుతూ "అమ్మా! అందంతా చిన్నప్పుడు—యిప్పుడు నాకేం భయం లేదు. లక్ష్మమ్మా! అమ్మమాటకేంగాని, నాకు నిజంగా వ్యవసాయం చెయ్యాలని వుంది...ఏమంటావు?" అన్నాడు.

"ఆఁ! ఉద్యోగం ఇంతమాత్రం చేశావ్, ఇంక వ్యవసాయం చెయ్యాలి!" అని నిట్టూర్పువిడిచింది వేదమూర్తితల్లి.

వేదమూర్తి మనస్సులో బాణం గ్రుచ్చుకొన్నట్లయింది.

"దానికేం అన్నయ్యా, మీ బావ రాచకీయాల్లో దిగారు; ఇక మీరు ఎల్లాగూ వ్యవసాయం చూడవలసిందే!" అన్నది రామయ్య భార్య.

రామయ్యభార్య పరాయి యింటి ఆడబడుచైనా, హైమవతికీ యీమెకూ తనపట్లవున్న ఆదరభావం ఒకటే! రామయ్యకుటుంబాన్ని తలచుకుంటే అతనికి జీవితంలో దేని వల్లా కలుగనితృప్తి కలుగుతుంది.

* * *

# అనుబంధాలు

జీవితరహస్యాన్ని ఆకళింపుకు తెచ్చుకోవాలని, ధర్మాధర్మాలు, సత్యాసత్యాలు తఱచి అన్వేషించే మేధాశక్తి మహత్తరమైన దేశాని, శాంతిని, ప్రేమను అనుభవించి, పంచుకోగల ప్రేమానుభూతికి, దానికి, అవినాభావసంబంధం ఉన్నట్లు లేదు. విరామమెరుగని తరంగవిజృంభణ ఒకటి, చంద్రికాస్నాపితమైనసరోవర మింకొకటి.

వెన్నెలవచ్చింది...విమలజ్ఞాపకంవచ్చింది వేదమూర్తికి.

అడయారులో సముద్రపుటొడ్డున విమలచేతిగాజుల్ని కదిలిస్తూవున్న క్షణాల స్మృతి ఉద్వేగం కలిగించింది.

ఎన్నోరోజులైంది...ఆమెచదువుపూర్తిఅయివుంటుంది. ఏదైనా ఉద్యోగం చేస్తూవుండేమో !

నాటకంరోజు, ఆమె పాటలు ముగించినతర్వాత, పరధ్యానంలోవున్న తనవైపు చూచినక్షణంలో, హృదయగతమైన ఆమె సౌందర్యరేఖ మళ్ళీ మనస్సుని మంత్రముగ్ధంచేస్తోంది.

వేదమూర్తికి నిద్రపట్టింది.

మెత్తనిపచ్చికమీద, వెల్లకిలాపడుకుని ఆకాశాన్ని చూస్తూ మేఘాలకదలికను గమనిస్తూవున్న తనదగ్గరకు, పచ్చికమేస్తూ, మెల్లగా వచ్చిన ఆవు—తెల్లటిది తన పొట్టమీద, ఎడమవైపు ఆప్యాయంగా నాకుతోంది. చక్కిలిగింతకలుగుతూన్నాఓర్చుకుని,ఆవుసౌందర్యాన్నిచూస్తూ ఆనందిస్తున్నాడు. ఇక ఓర్వలేక తప్పుకోవాలని ప్రక్కకు కదిలాడు. మెలకువవచ్చి గాయం తీవ్రంగా బాధపెట్టింది.

తనకు ఆబోతులు, ఎడ్లూ, ఆవులూ అంటే భయ మెందుకు ?

నిజంగా భయంలేదు. ఆవు తనని ఆప్యాయంగా స్పృశించటం తనకు ఎంతో బాగుంది.

మనతో సంబంధంకలిగి, జాగ్రదావస్థలో కళ్ళకుకనిపించే లోకానికి, మనస్సులోని అంతరాంతరాల్లో లిప్తమైన లోకానికి సమన్వయం కుదరకపోతే శాంతి లభించదు కాబోలు ! ఈ రెండింటిలో దేన్ని కాదన్నా, ఒకదానిబదులు ఇంకోదాన్ని అదేనని భ్రమపడినా చిక్కువస్తుంది. కాని నిత్యజీవితంలో ఈ లోకాలు రెండూ సమ్మేళనచెందుతూనేవుంటూ మనిషిఅను భూతిని వ్యక్తిత్వాన్ని నిర్ణయిస్తాయి.

పొడుస్తుందని చిన్నప్పటినుండి భయపడిన ఆబోతు పొడవనే పొడిచింది. దానితో ఆ భయంకాస్త తీరిపోయినట్లుంది నిజంగా ఆబోతులో ఎంత సౌందర్యం, శివి వుంది. చైతన్యానికి సంజ్ఞారూపం ఆబోతు. అందుకే బసవేశ్వరునిగా పూజిస్తారు.

తనలోని ఆబోతు పారిపోతున్న తన్ను పొడిచింది.అందువల్లనే తల్లికి, రామయ్యకు, బసవన్నకొండకు దూరంకాకుండా నిలిపాడు; పారిపోవటం కాదు, నిలవటమే జీవితం.

విచిత్రంగా లేదూ జీవితం ! కాదు, జీవితాన్నిగురించిన ఊహల్లోనే ఉందేమో విచిత్రమంతా ! ఏది పిచ్చి, ఏది కాదు? వేదమూర్తి నవ్వుకున్నాడు. తెల్లవారింది.

# 30

"ఏడాదిన్నరలో నేను రిటైరవుతాను. నాకు ఆరోగ్యం కూడా చెడింది. వెళ్ళి సీతాపురంలో సెటిల్ అవుదామనుకుంటు న్నాను. అక్కడ ఏడెకరాలపొలం కొన్న విషయం నీకు తెలుసు. అదివరకు మనకున్న మూడెకరాలతో కలిసేవుంది యిదికూడ. ఈ సంవత్సరం ఆ గ్రామానికి ఎలెక్ట్రిసిటీకూడా వస్తుంది. అక్కడ ఇల్లుకట్టుకుంటే నేను రిటైర్ కాగానే వెళ్ళడానికి వీలుగా వుంటుందని ఆలోచించి మొన్న ఒక సైట్‌కూడా చూచి వచ్చాను. విశ్వేశ్వరశాస్త్రి చాలఏళ్ళుగా, నేను సర్వీసులో ప్రవేశించినప్పటినుండి ఎరిగున్నవాడు. చాల సత్పురుషుడు. మొదట ఆ మూడెకరాలు అతనిదగ్గరే కొన్నాను. ఇప్పుడు కొన్న ఏడెకరాలు అతని దాయాదులకు చెందింది. నాకు మన ఊరు వెళ్ళాలనీ, అక్కడుండాలనీ లేదు. మన కక్కడేమీలేదు కూడా. పదేళ్ళక్రితంవుండిన ఇల్లు అమ్మివేశాను. విశ్వేశ్వర శాస్త్రిని నువ్వు హైస్కూలులో చదువుతూవున్నప్పుడు మనింటికి వస్తే, ఒకసారి చూచావు. నీకు జ్ఞాపకంవున్నాడో లేడో! నేననే దేమిటంటే, నువ్వు ఆ వూరువెళ్ళి సైట్ చూచి, ఇల్లుకట్టే సంగతి విచారించి ఒక ఏడాదిలో ఆ పని పూర్తిఅయ్యేట్లు చూడాలి. ఈబాధ్యత నిర్వహిస్తావనే నిన్ను రమ్మని వ్రాశాను. నువ్వు ఇంటిడిజైనూ అదీ, సెలక్టుచేసుకుని అంతా శాస్త్రిగారికి చెప్పితే, ఆయన శ్రద్ధతీసుకుంటాడు. మనం నెలకో రెండు నెలలకో వెళ్ళి చూచుకుంటే చాలు. నాకాయన అంతటి ఆత్మీయుడు! ఇదంతా నీతో ఎందుకు చెప్పతున్నానంటే,

ఆ కట్టే ఇల్లు నువ్వుకూడా నాతోవచ్చివుండేట్టుగా వుండాలి. ఇన్నాళ్ళూ నువ్వెక్కడో వుండటం, మేం ఊళ్ళుతిరుగుతూ వుండటం అయిందే. నా ఉద్దేశ్యం ప్రభాకర మీాసారి స్కూలు ఫైనలు పాసవగానే వాడు నీతో వుండాలి అని. వానిబాధ్యత నువ్వు వహించాలి. తర్వాత మీారిద్దరూ సెలవుల్లో తప్పకుండా సీతాపురంవచ్చి వుండాలి. నీ వివాహంవిషయం ఏం చేసుకున్నావో నాకేమిా చెప్పలేదు. ఇప్పుడైనా నువ్వు చేసుకుంటే బాగుంటుంది అనుకుంటాను. కాని ఆ విషయం, నేను నీకెప్పుడో ఇచ్చిన మాటప్రకారం, నిన్ను మళ్ళీ అడగను."

సుందరరావుతో ఇంత విపులంగా వ్యవహారవిషయాలు చెప్పి, నీ బాధ్యత అంటూ ఒకటి చెయ్యమని ఇంతవరకు తండ్రి శ్రీధరరావు ఎప్పుడూ అప్పగించలేదు. తండ్రితోటి సంబంధంలో మూడోఅధ్యాయం క్రొత్తది ప్రారంభంకాబోతోంది, అనుకున్నాడు సుందరరావు.

మొదటిఅధ్యాయం, తన తల్లి మరణం! ఆయన రెండవ పెళ్ళితో అది ఆఖరయింది. అప్పటినుంచి, ఈ పది పండ్రెండేళ్లు జరిగింది రెండోఅధ్యాయం. ఇప్పు డదీ పూర్తిఅయినట్లే. ఇన్నాళ్ళూ తన నేవిషయంలోను ప్రశ్నించలేదు. తన్నేమిా కోరలేదు. సెలవులకు రమ్మని వ్రాసి రప్పించుకొనేవాడు; తను సంపాయిస్తున్నప్పటికీ వెళ్ళినప్పుడల్లా నాలుగైదువందలు డబ్బు ఇచ్చేవాడు. "ఎందు కిదీ, నాకేమవసరాలున్నాయనీ ?" అని ఒకసారి అంటే, "అవసరంలేకుంటే బాంక్‌లో వేసి వుంచుకో!" అనేవాడు. తనకు ఆ యింటిలో సరైనస్థానం లేదని అందువల్ల ఒకవిధమైన సమబుద్ధి చూపించాలనీ ఆయనచేసే ప్రయత్నం

కాబోలు! అని అనుకొని ఆశ్చర్యపడేవాడు సుందరరావు. ఇంత ప్రేమ చూపించినా ఒక్క-సారైనా ఆయనై తనదగ్గరకు వచ్చి వారంరోజులు వుండలేదు. ఇప్పుడు తనమీద మోపు తున్న బాధ్యత సమంజసంగానే వుంది. తను వచ్చినప్పుడల్లా తమ్ముడు ప్రభాకరంమాత్రం చనవుగా వుంటున్నాడు; అందు చేత వాణ్ణితనదగ్గర వుంచుకోవడానికే అభ్యంతరం వుండదు. కాని, ఎటొచ్చీ తన సవతితల్లి తన కింకా క్రొత్తవ్యక్తే! ఆమె తనకన్నా ఏ రెండుమూడేళ్ళో మాత్రమే పెద్దది. ఆమెవల్ల ఏ లోపం లేకుండా అతిథి మర్యాదలన్నీ తనకు జరుగుతాయి. కాని ఆ యింటిలో తనకుండవలసినచనవు మాత్రం లేదు. ఒకవిధంగా అది తనస్వభావంలో లోపమే కావచ్చు, కాని ఉన్నసంగతి మాత్రం అంతే.

ఏమీ మాట్లాడకుండా ఆలోచిస్తూ కూర్చున్న సుందర రావుతో తండ్రి అన్నాడు: "ఏమిటాలోచిస్తున్నావు? నా ఉద్దేశ్యం చెప్పాను. నీ అభిప్రాయంకూడా ఏమిటో వినాలనే చెప్పాను, ఏమంటావ్?"

"మీరు చెప్పినట్లు చెయ్యడానికి నేను సిద్ధమే. ఈవిష యాలు చూడటానికంటే నేను ఇప్పుడు వేరే చేస్తున్ననిర్వాకం కూడా ఏమీ లేదు. కాని సెలవుల్లో ఏదో టూర్ వెళ్ళటం, అలవాటైన తర్వాత, బొత్తిగా ఎటూ వెళ్ళకుండావుండటం కొంచెం కష్టమేమో!" అని నవ్వాడు సుందరరావు.

"వెళ్ళొద్దని నేను నిర్బంధంచేస్తూవున్నానేమిటి? అంటే, ఒక భేదం వుంది చూడు! నా దగ్గిరికికూడా ఏదో టూర్కోసం

వచ్చి వెళ్ళినట్లు కాకుండావుండాలని అభిప్రాయం, అంతే!"
అన్నా డాయన.

* * *

విశ్వేశ్వరశాస్త్రి శ్రీధరరావుకన్న పెద్దవాడు. అరవై సంవత్సరాలుంటాయి. సుందరరావురాకకు వుప్పొంగిపోయాడు. గబాగబా లోపలికి వెళ్ళి పెళ్ళాన్ని తీసుకువచ్చాడు.

"అన్నయ్య కులాసాగా వున్నారా?" అని ఆమె కుశల ప్రశ్నలు వేసింది. "ఒక నెలక్రితం యిక్కడికి వచ్చినప్పుడు సుస్తీచేసిందన్నారు. ఇప్పు డెట్లావుంది ? ఇంకొకఏడాదికి పించనీఅవుతే, యీవూళ్ళో యిల్లు కట్టుకుంటారట కదూ! మా కెంతో సంతోషంగా వుంది." అన్నదామె.

వాళ్ళఆత్మీయత, అభిమానము—యిన్నాళ్ళూ మరచిపోయిన బంధుత్వ మేదో గుర్తువచ్చి తను తిరిగివచ్చినట్లు, మనస్సు ఆహ్లాదంతో విప్పారినట్లు—అనుభవించాడు సుందరరావు.

లోపలనుండి మూడేళ్ళకుఱ్ఱవాడు దిసమొలతో, అందెల చిరుగజ్జెల మధురధ్వానంతో బిలబిలా వచ్చి, విశ్వేశ్వరశాస్త్రివళ్ళోకి ఎక్కికూర్చున్నాడు. "ఎవరుతాతా?" అని, సుందరరావును వ్రేలితో వయ్యారంగా చూపిస్తూ అడిగాడు.

"బాబాయి" అని చెప్పా డాయన.

బంధుత్వము, వరుసలూ అన్నీ ఇదివరకే స్థిరపడివున్నాయన్నమాట!

"మా పెద్దమ్మాయికొడుకు. వీడికి వాళ్ళఅమ్మమ్మదగ్గర పిన్నిదగ్గర మాలిమి. ఈసారి వదలిపెట్టి వెళ్ళింది." అన్నా డాయన.

పెద్దావిడ కుఱ్ఱవాడిచొక్కా తీసుకువచ్చి, "కృష్ణమ్మా, చొక్కా వేసుకోకుండా రావచ్చా? వేసుకుందువు రా" అని పిలిచింది.

చొక్కా తొడిగినతర్వాత బొత్తములు తనే పెట్టు కుంటాననీ, ఆమెను పెట్టనివ్వకుండా మారాము సాగించాడు కృష్ణుడు. ఒకటి తను పెట్టుకోగలిగాడుకూడా. మిగతా రెండూ చేతకాలేదు. "తాతా నువ్వు" అని వాళ్ళతాత ఒకటి పెట్ట గానే "బాబాయికూడా ఓటి, ఏం" అని ముద్దుగా తలతిప్పు కుంటూ తాతతో చెప్పి, సుందరరావుచేరువకు వచ్చాడు చిన్ని కృష్ణుడు.

సుందరరావు నవ్వుతూ బొత్తము పెట్టి, దగ్గరకులాక్కుని ముద్దుపెట్టుకున్నాడు.

బుగ్గ తుడుచుకుంటూ, సిగ్గుపడి ఓరచూపులుచూస్తూ "ఛా! నువ్వు చెడ్డ!" అని వేలితో అతన్నిచూపిస్తూ, విడి పించుకుని వాళ్ళఅమ్మమ్మదగ్గరకు పరుగెత్తాడు.

వృద్ధదంపతులఆదరణ కలుపుగోలుతనం ఒక యెత్తు, చిన్నికృష్ణునిమాధుర్యం ఒకయెత్తు అనిపించింది సుందరరావుకు.

స్నానంచేసి భోజనానికిసిద్ధమవుతూ, తన యీ క్రొత్తఅనుభవాన్ని ఆకళింపుకు తెచ్చుకుంటున్నాడు. వృద్ధుల ఆదరణ, శిశువులముగ్ధవిలాసం యీ రెండూ పదేళ్ళుగా జీవి తంలో ఎక్కడా తన్ను స్పృశించనే లేదు! ఆ రెండింటిలో

అంత మాధుర్యం వుంటుందని కూడా ఊహించలేదు. ఈ యింట్లో ఆ రెండూ లభించినవి.

భోజనందగ్గర ఆ యింట్లో యిక మిగిలిన ఒకవ్యక్తి కూడా ప్రత్యక్షమైంది. ఆమె శాస్త్రిగారి కడసారి కూతురు; పద్ధెనిమిది ఇరవైఏళ్ళఅమ్మాయి. ఆమె అందమైన ముఖంలో వ్యక్తమౌతూన్న సౌమ్యత, గంభీరప్రశాంతత చూచిన సుందరరావుకు ఆ కుటుంబంలో అపురూపమైన పరిపూర్ణత, స్వచ్ఛత వున్నాయనిపించింది.

ఎక్కడా సామాన్యంగా కనుపించని సమన్వయ పరిపూర్ణత అది. చిన్నవాళ్ళు నచ్చితే, పెద్దవాళ్ళు నచ్చక పోవచ్చు; పెద్దవాళ్ళు మంచివాళ్ళనిపించినా, చిన్నవాళ్ళలో ఏవో లోపాలుండవచ్చు. బాహ్యసౌందర్యమున్నా వాక్పారుష్యమో, బుద్ధివక్రతో బాధ కలిగించవచ్చు. కాని అన్నీ సమన్వయంచెంది, ప్రశాంతి, ఆనందము పరిపూర్ణంగా కనిపిస్తూన్న ఆ గృహం అపూర్వంగా వుంది!

మేడమీద రెండుగదు లున్నాయి. అందులో ఒక గది సుందరరావుకు ప్రత్యేకించారు. ఆ గదిలోనుండి ఇంటి వెనుకభాగంలో వున్న పెద్దతోట కనిపిస్తూవుంది. బాదామి చెట్లు, నిమ్మచెట్లు, కొన్ని మామిడిచెట్లు, మిగతావన్నీ పూల చెట్లు, గన్నేరుచెట్లు గుంపులు గుంపులుగా ఎత్తుగా పెరిగి వున్నాయి. ఆ యిల్లు వూరికి ఒకచివర వుందేమో, ఆ యింటికి కుడివైపుగా దూరాన తోటలు, పొలాలు కనిపిస్తాయి. ఎడమ వైపున అంజనేయస్వామి దేవాలయం. దేవాలయంవెనుకనే కోనేరు. దేవాలయానికి ఒకప్రక్క కొంత ఎత్తుగావున్న ఖాళీ

స్థలాన్ని చూపించి శాస్త్రి "అదే మీ నాన్నగారు కొనదలచు కొన్న స్థల"మని చెప్పారు.

మధ్యాహ్నం విశ్రమించినతర్వాత సాయంత్రం నాలు గింటికి శాస్త్రిగారి మామిడితోటవైపు, తరువాత పొలంవైపు వెళ్ళారు. సుందరరావు తండ్రికొన్న పొలమూ దానితో కలిసేవున్న తనపొలం రెండెకరాలుకూడ చూపించారు శా స్త్రి గారు.

ఆ వూరిపరిసరాలు, తోటలు, పొలాలు అన్నీ మనో హరంగా వున్నాయి. ఆ వూరిని, ముఖ్యంగా శాస్త్రిగారి కుటుంబాన్ని, తండ్రి ఎందుకు ఎన్నుకున్నాడో ఎందు కంత ప్రేమిస్తాడో సుందరరావు కిప్పుడు బాగా అర్థమైంది.

శాస్త్రికి ఎనిమిదెకరాల పొలం, తోట, ఇల్లు వుండేవి. ఆయన మొదటి ఇద్దరు కూతుళ్ళకు పెళ్ళిళ్ళు చేయటానికి ఆరెక రాలపొలం అమ్మివేశాడు. అందులోని మూడెకరాలే, అయిదేళ్ళక్రితం శ్రీధరరావు కొన్నాడు. ఇప్పు డిక మిగి లింది ఆ తోట, రెండెకరాలపొలం. కాని శ్రీధరరావు కొన్న పొలంభాగం శా స్త్రి అనుభవిస్తున్నాడు.

తిరిగివచ్చేటప్పటికి గుళ్ళో గంటలు మోగుతున్నాయి. గుడివెనుక కోనేరు, పెద్దది, లోతైనది. చక్కని మెట్లు కట్టారు, దానిచుట్టూ పూలతోట.

సుందరరావుకు యింకేమీ ఆలోచన అవసరం లేదని పించింది. ఆ దేవాలయము, శాస్త్రిగారికుటుంబమూ, ఆ పరి సరాలు, అతని మనస్సుకు అనిర్వచనీయమైన ఆనందాన్ని, శాంతినీ యిచ్చాయి. ఎక్కడా అసంతృప్తికి కారణమేలేదు.

ఆ ప్రదేశాన్ని చూచినతర్వాత తండ్రివ్యక్తిత్వంలో తన కింత వరకు గోచరించని ఉదాత్తత అవగతమైంది. ఆయనఅభిరుచికి ఆనందం కలిగింది.

*  *  *

బాగా ప్రొద్దెక్కినతర్వాత గాని మెలకువరాలేదు సుందరరావుకు. వొళ్ళునొప్పిగావుంది. బాగా వేడిచేసినట్టుంది. ప్రయాణంబడలిక, నిన్నటి ఎండప్రభావం కాబోలు అనుకున్నాడు. శాస్త్రిగారు కనిపెట్టుకునివున్నారు.

"నాకు వొంట్లో సుస్తీగావుందండీ" అన్నాడు.

ఆయన వొళ్ళుతాకి చూచి "జ్వరంకూడా వున్నట్లుంది బాబూ! డాక్టర్ని రమ్మనేదా?" అన్నాడు.

"ఈ ఊళ్ళోడాక్టరుకూడ ఉన్నాడన్నమాట! మంచిదే" అన్నాడు.

ఆ ఒక్కవిషయం తనకు నిన్న గుర్తురాలేదు. అదీ ముఖ్యవిషయమే మరి!

"ఆఁ, ఎల్. ఎమ్. పి. ఒకాయన ఉన్నాడు. రిటైరై వూళ్ళోవుంటూ డిస్పెన్సరీ పెట్టుకున్నాడు" అన్నారుశాస్త్రి.

డాక్టరు వచ్చి వెళ్ళి, మందు పంపించాడు.

"నేను మళ్ళీ వస్తాను" అని శాస్త్రి వెళ్ళాడు.

మనస్సులో ఏదో కొత్త నిండుదనం ప్రవేశించింది. కొన్ని కొన్ని ప్రదేశాలకు కూడా ఒక ప్రత్యేక ప్రభావముంటుంది కాబోలు! హేతువాదానికి,ఆలోచనకు అతీతమైన ప్రభావం అది. తను వెళ్ళినచోట్లల్లా యీ ప్రత్యేకతని గుర్తిస్తూనే వున్నాడు. కాని అది మాటలకందని అనుభవభేదం. అనిర్వాచ

నీయంగా ఇతరులకు వివరించిచెప్పటానికి వీలులేకుండా వుంటుంది. చూచిన పట్టణాలు మాత్రమే తీసుకుంటే—మద్రాసు, బెంగుళూరు, హైదరాబాదు—ఒక్కొక్క చోట తన మనస్సులో కలిగినమార్పు, ఒక్కొక్కతీరు. మూడూ జనసమ్మర్దం ఉన్న పట్టణాలే. మూడింటిలోను తను మంచిహోటళ్ళలోనే బసచేశాడు; తిన్న తిండీ, ఉన్నతీరు, తిరిగినవిధానం ఒకటే. మరి ఆ భేదం దేంట్లోవుంది? మనుష్యుల్లో, భవనాల్లో, వీథుల్లో ఫలానిదాంట్లో అంటూ లేదు. పట్టణం మొత్తానికి, ఆ ప్రదేశానికే సంబంధించిన ప్రత్యేకత అది! ఒకచోట మనసులో ఏదో అనంతమైన కాంతి ప్రవేశించినట్లు; ఇంకొకచోట ఉదాత్తత; మరొకచోట అర్థంలేనివిషాదం; ఇంకా దేహప్రవృత్తుల్ని, కామాన్ని రేకెత్తించేచోట్లుకూడా వున్నాయి తనఅనుభవంలో! మనోవికాసాన్ని, ప్రశాంతతను, నిండుదనాన్ని ఆహ్లాదస్వరూపంలో అనుభవించింది మాత్రము ఇక్కడే! దేహంలో కొంత అస్వస్థతగావున్నా మనస్సులోనిఆనందంలోఏ మార్పులేకుండా, మనస్సు దానికున్న స్వతంత్రతని చాటుతూవుంది.

తను పడుకొన్నగదిలో మంచం, ఒక బీరువా, దానినిండా పుస్తకాలు, ఒకచిన్నటేబిల్,ఒకకుర్చీ మాత్రం వున్నవి; గోడలమీద ఏమీ పటాలు లేవు. అవతలిగదికి యీగదికి మధ్య ద్వారం మూసివుంది. ఆ గదికి మెట్లవైపుగా ఇంకొక ద్వారంకూడా వున్నట్లుంది. శాస్త్రిగారు రాత్రి క్రిందనే పడుకున్నారు. మరి అవతలిగదిలో ఏముందో చూడాలని కుతూహలంగా, తలుపుతీసి చూశాడు సుందరరావు. అందులో ఒక చిన్న వేదికమీద పాలరాతితో చేయబడిన కృష్ణవిగ్రహం

వుంది. సరిక్రొత్త పువ్వులదండ ఆ ప్రొద్దుటే మెడలో వేశారు. వేదికమీద ప్రక్కగా కొన్ని పుస్తకాలు, నేలమీద మూడు చిన్న చాపలు. అది పూజాగృహం. ఎంతో నిరాడంబరంగానే వుంది. కాని మనస్సును వశపరచుకునే పవిత్రత కూడా అక్కడ వుంది. లోపలికి వెళ్ళి ఒక్కక్షణం కృష్ణవిగ్రహంవైపు చూచి, పుస్తకాల్ని తీసి చూశాడు. భాగవతం, శ్రీకృష్ణకర్ణామృతం, గీతగోవిందం. పుస్తకాల్ని యథాస్థానంలో వుంచి, తలుపులు మూసి మళ్ళీ పడుకున్నాడు సుందరరావు.

ఆ పువ్వులదండను తను నిద్రలేవకముందే వచ్చి ఎవరో వేశారు. శాస్త్రిగారిఅమ్మాయి — సీతాలక్ష్మి వేసింది. సీతాలక్ష్మి అన్న పేరుకు అర్హతకలిగిన అమ్మాయి!

మెట్లెక్కి వస్తున్నారెవరో! "నిదానంగా వెళ్ళు!" అన్న కంఠస్వరం, తర్వాత చిన్నకృష్ణుని గలగల గజ్జెలధ్వని.

మొదట కృష్ణుడు "బాబాయ్! నే వచ్చేశా!" అంటూ గదిలో ప్రవేశించాడు. వెనకాల కాఫీపట్టుకొని వచ్చింది సీత.

గ్లాసు టేబిల్‌మీదపెట్టి "ఇక వెళ్దామా బాబూ!" అన్నది కృష్ణునితో.

"బాబాయితో మాట్లాడినాక ... పోదాం" అని దీర్ఘంతీసుకుంటూ చెప్పాడు కృష్ణుడు.

సీత సిగ్గుతో చిరునవ్వునవ్వింది. సుందరరావు లేచి కూర్చుంటూ "వచ్చి మాట్లాడవయ్యా, కృష్ణయ్యా! ఇట్లారా" అని పిలిచాడు.

"బాబాయిగారికి తలనొప్పిగావుందట. తర్వాతమాట్లాడుదువురా పోదాం" అంది సీత.

కృష్ణుడు సుందరరావుదగ్గరకు వెళ్ళి, చేతులు అతని మీదవేసి, సీతవైపుచూస్తూ, రానంటూ తల అడ్డంగా త్రిప్పాడు.

సుందరరావు సీతవైపు చూచి, "ఉండనివ్వండి! నాకేమీ మరీ సుస్తీగా లేదు." అన్నాడు.

"వీడికి క్రొత్తా పాతా లేదు! మహా అల్లరిచేస్తాడు. మీరు విశ్రాంతి తీసుకొంటే మంచిదేమో! ... దా బాబూ" అని మళ్ళీ పిలిచి, వానివైపు చేయిచాచింది సీత.

"ఆ గదిలో కృష్ణుణ్ణి పూజించేది మీరేనా?" అన్నాడు సుందరరావు.

ఆశ్చర్యంగా, సిగ్గుగా ఆతనికళ్ళల్లోకి చూచి "అవును" అని, సీత తలుపులుతోసి చూచింది. అవి తెరచుకొన్నాయి. గడివెయ్యటం మరచిపొయ్యానే! అని ఆమె అనుకుంటున్నట్లు గ్రహించిన సుందరరావు, "మీ పూజాగృహంలోకి ఎవరూ ప్రవేశించకూడదా? అయితే మరి నేను చేసింది అపచారమే! క్షమిస్తారా?" అన్నాడు.

ఏమనడానికి తోచక, సిగ్గుతో తలవంచింది సీత.

"ఆ గదిలో బాబాయ్, నేనే ఉండేది!" అని చిన్న కృష్ణుడు గదివైపు చేయిచూపించాడు.

సుందరరావు నవ్వుతూ, "అవునయ్యా, నువ్వే మరి! ఇదంతా నీ బృందావనం!" అని వాణ్ణి ఎత్తి ముద్దాడాడు.

చిన్నకృష్ణుడు సుందరరావు ముద్దుపెట్టినబుగ్గను వ్రేలితో చూపిస్తూ, "నువ్వు ఇక్కడ పెట్టు! ...పిన్ని ఇక్కడ ముద్దుపెట్టుతుంది! ... ఏం?" అని అవతలిబుగ్గను కూడా

చూపించి, సరేనా అంటున్నట్లు తలతిప్పుతూ, అతన్ని ఒప్పించ బోయ్యాడు.

సీత చప్పున గదిలోనుండి పారిపోయింది.

"ఎందుకని? నేను ఆవైపుకూడా పెట్టుతాను!" అన్నాడు.

"ఛా! నువ్వు చెడ్డ!" అన్నాడు కృష్ణుడు.

"నేను చెడ్డకాదయ్యా, నేను మంచి" అన్నాడు సుందరరావు. ఆ మాట అంటుంటే అతనికి కళ్ళల్లో నీళ్ళు క్రమ్మినట్లయింది.

"నువ్వు మంచి; నేను మంచి; పిన్ని మంచి; తాత, అమమ్మ మంచి!" అని కృష్ణుడు వల్లించాడు.

"అవును, నువ్వనేది నిజం!... ఇక్కడ అందరూమంచి, కృష్ణయ్య ఉన్నాడు...అందుకే అందరూ మంచి!" అన్నాడు సుందరరావు; అది స్వగతంలాగే వుంది.

కృష్ణుడు సుందరరావువొళ్ళో కూర్చునే, అతనిషర్టు గుండీలు వేళ్ళతో విప్పుతూ కొంచెంసేపు వుండి, కథ చెప్పవూ?" అన్నాడు.

సుందరరావు ప్రక్కమీద వాలి పడుకుంటూ ఒక చేత్తో కృష్ణుణ్ణి చుట్టి తనహృదయానికి చేర్చుకుని, "ఏం కథ కావాలి?" అన్నాడు.

"ఆ... కథ! నీ కథ" అని దీర్ఘాలుతీసి చెప్పాడు కృష్ణుడు.

ఏదో ఆలోచిస్తూ కప్పువైపు చూస్తున్న సుందర రావును "కత చెప్పూ" అని చేతులుతోస్తూ తొందర పెట్టాడు కృష్ణుడు.

"చెప్తాను కృష్ణా, చెప్తానయ్యా! తొందరైతే ఎట్లా? జ్ఞాపకంచేసుకోనీ" అంటున్నాడు సుందరరావు.

కృష్ణుడు మారాంచెయ్యటం మానకుండా "ఊఁ... ఇంక చెప్పు" అంటున్నాడు.

శాస్త్రిగారు వచ్చారు. "అల్లరిచేస్తున్నావా. యిక్కడ చేరి! రా, అమ్మమ్మ పిలుస్తోంది" అని వాణ్ణి ఎత్తుకుని "మీరు కాఫీతాగకుండా అట్టే వుంచేశారే! వీడు తాగనివ్వలేదేమో!" అని గ్లాసు పట్టిచూస్తూ, "చల్లారిపోయినట్లుంది, మళ్ళీ పెట్టమంటాను." అన్నాడు.

"వద్దు, ఇట్లా తెండి, ఫర్వాలేదు" అన్నాడుసుందరరావు.

"అబ్బే! యీ చల్లారినకాఫీ తాగితే తలనొప్పి ఏం తగ్గుతుంది" అంటూ ఆయన గ్లాసుతీసుకొని వెళ్ళబోయ్యాడు.

"పోనీ, అదే కొంచెం వేడిచేసి ఇవ్వమనండి. మళ్ళీ పెట్టవద్దు." అన్నాడు సుందరరావు.

"మీ కెందుకూ? అయిదునిమిషాల్లో వస్తాను" అని ఆయన మనుమణ్ని ఎత్తుకుని గ్లాసుతీసుకుని వెళ్ళిపొయ్యాడు.

* * *

మధ్యాహ్నం బాగా నిద్రపోయినందుకు కాబోలు రాత్రి సుందరరావుకు తొందరగా నిద్రరాలేదు. వెన్నెల పుచ్చపువ్వు వలె మనోజ్ఞంగా వుంది. కిటికీలోనుండి తన పక్కమీద పడుతూన్న చంద్రకిరణాలు, ప్రయత్నంమీద తలవంచి చూస్తే

కిటికీలో ఎదురయ్యే చంద్రుడు— వెన్నెలరాత్రి ఇంత హృద యంగమంగా తను అనుభవించి ఎన్నినాళ్ళో అయింది. తనలో ఎన్నడో గతించినదనుకొన్న యీ మనఃప్రవృత్తి, సత్య పూర్ణంగా మళ్ళీ మేల్కొన్నది. ఎప్పుడో చదివిన ఒక పద్య కావ్యంలోని చరణం, చంద్రుణ్ని ఉద్దేశించినది, మనస్సులో మెదలింది రాగయుక్తంగా "ముక్తగవాక్ష పథమ్మునుండి నా క్రేవకు వత్తు వెట్లొ పులకింపగ నా తృణకీర్ణశయ్యయున్" చాలనాళ్ళుగా చదవని, గుర్తుకు తెచ్చుకోని పద్యాలు ఎందుకో ఊరికే జ్ఞాపకంవచ్చాయి.

ప్రొద్దున పదిగంటలవేళ కృష్ణుడు, సీత రావటం, అప్పుడు జరిగినమాటలు ఒక్కొక్కటే ఏదో కలవలె గుర్తు వస్తున్నాయి సుందరరావుకు.

"ఛా! నువ్వు చెడ్డ!" అని ముద్దుగా మందలించి, ఆ కత సీ...కత చెప్పు!" అని మారాంచేశాడు కృష్ణుడు; సాక్షాత్తు కృష్ణమూర్తే!

ఆ మాటలు తనలో ఏవో లోతుల్ని అన్వేషించి, తన అంతరాత్మను శోధించి, హృదయాన్ని వీణవలె నినదింపజేశాయి! ఆ కృష్ణుడితో తనగతాన్ని కథగా చెప్పుకోవాలనే, చెప్పుకోక తీరదనే తోచింది ఆ క్షణాన. అందుకే "చెప్తానయ్యా! జ్ఞాపకం చేసుకోనీ, తొందరైతే ఎట్లా?" అంటూ ప్రాధేయ పడ్డాడు.

అది పండ్రెండేండ్లనాటి సంగతి.

ఆ సుందరరావుకు, యీ సుందరరావుకు, ఏమిటీ పోలిక, సంబంధం?

ఆ సుందరరావు ఒక ప్రత్యేకవ్యక్తిలాగ, స్పష్టంగా, వేరుగా కనుపిస్తూన్నాడీ సుందరరావుకు. అతన్నీ, అతని కథనూ, నివేదించగలడు కృష్ణునికి. కృష్ణస్వరూపమైన సత్యానికి !

ఆమెపేరు వేదవల్లి. పోస్టుగ్రాడ్యుయేటు చదవటానికి వెళ్ళిన యువకుడైన సుందరరావుకంటె మూడేళ్ళు పెద్దది. ఆమెభర్త, రిటైరైనతర్వాత నాలుగేళ్ళుగా మద్రాసులో స్థిరపడిన హెడ్‌మాస్టరు—శ్రీనివాసయ్యరు—సుందరరావుకు హైస్కూల్లో చదువుచెప్పి, అతని తెలివితేటల్ని, గుణశీలాల్ని మెచ్చుకొని పుత్రవాత్సల్యంతో ప్రేమించినవ్యక్తి. వుండటానికి సరైనగది దొరకనిసుందరరావును తనయింట్లో వుండమన్నాడు. సుందరరావుఆరోగ్యంపాడైతే ఆదరంతో భోజనంకూడా తన యింట్లోనే ఏర్పాటుచేశాడు.

మూడేళ్లై తల్లి చనిపోయినతర్వాత గృహాన్ని, ఆదర సౌభాగ్యాన్ని పోగొట్టుకున్న సుందరరావు హృదయానికి ఆ యింట్లో వాత్సల్యం, ప్రేమ లభించాయి. వివాహమైనకూడా వైవాహికజీవిత మెరుగని వేదవల్లి, యువకుడైన సుందరరావు ప్రణయంలో బంధింపబడ్డారు.

వేదవల్లి హృదయంలో సంఘర్షణ ! కన్నతండ్రికంటె దయగా ఏడేళ్ళు వాత్సల్యంతో చదువుచెప్పి, వ్యక్తిగా తనకు స్వాతంత్ర్యాన్ని యిచ్చి, తన్ను మనిషినిచేసిన పూజ్యుడు. వయోధికుడైనభర్త నిజంగా భర్తకాడు, తండ్రీ, గురువూ ! ఆయనపట్ల తన కృతఘ్నత, అపచారం సహించరానిది. తన కర్తవ్యమేమిటి ? ఆమె సుందరరావుతో చెప్పలేదు. ఆసంవత్స

రాంతంలో మూడునెలలుచూలాలుగా వేదవల్లి తన జీవితం చాలించింది.

డాక్టరును బ్రతిమాలాడు సుందరరావు, ఆమెమరణానికి కారణం రహస్యంగా వుంచమని.

వేదవల్లికి దహనసంస్కారంజరిగినరోజు రాత్రి శ్రీనివాసయ్యరు సుందరరావును పిలిచి అన్నాడు.

"సుందరం, ఆమె పోయింది! ఇంతటితో మనిద్దరి బాంధవ్యం కూడా సమాప్తి.... నాకు సర్వమూ తెలుసు; కాని నాకు తెలుసునని మీకు తెలియ నవసరంలేదనీ, సత్యం ముందు ధైర్యంగా నిలువగల వ్యక్తిత్వం నీలో వుందనీ, యిన్నాళ్ళూ పూనంవహించాను. నువ్వింతవరకు ఆమెమరణానికి బాధ్యుడివన్నసంగతే నన్ను వేధించి బాధపెట్టుతోంది. నేననుకున్న సుందరరావువి నువ్వు కాకపోవటం నిజమూ! ఆమె మరణకారణం నీకు తెలీదా ?"

"నేను పాపంచేశాను; మీకు ద్రోహంచేశాను; సత్యం ముందు నిలబడేధైర్యం నాకు లేకపోయింది; కాని ఆమె యిట్లా చేస్తుందని నేను ఊహించలేదు." అన్నాడు కన్నీళ్ళతో సుందరరావు.

"నువ్వనుకునేపాపం, ద్రోహం నువ్వేమీ చెయ్యలేదు. ఆమెమరణానికి నీ బాధ్యత లేదని అంటున్నావు. నాకు కావలసింది అదే. సుందరం, నువ్వామెను ప్రేమించటంలో చేసిన తప్పేమీ లేదు. ఆమె పేరుకు నా భార్య అయినా, కన్యగానే వుంది. ఈ వింత నీ వర్థంచేసుకోలేదని తెలుస్తూవుంది. జవసత్వాలు, కోరికలుడిగిన వృద్ధాప్యంలో నేనెందుకు పెళ్ళిచేసు

కొన్నానని ఊహించావు? ఆమెకు తల్లి చిన్నప్పుడేపోయింది; తండ్రి, సవతితల్లి హింసించారు. పాలఘాటుదగ్గర ఒకగ్రామం వాళ్ళది. ఆమెను డబ్బుకు తెగనమ్మటానికి సిద్ధంగావున్నారు; కాని పెళ్ళిపేరుతోగాని ఆ అమ్మకం జరగదు. ఆమెను కొని, ఏ బొంబాయో తీసుకువెళ్ళి అధోగతిలో దింపటానికి సిద్ధంగా వున్నారు వ్యాపారులు. పరిస్థితులు గ్రహించి, డబ్బిచ్చి మంగళ సూత్రంకట్టి, తీసుకొనివచ్చాను. నాకెవరూ దగ్గరవాళ్ళు లేరు. నా మొదటిభార్య పోయిన పదిహేనేళ్ళకు నేను మళ్ళీవివాహం యీ కారణంవల్ల చేసుకోవలసివచ్చింది. వివాహవ్యవస్థను యీవిధంగా వుపయోగించాను, ఒక వ్యక్తిని రక్షించటానికి ఆమె వ్యక్తిత్వంకుసుమించటానికి దోహదాలుచేశాను; కాని ఆమెకు నిజమైన వివాహంచెయ్యటం నా కలవిగాని పని.!

ఇప్పుడాలోచించు, నువ్వేదైనా పాపంచేస్తే, అది ఆమె మరణానికి సంబంధించిందేనని. కాని నీకు తెలీదంటున్నావు. ఇట్లా జరుగుతుందని నేనూ ఊహించలేదు. ఆమె తనపరిస్థితిని అర్థంచేసుకోలేకపోయింది. సాంఘికంగా విపరీతమైనపరిస్థితి; సత్యం, ధర్మమేమిటో, అది ఎంత క్లిష్టస్వరూపంలో వుందో నిశ్చయించుకోవటం శక్తిమించినపని అయిందామెకు. కాని, ఆమెకు పితృస్థానంలోవున్న నేను, ఆమెశిశువుకు మాత్రం పితృస్థానంలో వుండకపోగలనా? అటువంటి ధర్మానికి సాంఘిక పరిభాషలో నిర్వచనంలేదు. భాషలో శబ్దస్వరూపం లేనంత మాత్రాన సత్యం అసత్యమూ, ధర్మం అధర్మమూ అయిపోదు. సాంఘికపరిభాషలో పోల్చిచెప్పవలెనంటే ఆమె నాకామార్తె, నీ ధర్మపత్ని! వ్యవస్థారూపంగా వ్యక్తమయ్యే సత్యమూ,

ధర్మమే కాక, క్లిష్టమై, వివరణకు, నిర్వచనానికి అందని సత్యం, ధర్మం మానవహృదయానుబంధాల్లో ఎంతోమేర వుందని మనం గ్రహించవచ్చు. కాని అంతామించిపోయింది; యిన్నాళ్ళు సంరక్షించిన వేదవల్లిని చివరకు రక్షించలేకపోయాను."

ఆ మాటల్లోని ప్రగాఢశక్తి సత్యశీలత, ఆయనఉదాత్త వ్యక్తిత్వము సుందరరావుజీవితాన్ని ఆ క్షణంలో మార్చివేశాయి. సత్యవిచారణ, ధర్మనిర్ణయం ఏ మూలసూత్రాన్ని అనుసరిస్తుందో, వ్యక్తిత్వంలో విలువైనవస్తువేదో గ్రహించాడు. తప్పుచెయ్యటంలేదని ఘోషిస్తూనేవున్న హృదయాన్ని సరిగా వ్యాఖ్యానించలేని మేధాశక్తి తేజోవంతమై అతనివ్యక్తిత్వం రూపొందిన దా క్షణంలోనే.

ఆ సుందరరావుకాలప్రవాహంలో యీసుందరరావుగా మారాడు. కాని ప్రవహించిన ఆ వ్యక్తిత్వంలో ఎక్కడోవచ్చిన కొఱత ఏమిటో ఇప్పుడే తెలుస్తూవుంది. వేదవల్లిని, యువకుడైన సుందరరావును కలిపినది అప్పటి సుందరరావుయొక్క ప్రేమకాంక్ష, యౌవనోద్రేకం; ఇప్పు డది ఏ స్వరూపంలో వుంది? ఆ కాంక్ష పరితృప్తిచెంది అదృశ్యమౌతూ ఛాయా స్వరూపంలో విమలతోటి స్నేహంలో కనుపించింది!

కాని వేదవల్లిగర్భంలో అంతమొందినశిశువుతో, పరితృప్తిపొందకుండా, నిగూఢంగా నిలిచి తొందరపెట్టుతున్నది పితృత్వకాంక్ష! ఇప్పు డది ఏరూపంలో కనిపిస్తూంది యీ సుందరరావులో? రమణిమీద వాత్సల్యం, ఇవాళ చిన్నకృష్ణునిమీద కలిగిన భావం! బహుశా తనవిద్యార్థులు దీని నంగీకరించనందువల్లే వాళ్ళమీద విసుగు కాబోలు! రమణి,

చిన్నకృష్ణుడు ఆ కాంక్షను రేకెత్తించి గుర్తుకుతెచ్చారు, తెస్తున్నారు; తన నేదో చేసేటట్లు పురికొల్పుతారు కాని, తన వ్యక్తిత్వసమగ్రతకు, ఆత్మప్రశాంతికి అవసరమైన పరితృప్తి మాత్రం లభించటంలేదు.

అది ఎట్లా కలుగుతుంది? వివాహంచేసుకోవాలి! తండ్రి కూడా తన నదే కోరుతున్నాడు!

ఇట్లా ఎక్కడికక్కడ గతాన్ని, ప్రకృతాన్ని విశేషించి తనను తాను అర్థంచేసుకోవటానికి ప్రయత్నించటం కొంత న్యాయమే, సమంజసమే; కాని అంత తృప్తిగా లేదు. ఎందు కని? దీనిలో సంపూర్ణత్వం లేదు.

ఇటువంటి ఆత్మపరీక్షకు లొంగనివిషయం కూడా ఎంతో వుంది. ప్రొద్దున అవతలిగదిలో ప్రవేశించినప్పుడు కలిగిన భక్తీ, గౌరవం— ఆ భావాల కేమిటి అర్థం? శయ్యనుండి మెల్లగా వెనక్కిజారుతూ పారిపోతూన్న యీ వెన్నెలా, యీ మనోహరప్రకృతిభాగ్యంకలిగిన వూరు, యీ కుటుంబం, సీతా లక్ష్మివదనంలోని పునీతభావాని కర్థమూ, వివరణా ఏమిటి? ఏదో సమన్వయపరిపూర్ణత అనగానే అది వివరణకాదే! గతాన్ని ప్రకృతాన్ని జోడించి పరీక్షించితే అర్థమయ్యేది తెలిసిన కొంతభాగమే. కాని కాలాన్ని అధిగమించి తనలో ఇమిడివున్నసత్యం అనంతము, అనూహ్యం. ఒకరకమైన ఐక్య సిద్ధివల్ల, ప్రత్యక్షానుభవస్వరూపంలోనే అది గ్రాహ్యం కాని ఇతరత్రా కాదు.

అటువంటి అనుభవానికి ప్రాతిపదిక అయిన మనస్థితి తా నీ వూరు వచ్చినప్పటినుండి తనలో ఏర్పడ్డది; దానివిలువ ఇప్పుడే గుర్తిస్తున్నాడు.

ఆ మనస్థితినిగూర్చినధ్యాసతో సుందరరావు నిద్రించాడు.

# 31

ఉషస్సు తూర్పుదిక్కును రాగరంజితం చేసింది. సుందరరావు నిద్రలేచి గదివాకిట నిలబడి, ఆ సౌందర్యానికి ముగ్ధుడై కొంతసేపుండి, తోటలోకివెళ్ళి తిరగాలనిపించి మెట్లుదిగాడు. పూలమొక్కలను దాటి, గన్నేరులు గుబురుగా పొదలై ఏపుగా పెరిగివున్న ప్రదేశంవైపు నడిచాడు. రాగయుక్తంగా శ్లోకాలేవో చదువుతున్న కంఠం వినిపించి, ముందుకు సాగకుండా నిలిచాడు. ప్రాతస్సమయపవిత్రత మేళవింపై, రాగమధురమైన శ్రీకృష్ణస్తుతి తన్మయత్వం కలిగించింది.

పాట నిలిచిపోయి, గన్నేరులుకదలటంతో సీత వస్తున్నట్లు తెలిసికూడ, కదలకుండా నిరీక్షిస్తూ నిలుచున్నాడు సుందరరావు. చేత పువ్వులదండలతో సీతాలక్ష్మి వచ్చింది. ఉషాదేవిగా, ఆమె తనెన్నాళ్ళనుండో ఎదురుచూస్తూన్న దేవతామూర్తిగా తోచింది సుందరరావుకు.

"మీ కేమైనా కావాలా?" అని అడిగింది సీత.

"రోజూ ఇట్లా యిక్కడే కృష్ణకర్ణామృతం చదువుతారా?" అన్నాడు.

తనుచదవటం విన్నాడని తెలిసి సిగ్గుచే తలవంచి, "అవును" అని, తర్వాత "మీకు నీళ్ళుతోడివ్వమంటారా? ఇక నాన్నగారుకూడ లేచివస్తారు." అన్నది సీత.

"సరే" నని ఆమెవెనుక నడిచాడు సుందరరావు. "పూజకు నేనుకూడా రావచ్చా?" అన్నాడు.

సీత జవాబుచెప్పలేదు.

అతను స్నానంచేసి పైకివెళ్ళేటప్పటికి సీత దేవునిగది శుభ్రంచేసి, పూజ కన్నీ అమర్చింది.

విశ్వేశ్వరశాస్త్రి వచ్చాడు. "వంట్లో బాగుందా? చాల ముందుగా లేచారే!" అన్నాడు. తర్వాత శాస్త్రి అతన్ని దేవునిగదిలోకి తీసుకు వెళ్ళాడు.

ఒక చాపమీద కూర్చుని, కృష్ణవిగ్రహాన్ని తదేకంగా చూస్తూ మౌనంవహించిన సుందరరావును తృప్తిగా చూస్తూ వుండిపొయ్యాడు శాస్త్రి. సీత పూజ నిర్వర్తించింది.

* * *

ఆ రోజు అయిదుగంటలరైలుకు ప్రయాణమాతూ సుందరరావు. తన శాప్లాను, యిల్లుకట్టడానికి స్థలం అన్నీ నచ్చాయని శాస్త్రిగారితో చెప్పి, త్వరలో యింటి డిజైను పంపిస్తూ, అన్నివిషయాలు ఉత్తరంమూలంగా తెలుపుతాననీ, మళ్ళీ అవసరమైతే వస్తాననీ చెప్పాడు.

నిమ్మపళ్ళు, మామిడిపళ్ళబుట్టలతో శాస్త్రిగారు స్టేషను దాకా వచ్చారు.

రైలురావటానికి గంటసేపు వుంది. ఊళ్ళోవిషయాలు, తన కుటుంబసంగతులు చెప్పతున్నారు శాస్త్రిగారు.

"మీ అమ్మాయిపెళ్ళికూడా నిశ్చయంకాలేదా ?"
అన్నాడు సుందరరావు.

"ఇంకా లేదు బాబూ! ఏం చేసేది? మా సీతప్రకృతి వేరు; అది పెద్దవాళ్ళిద్దరిలాగ కాదు. దైవభక్తి, ఓర్పు ఒక యెత్తు, స్వాభిమానం ఇంకోయెత్తు! నాలుగునెలల్క్రిందట ఒక సంబంధం తెచ్చాను. కుదిరివుంటే యీ నెలలోనే కావ ల్సింది. జాతకరీత్యా యీ నెలలో జరగవలసిందే! కాని తప్పి పోయింది; నాకూ విచిత్రంగానే వుంది. ఏం జరిగిందనుకున్నారు? ఆ అబ్బాయి బి.ఏ. ఆఖరుసంవత్సరం చదువుతున్నాడు; వాళ్ళ బావ, అక్కయ్య వెంట వచ్చారు అమ్మాయినిచూడటానికి. వాళ్ళేవో ప్రశ్నలువేశారు. చివరకు ఆ అబ్బాయి పాడ మన్నాడు. వాళ్ళప్రశ్నలధోరణి సీతకు నచ్చలేదని నేను గ్రహి స్తూనేవున్నాను; ఇక పాడమనేటప్పటికి మూగనోముపట్టింది. "పాటలు రావా ?" అన్నారు. సీత తక్షణం లేచి లోపలికి వెళ్ళిపోయింది. నేనేం చెయ్యను? వాళ్ళఅమ్మ ఏదోసమాధానం చెప్పింది. వాళ్ళు వెళ్ళి కబురుపెట్టారు — అమ్మాయిని చేసుకుంటారట, కానిరట మేము అమ్మాయిపేర వ్రాస్తామన్న యిల్లూ, తోట అబ్బాయిపేర వ్రాయాలట! నేను సిద్ధపడ్డాను; కాని సీత తనకు పెళ్ళేవద్దంటూ పట్టుపట్టింది. ఏం చేసేది చెప్పండి? కొంతకాలం ఆగుదాంఅనుకొన్నాను."

సుందరరావు ఏమీ మాట్లాడకుండా వింటున్నాడు. శాస్త్రి మళ్ళీ అన్నాడు: "మా అన్నయ్య సంస్కృతంలో మంచి పండితుడు; రెండేళ్ళక్రితం పోయాడు. ఆయనే తెలుగు, సంస్కృతం స్వయంగా చెప్పాడు సీతకు. ఆయనకు ఆడపిల్లలూ

లేరు; సీతను మాత్రం ప్రాణం! కాని తీరా అమ్మాయిని పరమ ఛాందసురాల్ని చేశాడేమో అని యిప్పు డనిపిస్తూవుంది. ఈ కాలపుయువకుల కీ ఛాందసపుపిల్ల వనికొస్తుందంటారా?"

"ఛాందసం వేరులెండి! సనాతనమైనసంస్కారం ఛాందసంగా మారటానికి వ్యక్తిస్వభావం కారణం! ఏ సంస్కారం ఐనప్పటికీ కేవలం బాహ్యాడంబరమైతే అది ఛాందసమే అవుతుంది. పోతే, అధునాతనసంస్కారానికి సంబంధించిన ఛాందసం సులభంగా, స్పష్టంగా కనిపించదు; సనాతనమైంది కాలదోషంవల్ల ఎబ్బెట్టుగా చప్పున తెలుస్తుంది. మీయింట్లో నాకు ఛాందసమేమీ కనిపించలేదే!"

"మీ నాన్నగారిలాగే మాట్లాడుతారు మీరుడాకూ" శాస్త్రిముఖం ఆనందంతో విప్పారింది.

చేతులుజోడించి సెలవుతీసుకుంటూ, ద్వారందగ్గర నిలిచిన సుందరరావుతో రైలు కదిలిపోయింది.

* * *

సుందరరావు విశ్వేశ్వరశాస్త్రికొమార్తె సీతాలక్ష్మిని వివాహంచేసుకుంటానన్నందుకు ఆశ్చర్యపడలేదు శ్రీధరరావు.

"నువ్వా అమ్మాయిని చేసుకుంటే బాగుంటుందన్న ఊహ మూడేళ్ళక్రితమే కలిగింది నాకు, వాళ్ళ రెండో అమ్మాయిపెళ్ళికి వెళ్ళినప్పుడు. వాళ్ళువైదీకులు. కాని శాస్త్రికి అభ్యంతరముండదని నాకు నమ్మకం వుంది. ఎటొచ్చీ నీ విషయమే నాకు భయం. నే నా మాట నీతో అంటే విరుద్ధఫలితం తప్ప మరేమీ వుండదనుకొన్నాను. ఏ సమస్యకైనా కాలపరి

పక్వత అనేది వుంది. అందువల్ల భగవంతుడిమీద భారంవేసి నిరీక్షించుతూవున్నాను. ఇప్పుడు లభించిన తృప్తి యిదివర కెన్నడూ నాకు కలుగలేదని చెప్పగలను" అన్నా డాయన.

"అయితే యిందులో మీకూ కొంత ప్రవేశం వుందన్నమాట? చివరకు మిమ్మల్ని కాదని నేనెక్కడికీ వెళ్ళలేననే ఋజువైందిలెండి" అన్నాడు సుందరరావు.

"అందుకు నీకు విచారంగావుందా? నన్ను కాదని కా దబ్బాయ్! మనజీవితాలను నడిపించే విధినిదాటి వెళ్ళలే! దాన్ని అర్థంచేసుకోవటమే నిజమైన స్వేచ్ఛ."

శ్రీధరరావువ్రాసిన ఉత్తరం చూచి విశ్వేశ్వరశాస్త్రి స్వయంగా వచ్చాడు. సీతాలక్ష్మినివ్వటానికి ఆయనకు గాని, ఆయనభార్యకుగాని అభ్యంతరంలేదు. సంతోషంగానే వుంది. కాని అల్లుళ్ళిద్దరూ ఏమంటారోనన్న సందేహమే మిగిలింది. వాళ్ళకు ఉత్తరాలువ్రాసి, తననిశ్చయమేమిటో గట్టిగావాళ్ళకు తెలియబరిచాడు శాస్త్రి.

వివాహానికి లగ్నంకూడా నిర్ణయమైపోయింది. లగ్నం నిశ్చయమైనరోజు సుందరరావు తన కాప్తులైన ఒకరిద్దరికీ, రమణికీ తన వివాహంసంగతి ఉత్తరాలు వ్రాశాడు.

వారంరోజులతర్వాత ఒకనాడు శ్రీధరరావుదగ్గర కొక అపరిచితవ్యక్తి వచ్చి, తన్ను శ్రీధరరావుబావమరిది—రమణి తండ్రి ఒక ముఖ్యమైనపనిమీద పంపించాడని చెప్పాడు.

ఇప్పటికైనా తెలిసివచ్చిందేమో, ఇచ్చినడబ్బు తిరిగి యిచ్చే బుద్ధిపుట్టిందేమో, అనుకొంటూ ఆదరంగా కూర్చోమని గౌరవంగా పలుకరించిన శ్రీధరరావుతో నింపాదిగా

ప్రారంభించి, చెప్పాడు వచ్చిన మనిషి—సుందరరావు మరదలు రమణిని చేసుకుంటానని మాటయిచ్చి, యిప్పుడు ఎవరినో చేసుకోబోతూవున్నాడట! రమణిభవిష్యత్తు ఏం కావాలి? సుందరరావు మేనమామకు, రమణికి వ్రాసిన ఉత్తరాలు చూపించి, "రమణిని అతను చదివించటానికి ఖర్చు స్వయంగా భరిస్తూవుండటంకంటే ప్రబలసాక్ష్యం ఇంకేం కావాలి?" అని నిలవదీసి అడిగాడు. "ఇంతే కాదు! కట్నంసొమ్ము నాలుగు వేలు ముందే పుచ్చుకున్నాడుకూడా! కావలిస్తే వుత్తరంలో మీరు ఆ వాక్యాన్ని పరిశీలించవచ్చు." అన్నాడు.

శ్రీధరరావుకు మిన్నువిరిగి మీదపడినట్లు కొంతసేపేమీ తోచలేదు. సుందరరావు సమయానికి ఇంట్లో లేడు. "సరే, తర్వాత రండి, కనుక్కుంటాను" అని ఆ పెద్దమనిషిని పంపించి వేశాడు. ఆయనమనస్సు చాల వికలమైంది.

సుందరరావు తను ఉత్తరాలువ్రాసిందీ, రమణికి తను సహాయంచేస్తున్నదీ వాస్తవమేనని చెప్పగానే శ్రీధరరావుకు కోపంతో మతిపోయింది. తండ్రిని ఆ రూపంలో ఎప్పుడూ చూడ లేదు సుందరరావు. ఆయన అంతటి శాంతమూర్తి. రమణిని వివాహంచేసుకుంటానని తనెప్పుడూ ఆ అమ్మాయితో గాని, ఆమెతండ్రితో గాని అనలేదని సుందరరావు నొక్కి-చెప్పుతూ, వివరిస్తూవుంటే, బాగా ఆలోచించి అర్థంచేసుకొని ఏదో మోసంవుందని చివరకు గ్రహించాడు శ్రీధరరావు.

"రమణికి విషయం తెలీదనీ, అంతా మేనమామ పన్నాగం, ఎత్తులూ" అనీ సుందరరావు వాదించాడు. పెళ్ళి సంగతి రమణే వ్రాసివుంటుంది. ఆ వార్త అందుకొని

యీవిధంగా దాడిచేశాడు మేనమామ; కాని రమణికి తలంపే వుండదని తన గట్టినమ్మక మన్నాడు సుందరరావు.

మరల వచ్చిన రాయబారితో మొహమాటంలేకుండా తండ్రీ, కొడుకులు ఆ విషయమై చెప్పారు. పుణ్యానికి వెడితే పాపంఎదురైనట్లు కుయుక్తులతో వివాహాలుజరగవనీ, ఎత్తులు వేయటం, వలలుపన్నటం, బంధుత్వాల్ని స్థిరపరచుకోవటం ఎన్నడూ కాదనీ స్పష్టంగా చెప్పారు.

వెళ్తూ ఆ రాయబారి చివరిముక్కగా ఇలా అన్నాడు: "కోర్టుకు వెళ్తుందేమో వ్యవహారం! ఆలోచించుకుని, కొంత ఆలస్యమైనా—మాట నిలుపుకుంటామని ఉత్తరం వ్రాయండి. బంధుత్వాన్నెట్లా తప్పించుకుంటారు లెండి!"

సుందరరావు మద్రాసు వెళ్ళి రమణితోమాట్లాడటానికి నిశ్చయించాడు.

* * *

ఆ రోజు ఆదివారం కావటంవల్ల రమణితో తీరికగా మాట్లాడవచ్చుననుకొని సుందరరావు సాయంత్రం నాలుగు న్నరగంటలకే హాస్టలుకు వెళ్ళాడు. రమణి మూడుగంటల సినిమాకు వెళ్ళిందని తెలిసి దగ్గర్లోనేవున్న ఒక మిత్రుని దగ్గ రకు వెళ్ళాడు.

మళ్ళీ ఆరింటికి హాస్టలుకు వెళ్ళి, విజిటర్సుతో మాట్లాడ టానికి ఏర్పాటైన వరండాప్రత్యేక భాగంలో కుర్చీమీదకూర్చుని రమణికోసం ఎదురుచూస్తున్నాడు. ఎదురుగా పచ్చికతో మనో హరంగావున్న ఆవరణ, మందారచెట్లు, పచ్చికకు ఒకప్రక్కగా గేటునుండి, హాస్టలుభవనందాకా వంపుతిరిగిన రోడ్డు చూడ

టానికి మనోరంజకంగావున్నాయి, కాని సుందరరావుమనస్సులో మాత్రం ఉత్కంఠ తప్ప శాంతి లేదు.

గేటుదాటి ఒక చిన్న మారిస్ మైనర్ కారు వచ్చి హాస్టలుభవనందాకా రాకుండా రోడ్డుమలుపులో కొంత దూరంలో నిలిచింది. అందులోనుండి ఒక యువతి, ఒక యువకుడు దిగారు. యువకునిదగ్గర ఆమె సెలవుతీసుకొన్నతర్వాత యువకుడు కారులో వెళ్ళిపోయాడు. ఆ యువతి హాండ్ బాగ్ ఊపుకుంటూ, పరధ్యానంగా, విలాసంగా గంతులేస్తూ ముందరి మెట్లెక్కి, గబగబా లోపలికి పరుగెత్తిపోయింది.

మెట్లు సమీపించేవరకూ ఆ యువతి రమణేనా అని సందేహంతో పరధ్యానంగా చూస్తూవున్నసుందరరావు ఆమె మెట్లదగ్గరకు రాగానే రమణే అని గుర్తించాడు. తను కూర్చున్నది వరండాలో ఒకచివర. కుర్చీలోనుండి లేవబోయ్యేంతలో రమణి లోపలికి పరుగుతీసింది వచ్చికవున్నస్థలాని కొకప్రక్క పూలచెట్లపాదుల్ని సరిచేస్తున్న వాచ్ మన్ రమణిరావటం చూశాడు కాబోలు, సుందరరావుదగ్గరకువచ్చి "ఆమెనానే మీా బంధుగులు, నే పోయి సెప్తాను" అని లోపలికి వెళ్ళాడు.

సుందరరావు మళ్ళీ కుర్చీలోకూర్చున్నాడు. ప్రొద్దున రైలుదిగినవెంటనే రమణికి ఫోన్ చేసివుంటే ఈ ఇబ్బంది వుండేది కాదుగదా అనుకున్నాడు.

అప్పుడే ఆరున్నర దాటింది. మామూలు విజిటర్సు టైము ఏడైతే, వార్డెన్ ఏడున్నరవరకు పర్మిషన్ ఇచ్చింది.

రమణి వచ్చింది. "ఏమిటి బావా! ఇట్లా వచ్చావ్! వస్తానని వ్రాయనన్నా లేదే! నువిక్కడే కూర్చునికూడ నే

నిట్లా వెళ్తుంటే చూడలేదా? మరి పలకరించలేదేం?" అంటూ ఎదురుగా కుర్చీలో కూర్చుంది.

"నిన్ను చూచి ఏడాది అయింది కదూ! నువ్వు చాల మారినట్టున్నావేమో, దూరాన్నుంచి గుర్తుపట్టలేదు. తీరా గుర్తించేటప్పటికి లోపలికి వరుగుతీశావు." అన్నాడు.

"రమణి తనవైపు ఒకసారి చూచుకొని "ఏం మారాను ?"అన్నది. కాని తనుకట్టుకున్న ఉల్లిపొరలాంటిచీరె దానికట్టు, తను తలదువ్వుకొన్నతీరు బావకు కొత్తగానే వుంటుందని గ్రహించి, విషయం మారుస్తూ "మద్రాసు ఇంత తలవనితలంపుగా వచ్చావేమిటి బావా ?" అని ప్రశ్నించింది.

సుందరరావు కొన్నిక్షణాలు నిదానించి ఆమెవైపు చూస్తూ "రావలసివచ్చింది. రమణీ, ఇదంతా ఏమిటి ? నీకు తెలియకుండానే జరుగుతోందా?" అన్నాడు.

రమణిముఖంలో ఏదో మార్పుకలిగింది; కాని ఆమె నవ్వుతూ "ఏం లేదు బావా! అతను మా క్లాసుమేటు. వాళ్ళు చాల మంచివాళ్ళు. ఇక్కడే వుంటున్నారు. వాళ్ళమ్మ, చెల్లెలుకూడా నాకు తెలుసు. మాటినీకి రమ్మంటే వెళ్ళాను; తప్పంటావా? నువ్వు వద్దంటే మానేస్తాను."

"నేనా విషయం నిన్ను అడగనేలేదు. నువ్వు యీ కాలేజికివచ్చి నాలుగేళ్ళు అవుతోంది. నీ కాపాటి జాగ్రత్త, మంచీ చెడ్డ తెలుసుననే నా అభిప్రాయం. అదికాదు, నేను పదిరోజులక్రితం ఒక ఉత్తరం వ్రాశాను, నా వివాహం నిశ్చయమైందని. ఆ సంగతి నీతో మాట్లాడటానికి వచ్చాను. మీ నాన్నపాలఉత్తరాలేవో చూపిస్తూ నేను నిన్ను చేసుకుంటానని

మాటఇచ్చినట్లు, అందుకు కట్నంకూడా అప్పుడే తీసుకున్నట్లు రాయబారం పంపించాడు. ఆ ప్రత్యుత్తరాల్లో మాటలకి పెడర్థాలు తీస్తున్నాడు. ఇదంతా నీ కెంతవరకు తెలుసు? అనే అడగటానికి వచ్చాను" అన్నాడు. రమణి తాపీగా విని; మౌనంగావుండి, నేలవైపు చూస్తూ, నిదానంగా, స్పష్టంగా అన్నది. "అవును, నువు 'చేసుకుంటా'ననేభావం మొదటినుంచీ కలిగించావుకదా?

సుందరరావు నిర్విణ్ణుడయ్యాడు. "ఏ విధంగా వచ్చిందంటావు ఆ భావం?" అని కాస్త తీవ్రంగానే అడిగాడు.

"మొదట్నుంచీ కలిగింది. నాకు advice, guidance ఇచ్చావు; కావలసిన వెన్నో తీసియిచ్చావు. చదువుకోమన్నావు. మాకు తగిన ఆర్థికస్తోమత లేదంటే, నీవే ఆ భారం, బాధ్యత వహిస్తానన్నావు. ఇదంతా నీవిచ్చినమాట కాక ఏమిటి? ఇప్పుడు మీ నాన్నగారు మాఋాదివిరోధంవల్ల మనస్సుకిప్పి, వద్దని చెప్పి, బహుశా బాగా డబ్బువచ్చేసంబంధం చూపించగానే, సర్వం మరచిపోయి 'misunderstanding' అంటున్నావు. ఏమిటిదంతా, అని నేనడగాలి బావా! నేను ఎప్పుడూ అనుకోలేదు నువ్విట్లా చేస్తావని! ఉన్నట్టుండి పిడుగుపడ్డట్టు, ఫలానా తేదీ ఎవరో్న చేసుకుంటానని నువ్వు ఒక గీత వ్రాసిపడెయ్యగానే, నేను పీడావదలిపోతాననుకున్నావేమో! అవతలివాళ్ళు మాత్రం ఎట్లాచేస్తారో ఈ వివాహం, చూస్తాను!"

ఆవేగంతో, కళ్ళనీళ్ళతో, రోషంతో రమణిఅన్న మాటలకు ఆశ్చర్యపోయాడు సుందరరావు.

అతనిఆలోచనలు గిర్రున ఇదివరకువెళ్ళనిమార్గంలో వెళ్ళాయి. తనబాధ్యత ఎంతవరకు? తనజోక్యం యీా

అమ్మాయిజీవితంలో ఎంతవరకు వెళ్ళింది? అని ప్రశ్నించు కున్నాడు. అంతేకాదు, యీ వివాహవిషయంలో రమణీ, వాళ్ళనాన్న—యిద్దరిదీ ఏకాభిప్రాయమనే అర్థమౌతూవుంది. బహుశా మొదటినుంచీ కనీసం చాలాకాలనుంచైనా వాళ్ళ దీ విషయంలో ఏకాభిప్రాయమే! ఈ అపోహను వదిలించటం ఎట్లా? బహుశా రమణితో నింపాదిగా అన్నిసంగతులూ మాట్లాడితే ఏదో దారికనుపిస్తుంది.

మృదువైనకంఠంతో ప్రారంభించాడు: "రమణీ, ఇదంతా నీ అపోహ! నాకు డబ్బువస్తుందని కాదు యీ సంబంధంవల్ల—ఇది మా నాన్న బలవంతమూ కాదు. తలవని తలంపుగా వెళ్ళాను. ఆ అమ్మాయి నాకు భార్యకావాలి అని పించి నేను చేసుకోవాలనుకున్నాను. నీవంటే నా కెంతో వాత్సల్యం; కాని అది అప్పటికి ఇప్పటికీ కూడా వుంది. నువ్వు డాక్టరై, స్వతంత్రంగావుండాలన్నావు; నాకు చేతనైనసహాయం బావగా, స్నేహితుడిగా, బంధువుగా చేశాను. ఆ నాలుగువేలు నీపేర బ్యాంకులో వేశానుకదా! మరి నేను డబ్బుతీసుకుని మీ నాన్నకు మాటివ్వడమేమిటి? అర్థంలేదు! నా వాత్సల్యాన్ని ను వ్వింకోవిధంగా అర్థంచేసుకుని పొరపాటుపడి వుంటే, సత్యాన్ని యిప్పటికైనా గ్రహించి, అది మరచిపోవాలి; యథాప్రకారంగా వుండాలి."

"ఎంత చక్కని విభేదం తీసుకువస్తావు బావా! వాత్స ల్యమూ! ప్రేమా! నా కాశ్చర్యంగా వుంది! నువ్వు వాళ్ళింటికి వెళ్ళి రెండురోజులున్నావోలేదో, ఆమె నీకు తగినభార్య అని పించిందీ! ప్రేమించావూ! ఇన్ని సంవత్సరాలుగా తెలిసిన

వ్యక్తిని నేను నీకు వరికేరానూ! మరి డబ్బుకాకుంటే ఆమెలో ఏమివుంది? అపురూపమైన అందగత్తె కాబోలు! ఏదీ, ఫోటో అయినా తీసుకురాకపోయ్యావా? చూచి సంతోషించివుందును! లేకుంటే నామీందజాలికలిగినట్లే—దాన్ని వాత్సల్యం అనట మెందుకు?—ఆ అమ్మాయికి పెళ్ళికాదే, అని జాలిపడిపోయి యిట్లా చేస్తున్నావా? నాకు చదువుకోసం జాలిపడి సహాయం చేశావు; ఆమెకు పెళ్ళికావడానికి యీవిధంగా సాయపడు తున్నావన్నమాట! బాగుంది! మీ కింత మైత్రీహృదయం వుందనికాని, మీ వేదాంతం యీ విపరీతానికి దారితీస్తుందని కాని అనుకోలేదు. లేక, ఇవన్నీ మీరు కల్పించిన కారణాలా? నా గతేంకావాలి? సముద్రంలో దూకమనేనా?"

"జాలి పెళ్ళికి కారణంకాలేదు. కొందరువ్యక్తులు ఆ కారణంతో చేసుకుంటారేమో కాని, నా విషయంలో మాత్రం కాదని గట్టిగా చెప్పగలను. నీ బలవంతంవల్ల, నీలో ఒక అపోహకలిగించిన బాధను చూచి, ఒకవేళ అంగీకరించే బల హీనత నాలోవుంటే అప్పుడది జాలివల్లచేసుకొనేపెళ్ళికావటం మాత్రం తథ్యం! కాని నీకటువంటిజాలితో నిమిత్తంలేదు. ఇంకొక ఏడాది, రెండేళ్ళల్లో నువ్వు ఇతరులకు జాలిచూపగల పరిస్థితిలో వుంటావు. ఇప్పుడు నీలోకలిగేదంతా నువ్వింత వరకు అనుకున్న ఊహ నిజంకాలేదనేబాధ మాత్రమే! ఆ బాధ నిలవదు. ఎన్నినాళ్లైనా స్నేహంతో మాత్రం వివాహానికి ఒక బాటవెయ్యటం వీలైనపని కాదు. స్నేహం, వాత్సల్యం, అభి మానం—అవి అట్లానే వుంటాయి. వివాహానుబంధానికి అను గుణమైన పరస్పరభావ మేదో కలిగితే చప్పున కలుగుతుంది,

లేకపోతే కలగదు. అంతే. దానికి వివరణేమీ వుండదు—అందమూ, డబ్బూ, జాలి, స్నేహం — ఇవన్నీ కారణాలు కాలేవు. చాలమందికి ఇవే తగినకారణాలు అనిపిస్తాయేమో కాని, నాకుమాత్రం కావు. ఈ విషయాన్ని అర్థంచేసుకోగల వయస్సు, భావపరిపక్వత నీలో వున్నాయనుకుంటాను. నీకేమీ తెలీనివయస్సులో, పెద్దవాళ్ళఅభిప్రాయం నీ కోరికే అనుకుని, కలిగించుకున్న అపోహను, జ్ఞానంవచ్చినతర్వాత కూడా ఇంకా అట్లానే వుంచుకోవడ మెందుకు?"

సుందరరావుమాటలు విని చాలసేపు ఆలోచిస్తూవుండి రమణి అన్నది "మిమ్మ ల్నెవరూ బలవంతంచెయ్యబోవడం లేదు!"

"బలవంతం కాకపోతే మీ నాన్నగారు కోర్టుకువెళ్తానని బెదిరించటమెందుకు? అసలు మీ నాన్నగారితో నాకు వ్యక్తిగతమైనసంబంధమేమీ లేదు. నాకు కావలసినవ్యక్తివి నీవే. అందుకే నీతో మాట్లాడటానికి వచ్చాను."

"అందుకు కాదు—ఆయన బెదిరించటంవల్లనే వచ్చానని మీరుచెప్పితే నిజం అవుతుంది! ఒక్క ఉత్తరంతో వదలిపోతుందనుకున్నావే, మళ్ళీ నీవు నాకు వివరించటానికి రావటమెందుకు?"

"నువ్వు నన్ను అన్యాయంగా అంటున్నా వీ మాటలు! అసలు మనమధ్య వివాహప్రసక్తిఅంటూ వుందని నాకు తెలీనప్పుడు, మామూలుగా ఉత్తరంవ్రాయక ఇంక ఏంచేస్తాను? నీ కేదో అపోహఉందని ఇక్కడికి వచ్చేంతవరకు నాకు తెలీదు. నీకు యీ విషయంలో బొత్తిగా జోక్యంలేదనీ, మీ నాన్న

గారే యిదంతా చేస్తున్నారనీ అనుకుంటూవచ్చాను. నీతో వచ్చి మాట్లాడటం కాని, నువ్వు నన్ను సరిగా అర్థంచేసుకోవా లని ప్రయత్నించటంకాని ఎందుకో ఆలోచించు."

"ఆc, గ్రహించాను; నీ పెళ్ళికి ఆటంకంఉండరాదనే ఉద్దేశంతోనే"

"నువ్వు నన్ను మాటల్తో బాధపెట్టాలనుకుంటే, అలాగే చెయ్యి! కాని నా మాటల్లోనిసత్యాన్ని మాత్రం గ్రహించు".

వాచ్‌మన్ వచ్చి సుందరరావుతో "సార్, ఎట్టుమణి అయింది సార్!" అన్నాడు.

సుందరరావు లేచి "రేపుసాయంత్రం వస్తాను మళ్ళీ... నెమ్మదిగా అంతా ఆలోచించు రమణీ!" అన్నాడు.

"ఆలోచించేదేమిటి? ఇంక రమణి లేదనే అనుకో బావా!" అని లోపలికి వెళ్ళిపోయింది రమణి.

సుందరరావు బరువుగా నడిచాడు బస్సుస్టాపువైపు.

మరుసటిరోజు సుందరరావు వెళ్ళేటప్పటికి ఎదురు చూస్తూ కూర్చుంది రమణి. విజిటర్సురూములో చాలమంది వున్నారని ఇద్దరూ వెళ్ళి వచ్చికమీద ఒకచోట కూర్చున్నారు.

"ఆలోచించావా రమణీ?" అన్నాడు సుందరరావు కొంచెంసేపు మౌనంగా వున్నతర్వాత.

రమణి నిన్నటివలెకాక ప్రశాంతంగాను, కాస్త గంభీరంగానూ కనుపించింది. "ఆలోచించాను. నీవు ఇంతకాలం నన్నెందుకు చదివించావో అదే నా కర్థంకాలేదు. ఏవిధంగాను నిన్ను బలవంతంచెయ్యటం నా ఉద్దేశం కాదు. నిన్నటి

మాటలు మరచిపో. నాకు కోపంవచ్చింది. నాది అపోహే కావచ్చు. కాని, చాలాకాలంనుంచి నాలోఉన్నదాన్ని ఒక్క క్షణంలో ఎట్లా పోగొట్టుకోగలను? నేననుకున్నది ఏదీ సాధించకుండా వుండలే దింతవరకు. నాపట్టుదలలో నాకు గట్టి నమ్మకముంది. కాని నీ విషయంలో కలిగిన యీ పరాజయానికి నేనేమీ చెయ్యలేనని ఆలోచించుకొని గ్రహించాను. కాని అందువల్లకలిగే బాధమాత్రం తప్పదు."

"మనం జీవితాన్ని జయాపజయాలదృష్టిలో చూస్తే అర్థంచేసుకోలేము. వ్యక్తిగతానుబంధాల్లో గెలుపు, ఓటమి ఏమీ లేదు. సత్యాన్ని గ్రహించటమే ఒకవిధమైనగెలుపు."

"నీవనేది నా కర్థంకాదు. మొదట్నుంచీ వచ్చినఅర్థభేదమే ఇదని ఇప్పుడు గుర్తిస్తున్నాను. లోకంలో ఎటుచూచినా సంఘర్షణ, పోటీయే కనుపిస్తుంది నాకు.ఇన్నాళ్ళూ నేనుపొందిన నీ అభిమానమంతా ఈ రోజు ఒక్కక్షణంలో ఇంకొక వ్యక్తి జయించుకొన్నది. అది నాకు పరాజయమే."

అభిమానం ఎప్పుడూ వుంటుంది. ఎవరూ తీసివేయలేరు రమణీ! దాన్ని కావాలనుకోవడంగాని, వద్దనుకోవడంగాని నీలోనే వుంది.

రమణికళ్ళల్లో నీళ్ళుతిరిగాయి. "ఇన్నాళ్ళు కావాలని నిన్ను యాచించింది చాలదా ? ఈరోజు తెలిసింది నేను మీదగ్గర భిక్షమెత్తి బ్రతికానని; ఇప్పటికైనా నాకు స్వామాభినం కొంత ఉండనివ్వు."

"అడిగి తీసుకునేహక్కు ఒక్క భార్యకే వుందని ఎందుకనుకోవాలి? మరదలుగా తీసుకోవడానికి నీకుకూడా వుంది.

రమణీ! మనబాంధవ్యం ఎప్పటిలాగే ఉంటుంది. క్రొత్తగా బాంధవ్యంతో ప్రాతసంబంధా లెందుకు నశించాలి? ఒక్కొక్క దానికి జీవితంలో ప్రత్యేకస్థానమే వుంటుంది. ఒక్కొక్క వ్యక్తితోటిఅనుబంధము ప్రత్యేకమైంది!" కొన్నిక్షణాలు మౌనంగా వున్నతర్వాత రమణి అన్నది.

"అయితే నీ వాక్య విషయాన్ని అంగీకరించాలి — నీవు నాకోసం ఖర్చుపెట్టింది నే నివ్వగలిగినప్పుడు, ఇస్తే తీసుకోవడానికి."

"అది అంత ముఖ్యమైనసంగతా, ఆలోచించు. నేనేమీ నీకు అప్పుగా ఇవ్వలేదు."

"నీ పూర్తిఋణాన్ని ఎప్పుడూ తీర్చుకోలేను, కనీసం డబ్బైనా ఋణంతీర్చనివ్వు. అప్పుడు నే ననుకున్న వ్యక్తిగతస్వాతంత్ర్యమైనా పొందగలిగానని తృప్తిపడతాను. ఆ రేళ్ళప్పుడు, అర్థంకాని ఆశయాలను అభిప్రాయాలను నా సొంత భావాలనుకోవడం తెలివితక్కువైనా అయినా, వాటి ఉపయోగమూవుంది. ఆ ఆశయాలు పూర్తిగా అర్థరహితం కావు. వాటిలోసత్యమైనది వ్యక్తిగతస్వాతంత్ర్యం ఒకటి. నన్ను గురించి నేనింతవరకు ఆలోచించుకోలేదు. రాత్రి, ఇవాళా ఆపని చేశాను. అందుకే నిన్నటికోపం నాకు అసంబద్ధంగా తోచింది. కాని ఒక్క ఉత్తరముక్కతో నా విషయం తేల్చుకోవాలనుకున్న నీకూ బాగానే శాస్తిజరిగింది అని తృప్తికూడా కలుగకపోలేదు."

"ఈ నాలుగేళ్ళు నిన్నుగురించి ఏమీ తెలుసుకోక పోవటం తప్పే. కాని యింతటితో నే నెక్కడికీ పారిపోవటం

లేదని నువ్వు గుర్తించాలి. నా వివాహం నువ్వు రాకుండా జరగదు ”

# 32

వేదమూర్తి భూదానోద్యమంలో వినోబాభావే వెంట తిరుగుతున్నాడు.

సంఘంలో, ఆర్థికవ్యవస్థలో విప్లవంతీసుకొనిరావటానికి, మనుష్యుల్ని వ్యక్తులుగా పరిగణిస్తూ, వాళ్ళమధ్య పరస్పర ప్రేమ, ఔదార్యం, అహింస పెంపొందించటమే మార్గమని గుర్తించిన యీ వుద్యమం వేదమూర్తికి నచ్చింది.

వేదమూర్తివ్రాసినపుస్తకం ప్రచురింపబడినతర్వాత, ఒక సంవత్సరం దాన్నిగురించి ఎవరూ ప్రస్తావించలేదు. పత్రికల వ్యాఖ్యానాలు ముక్తసరిగా ఉన్నాయి. వేదమూర్తికి పరిచితుడైన అమెరికనురాయబారికార్యాలయంలోనిఒకవ్యక్తిమాత్రం పుస్తకాన్ని చదివి, అమెరికాలోని ప్రచురణసంస్థకు దాన్ని పంపాడు. ఆ సంస్థ వేదమూర్తికి నాలుగువేలు, మద్రాసు ప్రచురణసంస్థకువెయ్యి యిచ్చి, ప్రచురణహక్కుల్ని కొన్నది. పుస్తకం రెండవముద్రణ అమెరికాలో పూర్తిఅయి. విడుదల కాగానే విదేశపత్రికల్లో పొగడ్తలువచ్చాయి. దానితో దేశీయ పత్రికలు పుస్తకాన్ని మళ్ళీ తిరగవేసి, దానివిలువను వివరించాయి. మద్రాసులో అచ్చయినప్రతులు బాగా అమ్ముడుపోయాయి.

దేశం నాలుగుమూలలనుండి మద్రాసుపబ్లిషర్ ద్వారా వేదమూర్తికి ఉత్తరాలు వస్తున్నాయి. ఘూదానోద్యమాన్ని గురించి వ్రాయమని సర్వోదయసంస్థవారు కోరారు.

పబ్లిషర్ ద్వారా వస్తున్న పాఠకులఉత్తరాల్లో ఒక నాడు మద్రాసునుండి ఒక లేఖ వచ్చింది.

పార్వతి వేదమూర్తికి బాగా గుర్తులేదు. కాని విమల, లీలావాళ్ళతో కలిసివుండేదని జ్ఞాపకంతెచ్చుకున్నాడు. ఆమె తన పుస్తకాన్ని గురించి అభివందనాలు తెలిపింది. ఉత్తరంచివర, "లీల చనిపోయింది, మీకు తెలుసునో లేదో! మద్రాసువచ్చి నప్పుడు మీతో మాట్లాడటానికి అవకాశంకలిగిస్తారని కోరు తున్నాను. క్వీన్ మేరీస్‌లో ఇంగ్లీషు లెక్చరరుగా వున్నాను. బోధనావిధానంలో నేను మీకు శిష్యురాలినని చెప్పటానికి గర్విస్తున్నాను!" అని వ్రాసింది.

వేదమూర్తికి ఆ ఉత్తరం ఒకవిధమైన గర్వాన్ని కలి గించింది. ఉపన్యాసకుడుగా కొన్నాళ్ళే వున్నా తనశిష్యురా లొకతె తన్ను జ్ఞాపకంపెట్టుకోవడం, ఆమెకూడా తనలాగే ఇంగ్లీషులెక్చరరుగా ఉండటం, సంతోషంగా నేవుంది. కాని లీల చనిపోయినవార్తతో, ఆమెనిశిష్టత, సౌహార్ధత జ్ఞాపకం వచ్చాయి. కంటికికట్టినట్లు తను ఆమెయింటికివెళ్ళినదినాలు స్మృతికివచ్చి వేదమూర్తి పరధ్యానంగా వుండిపోయాడు. లీల అన్న చివరిమాట...తనకు విమల భార్యఅవాలన్న ఆమె ఊహానుగురించి... కాని విమల ఏదీ? ఏమైంది? పార్వతివ్రాయ లేదు. ఆమెకు తెలీదేమో! ఆ ఉత్తరాన్ని జాగ్రత్తపెట్టాడు వేదమూర్తి.

ఒక వారంరోజులకు రామయ్యదగ్గరనుండి వుత్తరం వచ్చింది. తల్లికి అస్వస్థత. తన్ను చూడాలని అంటూవుందట.

వేదమూర్తి మద్రాసుకు బయల్దేరాడు. ఒక్కరోజు మద్రాసులో పబ్లిషర్‌తో మాట్లాడి, పార్వతినికలుసుకొని తర్వాత బసవన్నకొండకు వెళ్ళాలని నిశ్చయించుకొన్నాడు.

పబ్లిషర్‌తో పని ముగిసినతర్వాత పార్వతికి కాలేజికి ఫోనుచేశాడు.

"మీరు దయచేసి మా యింటికి టీ తీసుకోవటానికి రావాలి. నేను నాలుగుగంటలకు వస్తాను. సిద్ధంగా వుండండి" అన్నది పార్వతి చక్కని ఇంగ్లీషు ఉచ్చారణతో.

ఈమెతో ఇక మాట్లాడటమంతా ఇంగ్లీషులోనే కాబోలు అనుకున్నాడు.

వేదమూర్తి పార్వతియింటికి వెళ్ళివచ్చినతర్వాత రైలుకువెళ్ళడానికి అన్నీ సిద్ధంచేసుకున్నాడు.

సరిగ్గా నాలుగున్నరకు పార్వతి వచ్చింది. "నమస్తే మేష్టారూ! నేను జ్ఞాపకమున్నానా?" అన్నది నవ్వుతూ.

ఆమె తెలుగులో మాట్లాడినందుకు సంతోషించి "లేకేం!" అన్నాడు.

"రండి వెళ్దాం" అన్నది.

క్రింద ఆమెపిలిచిన టాక్సీ వుంది.

"నువ్వు భాగ్యవంతురాలివా? లేక నా కోసమా యీ టాక్సీ? నాకు బస్సులోవెళ్ళటమే బాగుంటుంది!" అన్నాడు వేదమూర్తి.

"మీ ప్రశ్నకు జవాబు చెపుతాను. కానీ టాక్సీ తప్పదు" అన్నదామె.

టాక్సీ బయల్దేరింది.

"లీల ఎట్లా చనిపోయింది?" అన్నాడు వేదమూర్తి.

లీలకు పెళ్ళైనవిషయం చెప్పింది పార్వతి. తర్వాత పురుడొచ్చి చనిపోయినవార్త తెలిసింది అని చెప్పింది.

కాలేజిసమ్మె...నాటకంరోజు జరిగిన గొడవ...జ్ఞాపకం చేస్తూ మాట్లాడుతూవుంది పార్వతి. "నేను వీణవాయించాను...మీకు జ్ఞాపకంవుందా? వుంటుందనుకున్నాను, మీకు వుత్తరంవ్రాస్తూ" అన్నదామె.

"అవును జ్ఞాపకంవచ్చావు — విమల ఎక్కడుంది?" అన్నాడు.

"ఇక్కడే వుంది" అన్నది పార్వతి.

"మద్రాసులోనా ? ఏం చేస్తూవుంది ?"

"కొన్నాళ్ళు ఏదోవూళ్ళో టీచరుగా పనిచేసింది. ఇప్పుడు పోస్టుగ్రాడ్యుయేట్‌లో చేరింది...యీ సంవత్సరమే."

వేదమూర్తి మాట్లాడలేదు.

"మీ రామెను కూడా కలుసుకుంటారా ?" అన్నది పార్వతి.

"నాకు వ్యవధిలేదు, ఈరాత్రే మావూరు వెళ్ళాలి... ఊరికే అడిగాను" అని కొంచెమాగి "మీ యింటికి...అంటే నువ్వు పెళ్ళిచేసుకున్నావా ?" అన్నాడు.

"యీపాటికి కావలసిందే! ఒక చిక్కువల్ల ఆలస్యమౌతూవుంది. ఇప్పుడు ఆ చిక్కు తీరుతున్నట్లే భావిస్తూ

వున్నాను. మీరు ఇంకా వివాహంచేసుకోలేదా మాస్టారూ?"
అని ప్రశ్నించింది.

"లేదు, నాకు ఇంతవరకు స్థిరత్వం అంటూ ఏర్పడ
లేదు. నాకెందుకు భార్య, సంసారం ?" అన్నాడు వేదమూర్తి.

పెళ్ళితోనే స్థిరత్వం ఏర్పడుతుందంటారు !... ఒకవేళ
మీకునచ్చినఅమ్మాయి కనిపించక చేసుకోలేదేమో !"

ఆ మాటలకు వేదమూర్తి పార్వతిముఖంలోకి తేరి
చూచాడు. తన్ను గురించి యింత చొరవగా మాట్లాడుతూంది.
ఈమె ఇంగితజ్ఞానం, ఇంగ్లీషుచదువు, సంస్కారం ఏమైందని
అబ్బురపడ్డాడు. మళ్ళీ ఆలోచించి, తను ఆమెవివాహాన్ని
గురించి వేసిన ప్రశ్నవల్లే ఇంతదూరం వెళ్ళింది కాబోలు
సంభాషణ అనుకొని ఊరుకున్నాడు.

అతనిచూపుకుకాని, మానానికిగాని పార్వతి జంకలేదు,
ఊరుకోలేదు.

"అంతేకాని, వివాహవ్యవస్థమీద వైముఖ్యం, జీవితం
మీద వైరాగ్యభావం కలగలేదన్నమాట? మీరు వినోబాజీతో
పర్యటనచేస్తూంటారట కదూ ?"

"అవును, ఎవరు చెప్పారు ?"

"మీ పబ్లిషర్స్‌తో ఒక్కసారి మాట్లాడాను"

తన్ను గురించి ఏమిటి యీమెకింత ఆసక్తి? అను
కున్నాడు వేదమూర్తి,

పార్వతియిల్లు వచ్చింది. ఆమె మేడమీదభాగం అద్దెకు
తీసుకొన్నది. క్రిందిభాగంలో ఇంటివాళ్ళున్నారు. ఇల్లుశుభ్రంగా,
అందంగా కళాభిరుచి వ్యక్తంచేస్తూ వేదమూర్తి నాకర్షించింది.

వెనుకవైపు పోర్టికోలో మూడు పేముకుర్చీలు, మధ్య టేబిలు వేసిఉన్నాయి.

పనిమనిషి టీసామగ్రి అమర్చుతూవుంది.

వేదమూర్తి వెళ్ళి ఒకకుర్చీలో కూర్చున్నాడు.

పార్వతి లోపలిగదిలోకి వెళ్ళింది. మూడోకుర్చీ బహుశా ఇంకెవరోకూడ వస్తారని తెలుపుతూవుంది. టాక్సీలో పార్వతి మాటలధోరణి, ఇప్పుడింకెవరో మూడవవ్యక్తి రాబోవటం చూస్తే యీ సాయంత్రం తను అనుకున్నవిధంగా తృప్తికరంగా గడిచేటట్లు లేదనిపించింది.

పార్వతి వచ్చి రెండవకుర్చీలో కూర్చున్నది. ఆమె ఎవరి కోసమో ఎదురుచూస్తున్నట్లుంది.

"ఇంకొకరెవరైనా వస్తారా?" అని ప్రశ్నించాడు వేదమూర్తి.

పార్వతి నవ్వుతూ, క్షమించాలి మేష్టారూ! మీతో యింతవరకు చెప్పనందుకు...అదుగో, మీకోసం టాక్సీపంపిన భాగ్యవంతురాలు వచ్చింది"అన్నది, వెనుకవైపుద్వారానికేసి చూపిస్తూ.

వేదమూర్తి అర్థంకాక, వెనక్కితిరిగి చూచాడు.

ద్వారంలో విమల నిలబడివుంది.

"ఊఁ...వచ్చి క్షమాపణ చెప్పుకో!" అన్నది పార్వతి.

వేదమూర్తి ఆశ్చర్యంతో మాట్లాడలేదు.

విమల వచ్చి మూడవకుర్చీలో కూర్చున్నది తలవంచుకొని మౌనంగావున్న ఆమెను, పార్వతి మళ్ళీ: "క్షమించమని అడుగు. ఊరికే కూర్చుంటే ఎట్లా?" అని ఆజ్ఞాపించింది.

"క్షమాపణ ఎందుకూ?...నిన్ను కూడా ఇక్కడ చూడ గలిగినందుకు సంతోషంగా వుంది, విమలా!" అన్నాడు వేద మూర్తి నిర్లిప్తంగా.

విమలకళ్ళనుండి కన్నీటిబొట్లు ఆమెవొళ్ళోకి రాలాయి.

వేదమూర్తి మౌనంగా వున్నాడు.

"మేష్టారూ! చూస్తున్నారుకదూ! ఇదీ వరస! ఈమె భారంమాత్రం ఇక నేను మొయ్యలేను...మీా నచ్చినఅమ్మాయి కనిపించింది. తీసుకొనివెళ్ళి పెళ్ళిచేసుకోండి" అని పార్వతి చప్పున లేచి, "క్షమించండి, ఒక్క క్షణం, ఇప్పుడే వస్తా" అని లోపలికి వెళ్ళిపోయింది.

వేదమూర్తి విమలవైపే చూస్తూకూర్చున్నాడు. విమల కళ్ళుతుడుచుకుంటూ "నన్ను క్షమించారా?" అన్నది.

"నువ్వేం తప్పుచేశావని?...నేనే తొందరపడ్డాను... క్షమాపణ నేనే కోరాలి!" అన్నాడు. అతని కళ్ళల్లోకి చూచింది విమల. ఆ పరస్పరతలో మాటలూ, వివరణా అవ సరంలేకుండానే, హృదయాల్లో మేల్కొన్న గతం వాళ్ళిద్దర్నీ దగ్గరకు చేర్చింది. కొన్ని క్షణాలిద్దరూ అట్లానే వుండిపోయారు. వేదమూర్తి చిరునవ్వు నవ్వాడు...

"ఇదంతా పార్వతి ఏర్పాటు. మిమ్మల్ని యిక్కడికి తీసుకురావటానికి నేనూ వస్తానంటే, నన్ను రావద్దన్నది. తనే తీసుకువస్తానన్నది. పార్వతినిగురించి మీా రేమీా అనుకోవద్దు. ఆమెధోరణి ఒకవిధంగావుంటుంది. అంతే! ఇన్నాళ్ళూ ఆమే నాకు ఆదరువు."

"నేనేమీ అనుకోవటంలేదు. ఇందాక వచ్చేటప్పుడు ఆమె అన్నమాటల్లోనే గడుసుదనం గ్రహించి ఆశ్చర్యపడు తున్నాను."

"అవును, నాతో ముందుగానే అన్నది; మిమ్మల్ని గూర్చి వివరాలేమీ తెలీవు. మీరు వివాహం చేసుకున్నారో, లేక వినోబాజీతో తిరుగుతూ వైరాగ్యం స్వీకరించారో, నేను జ్ఞాపక మున్నానో లేదో అన్నీ మొదట తెలుసుకోకుండా నన్ను మీ యెదుటపడనివ్వనన్నది."

పార్వతి తిరిగివచ్చింది. "నే నిక్కడలేనని నామీద ఏమైనా చెప్పతూవుందా, మాస్టారూ! ఆమెమాటలు నమ్మ కండి !" అన్నది. విమల, వేదమూర్తి నవ్వారు.

"చూడండి,నన్ను టీతీసుకోకుండా చెయ్యాలని మీరను కుంటే మాత్రం నేను ఊరుకుండేదాన్ని కాదు. అందుకే మళ్ళీ వచ్చాను. పాపం! మీరూ మరచిపొయ్యారు. ముందు ఆ ప్లేట్ల సంగతి చూడండి" అంటూ పార్వతి వాళ్ళను హెచ్చరించి, పనిమనిషిని టీ తీసుకురమ్మని కేక వేసింది.

"మేష్టారూ, ఈ సంవత్సరం 'మెర్ మెన్' కావ్యం మళ్ళీ పెట్టారు. మెర్ మెన్‌గూర్చి చెప్పతూవుంటే నాకు మీరే గుర్తువస్తారు సుమండీ!" అన్నది పార్వతి వేదమూర్తిని చూచి నవ్వుతూ.

"ఈ గడుసుదనం నీకెట్లా వచ్చిందో కాని, నేనుమాత్రం తట్టుకోలేకుండా వున్నా పార్వతీ !" అన్నాడు వేదమూర్తి.

"పాపం! మీరే ఆ విషాదమూర్తి మెర్ మెన్ అని నే నెప్పుడన్నాను? మీరు ఆ కావ్యాన్ని బోధించేవిధానం నేను

నేర్చుకున్నాననే అంటున్నాను” అన్నది పార్వతి మళ్ళీ నవ్వుతూ.

“నా కొక్కసంగతి గుర్తువస్తోంది” అన్నది విమల.

వేదమూర్తి, పార్వతి ఆమెవైపు చూశారు.

“లీలనుగురించి—ఒకరోజు మెర్‌మెన్ పాఠం క్లాసులో నా కెందుకో కన్నీళ్ళువస్తే, లీల అన్నది—‘మేష్టారే మెర్‌మన్ అనిపించారు కదూ’ అని. లీలవాక్కుల్లో ఏదో నిగూఢసత్యం దాగివుండేది. ఆమె అపురూపమైనవ్యక్తి.”

“కొన్ని ఊహలు, నమ్మకాలు వింతగా కనుపించవచ్చునేమో! కాని లీలవిషయంలో నేనుకూడ ఆవిధంగానే భావిస్తాను పార్వతివ్రాసినవుత్తరంలో నన్ను ఇక్కడకు వచ్చేటట్లు చేసిన ఒక్కవాక్యం “లీల చనిపోయిందన్న వాక్యమే. నన్నెంత పొగడి వ్రాసినా, పార్వతి ఎంత శిష్యురాలైనా ఆ వార్త లేకపోతే బహుశా వచ్చివుండను” అన్నాడు వేదమూర్తి.

చివరిమాట పార్వతివైపు చూచి అన్నాడు

“పోనివ్వండి. నా కిప్పుడు లాభమూ లేదు, అప్పుడు నష్టమూ వుండివుండదు.” అన్నది పార్వతి వాళ్ళిద్దరికీ టీ అందిస్తూ.

“గడుసువాళ్ళకి కోపంరాకూడదు. శిష్యురాలి ఉత్తరాన్ని చూచి నిజంగానే ఆశ్చర్యపడ్డాను. ఇప్పుడు ఆమె సామర్థ్యమూ, మంచితనమూ చూచి ఆ గర్వం ఇంకా ఎంత పెరిగిందో చెప్పలేను అన్నాడు వేదమూర్తి.”

టీ త్రాగటం పూర్తిఅయింది.

"నాకు ఆ కాలేజీరోజులన్నీ జ్ఞాపకంవస్తున్నాయి. నేను వీణ వాయిస్తాను. విమల పాడుతుంది. ఏమంటారు మేష్టారూ? సరేనా ?"

"మీ ఋణాన్ని ఎట్లా తీర్చనా ? అని ఆలోచిస్తున్నాను." అన్నాడు వేదమూర్తి.

నాటకంరోజున పాడిన పాటల్లో మూడింటిని పాడింది విమల. పార్వతి మూడవపాట పూర్తవగానే లేచింది. "నాకు నిజంగానే కాస్త పనివుంది మీరిద్దరూ మాట్లాడుతూవుండండి వస్తాను. ఆఁ...మరచిపోయాను! మీ రిక్కడే భోజనం చెయ్యాలి !" అన్నది వేదమూర్తి నుద్దేశించి.

"నేను యీ రాత్రి మెయిలుకు వెళ్ళాలని నిశ్చయించుకున్నానే !" అన్నాడు.

"రేపు వెళ్ళకూడదా ? నేను టెలిగ్రామ్ పంపిస్తాను" అన్నది పార్వతి.

తనవైపుచూస్తున్న విమలను చూచి వేదమూర్తి "సరే, ప్రొద్దున ఎక్స్ప్రెస్‌కు వెళ్తాను" అన్నాడు పార్వతితో.

* * *

భోజనంచేసినతర్వాత పోర్టికోలో వేదమూర్తిని, విమలను కూర్చోబెట్టి పార్వతి తనగదిలోకి వెళ్ళిపోయింది.

వేదమూర్తి తనకథ వినిపించాడు. విమలకు రాజ్యం విషయంకూడ దాచకుండా చెప్పాడు.

విమల కొంతసేపు మౌనంగావుండి, అన్నది "మీ జీవితంలోని మంచిచెడ్డలు నిర్ణయించటానికి నాకు సామర్థ్యం వుందనుకోను. కాని ఏదైనా చెడు వుండివుంటే దానికి కారణం

నేనేనని, లేక విధి అని అనుకుంటున్నాను. వివాహానికి నే నప్పుడే అంగీకరించినట్లయితే కొన్ని సంగతులు జరిగివుండవు...

"మీ విషయమే కాదు. నా అనుభవాల్ని చెప్పితే మీకూ అనిపిస్తుంది. టీచరుగా మూడేళ్ళు పనిచేసి, నాకు అసంతృప్తికలిగి, స్త్రీసంక్షేమం లక్ష్యంగా చేసుకుందామని సంఘసేవలో ప్రవేశించాను. అభివృద్ధిప్రణాళిక అమలువరు స్తున్న ఒక గ్రామంలో ప్రచారశాఖలో నియమింపబడ్డాను. అది పోయిన సంవత్సరం. ఆ తాలూకాకు జనార్దనం అనే పోలీసు ఆఫీసరు వచ్చాడు. అతను మీకు గుర్తువుండవచ్చు. మీరు కాలేజీలో వున్న సంవత్సరం ఆంధ్రభాషాపరిషత్తుకు కార్యదర్శి. బి.ఏ. రెండవసంవత్సరం చదువుతూవుండేవాడు. సమ్మె నడి పించిన ఇద్దరు ముగ్గురులో ముఖ్యుడు. బాగా డబ్బున్న వాడు. బి.ఏ. కాగానే, పోలీసుశాఖలో పెద్దఉద్యోగమే సంపాదించాడు. కాని అతను కాలేజిలోవుండేవాడన్న విషయమూ, ప్రాతసంగతులూ నాకు గుర్తురాలేదు. మామూలుగా అందరుఆఫీసర్లవలె గౌరవం, ప్రత్యేకమైన మర్యాదా చూపించేవాడు. అవసరమున్నా లేకపోయినా తన మనుష్యుల్నీ, కారునీ నాఉపయోగార్థం పంపించేవాడు. అతని మాటలు, ధోరణి చూచి, నేను ఏమాత్రం అనుమానించలేదు అతనివుద్దేశం. అందులో నాకు ఆ వాతావరణం, మనుష్యులు క్రొత్త. ఒకరోజు మా గ్రామంలో కాంపుచేశాడు. ఏదో నేరం విషయం కూపీతీయాలన్నకారణంతో. ఆ రోజు రాత్రి పదింటికి అకస్మాత్తుగా వచ్చి మా యింటితలుపు తట్టాడు. మా యింట్లో కొన్నిగంటలు అవసరంగా వేచివుండాలని నా అనుమతి

కోరాడు. "సరే వుండండి, నేను ఇంకోచోటికి వెళ్తాను" అన్నాను. "అట్లాగే, మంచి నీళ్ళివ్వండి." అన్నాడు. నేను నీళ్ళు తెచ్చేలోపల వీధితలుపు మూసి గడియపెట్టి కూర్చున్నాడు. రోజూ నాకు తోడుగావుండటానికి వచ్చే జవాను గంగడు కానీ, పనిమనిషి వెంకి కాని ఎందువల్లో రాలేదు. బహుశా అదీ జనార్దనం ఏర్పాటైవుండవచ్చు! నేనొక్కర్తెనే వుడింపొయ్యాను. అప్పుడు పాతపరిచయంగూర్చి ఎత్తాడు. నాకు కాలేజిలోవున్నప్పుడు ఉత్తరంవ్రాశాడట బెదిరిస్తూ. ఒకసారి పాడమని కోరితే పాడలేదట! అప్పటినుండీ నామీద దృష్టి పెట్టుకున్నాడట. కాని ఆ సమయంలో తన వివాహంజరగటంతో తనప్రయత్నం వ్యర్థమైందట! ఇద్దర్నీ వేరుచేసిన విధి మళ్ళీ యిద్దర్నీ ఒకటిగా తీసుకొనివచ్చిందట. నాకు వివాహం కాక పోవడం తన అదృష్టమట. మెల్లగా విషయమంతా చెప్పాడు, ఎంతో నింపాదిగా, నిర్భయంగా. నేను వింటున్నాను. అదృష్ట వశాత్తు ఏమీ మాట్లాడలేదు. భయం ఆవేశించిందేమో! ఒక్క మాటకూడ రాలేదు. నా నిస్సహాయత నాకు పూర్తిగా అర్థంఅయింది. కాని నా మనస్సుమాత్రం అతివేగంగా పని చేస్తూంది. ప్రయత్నంమీద ఏడవబోయి నవ్వాను! "సరే, ఉండండి వస్తాను" అని గబగబా లోపలికి వెళ్ళాను. అదృష్ట వశాత్తు పెరటిదారి వుంది బయటపడి, వెనకాలవీధిలోవున్న కరణంగారియింటికి పరుగెత్తి ఆశ్రయంకోరాను. వాళ్ళు ఏమీ తెలీనట్లు నన్ను ఒక గదిలోపల ఉంచి తాళంవేసేశారు. తర్వాత రెండురోజులు ఆ గ్రామంలోనే వున్నాడు జనార్దనం నా కోసం చూస్తూ. నాకుమాత్రం ఆ గది భద్రమైన చెరసాల.

అందులోంచి నేను బయటకి రాలేదు. మూడవరోజు అతను ఆ గ్రామంనుంచి వెళ్ళాడని తెలీగానే ఆ రాత్రి కరణంగారు మనుష్యుల్ని తోడిచ్చాగా, రైలందుకుని మద్రాసు వచ్చి వేశాను. వెంటనే రాజీనామా పంపించాను పోస్టుద్వారా. ఉద్యోగం వదలిపెట్టి పోస్టుగ్రాడ్యుయేట్‌లో చేరాను. పార్వతి లెక్చరరుకమ్మన్నది...అంటే, ఇంతలో మీరు కనిపించకపోతే నన్నమాట!"

"మనుష్యులమీద, మనసంఘంమీద దేనమ్మకంపోతుంది! ఈ విషయం వింటుంటే మనం సాధిస్తున్న దేమిటి? అనిపిస్తుంది. ముందుకు వెళ్తున్నామో వెనక్కి వెళ్తున్నామో! అర్థంకావటం లేదు. ఏదో పెద్దపట్టణాల్లో తప్ప గ్రామాల్లో స్త్రీలు ఉద్యోగాలుచేసే వాతావరణం ఏ మాత్రం ఏర్పడలేదు. జనార్దనంవంటి వాళ్ళకి ఏమిటిశిక్ష?...స్త్రీకిసౌందర్యమే పెద్దశత్రువుకాబోలు!" అన్నాడు వేదమూర్తి.

"డబ్బుమాత్రం శత్రువుకాదా ?" అన్నది చిరునవ్వుతో విమల. "మీరు నా మీద కోపం తెచ్చుకోవటానికి, అపోహ పడటానికి అదే కారణం. ఇన్నాళ్ళూ పార్వతే లేకపోతే నా కాధారమేమిటో చెప్పండి?"

"పార్వతిపెళ్ళివిషయమేమిటి? ఏదో గడుసుగా అన్నది కాని నా కర్థంకాలేదు."

"ప్రభాకరరావని మంగుళూరుబ్రాహ్మలు, కన్నడం మాతృభాష. పార్వతికి ఆనర్సులో క్లాసుమేటు; యిప్పుడిక్కడే

సబ్-ఎడిటర్‌గాకని చేస్తున్నాడు. ఇద్దరూ వివాహంచేసుకోవాలని నిశ్చయించుకుని మూడేళ్ళుదాటింది. పార్వతినాన్నగారు, నలుగురుఅన్నయ్యలు మొదట యీ సంబంధానికి ఒప్పుకోలేదు. వాళ్ళనాన్నగారు పోయి సంవత్సరమైంది. అన్నయ్యలిప్పుడు సముఖంగానే వున్నారు. కాని నాకోసం—నాకు వివాహం కావటమో, లేక నేను మళ్ళీ ఉద్యోగంలో ప్రవేశించటమో జరిగితేనే, తను పెళ్ళిచేసుకుంటానని నిశ్చయించింది. ఇక అంతే; ఎవరుచెప్పినా తిరుగులేదు, లాభంలేదు.

"అయితే నువ్వు పోస్టుగ్రాడ్యుయేట్ పూర్తిచేస్తావా?"

"ఎటూతోచక అందులో చేరాను. నీవేం చెయ్యమంటావో చెప్పండి. రేపేమానెయ్యమన్నా మానేస్తాను."

వేదమూర్తి ఆలోచిస్తూ కూర్చున్నాడు.

పార్వతి వచ్చింది. "ఏమిటి ఇంకా కూర్చున్నారు? టైమెంతయిందో తెలుసా? పన్నెండు దాటింది!"

"నువ్వు వచ్చి చెప్పలేదని కూర్చున్నాము." అన్నాడు వేదమూర్తి నవ్వుతూ.

"నామీద విసుక్కుని ప్రయోజనంలేదు. నేను చెప్పినట్లు మాత్రం వినవలసిందే!"

"రా విమలా" అని విమలచెయ్యి పుచ్చుకొని,పార్వతి "మాస్టారూ, మీకు ఆ గదిలో పక్క వేయించాను... గుడ్ నైట్!" అని వేదమూర్తితో చెప్పి విమలతో వెళ్ళిపోయింది.

వివాహమైనతర్వాత వేదమూర్తి బసవన్నకొండలో స్థిరపడ్డాడు. విమల స్వగ్రామంలోనిఆస్తిని అమ్మివేసింది. బసవన్నకొండలో, గ్రామానికి కొంచెందూరంగా, వేణుగోపాలస్వామిఆలయందగ్గర, రామయ్యకుచెందినస్థలంకొని, సొంతయిల్లు కట్టుకుంటున్నారు విమల, వేదమూర్తి.

రామయ్య అసెంబ్లీమెంబరు; ౧౯౫౭ ఎన్నికల్లో రెండవసారికూడా గెలిచాడు. రాజారెడ్డి పోటీచెయ్యలేదు.

రాజారెడ్డి క్రొత్త రైస్‌మిల్లు పెట్టడానికి కొంతపొలం అమ్మివేశాడు. వేదమూర్తి అతనిదగ్గర—తండ్రిఅమ్మినపొలం విమలపేర కొన్నాడు.

వ్యవసాయం, భారతీయతత్త్వశాస్త్రం వేదమూర్తి అభిమానవిషయాలు. విమలను గ్రామంలోని ఎలిమెంటరీ స్కూలును నిర్వహించమని రామయ్య కోరుతున్నాడు.

శివరాత్రి వచ్చింది. మల్లికార్జునస్వామికి ఉత్సవాలు జరుగుతున్నాయి.

వేదమూర్తి విమలతో అన్నాడు. "చూశావా, మా నాన్నమాటే నెగ్గింది చివరకు! నీ డబ్బుతో మా పొలం మాకు దక్కింది. మనిషికీ నేలకూ ఏమిటో యీఅనుబంధం!"

"వ్యక్తికీ వ్యక్తికీ వుండే అనుబంధంవంటిదే అనుకోవాలి, అన్నదామె.

విమలతో బసవన్నకొండమెట్లెక్కుతూవున్న వేదమూర్తికి గత జీవితమంతా తెరలుతెరలుగా స్ఫురణకు వచ్చింది......

అయిపోయింది.

# ఉత్తమ కథా సంపుటములు

| | | |
|---|---|---|
| ఆశాప్రియ | బుచ్చిబాబు | రు. 1-00 |
| ఆమెనీడ | ,, | 1-00 |
| దేశం నాకిచ్చిన సందేశము | ,, | 1-00 |
| లోకంకోసం | భరద్వాజ | 1-00 |
| కల్పన | ,, | 1-00 |
| నర(క)లోకం | ,, | 1-00 |
| త్రినేత్రుడు | ,, | 1-00 |
| జాలిగుండె | ,, | 1-00 |
| దావానలం | ,, | 1-00 |
| ఉన్నది-వూహించేది | ,, | 1-00 |
| పాపం | ,, | 1-00 |
| మమకారం | ,, | 1-00 |
| | ,, | 1-00 |
| అర్ధాంగి | ,, | 1-00 |
| | ,, | 1-00 |
| అనూరాధ | ,, | 1-00 |
| పద్మవ్యూహం | ,, | 1-00 |
| అవశ్రుతులు | ,, | 1-00 |
| చిత్రగృహం | ,, | 1-00 |
| పగటికలలు | దాసు | 0-75 |
| గొప్పోళ్ళన్యాయం | లింగరాజు | 1-00 |
| జాతకకథలు | | 5-00 |
| బాలల కథాసరిత్సాగరము 1 సం. | | 5-00 |
| బాలల కథాసరిత్సాగరము 2 సం. | | 5-00 |

# ఆదర్శ నవలలు

| | | |
|---|---|---|
| సంసారసాగరము | తమిళనవల | 2-25 |
| వైకుంఠపాళి | పి. వి. కృష్ణమూర్తి | 1-50 |
| కోకోరో | జపాన్ నవల | 1-00 |
| యుగసంధి | భాస్కరభట్ల | 4-00 |
| మిగిలిందేమిటి? | లత | 1-75 |
| తారుమారు | కొసరాజు | 2-50 |
| చీకటివెలుగు | ముద్దంశెట్టి | 1-50 |
| పాడులోకం | ,, | 1-50 |
| గుడిగంటలు | ఎల్లోరా | 1-00 |
| చివరకు మిగిలేది | బుచ్చిబాబు | 2-75 |
| మనోరమ | ప్రేమచంద్ | 3-00 |
| నిరంజన్ | రవీంద్రనాథ్ మైత్ర | 2-00 |
| యాత్రికుడు | ప్రబోధకుమార్ సన్యాల్ | 3-50 |
| అన్నా కెరినీనా | టాల్‌స్టాయ్ | 7-00 |
| అనుమానం | ,, | 3-00 |
| అమ్మ | మాక్సింగోర్కీ | 5-00 |
| భయస్థుడు | ,, | 5-00 |
| అనాథబాలుడు | ,, | 2-50 |
| పేకమేడలు | టర్జనీవ్ | 2-25 |
| యమకూపం | కుప్రిన్ | 4-00 |
| కొడుకులు-కూతుళ్ళు | | 6-00 |
| ఇనపపాదాలు | జాక్ లండన్ | 4-00 |
| నానా | ఎమిలీజోలా | [illegible]-50 |
| థెరెసా | | 2-50 |
| డోరియన్ గ్రే | ఆస్కార్ వైల్డ్ | 3-50 |
| మానవహృదయాలు | మపాసా | 3-00 |